శ్రీనివాస మంగాపురం

మరియు

# మన ఆలయముల చరిత్ర

(తిరుమల, తిరుపతి, తిరుచానూరు, తొండవాడ, చంద్రగిరి,
నారాయణవరం, నాగలాపురము -
సువర్ణముఖరీ, అరుణానదీ లోయలు)

శ్రీ గోపీకృష్ణ




ప్రచురణ :
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
1980

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :
T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.
Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :

T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.

Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :

T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.

Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :

T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.

Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :
T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.
Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :

T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.

Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :

T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.

Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :

T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.

Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :
T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.
Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :

T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.

Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :

T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.

Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : **Rs. 7-00**

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :

T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.

Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :

T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.

Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : Rs. 7-00

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :
T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.
Copies 5,000.

**Srinivasa Mangapuram *Mariyu* Mana Alayamula Charitra**

BY

SRI GOPI KRISHNA

Subsidised Price : **Rs. 7-00**

T. T. D. Religious Publications Series No.

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

PRINTED AT :

T. T. DEVASTHANAMS PRESS, TIRUPATI.

Copies 5,000.

# ప్రవేశం

అదిగో! సువర్ణముఖరీ నది స్థానికంగా స్వర్ణముఖి అని పిలుస్తారు. పాకాల దగ్గర పాలకొండల్లో ఆదివేపల్లిదగ్గర చిన్నవాగుగా పుట్టింది. చంద్రగిరికి ఎగువన భీమానదితో కలిసి నది అయినది. దిగువన కళ్యాణితో సంగమించి పెద్దనదిగా రూపొందినది. చంద్రగిరి కొండల్లో - చంద్రనగము, హేమనగములలో - హేమనగాన్ని ఒరసుకొంటూ ప్రవహించడంవల్ల సువర్ణ సైకతాలతో సార్థక నామధేయురాలయినది. నిజానికి సువర్ణముఖరీ ఇసుక వెండిలాగా తెల్లగానూ వుంటుంది. సువర్ణంలాగా బంగారు వర్ణంతోనూ వుంటుంది.

చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా పాకాల సమీపంలో పుట్టిన యీ నది, *పాలకొండలను వదలి, ఉత్తరంగా కొంత - ఈశాన్య దిక్కుగా కొంతదూరం ప్రయాణించి - శేషాచల కొండలను స్పృశించి - భీమా-కళ్యాణి, నదులతో సంగమించి - శ్రీ అగస్త్యేశ్వర పాదాలను తాకి శ్రీ పరాశరేశ్వరునికి మ్రొక్కి శ్రీ పద్మావతి అమ్మవారిని సేవించి - శ్రీ పరశురామేశ్వరస్వామిని పలకరించి - శ్రీకాళహస్తీశ్వరుని దర్శించి, తూర్పుగా ప్రవహించి, నెల్లూరు మండలములోని నాయుడుపేట దగ్గర సిద్ధవరంలో (గూడూరు తాలూకా) తూర్పు సముద్రముతో సంగమిస్తుంది. వంద మైళ్లకు మించిన సువర్ణముఖరీ ప్రయాణ మార్గమిది.

సువర్ణముఖరీ పురాణములో ఆ నది పుట్టుకను గూర్చి ఇలా వుంది: కైలాసంలో శ్రీ పార్వతీ పరమేశ్వరుల ఏగు పెండ్లి చూడడానికి ఏగు దెంచిన ముక్కోటి దేవతల భారంతో భూమి ఆ వైపుకు వంగినది. మన మెఱిగిన కైలాసం - హిమవత్పర్వత ప్రాంతమే గదా! అందుకని భూమి ఉత్తరవైపు ఒరగగా ఆ ప్రమాదాన్ని గ్రహించిన పరమశివుడు - శ్రీ అగస్త్య మహామునిని పిలిచి - దక్షిణమువైపు వెళ్లి భూభారాన్ని సమం చేయమన్నారు. అందుకే - అందరూ ఒక ఎత్తు - అగస్త్యుడు ఒక ఎత్తు - అన్న సామెత ప్రచారంలోకి వచ్చింది.

---

* (పాపికొండలనికూడ వీటిని పిలుస్తారు)

లోపాముద్ర సహితుడై, అగస్త్య మహాముని దక్షిణాదికి బయలుదేరి నాడు. దారిలో వింధ్యపర్వతం నిలువునా పెరిగిపోయి సూర్యగమనానికే అడ్డు వస్తోంది. తాను దక్షిణాదికి వెళ్లి త్వరలోనే వస్తానని, అంతవరకు అణగి వుండమని అగస్త్యమహాముని వింధ్యపర్వతుని కోరినాడు. వింధ్య పర్వతము తన పొడుగును కుదించుకొని, అగస్త్యునికి దారి ఇచ్చింది. అలాగే, అగస్త్యునిరాకకు, ఇంకా నిరీక్షిస్తూనే వుంది ఆయన తిరిగి వెళ్లాక పొడుగు పెరుగుదామని. కానీ, దక్షిణాదికి వచ్చిన ఆ మహాముని తిరిగీ ఆ వైపుకు వెళ్లలేదు. అలాగ ఆయన వింధ్యా గర్వభంగంకూడ గావించాడు.

తదుపరి గోదావరి - కృష్ణానదులలో గ్రుంకులిడి, దాక్షారామము, శ్రీశైలము, జ్యోతిసిద్ధవటం మొదలగు పుణ్యక్షేత్రాలను, తీర్థాలను, దర్శించి-సేవించి చివరకు శ్రీ కాళహస్తి ప్రాంతానికి వచ్చాడు. అచ్చట స్నాన పానాదులకు ఒక్క నదికూడా లేదు.

వెంటనే ఆమహాముని గంగావతరణమునకై, దక్షిణ కైలాసమగు శ్రీ కాళహస్తికి నాలుగు యోజనముల దూరమున, పడమర దిక్కున ఒక మహా పర్వతమున శివుని గూర్చి ఘోరతప మాచరించినాడు* అప్పుడు బ్రహ్మ, అఖండల ముఖ్యులతో గూడి, శివుని దర్శించి, అగస్త్యుని తపోనిష్ఠను గూర్చి విన్నవించి, ఆతని యాజ్ఞానుసారముగ బ్రహ్మ, అగస్త్యునకు ప్రత్యక్షమై, అచ్చట ఒక పుణ్యనదిని బొందగోరు అతని అభీష్టము నెఱింగి, యొకనదిని ప్రవహింప జేసినాడు. ఆకాశగంగ, దివినుండి భువి కవతరించినపుడు దేదీప్యమానమైన సువర్ణకాంతులతో, సువర్ణ 'గలగలా' రావములతో నొప్పి యుండుట వలన, బ్రహ్మదేవుడు యీ నదీమతల్లికి 'సువర్ణముఖరీ' అని పేరు పెట్టినాడు. ఈ నది వరదలు అగస్త్యునికి తపోభంగము కలిగించగా ఆయన దానిని అంతర్వాహినిగా అనుగ్రహించినాడు. అందువలన ఈ ప్రాంతాలలో నదిలో నీరు లేకున్నను - బావులలో మంచి ప్రవాహముంటుంది.

నదీతటముల కిరువైపుల మొగలిమొదలు మిక్కుటముగా గలిగిన నాడు - యీ నదికి 'మొగిలేరు' అను స్థానికనామము కూడా స్థిరపడినది.

---

* పాల కొండలలోని ఎత్తయిన కొండను అగస్త్యపర్వతమంటారు.

ఈనదికి వాగులు - వంకలు - చిన్న పెద్దఏరులు ఇలా అనేక వుపనదులు వున్నవి. వీనిలో భీమనది - కళ్యాణి అనునవి ముఖ్యమైనవి. కళ్యాణీ నది -- కళ్యాణప్రదమైనది. శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి వారు వెలసినది యీ నదీతీరములోనే. ఆ పునీతప్రదేశమే నేటి శ్రీనివాస మంగాపురము. తిరుపతికి పడమరగ - ఏడు మైళ్ల దూరములో - ఏడుకొండల క్రిందుగా ఏడు కొండలవాని క్రీగంటి చూపులకు ఆనగా - భాకరాపేట మీదుగా మదనపల్లికి ఏగు బాటలో ఎంతో శోభాయమానముగా వెలిసినది.



సువర్ణముఖరీనది - ( శ్రీ కాళహస్తి దగ్గర )

# పరిశీలన

సువర్ణముఖరీ పరీవాహక ప్రదేశాన్ని విహంగదృష్టితో చూద్దాం:

పడమర వైపు పాలకొండలు - తూర్పు వైపు గంగుడుపల్లి కొండల
చంద్రగిరి ఎగువలోయ పాకాలకు దిగువన ఏర్పడింది. దక్షిణంగా దో
కంబాల కొండలు - ఉత్తరాన శేషాచలం లేదా ఏడు కొండలతో చంద్ర
దిగువలోయ ఏర్పడినది. ఈ లోయ చూడ్డానికి సర్పాకారంవలె మెలిక
తిరిగి వుంది. ఇంకా తూర్పుభాగంలో ఏర్పడిన లోయలు సదాశివకో
వేయిలింగాల కోనగా ప్రసిద్ధిగాంచినవి.

కర్నూలుజిల్లా నుంచి, చిత్తూరుజిల్లా వరకు నల్లమల - ఎఱ్ఱమ
అడవులలో ఏర్పడిన పర్వతాలు - ఆదిశేషుని ఆకృతినందగా - శిరస్సు
శ్రీ వేంకటేశ్వరస్వామి — నడుముపై అహోబిల నృసింహస్వామి - తోక
శ్రీశైల మల్లికార్జుస్వామి వెలిసిన విషయం అందరెఱిగినదే!

పర్వతము ఆదిశేషుని ఆకృతితో ఏర్పడగా - దానికి ఆనుకొని వు
లోయ ఆదిశేషుని అనుంగు పుత్రుడు వాసుకి వలె అల్పంగా ఏర్పడడ
గమనార్హం. పర్వతం తలవైపు లోయయొక్క తలభాగం ఏర్పడడ
పర్వతం చివరి భాగంలో - లోయ పుచ్ఛం ఏర్పడడం జరిగింది.
ప్రకారంగా చూస్తే సువర్ణముఖరీ నది పడుకొనివున్న సర్పంలా మ
కనిపిస్తుంది. ఈ సర్పాకృతి మీద తలవైపు శ్రీకాళహస్తీశ్వరస్వామి
మరొకరూపంగా ఇది ఆదిశేషుని నోటిభాగంగా గుర్తింపబడినది. నడుముమీ
అలమేలు మంగాపురం శ్రీ పద్మావతిదేవి - పుచ్ఛముమీద శ్రీనివాస మంగాపు
శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి వెలిసినారు.

మన విహంగ దృష్టిని సూక్ష్మీకరించి చెప్పుకొందాం. మ
కనబడునవి రెండు సర్పాకృతులు. ఒకటి పర్వతాకృతి దాల్చిన ఆదిశేష
తూర్పు వైపు తలబెట్టి పడుకొని వుంటాడు. ఆ అనల్ప ఆకారంమీ

'స్సున శ్రీ తిరుమల వేంకటేశ్వరుడు-నడుముభాగాన అహోబిల శ్రీనృసింహ
ామి-తోకమీద శ్రీశైల మల్లికార్జునస్వామి వెలిసివున్నారు. ఇక రెండవది-
) ఆకృతి దాల్చిన అల్పవానుకి ఆకృతి. తూర్పు సముద్రమువైపు తలబెట్టి-
శమర వైపు తోకబెట్టి మగతగా పడుకుని వుంటాడు. ఈయన శిరస్సున
కాళహస్తీశ్వరస్వామి - కటిపై శ్రీ పద్మావతిదేవి (తిరుచానూరు) - తోక
గాన శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి వెలిసివున్నారు. ఒకరి సరసన
ొకరు - పడుకొనివున్న యీ తండ్రీకొడుకుల్లాంటి సర్పాకృతుల మీద
ిసిన ఆలయాల నిర్మాణ క్రమంలో - మనకు శివకేశవుల అభేదతత్త్వం
ఛరిస్తుంది.

ఆకృతిలో అల్పమయినా, పురాణేతిహాస చరిత్రలలో అనల్పమయినది
ం సువర్ణముఖరీనది - దాని పరీవాహక ప్రాంతం. అన్ని నాగరికతలు నదీ
య్లో ఆవిర్భవించినట్లే, ఈ ప్రాంతం ప్రాచీనసంస్కృతి అంతా యీ
ద్రగిరిలోయలోనే వెల్లివిరిసింది.

వ్యాసోక్త పురాణములని ప్రసిద్ధిగాంచి, వేదవ్యాస మహర్షిచే విరచింప
నవని భావింపబడుతున్న అష్టాదశ పురాణములలో అనేకం సువర్ణముఖరీ
'శస్త్యాన్ని వుగ్గడిస్తున్నవి.

వరాహ పురాణమున- శ్రీవేంకటేశ్వరస్వామి వెలిసియున్న వేంకటాద్రికి
వ భాగంలో, క్రోసెడు దూరంలో, నందనోద్యానవనమునకు సమీపమున
ర్ణముఖి వున్నట్లు - దాని వునికి తెలియజేయబడినది.

స్కాందపురాణం - సువర్ణముఖీ పుట్టుక ప్రాశస్త్యాలను గురించి
ష్టంగా పేర్కొన్నది.

భవిష్యోత్తర పురాణంలో - సువర్ణముఖరీ తీరంలోని నందనోద్యాన
ంలో - శ్రీనివాసుడు శ్రీ పద్మావతిదేవిని ప్రథమంగా చూసినట్లు, వారిద్దరూ
రినొకరు ప్రేమించుకొన్నట్లు, ఆ కలయికే శ్రీనివాసుని కళ్యాణమునకు
) తీసినట్లు పేర్కొనబడినది.

ఇలా యీ నదీమతల్లి - శ్రీ పద్మావతి శ్రీనివాసుల ప్రేమాయణం వివాహం - వివాహానంతర జీవనాలతో ముడిపడి - తాను ధన్యయై సమ ప్రకృతినే ధన్యం చేసింది.

సకలపురాణ ప్రోక్తం శ్రీవేంకటాచల మాహాత్మ్యం. అనేక పురాణాలు ఉపపురాణాలు శ్రీ తిరుమలక్షేత్ర మాహాత్మ్యం గురించి పేర్కొన్నవి గానీ అందులో ముఖ్యమయినవి శ్రీవరాహ పురాణం - శ్రీభవిష్యోత్తర పురాణం మాత్రమే. సువర్ణముఖరీ తీరాన వెలిసిన శ్రీ అగస్త్యాశ్రమాన్నీ - శ్రీ అగస్త్యేశ్వరాలయాన్ని - దాంతో పెనవేసుకున్న శ్రీ పద్మావతి శ్రీనివాసుల కథను - ఆ రెండు పురాణాలు శ్లాఘించడం - గమనార్హం.

భవిష్యోత్తర పురాణంలో ఇంకొక కథ కూడ వుంది.

ఆదిశేషునికి - వాయుదేవునికి తమలో బలాఢ్యుడెవరో అన్న ప్రశ్న ఉదయించినది. బలాబలాలు తేల్చుకోవాలనుకున్నారు. తమ పందెమునకు శ్రీహరిని న్యాయనిర్ణేతగా వుండమని కోరుకున్నారు. ఆయన పర్యవేక్షణలో పందెం ప్రారంభమయింది. మహామేరువుయొక్క పుత్రుడు ఆనందుడను పర్వతుడు. ఆతనిని బలంగా చుట్టుకున్నాడు ఆదిశేషుడు. వాయుదేవుడు బలంగా వీచి - ఆనందపర్వతముతో బాటు ఆదిశేషుని కూడ - సువర్ణముఖరీ నదికి క్రోశెడు దూరములో పడునట్లు చేసి తాను బలాఢ్యుడనని నిరూపించుకున్నాడు. నవ్వుకున్నాడు శ్రీహరి. వాయుదేవుని బలాన్నిచూసి గాదు. తన అభీష్టాన్ని - ఆ అభీష్టం ప్రకారం జరిగిన యీ లీలను జూసి - వాయువు అదంతా తన బలమనుకొంటున్న అతని అహంకారాన్ని - అజ్ఞానాన్నిచూసి. శ్రీహరి సంకల్పించినట్టు జరిగింది. ఆదిశేషుడు తన సహస్రపడగలతో, ఆనందుడు తన అనంత సౌందర్యంతో భూలోకం చేరుకున్నారు. ఆదిశేషుని పడగమీద ఆనంద పర్వతముంది. అదియే నేటి ఆనందనిలయ విమానం శ్రీ వేంకటేశ్వరస్వామి క్రీడాచలము.

ఇన్నిపురాణాల సంగతెందుకు? సువర్ణముఖరీ పురాణమనుపేరిట - ఒక ప్రత్యేకపురాణమే వెలిసినదన్న - అదే దాని ప్రాశస్త్యాన్ని చాటుతున్నది గదా!

దండకారణ్య చరిత్ర ప్రకారం, రఘువంశమూలకారకుడయిన దిలీప చక్రవర్తి, తన దేవేరియైన సుదక్షిణాదేవిని, ఉత్తరదేశంనుంచి విమానంలో వచ్చి, సువర్ణముఖరీతీరముననే కలిసినట్లు తెలియుచున్నది.

అపౌరుషేయములైన వేదములు - వేదాంగములలో ప్రాచీనమైనది ఋగ్వేదం. ఆ ఋగ్వేదంలోని ఒక ఋక్కునందు - ఒక దేశపు సరిహద్దును 'వికటగిరీం' అన్నందువల్ల - పారమాత్మకోపనిషత్, బ్రహ్మపురాణములందు తిరిగి యీ శబ్దము ప్రయుక్తమయినందువల్ల - ఆ కాలంలోకూడ - సువర్ణముఖి - వేంకటాద్రి ప్రాంతీయ సరిహద్దులుగా గుర్తింపబడినట్టు తోచుచున్నది.

ప్రాచీన తమిళవాఙ్మయమునందలి భాషాలక్షణ గ్రంథమైన 'తొల్కాప్పియమ్' నందు వేంగడమను పేరుతో శ్రీ వేంకటాచల ప్రస్తావన యున్నది. ఈ గ్రంథము క్రీ. పూ. రెండవ శతాబ్దమునకు చెందినదిగా నిర్ణయింపబడినది. ఋగ్వేదము తరువాత, యీ ప్రాంత ప్రస్తావనను దెచ్చిన తొలి గ్రంథము ఇదే.

దీని తరువాత, తమిళంలో 'సంఘం సాహిత్యమను' పేర వెలిసిన, సాహితీ సమారాధనలో కూడ - 'మములానర్' అను సంఘం కవి, వేంగడమను పేరున ప్రసిద్ధిచెందిన కొండల నుదహరించినాడు. క్రీ. శ. రెండవ శతాబ్దమునాటిదిగా భావింపబడుతున్న యీ సంఘం సాహిత్యంలో - ఆనాటి తమిళరాజ్యంలో వాడుకలోనున్న అనేక పద్యములు - పాటలు మొదలగు సాహితీ ప్రక్రియలున్నవి.

అయితే! 'తొల్కాప్పియమ్' గానీ, 'సంఘం సాహిత్యం' గానీ, వేంకటాచలమును పేర్కొన్నవి గానీ దానిమీద వెలిసిన దేవుని పేరుమాత్రం చెప్పలేదు.

'అహననూరు' అనే పద్యకావ్యంలో కూడ తిరుపతిని వేంగడమనే పేర్కొన్నారు. ఆ ప్రాంతాన్ని 'పుల్లి' అనిపేరుగల వడుకు ప్రభువొకడు పాలిస్తున్నట్టుగ వ్రాయబడింది. పుల్లి అను యీ ప్రభువు తెలుగువాడు.

అప్పట్లో ఆప్రాంతాన్ని పాలించు రాయలసీమ రాచబిడ్డడు గావచ్చు. ఆకాలంలో తమిళులు తెలుగున 'వడుకు' అనేవారట! ఈ కావ్యంలోనే 'పవత్తిరి' అనే రాజధానినుంచి 'తిరయ్యన్' అను రాజొకడు పాలన గావించినట్టు వ్రాయబడింది. ఈ ప్రాంతం ప్రస్తుతం గూడూరు తాలూకాలోని రెడ్డిపాళ్యంగా గుర్తించబడింది.

సంఘం కవి అయిన, మములానర్, పద్యాల్లో తిరుపతి ప్రాంతాన్ని 'పుల్లి కున్ఱమ్' - అనగా పుల్లి పరిపాలించు ప్రాంతంగానే పేర్కొన్నాడు.

తదుపరి ఈ ప్రాంత ప్రస్తావన 'శిలప్పాధికారం' అను తమిళ కావ్యంలోనున్నది. ఇది కణ్ణగి కథగా పేరుగాంచినది. దీనికర్త - జైన మతస్థుడో లేక బౌద్ధమతస్థుడో? - అతని పేరు ఇల్లంగో - అడిగల్. క్రీ. శ. 8వ శతాబ్దివాడు. వేంగడాన్ని - దానిమీద వెలిసిన విష్ణుమూర్తిని చక్కగా వర్ణించినాడు.

ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం ప్రకారం - యీ ప్రాంతం - మహేంద్ర పర్వతాలలోని అంతర్భాగం.



(గాలిగోపుర దృశ్యము)

# ప్రశస్తి

పన్నిద్దఱు ఆళ్వారులలో మొదటిముగ్గురు - పొయిగై ఆళ్వారు, భూత ఆళ్వారు, పేయాళ్వారు - యీ ప్రాంతంలోని 'తిరుక్కోవిలూర్' అనే గ్రామంలో - దైవకల్పితమైన గాలివానకు - చాలీచాలని ఇంట్లో ఒకరి తరువాత ఒకరు ప్రవేశిస్తారు. వారి వెనుకనే విష్ణుమూర్తి ప్రవేశించి - ముగ్గురినీ మెడబట్టి గెంటి - తానెవరో తెలుసుకొనేటట్టుచేయగా, వారు ఆయననే గాక, తాము ముగ్గురము ఎవరయినదీ తెలుసుకొని, ఆశ్చర్యపడి ఆత్మజ్ఞాన స్వరూపులై అనూహ్యంగా దర్శనమిచ్చిన విష్ణుమూర్తి దయావిశేషానికి వివశులవుతారు. వారు కలిసిన 'తిరుక్కోవిలూర్' ఏదో తెలియదు. తిరుమల శ్రీవారి ఆలయంలో స్నపన మండపమునకు 'తిరువిలన్‌కోయిల్' అని పేరు. తిరుచానూరులోకూడ ఆ పేరుతో ఒక మండపము వుంది. ఏదయినా - ఏదనుకున్నా, వచ్చిన ఇబ్బందిలేదు.

పన్నిద్దఱు ఆళ్వారులు - పొయిగై ఆళ్వారు, భూతాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిశైయాళ్వారు, నమ్మాళ్వారు (శఠగోపాచార్య), మధురకవి ఆళ్వారు, పెరియాళ్వారు, ఆండాళ్ (గోదాదేవి), కులశేఖర ఆళ్వారు, తొండరడిప్పొడి ఆళ్వారు, తిరుప్పాణాళ్వారు, తిరుమంగై ఆళ్వారు - యీ పుణ్యక్షేత్రాల నడయాడి - పాడిన దివ్య కీర్తనలన్నీ నాలాయిర ప్రబంధమందున్నవి.

108 పవిత్ర విష్ణుక్షేత్రాలు - 108 దివ్య తిరుపతులన్న నామంతో తిరుపతి పేరుమీదుగానే చలామణిగావడం గమనార్హం.

ధర్మకీర్తి అను బౌద్ధ వేదాంతి, వ్యాకరణకర్త యీ ప్రాంతంలో పుట్టడంవల్ల ఇది బౌద్ధులకుకూడ యాత్రాస్థలమైంది.

ప్రసిద్ధ తెలుగు పూర్వకవులు - ఎఱ్ఱాప్రెగ్గడ, జక్కన, శ్రీనాథుడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, తెనాలిరామకృష్ణుడు, ధూర్జటి మొదలగువారు యీ పుణ్యభూమిని పొగిడినారు - తమతమ కావ్యాలలో.

మేమెందుకు మ్రొక్కకూడదని - మహమ్మదీయ మంత్రి లాలాఖమరాం-
ఖల్లి మోహనదీతో - భార్య పితాబీబీతో తిరుమలరాయ మండపం నుంచి,
శ్రీ వేంకటేశ్వరుని మ్రొక్కుతున్నారు. లాలాఖమరాం అంటే ఎవరోకాదు.
మన సన్నిహితుడు 'తోడరమల్లు'— హైదరాబాదులో నివశించిన మనమంత్రి.
రెండవ వెంకటపతిరాయలు, తన సామంతుడైన దామెర్ల వెంకటాద్రిచే -
క్రీ. శ. 1639 లో మద్రాసులో సెయింటు జార్జి కోటను కట్టుకోవడానికి
(మిస్టర్ ఫ్రాన్సిస్‌డే అను తూర్పు ఇండియా కంపెనీ అధికారికి) అనుమతి
నిప్పించినాడు. చంద్రగిరి కోటనుండి వెలువడిన యీ ఆజ్ఞాపత్రం భారతదేశ
చరిత్రనే మార్చివేసింది. దామెర్ల వేంకటాద్రి తండ్రి పేరు 'చెన్న' (చెన్న
పట్టణం) నిలిచింది.

రాయచోటి ప్రభువు మట్లి కుమార అనంతరాజు - అనంతునిలో లీన
మయినా ఆతడు కట్టించిన - శ్రీ గోవిందరాజస్వామి రాజ గోపురము, అలిపిరి
దిగువనున్న గాలిగోపురము, తిరుమల సోపానమార్గము - ఇంకా ఆతని రాక
కోసం నిరీక్షిస్తూనే వున్నాయి - పైకి ఎగజూస్తూ! దొరతనము చిన్నదయినా -
పెద్దగుణమాతనిది. దైవప్రేరితుడయిన ఆతని జీవితము కడుంగడు ధన్యము.

శ్రీ కృష్ణదేవరాయలను చరిత్ర ప్రసిద్ధుని చేసిన మహామాత్యుడు
తిమ్మరుసు మంత్రి పుట్టినది చంద్రగిరిలో. ఆతని తమ్ముడు గోవిందా
మాత్యుడు కూడ చరిత్ర ప్రసిద్ధుడే! 'చంద్రభాను చరిత్రము' వ్రాసిన తరి
గొప్పుల మల్లన చంద్రగిరి వాసి. ఈతడు 16 వ శతాబ్దమునకు చెందిన
వాడు. ఇటీవలి వరకు సినీపరిశ్రమలో ప్రసిద్ధుడై, భక్తపోతన, భక్త రామ
దాసు పాత్రధారి అయిన చిత్తూరు నాగయ్య జన్మస్థలం - చంద్రగిరి. వికట
కవి అని పేరు గాంచిన - అష్టదిగ్గజములలో నొకడై విఖ్యాతి గాంచిన తెనాలి
రామకృష్ణ కవి చివరి దినాలను యిచ్చోటనే గడిపినాడు. చంద్రగిరి కోటలో
రాజమహలుకు వెనుక వైపు శతాబ్దుల తరబడి నిలబడి వున్న మట్టిగోడలు -
రామకృష్ణుని గృహమని స్థానికుల అభిప్రాయం. అందువల్లనే ఏమో! ఎండకు
ఎండి వానకు తడిసినా అవి ఇంకా కూలిపోకుండా నిలబడే వున్నాయి. రామ

కృష్ణుని మాహాత్మ్యమంటే సామాన్యమా మరి? కాకపోతే, అతడు విరచించిన శ్రీ పాండరంగమాహాత్మ్య పుణ్యఫలం కావచ్చు. శ్రీకాళహస్తి వాసుడయిన ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యము వ్రాసి వాసి కెక్కినాడు.

హిందూమతం - ధర్మం - రక్షణ కొఱకు, మహమ్మదీయ మత వ్యాప్తిని పరిపాలనను అరికట్టడానికి స్థాపింపబడినది - విజయనగర సామ్రాజ్యం. ఈ సామ్రాజ్యానికి అవసరమైన చక్రవర్తులు, సాళువ, తుళువ, ఆరవీటి వంశీయులనే గాకుండా మంత్రులను, దండనాధులను, మహాకవులను, పండితులను కూడ పంటలతోబాటు పండించింది స్వర్ణముఖి.

అంతేగాదు! శ్రీ రాఘవేంద్రస్వామి జననీజనకులు, శ్రీ సొరకాయ స్వామి, శ్రీ మళయాళస్వామి, స్వర్ణముఖీ నది వల్ల పునీతులై, అందరినీ పునీతులను జేసి పరమపదమందినారు.

భారతదేశ మాజీ అధ్యక్షుడు డాక్టర్ రాధాకృష్ణ పండితుడు, లోక్‌సభ మాజీ అధ్యక్షుడు శ్రీ అనంతశయనం అయ్యంగారు - తిరుచానూరు నుంచి తిరుపతి ఉన్నత పాఠశాల చదువుకోసం వస్తూ పోతూ - పుస్తకాలు గట్టున పడవేసి స్వర్ణముఖిలో ఈదులాడి రోజులను తలచుకొని, ముసలితనంలో మురిసిపోయేవారు. అయితే వర్షాకాలములోనే అది సాధ్యం. కబీరుదాసు అన్నట్టు - మునిగినవారంతా మహానుభావులు కాకపోయినా - మునిగిన వారిలో మహానుభావులున్నారు. త్యాగయ్య అన్నట్టు, అలాంటి మహానుభావులు ఎందరో? అలాంటివాడే శ్రీ రామానుజాచార్యులు. విశిష్టాద్వైతాన్ని పదిమందికీ కరతలామలకం చేసిన మహనీయుడు. తిరుపతి పట్టణ స్థాపకుడు. శ్రీ గోవిందరాజస్వామిని తిరుపతిలో ప్రతిష్ఠజేసిన పుణ్యాత్ముడు. అతని జ్ఞాపకార్థమే - తిరుపతినుంచి తిరుమలకుపోవు సోపానమార్గంలో రెండు భాష్యకారుల గుడులు, శ్రీ వరాహస్వామి, శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీ గోవిందరాజస్వామి, మంగాపురం శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి, నారాయణవనం శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయాలలో యతిరాజాలయములు వెలిసినవి.

అంతెందుకు? దక్షిణదేశంలోని అన్ని వైష్ణవాలయాలలో ఆయన విగ్రహాలున్నాయి.

ఆలవందర్ అని పేరు గాంచిన యమునాచార్యుడు - ఆతని తండ్రి ఈశ్వరముని, ఆతని తండ్రి నాథముని - ఆతని ఆజ్ఞాపాలకుడయిన రామమిశ్రుడనబడు మనక్కాల్‌నంబి, మహాపూర్ణుడు (పెరియనంబి), శ్రీశైలపూర్ణుడు (తిరుమలనంబి), ఆంధ్రపూర్ణుడు (వడుగనంబి), ఆళ్వారు చెఱువును త్రవ్విన అనంతాచార్యులు (ఆనందాళ్వారు లేక పురుషవార్లు), వేదాంతదేశికుడు, ఆయన నమ్మిన పరకాలస్వామి (బ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామి), హత్తీరాంజీ మహంత్ ఆయన శిష్యపరంపర మహంతులు, శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి, వీరంతా తిరుమల ప్రాంతచరిత్రకు దోహదం చేసినవారే!

---

గమనించదగిన విషయం:— "నందలూరు సమీపాన బాహుదానదీ తీర ప్రదేశంలో "లంజకనుమ గుట్ట" వద్ద ఒక బౌద్ధ విగ్రహం, బుద్ధుని పాదము, బ్రాహ్మిలిపి గల శాసనాలు మృణ్మయ పాత్రలో భద్రపరచబడిన రాగి, సీసపు నాణెములు దొరికాయి. ఇవి క్రీ॥పూ॥ 3 వ శతాబ్దికి చెందినవని భావించుచున్నారు. ఇది మౌర్యకాలమునాటిదని రాయలసీమలో బౌద్ధ సంస్కృతికి సంబంధించిన అవశేషాలు బయల్పడడం ఇదే ప్రథమమని రాష్ట్ర పురావస్తు శాఖవారు అంటున్నారు. వీటిని బట్టి రాయలసీమలో బౌద్ధమతము వ్యాప్తి చెందినట్లు మొట్టమొదటి సారిగా కనుగొనబడింది. భారీ ఎత్తున ఇంకా త్రవ్వకాలు పరిశీలనలు నిర్వహించిన ఈ ప్రదేశానికి సంబంధించిన చరిత్రాంశాలు ఇతోధికముగా వెలుగులోకి రాగలవని కడపజిల్లా కలెక్టరు అన్నారు. ఇచ్చట చరిత్రాత్మకమైన నిగూఢమైన ఒక గుహ కలదు. ఇచ్చట నుండి సిద్ధవటం కోటలోనికి ఆనాటి పరిపాలకులైన నవాబులు రహస్యమార్గము ఏర్పరచుకొనియుండిరని పూర్వగాథ". (ఈనాడు, ఆదివారం జనవరి 13, 1980.)

శేషాచల పాదముల వరకు బౌద్ధమతము వ్యాపించినదన్న ముఖ్య విషయం పై విషయాన్ని బట్టి స్పష్టమవుతోంది.

# అంజనాద్రి

"దక్షిణస్య సముద్రస్య తథా వింధ్యస్య చాంతరే" నర్మదా తపతీ నదులను మినహాయించి - వింధ్యపర్వతాలకు దక్షిణ భాగము - త్రిసముద్ర సమేత - దక్షిణా పథమని వ్యవహరింపబడినది. దక్కను పీఠభూమి అను పేరు దానికి వికృత రూపముగానే వచ్చి వుండవచ్చు. దక్షిణా పథశబ్దము వాల్మీకి రామాయణమున (క్రీ. పూ. 2 వ శతాబ్దము), స్కందపురాణమున కలదు. (వి. న.) తిరుమల చక్రతీర్థ, సమీపంలోని 'శిలాతోరణం'-కొన్ని లక్షల ఏళ్లనాటిదని భూగర్భశాస్త్ర నిపుణులు తేల్చిరి. మైక్రోవేవ్ స్టేషనుకు పోవుదారి ప్రక్కన నున్న యీ 'శిలాతోరణం' యీ ప్రాంత ప్రాచీనతను తెలియజేయుచున్నది. ఇలాంటి అద్భుతాలు ప్రపంచంలో మూడు మాత్రమే వున్నాయట.

"దక్షిణాపథమున జీవకోటి ఉత్తరాపథమునకంటె ముందే వర్ధిల్లినదని విశ్వసింపవచ్చును .... దక్షిణాపథమందెల్లెడ లభించిన ప్రాచీన సమాధి స్థలముల పరిశోధనలవలన పాతజాతియుగము క్రీస్తుపూర్వము 5,00,000 సంవత్సరములకు పూర్వమే వర్ధిల్లెనని చెప్పవచ్చును .... దోర్ణకల్లు ఆత్మకూరు కనుమదగ్గర, తరువాత గిద్దలూరు గ్రామముదగ్గర శిలాపరికర పరిశ్రమబాగుగా సాగినట్లు విశదమగుచున్నది. బేతంచర్లకు దగ్గరగానున్న 'బిల్లసర్గం' కొండ గుహలలో ప్రాక్చారిత్రక యుగమునకు సంబంధించిన జంతువుల అస్థిపంజరములు, ప్రాచీన శిలాయుగ పరికరములు దొరికినవి. నవీనశిలాయుగమునాటి జనులు నల్లశాణపు రాతికొండలలో నివసించుచుండెడివారు. వీరు వ్యవసాయముతోబాటు గొఱ్ఱెలు, మేకలు మొదలగు జంతువులనుకూడ పెంచుచుండెడివారు.

"నవీన శిలాయుగము కాలక్రమమున ఇనుపయుగమునకు దారితీసినది. ఇనుపయుగము నాటి పనిముట్లు ప్రాచీన సమాధులలో దొరకుచున్నవి. ఈసమాధులకు వ్యవహారభాషలో 'రాక్షసిగుళ్ళు' అనిపేరు. (ఆంగ్లనామము

గాలిత్స్) ... నిలువురాళ్ళు మృతజన స్మారక చిహ్నములుగా పాతిపెట్టు
ండెడివారు. "రాతిపెట్టెలు మరియొకరకమైన సమాధులు .... ఇంకొక
మైన సమాధి పీనుగుతొట్టె. మట్టితో పెద్దతొట్టిజేసి దానిలో అస్థికలు,
ండలుపెట్టి దానిని భూమిలో పాతిపెట్టుట పరిపాటి. ఇట్టివి చిత్తూరు,
ర్నూలు, అనంతపురం మండలములలో నున్నవి. ఈ శవపేటికలకు చుట్టు
లేక 8 కాళ్ళు ఉండును. భారతదేశమంతటిలోను అద్వితీయము, అన
నమునైన శవపేటిక కడప మండలములోని శంకవరమునందు దొరికినది.
గొఱ్ఱె ఆకారముకల 6 కాళ్ళపెట్టె ....

"ఉత్తరాపథమున గంగాసింధుమైదానములలో ఆర్యులు స్థిరనివాస
ల నేర్పరుపకమునుపే దక్షిణాపథమున ప్రాగైతిహాసిక యుగమున ప్రాక్తన
నవుడు ప్రాచీన నవీనశిలాయుగములలో వర్ధిల్లియుండిరి.

"ద్రావిడ భాషలు దక్షిణాపథమున ఆర్యసంస్కృతి అవతరించుటకు
ర్వమే వర్ధిల్లెనని చెప్పకతప్పదు. గుణాఢ్యుడు సంస్కృత ప్రాకృతములనే
దేశభాషనుకూడ పేర్కొనెను. గుణాఢ్యునకు కొన్నిశతాబ్దులు పూర్వమే
క్షిణాపథమున "మూలద్రావిడ భాష" వివిధ మాండలికములతో విలసిల్లి
. ద్రావిడభాషకు మొదటివ్యాకర్తగ అగస్త్యుడు పేరుకెక్కెను.

"ఆర్యసంస్కృతిని దక్షిణాపథమున అవతరింపచేసిన ప్రథమ
ారకుడు అగస్త్యమహర్షి. అగస్త్యునకును దక్షిణదిక్కునకునుగల అవినా
వ సంబంధము జగత్ప్రసిద్ధము ....

"రామాయణ మహాభారతములకు దక్షిణాపథమందలి వివిధరాజ్యములు
రిచితములే. మహాభారతయుద్ధము క్రీస్తుపూర్వము 3,000 సంవత్సరము
ముందు జరిగినది. అందు దక్షిణాపథరాజులు పలువురు పాల్గొనినట్లు
వర్ణితము....

"చారిత్రకదృష్టితో చూచిన రాముడు దక్షిణాపథమున ఆర్యసంస్కృతిని
రించుటకు పూనుకొనిన కారణజన్ముడు. రాముడు దండకారణ్యమున

అగస్త్యుని సందర్శించెను. అగస్త్యుడు దక్షిణాపథమున ఋషివాటికలు ఎట్లు వర్ధిల్లుచున్నవో వివరించి, రాక్షసుల బారినుండి వారిని రక్షింపుమని కోరెను.

"పురాణయుగానంతరము దక్షిణాపథమున విలసిల్లిన రాజవంశములలో ఆర్యసంతతికి చెందినవారు దక్షిణకోసలనేలిన ఇక్ష్వాకులు, విదర్భనేలిన భోజులు, మహిష్మతినేలిన హైహయులు, దక్షిణాపథమందలి ఆదిమనివాసులగు ఆంధ్రులు, శబరులు, పుళిందులు, ఆర్యసంస్కృతికి చెందిన విశ్వామిత్రుని సంతతివారు కలసిపోయిరి.

"బ్రాహ్మణకముల కాలమున ఆర్యసంస్కృతి విదర్భవరకు వ్యాపించినది. పాణిని (క్రీస్తుపూర్వము 7వశతాబ్దికి ముందువాడు) గోదావరీ ప్రాంతమందలి అశ్మకదేశమును పేర్కొనెను. కాత్యాయనుడు - నందరాజుల కాలము నాటివాడు - పాండ్య, చోళ, కేరళపథములను వివరించెను. ఐతరేయ ఆరణ్యకమునందు చేరులప్రస్తావన కలదు. వారు అనాచారులుగ నభివర్ణింపబడిరి. సూత్తనిపాతమునందు కోసలదేశమునుండి 'బావరి' పండితుడు దక్షిణాపథమునకు పోయి అచ్చట 'అస్సక' దేశమున గోదావరీ తీరమందలి యొక పల్లెలో స్థిరనివాస మేర్పరచుకొనినటుల కథ కలదు. అతడు వేద వేదాంగ పారంగతుడు. సోమయాజి, అతని శిష్యులు ఉత్తరాపథమునకు బుద్ధుని కలసికొనుటకు పోయిరి. వారు పోయిన మార్గమున 'పతిత్థాన,' మాహిష్మతి (మాంధాత), ఉజ్జయిని నగరములు కలవు. పాండ్యరాజధాని మధుర. దక్షిణమధురను శ్రీకృష్ణుని కూతురు రాణియై యేలిన కథను గ్రీకు రాయబారి మెగస్తనీసు అభివర్ణించియున్నాడు. బోధాయనుడు ధర్మసూత్రములలో దాక్షిణాత్యు లవిగ పంచవైలక్షణ్యములను వివరించియున్నాడు. అనుపేతులతో సహభోజనము, స్త్రీలతో సహపంక్తిభోజనము, చలిదిఅన్నము తినుట, మేనమామ కూతురును వివాహమాడుట, మేనత్తకూతురును వివాహమాడుట. చివరి రెండు ఆచారములును ఉత్తరాపథమున నిషిద్ధములైనను, దక్షిణాపథమున అన్ని వర్గములందును నేటికిని నిల్చియుండుట గమనింపదగిన విశేషము.

"కాలక్రమమున బౌద్ధ జైనములు దక్షిణాపథమున ప్రవేశించినవి. క్షిణాపథమున రాజకీయాధిపత్యమును సంపాదించిన ప్రథమ రాజవంశము రు నందులు. నందరాజులు కళింగమును జయించి మగధకు కొనిపోయిన నవిగ్రహమును ఖారవేలుడు తిరిగి కొనితెచ్చెను. గోదావరి తీరమునందలి ంందేర్' (నౌనందదేరా) నందరాజ్య చిహ్నమని కొందరు చరిత్రకారుల భిప్రాయము. నందసామ్రాజ్యమును చంద్రగుప్త మౌర్యుడు కౌటిల్యుని ాయమున క్రీ॥ శ॥ 322 సంవత్సరమున కూలద్రోసెను.

"చంద్రగుప్తుడు తన జీవితమునందలి అపర సంధ్యాసమయమును హరరాష్ట్రమునందలి శ్రావణ బెల్గొలాలో గడిపినట్లు జైన వాఙ్మయము కకంఠముతో వచించుచున్నది. అతని గ్రీకురాయబారి 'మెగస్తనీసు ధ్రులకనేక గ్రామములు, 30 కోటలు, లక్షకాల్బలము, 2000 అశ్విక ము, 1000 గజబలముండెడిది ...' అని వ్రాసినాడు.

మౌర్య సామ్రాజ్యకాలమున ఉత్తర దక్షిణ భారతముల మధ్యగల ్యపారసంబంధములను పేర్కొనుచు కౌటిల్యుడు అర్థశాస్త్రమున వ్రాసిన టలు పేర్కొనదగినవి.

'భూమార్గములలో హిమాలయములకు పోవు వ్యాపారమార్గమే దక్షిణా ముసకు బోవు మార్గము కంటె శ్రేష్ఠతరమని మాగురుదేవుల అభిప్రాయము. ు ఉత్తరమున ఏనుగులు, గుఱ్ఱములు, దంతము, చర్మములు, సుగంధ వ్యములు, వెండి, కాంచన వస్తువులు దొరకును.' కానీ కౌటిల్యుడు రువుగారి యభిప్రాయముతో నేకీభవింపలేదు.

* తిరుమల శ్రీవారి ఆలయములోని మూర్తి బుద్ధ విగ్రహమని కొందరి అభిప్రాయము. విగ్రహము అనగా జైన తీర్థంకరులలో నొకరి విగ్రహమని మరికొందరి అభిప్రాయము. పూర్వము వైష్ణవము వ్యాపింపలేదన్న సంగతి యీ అభిప్రాయమునకు తావొసగుచున్నది. కకూ, ఆ దేవదేవునికి - విష్ణువని, కుమారస్వామియని, శ్రీరాముడని, మహాదేవుడని, బాలాత్రిపురసుందరియని, ఎవరెలా భావిస్తే - అలాగే కనబడతారని యీ గ్రంథకర్త ప్రాయము. అంతా విశ్వాసబలము.

"నా అభిప్రాయము వేరు, దక్షిణాపథమున ఉన్ని, చర్మములు, గుఱ్ఱములు లభింపక పోయినను అచ్చట వజ్రములు, శంఖములు, వివిధరత్నములు, పగడములు, కాంచనవస్తువులు లభించును. అంతేగాక దక్షిణాపథమునకు పోవు మార్గమధ్యమున విలువైన గనులు కలవు. వివిధవ్యాపార వస్తువులు లభించును. అనేక వర్తకులు కూడుచుందురు. ప్రయాణము సులభము. కావున దక్షిణాపథమార్గమే శ్రేష్ఠతరము.

"(కౌటిల్యుడు) .... అర్థశాస్త్రమున పగడవిభేదమును వర్ణించుచు తామ్రపర్ణి నదిలో దొరకు 'పాండ్యకవాటము'ను పేర్కొనెను. అర్థశాస్త్రమున మధురలోని వస్త్రములను గూర్చిన ప్రసక్తికలదు. దక్షిణమున లభించు వైఢూర్యరత్నమునుగూర్చి, చందనమును గూర్చియు విశేషప్రశస్తికలదు.

"మౌర్య సామ్రాజ్యము దక్షిణాపథమున విస్తరించిన సంగతి తమిళ వాఙ్మయమున కూడ ప్రతిఫలించినది. 'మామూలనార్' కవి (సంఘం కవి) నందుల ధన నిక్షేపమును ఉదాహరించెను. ఒక విరహిని నోట వెలువడిన మాటలు.

"నా ప్రియునింత కాలము ఆకర్షించి నా నుండి వేరు చేయగలిగిన విశేషమేమై యుండును. పాటలీపుత్ర సౌభాగ్యము ప్రోగుచేసి యుద్ధములలో జయశీలురయిన నందులు గంగానదిలో దాచిన ధన నిక్షేపమై యుండునా!' 'మామూలనార్ కవీశ్వరుడు ప్రకరణాంతమున మౌర్య దండయాత్ర వర్ణించెను. . .

"తమిళ దేశమున దక్షిణకొననున్న గుహలలోనున్న బ్రాహ్మీ శాసనములు క్రీస్తు పూర్వము 3వ శతాబ్ది నాటివని చెప్పవచ్చును. ఈ శాసనాక్షరములు భట్టిప్రోలు అక్షరములను పోలుచున్నవి .... ఇందులో ఒక గుహ పేరు 'కడుగుమళై'. బౌద్ధ వాఙ్మయమున చిరస్మరణీయమైన గృధ్ర కూటమున కనువాదము. ఇట్టి గుహలు నెల్లూరు మండల మందలి మాలకొండలో కూడ

బయలు వెడలినవి. జైన బౌద్ధము లేకకాలముననే దక్షిణాపథము ప్రవేశించె నని విశ్వసింపవచ్చును. పైన పేర్కొనబడిన శాసనలిపి దక్షిణ బ్రాహ్మి."

—శాలి యుపన్యాసలు, ప్రాచీన దక్షిణభారత చరిత్ర, నండూరి రామకృష్ణమాచార్య.

క్రీ. పూ నాటి నవనందులు, వారి తరువాత చాణక్యుని శిష్యుడగు మౌర్యచంద్రగుప్తుడు, అతని తరువాత యాతని కుమారుడు బింబిసారుడు, అతని తదనంతరము ప్రసిద్ధిగాంచిన యాతని కుమారుడు అశోకుడు, దక్షిణాపథము నేలిరి.

అశోకుని మరణానంతరము మౌర్యసామ్రాజ్యము, విచ్ఛిత్తి నొందినది. మౌర్యసామ్రాజ్య మస్తమించిన తరువాత చక్రవర్తిత్వమునకు నలుగురు ప్రయత్నించిరి. మగధ సింహాసనమును ఆక్రమించిన పుష్యమిత్రుడు, గ్రీకురాజు డెమిట్రియస్, కళింగాధిపతి ఖారవేలుడు, దక్షిణాధిపతియైన శతకర్ణి.

అంతవరకు, వారికి సామంతులుగా నున్న శాతవాహనులు, తాము స్వయముగా స్వతంత్ర రాజ్యమును స్థాపించిరి - (క్రీ.పూ. 220).

ఇదియే శాతవాహన సామ్రాజ్యము. మొదటి ఆంధ్ర మహారాజ్యం.

శాతవాహనులు ఆంధ్ర భృత్యులని, ఆంధ్ర సజాతీయులని. ఆంధ్రులని పురాణములు వర్ణించినవి. వారు తమ శాసనములలో ప్రాకృతమును వాడిరి. బౌద్ధ. జైన ప్రబోధకులు వాడిన పాళి, ప్రాకృతమునకు మూలభాష. ఆంధ్రులయిన శాతవాహనులు తమ శాసనములలో ప్రాకృతమును ఏల వాడిరి? అది అలనాటి రాజభాష. పైగా విద్యావంతుల బాష. క్రీస్తు శకము 3వ శతాబ్ది వరకు ఆంధ్రదేశము నందలి శాసనములన్నియు ప్రాకృత శాసనములే. భట్టిప్రోలు, అమరావతి యందలి శాసనములు కూడ ప్రాకృత శాసనములే. చరిత్రకారులందరూ, శాతవాహనులు ఆంధ్రులన్న విషయములో ఏకాభిప్రాయమునకు వచ్చినా, శాతవాహనులు మాత్రం తాము ఆంధ్రులమని ఏ శాసనములోనూ చెప్పలేదు. ఇది మరీ విచిత్రం.

ఆంధ్ర దేశమునకు - దక్షిణ దేశమునకును, దగ్గర సంబంధం శాత వాహనులతోనే ప్రారంభమయినది. అయినా, వీరి కాలంలో గాని, వీరి తరువాత కృష్ణానదితీరస్థ దేశమును పరిపాలించిన ఇక్ష్వాకుల కాలంలో గాని, తెలుగువారు దక్షిణాదికి వెళ్లి వలసలు స్థాపించలేదు. క్రీ. పూ. 600 ప్రాంతంలో ఆపస్రభుని నాయకత్వాన ఆంధ్రులు ఒక తెగగా దక్షిణాదికి బయలుదేరి వెళ్ళినట్టు కొందరి అభిప్రాయం.

ఆంధ్ర రాజులయిన ఇక్ష్వాకుల రాజధాని విజయపురి. ఇది నాగార్జున కొండలోయలో నున్నది. వీరు దక్షిణాది గుండా వెళ్లి, సింహళ ద్వీపముతో వ్యాపారము చేసిరి గానీ, దక్షిణాదిలో ఏ ప్రాంతమునూ పాలించలేదు. క్రీ.శ. 78 — 102 సంవత్సరముల మధ్య పాలించిన శాతవాహన చక్రవర్తి గౌతమీపుత్ర శాతకర్ణి రాజ్యములో ప్రస్తుత రాయలసీమ జిల్లాలు కలిసి యుండెడివి. అయినా తొండమండలము పూర్తిగా కలువబడలేదు.

గౌతమీపుత్ర శాతకర్ణి తరువాత ఆతని కుమారుడు పులుమావి, దక్షిణాపథముపై దండెత్తి, తొండమండలమును శాతవాహన సామ్రాజ్యములో కలిపెను. ఈవిధముగా క్రీ. శ. ఒకటవ శతాబ్దము చివరన తొండ మండలము శాతవాహన సామ్రాజ్యములోని అంతర్భాగ మయ్యెను. పులుమావి చేతిలో ఓడిన కరికాల చోళుడు చరిత్రప్రసిద్ధుడు. ఇతడు కావేరినదికి ఆనకట్ట నిర్మించెను. ఇతని కాలముననే తమిళవాఙ్మయం 'సంఘం' అనుపేర వెలిసినది. వుహారు, కావేరి పూంపట్టణములు, కరికాలుడు, గోచ్చెంగణాన్ రాజులు, వారిమధ్య జరిగిన అంతర్యుద్ధములు ఇందలి కథా వస్తువులు. ఇందులో వేంగడమను పేరుతో తిరుమలకొండలు ప్రస్తావించ బడినవి

— —

# వృషభాద్రి

క్రీ. శ. 130-150 సంవత్సరముల కాలంనాటి 'టోలమీ' అను గ్రీకు భూగోళ శాస్త్రజ్ఞుడు ఆంధ్ర ప్రాంతమంతా పర్యటించినాడు. తన పర్యటనానుభవంతో వ్రాసిన భూగోళంలో - దక్షిణాదిన 'అరువనాడు' (తొండమండలం) అను ప్రాంతమున్నట్లు - దానికి 'మలంగ' రాజధాని అయినట్లు - దానిని బసోరనాగులనువారు పాలిస్తున్నట్లు తెలియజేసినాడు.

శాతవాహనులలో చివరి చక్రవర్తి మూడవ పులుమావి. అతడు క్రీ. శ. 3వ శతాబ్దములోని రెండవదశాబ్దమున పాలించునప్పుడు, మహాజనపదమను పేరుగల గొప్ప దక్షిణ ప్రాంతమును మహాసేనాపతి స్కందనాగుడనువాడు పాలించుచుండెను. వాని రాజ్యమునకు పశ్చిమముగా - చూతనాగులనువారు వనవాసినుంచి పరిపాలించుచుండిరి. దీనినిబట్టి క్రీ. శ. [illegible] శతాబ్దము ప్రారంభమునాటికి తొండమండలము నాగుల పాలనలో [illegible]ది. కాబట్టి కంచి (కాంచీపురము) అప్పటికి రాజధానిగ ప్రాముఖ్యమునకు [illegible]లేదని తోచుచున్నది.

"టోలిమీ బస్సరానాగులను పేర్కొనెను. ప్రాచీన తమిళ [illegible]జయము ఓవియనాగులను పేర్కొనుచున్నది. పల్లవులు నాగకన్యలను వివాహమాడి, నాగమండలమున రాజ్యము స్థాపించిరి. ఈ పల్లవులే గౌతమీపుత్రశాతకర్ణి నాటి విదేశీయులైన పహ్లవులనుట ఊహామాత్రమైనను సత్యదూరము కాదు. యవనులు, పల్లవులు, ఇక్ష్వాకులు, శాతవాహనులు వీరికి అన్యోన్య వివాహబంధములు కన్పించుచున్నవి."

— (121 ప్రా. ద. భా. చరిత్ర - నండూరి రా. కృ.)

ఈ కాలమునకు చెందిన మత్స్యపురాణము ఆ కాలమునాటి - ఇట్టి సాంఘిక విప్లవ పరిమాణమును సూచించుచున్నది.

పై విధముగా, శాతవాహన సామ్రాజ్యము అంతరించునాటికి, వారి సామ్రాజ్య తూర్పుకొననున్న నాగులు, ఆ నాగులకు అల్లుడై, పల్లవ వంశ

మూలపురుషుడైన సింహవర్మ (వీరకుర్చ) పల్లవరాజ్యమును తొండమండలము ననే స్థాపించెను. ఆతడు తొండమండలమందలి నాగులందరికి నాయకుడై, తలలోని నాలుకయై ఉత్తర దండయాత్రచేసి, ఇక్ష్వాకుల ఓడించి గుంటూరు, నెల్లూరు, రాయలసీమ జిల్లాలు తన రాజ్యమున కలుపుకొని, కాంచీపురమును రాజధానిగ చేసికొని, తొండమండలమును చక్కగా పాలించెను. క్రీ. శ. 200 నుంచి 900 వరకు అవిచ్ఛిన్నముగా ఇచ్చట పల్లవుల పరిపాలన సాగినది. వీరి కాలమున అనగా క్రీ. శ. 331 లో సముద్రగుప్తుడు దక్షిణ దిగ్విజయయాత్ర చేశాడు. ఆతనిచేత, విష్ణుగోపుడను పల్లవరాజు ఓడింపబడినాడు.

ఈ ప్రాంతమున క్రీ. శ. 5 శతాబ్దమునుంచి క్రీ. శ. 10 శతాబ్దము వరకు శైవమతాభివృద్ధి జరిగినది. క్రీ. శ. 5 శతాబ్దమువాడగు, రాజసింహ వర్మ అను పల్లవరాజు శైవమతాభిమాని.



పల్లవుల ప్రాచీన కుడ్యశిల్పం

# సీలాద్రి

క్రీ.శ. 590_600 మధ్య ఏలిన సింహవిష్ణు పల్లవదేశాన్ని వెలుగులోనికి తెచ్చి ప్రఖ్యాతి గాంచినవాడు. 'పల్లవ' అను నామధేయం ఇతని కాలం నుంచే ప్రసిద్ధిచెందినదిగా తోచుచున్నది. (సింహళ నాగవంశరాజ కుమారిని ఒక చోళరాజు వివాహమాడగా ఆమె కుమారుడు తిరిగి సింహళానికి నాగ వంశరాజుగా పోయినాడు. ఇతను పాలించిన లేక ఇతని తల్లి జన్మించిన స్థలం 'మణిపల్లవమ్'. ఈ పేరుమీదుగానే వారు పల్లవులయినట్లు చెపుతారు.) ఈ సింహవిష్ణు కంచి రాజధానిగా చోళ, చేర, పాండ్య, సింహళ వగైరాలను జయించి కీర్తిగాంచినాడు.

క్రీ. శ. 546 _ 611 లో విష్ణుకుండినులలో ఆఖరివాడగు మాధవ వర్మ పాలించినాడు. (వీరిలో అనేక మంది మాధవవర్మలు వున్నారు.) ఇతని కాలంలో గణస్వామి అను పండితుడు 'జనాశ్రయ ఛందో విచ్ఛితి' అను గ్రంథ రచన చేశాడు. దీనిద్వారా ఆ కాలంనాటికే గీత, సీసపద్యాలు రచించేవారని తెలియుచున్నది. క్రీ.శ. 575 నాటిదని భావింపబడుతున్న- కడప జిల్లా, కలమల్ల గ్రామంలో దొరికిన యీ తెలుగు శాసనం - తెలుగులో మొట్టమొదటి శాసనంగా రూఢి అయింది.

క్రీ. శ. 600 _ 630 నాటి మహేంద్రవర్మ ప్రసిద్ధిచెందిన పల్లవ చక్రవర్తి. ఇతడు శైవ భక్తుడుగా నుండి, తిరుచినాపల్లి, వల్లవారం వగైరా ప్రదేశాలలో శైవాలయాలు నిర్మించి, శైవమతాన్ని ప్రచారం చేయడానికి చాల కృషిచేసినాడు. ఈతనిని సుశర్మ వంశీకుడును, చాళుక్యుడును అగు రెండవ పులకేశి క్రీ. శ. 616 లో ఓడించి, పులివెందుల వేములకోటను ఆక్రమించుకొని, యీ ప్రాంతమునగల పాళేగాండ్ర నందరను ఓడించి తన దిగ్విజయయాత్ర చిహ్నముగా, పులికేశి విండుల (నేటి పులివెందుల) అను పట్టణమును నిర్మించినట్లు తెలియుచున్నది.

క్రీ. శ. 630 – 658 కాలం - ప్రసిద్ధుడైన పల్లవ నరసింహవర్మ ఏలినది. ఇతడు పరమేశ్వర బిరుదాంకితుడయిన రెండవ పులకేశిని ఓడించినాడు. ఇతనికి 'మామల్ల' అని పేరుకూడ వున్నది. ఆ పేరు మీదుగానే ఇతడు మామల్లపురమును (నేటి మహాబలిపురము) నిర్మించినాడు. ఈతని తరువాత పల్లవదంతివర్మ పరిపాలించినాడు. ఈతని పాలన కాలం 60 సంవత్సరాలు.

పల్లవులు మొదట శైవమతాభిమానులు. తదుపరి వైష్ణవ మతాభిమానులు. కొందరు శైవులై, కొందరు వైష్ణవులై, మరికొందరు రెండిటినీ సమాన దృష్టితో ఆదరించిరని తోచుచున్నది. అందుకు సాక్షి నేటి కంచిలో - శివకంచి - విష్ణుకంచి అను పేరులతో ఒకే పట్టణములో రెండు ప్రాంతాలు వెలుగులోకి రావడం. పైగా శిల్పసంపదలో - గోపుర నిర్మాణంలో ఒకదానిని మించి మరొకటి వుండడం.

దంతివర్మ దాదాపు 60 సంవత్సరాలు (క్రీ.శ. 770 – 830) పాలించినా, అతడు తొండమండలమునకు చేసినసేవ అంతగా కానరాదు. లేదంటే, తిరుచానూరులో - శ్రీవేంకటేశ్వరస్వామి (ప్రతిమ) పూజింపబడునప్పుడు - అక్కడ దీపారాధనకు ఏర్పాటు గావించినాడు (క్రీ.శ.830). తి. తి. దే. వారికి లభ్యమయిన శాసనాలలో ఇది మొదటిది. అనగా దీనికి మునుపు కాలంనాటివి ఏవీ లభ్యంకాలేదు తి. తి. దే. శా. సం. శాసనము 3 లో విజయాదిత్యుని పేరున్నది. శాసనం పూర్తిగా లేదు. ఈ విజయాదిత్యుడు బాణరాజు కుమారుడు. ఇతని కాలం క్రీ. శ. 790. శిలప్పాధికారం (క్రీ.శ. 756) ప్రకారం, శ్రీవారి ఆలయం అనే దానిలో సూర్యుడు చంద్రుడు ప్రకాశిస్తున్నారు ఇది టి. కె. టి. వీరరాఘవాచార్య గారి అభిప్రాయం. (తిరుపతి చరిత్ర, మొదటి సంపుటము పుటలు 73-74) ఇది నిజమయితే ఈ శాసనం మొదటిదవుతుంది. (క్రీ. శ. 600 నాటికి ఆంధ్రదేశంలో బౌద్ధమతం నామావశిష్టమై, చివరకు జైన హిందూమతములే

తదనంతరము తెనుగు గుండ్రటి అక్షరాలు సంతరించుకోగా, కన్నడం అలాగే వుండిపోయింది. తెలుగు ద్రవిడబాషా కుటుంబానికి చెందినది.)

అప్పుడా ప్రాంతమును, పల్లవ సామంతులైన బాణరాజు లేలుచుండిరి. బాణరాజులేలిన రాజ్యమునకు వడుగావళియనియు, పెరుంబాణప్పాడి యనియు పేర్లు. చిత్తూరు మండలములోని దక్షిణభాగము, అనంతపుర మండలములోని కొంతభాగము, మైసూరు రాజ్యములోని కోలారు మండల ప్రాంతము, దక్షిణమున పాలారునది గల భూభాగము బాణరాజ్యము. బాణరాజయిన రెండవ విక్రమాదిత్యుని ఉత్తర ఆర్కాడు జిల్లా గుడిమట్టం (గుడియాత్తం) తాలూకా ఉదియేంద్రము తామ్రశాసనములో తన పూర్వుడైన జయనందివర్మ ఆంధ్ర పథమునకు పశ్చిమమునకున్న భూభాగము నేలుచుండెనని వ్రాయించుకొనెను. క్రీ. శ. 4వ శతాబ్దములోనున్న వధూవల్లభ మల్లదేవనందివర్మ యను బాణరాజు తాను వ్రాయించిన ముడియానూరు శాసనములో ఆంధ్ర మండల ద్వాదశ సహస్ర గ్రామ సంపాదితమగు సపార్ధలక్ష విషయాధిపతినని తెలుపుకొనెను.

ఈ ఆంధ్ర మండలమునకే తమిళ కన్నడ శాసనములలో 'వడుగావళి పండ్రెండువేల'ని మారుపేరు గలదు. అనగా ఆంద్ర మండల ద్వాదశ సహస్ర గ్రామ కలితము (ముడియానూరు తామ్రశాసనము క్రీ. శ. 338)

మనమిదివరకే పుల్లి అను పేరుగల 'వడుకు' ప్రభువు వేంగడం ప్రాంతాన్ని పాలిస్తున్నట్టు తెలిసికొన్నాము. వడుకు (తెలుగు) - వడుక- వడుకావళి - వడుగావళి - ఆంధ్రప్రాంతాన్ని - అచ్చటిభాషను తెలియజేస్తున్న వనుట స్పష్టం

క్రీస్తుపూర్వం 1వ శతాబ్దమునాటిదని (శాతవాహనుల కాలంనాటిదిగ) విశ్వసింపబడుతున్న గుడిమల్లం (పాపానాయుడుపేట సమీపం) పరుశురామేశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలోని "బాణరాజుల శాసనములలో ఐదింటియందు కొన్నిటిలో వడుగావళి యుదాహరింపబడినది. చిత్తూరు మండలములోని పుంగనూరు గ్రామమందలి బాణరాజు కన్నడ శాసనములో

వడుగావళి పన్నిసాశిరమని గలదు. విజయనంది విక్రమవర్మ తిరువళ్ళము తమిళ శాసనములో బాణరాజు లేలు రాజ్యభాగమునకు వడుగావళి పంద్రెండు వేలనియే తెలుపబడినది."-- ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము - కుందూరి ఈశ్వరదత్తు.

వడుగావళియే గాక, చిత్తూరు మండలములోని కొన్ని కన్నడ శాసనములలో 'పులినాడు' అను పేరు కూడ వాడుకలో నున్నది. ఈ శాసనములో 'నోలంబ' పల్లవరాజుల కాలమునాటిది. 1. పులినాట్ట కెఱెయబెలగటూరం, 2. పులినాడ కోళతూరం. పైరెండు శాసనములలోనివి చిత్తూరు మండలములోని పుంగనూరు జమీందారీలోని గ్రామములు.

పల్లవులు, వారి సామంతులు బాణరాజులు క్రీ. శ. 9 శతాబ్ద అంతమున బలహీనులైనారు. పల్లవులలో చివరి రాజు అపరాజితుడు. పేరు అపరాజితుడయినా, ఆతడు చోళరాజయిన మొదటి ఆదిత్యుని చేతిలో పరాజితుడయినాడు. అంతటితో పల్లవ సామ్రాజ్యము, చోళ సామ్రాజ్యమున అంతర్లీనమైపోయినది. అయినా కొందరు పల్లవ ప్రముఖులు చోళరాజులను ఆశ్రయించి, వారికి సామంతులై, ప్రభువులై, మంత్రులై మనగలిగినారు. అట్టి వారిలో ప్రముఖుడు - శక్తి విటంకన్. ఇతడు చోళరాజయిన పార్థివేంద్ర వర్మ సామంతుడు. శక్తి విటంకుని భార్య పేరు 'సామావై' (శమావి). ఈమె 'పల్లవ ప్రెగ్గడయ్యర్' (ప్రెగడ - ప్రెగ్గడ తెలుగు పదాలు) కుమార్తె. తిరుమల శ్రీవారి ఆలయంలో క్రీ. శ. 966 లో భోగ శ్రీనివాసమూర్తిని వెలయించినది. తిరుచానూరులో కొన్ని భూములు శ్రీవారికి కైంకర్యము చేసినది. ఈమె వేయించిన శాసనము తి. తి. దే. వారి పురాతన శాసనాలలో రెండవది.

పల్లవరాణి యగు 'శమావై' మరొక పేరు కడవన్ పెరుందేవి. (తిరుమలలో నేడు పెరిందేవి తోటగా పిలువబడుతున్న భాగము (శ్రీ వరాహస్వామి ఆలయమునకు ఉత్తరముగా పాపవినాశము రస్తాపై నున్నది.) ఈమె భర్త

పేరు శక్తి వికటన్ లేక కడవట్టిగల్. విజ్ఞాన సర్వస్వము పల్లవులను ఆంధ్రులని తేల్చినది గాన ఈమె తప్పకుండా తెలుగువారి ఆడబడుచు. దీనిని బలపరచ డానికి ఆమె కన్న తండ్రి నామధేయం, 'పల్లవ ప్రెగ్గడయ్యర్' సహకరిస్తోంది. ప్రెగడ, ప్రెగ్గడ అనునవి తెలుగు పదాలు. తమిళంలోకూడ ఇవి చోటు చూసుకున్నాయి.

ఈమెను గురించి ఇంతగా విపులీకరించడం ఎందుకంటే, చరిత్ర కారులకు, వైష్ణవులకు, శ్రీ వేంకటేశ్వర భక్తులకు, ఆమె మీదున్న ప్రేమ. భోగ శ్రీనివాసమూర్తి అని పిలువబడు, మణవాళపెరుమాళ్ వెండి విగ్రహం చేయించిందని గాదు. తిరుచానూరులో కొన్ని భూములను శ్రీ వేంకటేశ్వర స్వామికి సర్వమాన్యంగా సమర్పించిందనిగాదు. ఇంకా అనేక బంగారు ఆభరణాలు వగైరా, సమర్పించిందనీ గాదు. శాసనములో ఆమె వాడిన మాటలు - అనితరలభ్యం. అందరూ వారి దానధర్మాలను పాడుచేస్తే, కాశీలో వంద గోవులు చంపిన పాపం చుట్టుకుంటుందని శాపం పెడితే, ప్రేమ స్వరూపిణి, భక్తి స్వరూపిణి అయిన యీమె వేయి సంవత్సరాల క్రితం తాను ఆచంద్రార్కముగా వెలయించిన శాసనములో ఏమన్నదంటే, "....ఈ దానాన్ని రక్షించి కాపాడేవారి పాదములు నాకు శిరోధార్యములు. శ్రీవైష్ణవులు రక్షింపబడుదురు గాక! ఇది సత్తాండైచే వ్రాయబడినది." ఎంత ఔదార్యం? ఆ మహారాణి పాదములు మనకు శిరోధార్యములు గదా!

---

# శేషాద్రి

పల్లవుల నోడించిన చోళరాజు ఆదిత్యుడు తన సామ్రాజమును రాష్ట్ర కూట సామ్రాజ్యము వరకు విస్తరింపజేసినాడు.

అశోకుని శిలాశాసనాలలో కూడ చోళవంశ ప్రసక్తి వుంది. ఈ వంశం ప్రాచీన కాలంనుంచీ అక్కడక్కడా కనిపిస్తూనే వుంది గానీ, ప్రఖ్యాతికి రాకపోయిందని వూహించవచ్చు.

చోళ వంశస్థుడైన విజయాలయుడు తంజావూరు పల్లవరాజుల క్రింద సామంతుడుగా వుండేవాడు. ఆతని పుత్రుడే ప్రథమాదిత్యుడు. ఆతని కాలము క్రీ. శ. 875 - 907. ప్రథమాదిత్యుడు పల్లవరాజులను జయించి, సామ్రాజ్యము స్థాపించి, తిరువేంగడ కొట్టములోని - తొండమనాడులో (శ్రీకాళహస్తికి సమీపం) మరణించినాడు. అతని అస్థికలపై ఆతని కుమారుడయిన పరాంతకుడు కోదండరామేశ్వర మరియు ఆదిత్యేశ్వరాలయముల నిర్మించి, ఉత్సవ దినాలలో వేయిమంది బ్రాహ్మణులకు సంతర్పణ జరుగునట్లు ఏర్పరచినాడు. ఆ ఆలయములు బహు చిన్నవి. అయినా ఉన్నవి. అందులో విగ్రహాలు లేవు. ఇక బ్రాహ్మణుల సంతర్పణకు - ఎప్పుడో తర్పణము వదలినారు.

క్రీ. శ. 907 లో రాజయిన పరాంతకుడు, దక్షిణమున కావేరి, ఉత్తరమున కాళహస్తి, పశ్చిమమున మైసూరు పీఠభూమి - కేరళదేశము, తూర్పున బంగాళాఖాతము ఎల్లలు గల రాజ్యము నేలి వంశ ప్రతిష్టను ఇనుమడింపజేసినాడు.

పృధ్వీపతి ఉదయేందిర శాసనములో పరాంతకుడు ఇద్దరు బాణ రాజులను నాశనము చేసి, వైదుంబులను జయించినట్లు గలదు. బాణులు ప్రాచీన రాజవంశీయులని పెరుబాణప్పాడిని పాలించిరని ఇదివరకే తెలుసుకొన్నాము. తిరుమలలో లభ్యమయిన మరొక ప్రాచీన శాసనములో (1 - 3)

విజయాదిత్యుడను బాణరాజు ఉదయించినట్టు వుంది. మరొక శాసనములో (1-4) శ్రీ వేంకటేశ్వరునికి అతని దానముల గురించిన ప్రసక్తి వుంది. ఈ విజయాదిత్యుడు క్రీ. శ. 9 వ శతాబ్దము ప్రథమార్థంలో వెలిసిననాడు కానీ టి. కె. టి. వారి (తిరుపతి చరిత్ర - I ఆంగ్ల గ్రంథము)- అభిప్రాయం అతని జన్మకాలం క్రీ. శ. 790. పెరుబాణప్పాడి అనగా పాలారుకు ఉత్తరమున కాళహస్తి - పుంగినూరు మధ్యగల దేశము. అంతిమదశలో బాణుల రాజధాని పఱివి. షోలంగపూరు (షోలింగర్) శాసనములోని ఈ పరివి; అనంతపూర్ జిల్లాలోని నేటి పరిగి కావచ్చు. ఇక పరాంతకుడు జయించిన * వైదుంబు లనువారు తెలుగు రాజులు.

పరాంతకుని పుత్రుడు పార్థివేంద్రవర్మ. ఇతనిని రెండవ ఆదిత్యుడు లేక రాజాదిత్యుడు అని కూడ అంటారు. ఇతనికాలముననే క్రీ. శ. 970 ప్రాంతాన 'సమావై' అను పల్లవరాణి, తిరుమల ఆలయంలో 'మణవాళ పెరుమాళ్' (భోగ శ్రీనివాసమూర్తి) వెండి విగ్రహాన్ని నెలకొల్పినదని చదివాము.

క్రీ. శ. 948 లో 'నాకోలా' యుద్ధములో రాష్ట్రకూట రాజులచే పై విజయాదిత్యుడు ఓడింపబడడంతో, చోళుల ప్రాభవము మెఱపులా మెరిసి అంతర్థానమయింది.

తిరిగి ఈ ప్రాభవము క్రీ. శ. 1014 - 41 రాజ్యము చేసిన రాజేంద్ర చోళునితో ప్రభవించి దీప్తి గాంచినది. రాజేంద్ర చోళుడు రాజరాజు కుమారుడు. చోళ చాళుక్య అనగా ఆంధ్ర తమిళ దేశాలను రాజయి కంచి రాజధానిగా పరిపాలించాడు.

---

* వైదుంబరాజులకు కలకడ పురాధీశ్వరులని బిరుదు కలదు. కలకడపురము నేటి చిత్తూరుజిల్లా - వాయల్పాడు తాలూకాలో రాయచోటికి పోవు రస్తామీద నున్నది. క్రీ. శ. 9-10 శతాబ్దములో నిది వైదుంబుల పరిపాలనయం దుండెను. రేనాటి దక్షిణ ప్రాంతము నేలిన మాండలికుల కిది ముఖ్యపట్టణము. ఈ మాండలికులకు సిద్ధవటదేవ దివ్య శ్రీ పాదపద్మారాధకులని కూడా బిరుదు కలదు. కలకడ పురాధీశ్వరులు చిత్తూరు వుత్తరంగా - కడపకు దక్షిణంగా కొద్ది భూభాగాన్ని ఏలినారని చెప్పవచ్చును. ప్రా. చా. భూ.

రాజేంద్ర చోళుని, చోళకులోత్తుంగ దేవుడని కూడ అంటారు. ఇతడు పొరుగున నున్న అన్నిదేశములను (జావా, సుమిత్ర అండమాను నికోబారు దీవులతో సహా) జయించి విజయస్మారకంగా గార్జే కొండపెద్ద సోలాపురం అను నగరాన్ని (ప్రస్తుత షోలింగర్) నిర్మించి దానిని తన రాజధానిగా చేసు కున్నాడు. కంచి తరువాత ఇది ఆతని రెండవ రాజధాని.

ఇతని తండ్రియైన మొదటి రాజరాజు (క్రీ. శ. 985-1014) కాలమునాటి తి. తి దే. శాసనములు మూడు. అందులో నొకటి తిరుమల ఆలయములోనిది. రెండవది పరాంతకుని రాణి (పరాంతకదేవి అమ్మన్) శ్రీవారి కిచ్చిన బంగారు పట్టము (నొసటి పతకము) ను గూర్చి తెలియజేయు చున్నది.

మొదటి రాజేంద్ర చోళుని కాలములోని (క్రీ. శ. 1014-41) శాస నములు రెండు తి. తి. దే. శాసనములందున్నవి. ఇందులో మొదటిది తిరుమల ఆలయములోనిది. ఈ శాసనములో రాజేంద్ర చోళుని పేరు, శ్రీ కొప్పర కేశరి పన్మార్ అనగా కో-పరకేసరివర్మన్ లేక రాజేంద్ర చోళదేవ అని వున్నది. ఇందలి విషయము-ఆలయ వ్యవహారముల విచారణ.

తిరుచానూరు గ్రామం శ్రీ వేంకటేశ్వర గుడిమాన్యం. తిరువేంగడ కొట్టం ప్రాంత అధికారి (గవర్నరు) "అధికారి *కొత్రమంగలముడైయాన్" అక్కడ మజిలీచేసినాడు. అతనితో బాటు కుడవూర్‌నాడు అధిపతి (తహ సీలుదారు) "కడప్పంకుడైయాన్" కూడ అక్కడే ప్రభుత్వభవన ప్రాంగణములో కూర్చుని సభను సమావేశపరచి ఆలయ బాగోగులు విచారిస్తూ వుండగా, వారికొక విషయం తెలిసివచ్చింది.

తిరుచానూరుకు నాలుగైదుమైళ్ల దూరమున తిరుమండ్యం గ్రామంవుంది. ఇప్పుడు కూడ ఆ పేరుతోనే వుంది. ఆ గ్రామం కూడ శ్రీవేంకటేశ్వరగుడి మాన్యమే. ఆ గ్రామసభవారు తిరుమల శ్రీవారి ఆలయంలో, కర్పూర

---

* తిరుచానూరు సమీపంలో కొత్రమంగళం గ్రామం వుంది.

దీపంతోపాటు 24 దీపాలు వెలిగించి అందుకుగాను 23 బంగారు నాణెములు ఆలయ కచ్చేరీలో తీసుకోవాలని నియమం. అప్పుడు కూడ, ఇప్పటిలాగానే జరిగింది. నాణెములయితే తీసుకున్నారు గానీ, దీపాలుమాత్రం రెండుచాలను కున్నారేమో-22 తగ్గించి రెండుమాత్రం వెలిగించి నెయ్యి మిగులుబాటు చూసు కున్నారు. ఆ సంగతిని విచారించి ఆ సభవారి దగ్గఅనుంచి నాణెములు రాబట్టి, చోళ అధికారులు - ఆపనిని ఆలయ అధికారులకే అప్పగించారు. ఇదీ ఆశాసనం. ఇక రెండవశాసనం - తిరుపతి శ్రీకపిలేశ్వర ఆలయంలో వుంది. అందులోని విషయం - తిరుపతిలోని శ్రీకపిలేశ్వర ఆలయంలో (కపిల తీర్థము లేక ఆళ్వారు తీర్థము) ముఖమంటపము - తిరుమాలిగై నిర్మించ బడడాన్ని గురించి వాటిని కట్టించిన స్థానిక చోళ అధికారిపేరు రాయన్ రాజేంద్రచోళ. *(కొట్టూరు ఉడయాన్.)

ఇంతవరకు తొండమండలము, తొండవిషయము, తొండమనాడు, తుండీరమండలము, తుండక విషయము, తొండైనాడు అని పల్లవశాసనము లలో వ్యవహరింపబడుతూ వచ్చిన ప్రాంతం - రాజేంద్రచోళుని కాలమునుంచీ జయంగొండ చోళమండలమను వ్యవహారమునను వచ్చినది. దానికి కారణము 'జయకొండ' అనునది ఆతని బిరుదము.

> "తొణ్డ నాణ్డైన జయంగొణ్డ చోడమణ్డలమున వెంగుణ్ర కోట్టమున
> మరుదాల నాటక్కమున"
>
> — జర్నల్ ఆఫ్ ఓరియంటల్ రీసెర్చ్.

ఈకాలంలో జరిగిన గొప్పసంఘటన శ్రీరామానుజాచార్యుల జననం. ఆయన క్రీ. శ. 1000 జన్మించి, క్రీ. శ 1125 వరకు జీవించినట్లు తెలు స్తోంది. మతపరంగా గొప్ప సంచలనం కలిగించాడు. ఆయన బోధించినది విశిష్టాద్వైతము.

---

* ఈతని మరొకపేరు, 'బ్రహ్మమారాయన్ ముసైయాదరాయన్' ఈతడే కపిలేశ్వరా లయమును నిర్మించినట్టు విశ్వసింపబడుతున్నది. "కొట్టూరు" అనునది. తిరుపతి పర్వతక పూర్వము అచ్చట వెలిసిన చిన్న పట్టణము. ఇది అచ్యుతదేవరాయల కాలంవరకు వుండెడిది.

మొదటి కుళోత్తుంగచోళుని కాలమున (క్రీ. శ. 1070 - 1120) జయంగొండ చోళమండలము కొంతకాలము వరకు రాజేంద్రచోళమండలమని కూడా వ్యవహరింపబడి, తిరిగీ జయంగొండ చోళమండలముగానే శాసనములలో వ్యవహరింపబడినది. ఈతని శాసనములు తిరుమలలోనివి, యోగిమల్ల వరములోనివి మొత్తం 11. అందులో నొకటి విక్రమచోళునిది.

తి తి. దే. శాసనములలో మూడవ రాజరాజు (క్రీ. శ. 1216—1254) చోళునివి పంద్రెండు శాసనములున్నవి. అందులో శ్రీగోవింద రాజస్వామి ఆలయములో నొకటి, యోగిమల్లవరంలోనివి 4 శాసనములు మంచి స్థితిలో నున్నవి. (తక్కినవి పాడయినవి) ఇందులో ఒక శాసనము ఆనాటి న్యాయవిచారణకు సంబంధించినది.

త్రిభువన చక్రవర్తిగల్, శ్రీమత్కీర్తి మున్నదైత్తక శ్రీ కొ- రాజకేసరీ యన, బిరుదాంకితులు అయిన రాజరాజదేవర్‌వారు పాలించు 23 సంవత్సర మున 80 దినమున లిఖించిన శాసనం.

తిరుచానూరుకు ఎగువగా కొద్దిదూరములో యోగిమల్లవరము (జోగల మల్లారమని స్థానికనామం) అను గ్రామమున శ్రీతిప్పలాధీశ్వరముడయ మహా దేవ (నాయనార్) అను శివాలయమున్నది. పరాశరేశ్వరాలయమని కూడ పేరు. ఆ ఆలయంలో అభిషేక, నైవేద్యములకు గాను జయంకొండచోళ బ్రహ్మమారయన్- ఖచ్చితమైన త్రాసుతో, నిక్కచ్చిగా తూకంవేసి, అప్పటి మైన బంగారు కళాంజాలు 26¼ ఇచ్చి ఆ సంగతి శిలాశాసనం వేయించాడు ఆ బంగారు పుచ్చుకొన్న స్థానిక తిరుచానూరు సభవారు (ధర్మకర్తలు కావచ్చు) ఏంచేశారో ఏమోగానీ, పూజలు మాత్రం చేయలేదు. అసలు విషయం రాజ రాజుగారిదాకా వెళ్లింది. ఆయనకు సామంతుడు, ఆ ప్రాంతపు ప్రభువు అయిన చాళుక్క వీరనరసింగదేవర్ అనబడు యాదవరాయలువారు విచారణ కొచ్చినారు-తిరుక్కన్నప్పదేవన్ తిరుక్కవనమ్ అనబడు శ్రీ కాళహస్తికి. అక్కడి కొచ్చిన తిరుచానూరు సభయ్యర్ తనకేవిషయమూ తెలియదని తాను అమాయకుడనని చెప్పుకున్నాడు. అయినా శిలాశాసనం వుందిగదా! నిజం

అదే చెప్పింది. ఆ ప్రకారంగా బంగారునాణెములు వసూలుచేయబడి శ్రీ భండారం చేర్చబడినాయి. శైవబ్రాహ్మణులు అయిన పూజారులు, అవి చేరి నట్లు రసీదుకూడా ఇచ్చారు. ఊరవర్, పాడికావలర్, పెరికేరవర్ అను వారు దానికి సాక్షులు. ఇది శాసనంలోని యాదవరాయలవారి న్యాయవిచారణ. ఈ విచారణలో పరాశరేశ్వరాలయ స్తనత్తరేగాక, బంగారు పుచ్చు కొన్న స్తనత్తరులు, మాహేశ్వరులు, ఇంకా తమాషాచూడదలచిన మనలాంటి వారు అనేకమంది సభచేరినారు. ఇంతకూ తిరుక్కన్నప్పదేవన్ తిరుక్కవనమ్- అనునది శ్రీకాళహస్తియేనా? ఏమో! అది నా వూహ. పేరునుబట్టి అలా వూహించాను. కాళహస్తి కాకపోతే, తిరుచానూరు ప్రక్కన స్వర్ణముఖీ తీరంలోని - ఏదయినా శివాలయపు తోట కావచ్చు.

ఈకాలంలో రెండు విశేషాలు. "ఉమాపతి దేవుడనే బెంగాల్ శైవ భక్తుడు దక్షిణాదికి వచ్చి స్థిరపడిపోయాడు. కోమటి అనే పదం వైశ్యానికి అనగా వ్యాపార పరంగా వాడుకలోనికి వచ్చినది. అంతకు మునుపు యీ అర్థంలో వుపయోగింపబడలేదు.'' జె. రామచంద్రారెడ్డిగారి చారిత్రకకాలసూచి.



# గరుడాద్రి

ఇంతటితో చోళుల చరిత్ర మనకు సంబంధించినంత వరకు ముగిసింది.

క్రీ. శ. పదమూడవ శతాబ్దము మధ్యకాలంలో బలహీనులైన చోళ చక్రవర్తుల నణచి పాండ్యరాజులు పరిపాలన కొచ్చినారు. వీరిలో మొదటి మారవర్మన్ సుందరపాండ్యుడు ముఖ్యుడు. ఇతడు జయంగొండ చోళమండల మంతయు ఆక్రమించి - చోళ సామంతుల నందరిని లోబరచుకొని - నెల్లూరు దాకా దండయాత్రచేసి వీరాభిషేకం చేసుకున్నవాడు. తిరుమల ఆలయంలో ఈతని శాసనములు ఎక్కువగానే వున్నవి.

ఇంతవరకు తమిళములో నున్న శాసనములు ఇతని కాలమున సంస్కృతములో వెలిసినవి.

ఇదివరకు చోళులకు సామంతుడుగానున్న యాదవరాయలిప్పుడు - పాండ్యుల సామంతుడైనాడు. సుందరపాండ్యుని నామం - వీరనరసింగదేవ రాయల పేరు; రెండూ కలిగిన ఒక శాసనం తిరుమల ఆలయంలో నున్నది. ఈ శాసనంలో పాదిరివేడు గ్రామం; శ్రీవారికి సర్వమాన్యంగా సమర్పింప బడినది. ఈ పాదిరివేడు గ్రామం వడమాలపేటకు తూర్పుగా ఐదారుమైళ్ల దూరంలోవుంది. [1] గుడిమల్లం ఇలాకాలో అనికూడ చెప్పవచ్చు. ఈ గ్రామం తిరుక్కుడవూర్‌నాడులోని, [2] ఆశవముక్కిలైనాడు (విభాగము) లో నున్నట్టు పేర్కొన బడినది.

---

1. గుడివల్లం అని కూడ అంటారు. నిజానికి ఇచ్చట ప్రాచీన పరశురామేశ్వరాలయము భూమికంటే తగ్గులో అంటే వల్లంలోవుంది. అందువల్ల ఆవూరి పేరు గుడివల్లంఅని అక్కడి వారంటున్నారు.

2. ఆత్తూరునాడని కూడ కొన్ని శాసనాలలోవుంది. ఇచ్చటొక ప్రాచీనశివాలయంవుంది. పాతకాలవు ఇటుకలకట్టడంగాగుర్తు. రేణిగుంట చక్కెరకర్మాగారం దగ్గరవున్న యీ కుగ్రామం-అత్తూరు-చోళులకాలంలో ఒక తాలూకాకేంద్రం.

ఈ కాలంలో వీరనరసింగయాదవరాయల వలెనే, మరికొందరు పాండ్యులకు సామంతులైనను, కొందరు చోళ, పాండ్యులకు సామంతులుగా నుండి - తదుపరి స్వాతంత్ర్యము ప్రకటించుకొనిరి. వారిలో పెరున్‌జింగ అనుపేరుగల కాడవరాయడు, ఆతని కుమారుడు కొప్పెరున్‌జింగ అనుపేరు గల మహారాజసింహుడు, (ఆతనిని ఖడగమల్ల అనికూడ పిలుస్తారు.) ముఖ్యులు. వీరు పల్లవులలో చివరివారు. కాడవరాయడు వీరనరసింగ యాదవరాయలతో ఉరత్తి దగ్గర యుద్ధముచేసి, అందు నరసింగయాదవ రాయల బావమరది నారాయణపిళ్లై అను నతనిని చంపెను. ఈసంగతి యోగి మల్లవరం శాసనంలో నున్నది. యుద్ధములొ చంపబడిన నారాయణపిళ్లై జ్ఞాప కార్థము యాదవరాయలు కొన్నిదానములు చేసిన సంగతి ఆశాసనంలో నున్నది. *కొప్పెరున్‌జింగ శాసనములు రెండు తిరుమల ఆలయము నందున్నవి.

వీరి తరువాత పాలన కొచ్చిన యాదవరాయలనేకులు యీ ప్రాంత మును పరిపాలించి ప్రసిద్ధులైరి. వెంకటగిరి, కాళహస్తి, చంద్రగిరి రాజ్యము లను ఏలినవారు వీరు.

తిరుక్కాళత్తిదేవ యాదవరాయలు శ్రీవేంకటేశ్వరునికి కడవూరు సర్వ మాన్యంగా ఇచ్చిన దాన శాసనంలో (క్రీ. శ. 1210?) ఆతని ప్రశస్తి ఇలా వుంది. 'సకలభువన మండలేకాశ్రయ, సమస్త విద్యోద్యాన మత్తకల కంఠ, శ్రీకాళహస్తీశ చరణారవింద మధుకర, శ్రీమద్వేంకటగిరి పురపాలక (నెల్లూరు జిల్లా వెంకటగిరి) వెంటరి వాలక (వేటగాళ్ల ప్రభువు), వేంగి మహానాయక పిథారిదేవి లబ్ధ వరప్రసాద, గోదావరీవల్లభ, కానుపాకపుర వరా ధీశ్వర (చిత్తూరు దగ్గర కాణిపాకపట్నం? సిద్ధివినాయక క్షేత్రం), విద్వజ్జనో త్తమ, పరిభూత రాజాశ్రయ, చంద్రకుల తిలక, చాళుక్యనారాయణ, సకల గుణ సంగ్రామ (శోభిత) మహారాజాధిరాజ, యాదవరాజ, శ్రీమద్భుజబల,

---

* వేంకటాద్రికి దిగువన కొప్పెరవాండ్లపల్లి వున్నది. శ్రీవారి ఆలయంలో కొప్పెర లనబడు పెద్దపెద్దలోహ పాత్రలున్నవి. శ్రీవారిహుండీ పెద్దపాత్ర కలిగి వున్నది గాన కొప్పెర అని వ్యవహరింపబడుతోంది.

తిరుక్కాళత్తిదేవ యాదవరాయలు 'చాళుక్యనారాయణ' బిరుదు వహించడం వల్ల, వీరనరసింగదేవయాదవరాయలు 'శశికుల చాళుక్కి' అని బిరుదువహించడం వల్ల, తూర్పు చాళుక్యల వేంగిరాజ్యంతో వీరికి సంబంధమున్నట్లు తెలుస్తోంది. లేదా వీరు పాలించిన కొంత భూభాగం వేంగిరాజ్యములోనిది కావచ్చు. తూర్పు చాళుక్యల తరువాత, వీరు స్వతంత్రులై, ప్రాంతీయంగా చోళులకు లోబడివుంటారు. యాదవరాయ లందరు ప్రాంతీయ (గవర్నర్ల) అధికారహోదాలో పాలించినట్లు తోస్తోంది. తెలుగు చోళ ప్రభువులు వీరికి సామంతులుగా నుండినారు. అయినా వివాహ విషయాలలో వీరు హోదా పట్టింపులు పట్టించుకోలేదు. వీరి కన్యకలను వారు, వారి కన్యకలను వీరు, యీ విధంగా తెలుగు చోళులు - యాదవరాయర్లు బంధుత్వము నెఱపుకొని పటిష్టంగా పరిపాలించారు.

*తిరుక్కాళత్తిదేవ యాదవరాయలు తిరువణ్ణామలై - శ్రీకాళహస్తి, ఈ రెండు శైవక్షేత్రాల మధ్య దేశాన్ని పరిపాలించినట్లు శాసనాలవల్ల తెలుస్తోంది. ప్రథమంగా 'పాకనాడు' పేరు ఇతని శాసనాలలో కనబడుతోంది. నెల్లూరు - కడప మండలాలలో కొంత భాగం 'పాకనాటి' పేర పరిగణన లోనికి వచ్చింది. క్రీ. శ. 1230 నాటికి చెందిన వెంకటగిరి (నెల్లూరు జిల్లా) శాసనములో ఇలా వుంది. "జయంగొండ చోడమండలములోని పాక్కైనాడు." (శా. శ. 1152) క్రీ. శ. 1230 నుంచి క్రీ. శ. 1526 వరకు యీ 'పాకనాడు' పేరు ప్రముఖంగా శాసనాలలోను, చరిత్రలోను, సాహిత్యంలోనూ కనబడుతోంది. పైవాటి ఆధారంగా పాకనాటి ఎల్లలు, ఇలా చెప్పుకోవచ్చు. తూర్పున సముద్రతీరం, ఉత్తరమున కందుకూరు తాలూకా, దక్షిణమున నెల్లూరు-వెంకటగిరి తాలూకాలు, పశ్చిమమున ఉదయగిరి తాలూకా ప్రాంత మధ్యభూమి పాకనాడు. నాగపుడోలు, చతుర్వేదిమంగళమనే నాగపుడోలు, విక్రమసింహపురమని పిలువబడే నెల్లూరు, కందుకూరు, బిట్రగుంట - ఈ ప్రాంతములోని శాసనస్థ ముఖ్యప్రాంతాలు.

---

*ఈయన తిరుపతి సమీపంలోని అవిలాల గ్రామమును శ్రీవారికి సర్వమాన్యంగా సమర్పించినాడు.

నన్నెచోడుడు కుమారసంభవ పీఠికలో తన తండ్రి పాకనాటి యిరువది యొక్క వేయింటి కధీశుడని చెప్పుకొన్నాడు.

ఎఱ్ఱాప్రెగడ భారతారణ్య పర్వమందు తాను పాకనాటిలోని గుడ్లూరు వాసియైనట్టు వ్రాసుకొన్నాడు.

మంచెన కేయూర బాహుచరిత్రమునందును, బెండపూడి అన్నమంత్రి శ్రీనాథునితో నన్న పలుకులలోను పాకనాటి ప్రస్తావన ఉన్నది. ఇక శ్రీనాథ మహాకవి భీమేశ్వర పురాణంలో తాను పాకనాటి వాడనని చెప్పుకొన్నాడు. శ్రీకాళహస్తి దేవయాదవరాయలు అనే, తిరుక్కళత్తి దేవయాదవరాయల తదనంతరం, ఆయన కుమారుడు శింగప్పిళ్లై అనబడు వీరరాక్షస యాదవ రాయలు రాజ్యానికి వచ్చినాడు. తిరుమల ఆలయానికి తిరుక్కుడవూర్‌ను ఆయన సర్వమాన్యంగా ఇచ్చినట్లు రెండుశాసనాలున్నాయి.

ఆయన తదనంతరం వీరనరసింగదేవ యాదవరాయల పాలన. మూడవ కుళోత్తుంగ చోళుని కాలంనుంచీ కనిపిస్తూవున్నాడు అక్కడక్కడ. ఆతని పరిపాలన కాలం 57 సంవత్సరాలుగ లెక్కింపబడినది. చోళుల తరువాత, పాండ్యులకు కూడ సామంతుడుగా కొనసాగినాడు కావున తి.తి.దే. శాసనాలలో ఆయనకు చెందినవి ఎక్కువగానే కనిపిస్తున్నాయి. తన ఎత్తు బంగారం తూకంవేసి, దానితో శ్రీవారి ఆనందనిలయ విమానం బంగారు పూతపూయించి, ఆనంద పర్వతుని తండ్రి మహా మేరువును గుర్తుకు తెచ్చు కొనేలా చేశాడు. ఈయన బంగారు పూతపూయించి పూర్తి చేసే సరికి సరిగ్గా మొదట జటవర్మన్ సుందరపాండ్యుడు శ్రీవారి ఆనందనిలయ విమానం మీద బంగారు కళశం పెట్టి తన భక్తిని వెల్లడించుకున్నాడు. ఈ రెండు దైవ కార్యాలు అనుకోని విధంగా ఒకేసారి జరగడం దైవేచ్ఛ. శ్రీవారి ఆలయ మునకు కావలసిన పప్పు, బియ్యం వెచ్చాలకోసం ఒక గ్రామాన్ని సర్వమాన్యంగా సమర్పించినాడు - వీర నరసింగదేవ యాదవరాయలు.

ప్రాంతీయ అధికారిగ - ఆలయనిర్వహణ, విచారణలు, న్యాయ నిర్ణయాలు చేసినట్టు మనమిదివరకే తెలుసుకొన్నాము. శ్రీకాళహస్తిలో మాణిక్కంగైండియనయనార్ ఆలయంలో మల్లికార్జున విగ్రహం నెలకొల్పినాడు. తిరువొర్రియూర్‌లోని ఆలయవసారాలో తనపేరుమీద వీరనరసింహేశ్వర ముడయనయనార్ విగ్రహం చేయించాడు. తిరుపతిలో ఒకచోట తన స్వహస్తాలతో "వీరనరసింగపెరుమాళ్" అని తనపేరు గలిగిన దేవున్ని ప్రతిష్ఠించాడు. (ఎక్కడోమరి? ఆ శాసనం చెప్పడంలేదు.) అయినా మంచినీళ్లగుంట అనిపిలువబడుతున్న నరసింహతీర్థంలో అని అందరి అభిప్రాయం. పెరుమాళ్లపల్లిలోనున్న లక్ష్మీనృసింహస్వామి ఊరిపేరు పెరుమాళ్‌పల్లి. స్వామిపేరు నరసింగ. కాబట్టి ఇదియే అయివుండవచ్చునని అనుకోవడానికి వీలులేదు. తిరుపతినుంచి ఐదు మైళ్లదూరమున చిత్తూరు రహదారి మీదనున్న ఈ స్వామిని, అన్నన్ పెరుమాల్ ప్రియన్ అను తెలుగు పల్లవుల అధికారి నిర్మించాడని నా అభిప్రాయం.

శ్రీవేంకటేశ్వర అంతరాలయము బాగుచేయడానికి అనుమతించవలసినదని ఒక 'దేశాంతరి' కోరగా, శిథిలమై రిపేరు కొచ్చిన భాగాలలోని శిలాశాసనాలు క్రొత్తరాళ్లమీద యథాప్రకారం చెక్కించే నిబంధనమీద యాదవరాయలవారు అనుమతించినారు. ఆ ప్రకారంగానే దేశాంతరి ఆలయాన్ని బాగుచేసి, ఉత్తరవైపు గోడమీద తిరిగి శాసనాలు చెక్కి, నాలుగు చోళుల శాసనాలు మనకు దక్కేలా చేసినాడు. పేరయినా చెప్పుకోకుండా నిస్వార్థంగా ఇంత మాధవసేవ, మానవసేవకొరకు చేసిన ఆ దారినపోయే దానయ్య, పిమ్మట శర్మాదేవి అని పిలువబడు శరవన్ మహాదేవి చతుర్వేది మంగళమునకు చెందిన తిరువుల్లానిదానర్‌గా గుర్తింపబడినాడు. అతడు తిరునల్వేలి జిల్లాలో ఒక గుడి కూడ కట్టించాడు. చతుర్వేదిమంగళము ఒకటి పాకనాటలో నున్నదని మనకు తెలుసు.

క్రీ. శ. 1245 లో శ్రీ వేంకటేశ్వర ఆలయ జీర్ణోద్ధారణ జరిగినదని, అప్పటికి వీరనరసింగదేవ యాదవరాయల పరిపాలనా సంవత్సరాలు 40 అని మనం విశ్వసించవచ్చు.

పల్లవరాణి 'సమావై' తరువాత స్మరించుకోదగిన వ్యక్తి వీరనరసింగ దేవ యాదవరాయలు. చరిత్ర జ్ఞానం, అంతో ఇంతో కలిగిన యీ రాకెట్ల యుగంలోనే - శిల్పం కానీ, శిలాశాసనం కానీ దొరికితే మనం అరుగుమీదికో లేక క్రిందికో లేకపోతే జలదారి బండగానో వుపయోగిస్తాము. అలాంటిది, దాదాపు 800 సంవత్సరాలక్రితం శాసనాల ప్రాముఖ్యాన్ని గుర్తించి, రాబోవు తరాలవారి కోసం వాటిని యథాతథంగా భద్రపరచ గలిగిన 'ముందుచూపు' గల వ్యక్తి వీరనరసింగదేవ యాదవరాయలవారు. ఆయన చరిత్రకారుల పాలిటి కల్పతరువు.

ఈ మహానుభావుని రాణిగారు 'యాదవరాయనాచ్చియార్' ఈమె, గోవిందరాజస్వామి ఆలయంలో ఇంకొక బ్రహ్మోత్సవము జరుపుటకుగాను పయిండపల్లి గ్రామంలో అర్ధభాగం దానం చేసింది. ఈ పయిండపల్లి - తొండవాడ గ్రామానికి తూర్పుగ స్వర్ణముఖీ తీరంలో నున్నది. ఇప్పుడు 'పైడిపల్లి' అని పిలుస్తున్నారు. అంతేగాక తిరుమల ఆలయంలో - గోవింద రాజస్వామి ఆలయాలలో నేయి దీపాలు వెలిగించడానికిగాను గోదానము (64 ఆవులు 2 ఆబోతులు) చేసినట్లు తి. తి. దే. శాసనాలవల్ల వెల్లడవుతోంది.

వీరనరసింగదేవ యాదవరాయల పిమ్మట, తిరువేంగళనాథ యాదవ రాయల శాసనములు తి. తి. దే. లో నాలుగున్నవి. ఈ తిరువేంగళనాథ యాదవరాయలు, తిరుపతి గ్రామమును శ్రీ వేంకటేశ్వరస్వామివారికి తిరుణా మట్టుక్కానిగా సమర్పించినాడు. అంటే సర్వమాన్యంగా సమర్పించి నాడని భావించవచ్చు.

ఆ కాలంనాటి పన్నులు గురించిన ఒక శాసనంలో ఒక్క తిరుపతిలోనే 40 రకాల పన్నులు వసూలు చేయబడెడివని తెలుస్తోంది. అందులో దేవుని పన్నులు కొన్ని. హొయసల రాజులకు సమర్పించవలసిన 'వల్లాలదేవర్ వారి' అను పన్ను ఒకటి. మొత్తమునకు ఆ కాలమునాటి, శిస్తు - పన్నుల విధానము చూస్తే - మనవారు యీనాడేగాదు - ఆనాడు గూడ పన్నుల భారం నుంచి ప్రజలను విముక్తులను చేయలేదనిపిస్తోంది.

తరువాత పాలకుడుగా వచ్చిన శ్రీ రంగనాథ యాదవరాయల శాసనములు ఆరున్నవి. ఆతడు యీ అనిశ్చిత పరిస్థితులలో అనేక యుద్ధములు చేసినట్లు తెలియజేస్తున్నవా శాసనములు. అంతరిస్తున్న హిందూ హొయసల రాజ్యంకొరకు కొన్ని - అప్పుడే తొలిచిగురులు దాలుస్తున్న విజయ నగర సామ్రాజ్యం వుద్భవించడానికి కొన్ని యుద్ధములు చేయక తప్పలేదు ఆతనికి.

తిరుమల మీద ఆతడు తను బస చేయడానికి గాను ఒక అంతఃపురము నిర్మించినట్టు తెలుస్తోంది. అది ఎక్కడ నిర్మించబడిందో తెలియదు. వరాహ స్వామి గుడికి ఉత్తరంగా - అంటే ఉత్తరమాడవీధిలో, చింతచెట్ల క్రింద ఎత్తయిన మట్టి దిబ్బలు - ప్రాచీన ఇటుక కట్టడాలు కనిపిస్తున్నాయి. త్రవ్వి చూస్తే అంతఃపుర అవశేషాలు బయట పడవచ్చు, శ్రీ రంగనాథ యాదవ రాయలు తిరుమల మీద పుష్పవనాలను, మఠాలను గూర్చి ప్రస్తావించడమే గాకుండా శ్రీ వారి పారువేటను గురించికూడ తన శాసనంలో లిఖించాడు.

మొత్తానికి ఇతని కాలం - చివరి హొయసల రాజయిన మూడవ వీర వల్లాలుని అస్తమయాన్ని, విజయనగర సామ్రాజ్య నిర్మాతలయిన సంగమ వంశీయులు మొదటి హరిహరబుక్కరాయల ఆగమనాన్ని అంటే హిందూమత అస్తమయాన్ని, అరుణోదయాన్ని కూడా చూసింది.

శ్రీ వేంకటేశ్వరస్వామికి సర్వమాన్యంగా సమర్పించబడిన తిరుపతి గ్రామానికి ఎగువగా అంటే పశ్చిమదిక్కున కొన్నిభూములు శ్రీరామానుజా చార్యుల నిత్యపూజానై వేదికములకు ప్రత్యేకింపబడినవి. దానికి నీటివసతి లేదు. అందువల్ల చిట్టడవి తయారయింది.

పెరియరి చెఱువు వుంది. ఆ చెఱువు, ఆ గ్రామం శ్రీవేంకటేశ్వర స్వామివి. అది ఏదో కాదు. నేటి పేరూరు గ్రామం. పేరూరుచెఱువు. ( స్వర్ణముఖి ప్రవహించునప్పుడు, ఆనీరుతో యీచెఱువునింపడానికి ఏర్పాట్లు వున్నాయి. ) పేరూరు చెఱువునీరు వాడుకొని, రామానుజాచార్యులు తన

పొలాలు పండించుకోవడానికి, 200 పణములు శ్రీవేంకటేశ్వరస్వామికి సమర్పించవలసినదిగా ఆదేశించు శాసనము తిరుపతిలో నున్నది. శ్రీవేంకటేశ్వరస్వామి డబ్బు గట్టిది. రామానుజాచార్యులకు సైతం డబ్బు యివ్వనిదే, స్వామి చెఱువునుంచి నీరురాదు. శ్రీరంగనాథ యాదవరాయల కాలమున నీటితీరువకు సంబంధించిన శాసన మిది.

యాదవ పాలకులలో హెుబల యాదవుని శాసనములు ఆఖరివి. ఇతడు శ్రీవారి వైకుంఠహస్తము ( వరదహస్తము, వరదానము చేయునది ) నకు బంగారు తొడుగు చేయించినాడు. తను వేయించిన సంస్కృత మరియు తమిళశాసనములో, తమిళములో తాను 'తంజై' రాజునని, 'వడవేంకటము' ( తిరుమల ) వనమూలికలు - చెట్లతో మధుర సుగంధముతో గుబాళిస్తోందని లిఖించాడు. 'తంజై' ప్రాంతము మైసూరులోనిది గావచ్చు. కానీ యీ ప్రాంతములో 'తంజమ్మ' అనుపేరు కలిగినవారు విశేషంగా వున్నారు.

తెలుగు చోళులలో ఎఱ్ఱసిద్ధన ప్రథముడు. ఆతని కుమారుడు మనుమసిద్ధి. ఆతని కుమారుడు అల్లున్ తిరుక్కాలత్తిదేవుడు. ఆతని కుమారుడు కూడ మనుమసిద్ధి. అనగా మనుమసిద్ధి మనుమడు మనుమసిద్ధి - దాయాదుల పోరుతో, రాజ్యం నుంచి తరుమబడగా కాకతి గణపతిదేవుని సహాయముతో తిరిగి రాజ్యమునకు వచ్చెను. దీనికి కారకుడు తిక్కన సోమయాజి. మహాభారతములో 15 పర్వములు వ్రాసి ప్రసిద్ధికెక్కినవాడు. తిక్కన భారతమన్న అందరికీ చెవులు నిక్కబొడుసుకుంటాయి. తన రాజును తిరిగి సింహాసనాధీష్టుని చేసి ఖడ్గబలముకంటె కలం బలమెక్కువని నిరూపించినాడు.

మనుమసిద్ధి తండ్రియైన అల్లున్ తిరుక్కాలత్తిదేవుడు - తిక్క నృపతి - చోడతిక్క - అనుపేరులనేగాక చోళస్థాపనాచార్య అన్నపేరును కూడ తగిలించుకున్నాడు. అతనికున్న అనేక దేవేరులలో వీరనరసింగదేవయాదవరాయల కుమార్తె లిద్దరు. ఇతనికి గండగోపాలుడని కూడ పేరున్నది. అయితే తెలుగు పల్లవుడయిన విజయ గండగోపాలదేవుడు వేరు. ఇంకా ఇతనికున్న

ఇతరనామములు మధురాంతకపొత్తపిచోళ, త్రిభువన చక్రవర్తి. కర్ణాటక సోమేశుని, శంఖురాజుని యుద్ధమున ఓడించి చోళుల ప్రతిష్ఠించినందువల్ల నితడు పైనపేర్కొన్న బిరుదులు దాల్చియుండవచ్చు.

తెలుగు పల్లవులలో ప్రముఖుడయిన విజయగండగోపాలుని శాసనములు స్పష్టముగాలేవు. విజయగండగోపాలదేవుడు - భరద్వాజ గోత్రుడని మాత్రం తెలుస్తోంది. ఇతని రాణి దేవరసియార్ శ్రీవేంకటేశ్వరుని దీపముల నెయ్యి కొరకు గోదానము చేసింది. ఇతని అధికారులలో నొకడు, కాశ్యపగోత్రుడు-అమ్మైయప్పన్ లేక అన్నన్ పెరుమాళ్‌ప్రియన్ అను నాతడు 32 ఆవులను ఒక ఆబోతుని శ్రీవారి ఆలయనేతికొరకు దానం చేసినట్లు శాసనాలలో నున్నది. ఇదే కాలమున, [1]నారాయణపురం (నారాయణవనం) వాసినియైన, వనీయన్ కాట్టరి - అను వర్తకుని కుమారుడు అమరకన్ అను నాతడు శ్రీవారి దీవము-దీపస్థంభమునకు గాను 3 మాడైలు, కర్పూర హారతికి నిధిగా 12 మాడైలు ఇవ్వడం జరిగింది.

త్రిపురాంతక దేవుడను ఇంకొక తెలుగు పల్లవ ప్రభువు పేరుగూడ శాసనాలలో నున్నది. అతని తరువాత రాజగండగోపాలుడు, తదనంతరము పాలీయ శ్రీ వైష్ణవులు - వీరి శాసనాలు కూడ వున్నవి. అవి అన్నీ దీపాలు - కర్పూరాలమయం.

క్రీ. శ. 1260 నుంచి 1360 వరకు, అనగా వంద సంవత్సరాల కాలం దక్షిణ భారత చరిత్రలో సంధి యుగమని చెప్పవచ్చు. రాజులు మారినారు. రాజ్యాలు చేతులు మారుతూ వచ్చాయి. అనిశ్చిత పరిస్థితులు నెలకొన్నాయి. అయినా ఈకాలంలో జరిగిన సంఘటనలు కొన్ని చరిత్ర గతినే మార్చివేశాయి. పల్లవుల, చోళుల, పాండ్యుల అనంతరం యీ సంధి యుగము వచ్చినది. ఈయుగములో ముఖ్యులు పల్లవ, చోళ సామంతులు— తదుపరి చివరి పల్లవులు - చివరి చోళులు - అందరి కంటె ముఖ్యులు యాదవ రాజులు. రాష్ట్రకూట రాజులు కూడ అవతరించిరి గానీ, వారు మనకు కావలసిన చరిత్రకు అందరు.

---

1. ఈ క్షేత్ర చరిత్ర వివరంగా యీ గ్రంథంలోనే వేరొకచోట వుంది.

యాదవరాజులలో మొట్టమొదటి వాడనబడిన ఘట్టిదేవుడు (క్రీ. శ. 1184 – 1227) చోళసామంతుడు. ఇతని కాలములో శైవులకు - వైష్ణవులకు వివాదము రాగా శ్రీరామానుజాచార్యులవారు దానిని పరిష్కరించినట్టు చెప్పబడినది గానీ రామానుజాచార్యుల కాలము పై కాలమునకు సరిపడుటలేదు. ఘట్టిదేవుని కుమారుడు రాజమల్లుడు (క్రీ. శ. 1208 - 1237) యాదవ నారాయణస్వామి అనుదేవుని ప్రతిష్ట చేసెనని చెప్పబడినది. ఈ యాదవనారాయణస్వామి-[1]నాగలాపురంలోని వేదనారాయణస్వామి అవునోకాదో తెలియదు. అయినా యీ ప్రాంతమంతా వారి ఆధీనంలోనే వుండినది గాన, ఆ విధంగా వూహించడం తప్పేమీకాదు. ఇక తదుపరి యాదవరాజులను గూర్చి ఇదివరకే తెలిసికొంటిమి. ఉత్తరదేశంలో ఢిల్లీసుల్తానులను పేరుతో ఖిల్జీవంశీయులు పాలనకు రాగా - దక్షిణదేశములో దేవగిరి (దౌలతాబాదు) రాజధానిగా యాదవరాజ్యము, ఓరుగల్లున కాకతీయరాజ్యము, ద్వారసముద్రము - రాజధానిగా హొయసలరాజ్యము, మధుర రాజధానిగా పాండ్యరాజులు యీ విధముగా హిందూ రాజ్యములు వెలిసినవి.

అల్లాఉద్దీన్ (ఖిల్జీగవర్నరు) దేవగిరిని దోచుకొనెను. తదుపరి కుట్రతో ఢిల్లీ సుల్తానయ్యెను. క్రీ. శ. 1303 లో ఆతడు తలపెట్టిన దక్షిణ దండయాత్ర కొనసాగక పోగా, తిరిగి క్రీ. శ. 1309 లో మాలిక్ కాఫర్ అను సేనానిని దక్షిణ దేశముపై బంపెను. ఈ పర్యాయము వరంగల్ పట్టుబడినది. కాకతి ప్రతాపరుద్రుని అపార సంపదలు వాని సొత్తయ్యెను. నైఋతి దిక్కుగా ప్రయాణముచేసి హొయసలుల (మైసూరుప్రాంతము) దోచుకొనెను. తదుపరి తమిళరాజ్యముపై బడి పాండ్యరాజుల బాధించెను.

తిరుమల - తిరుపతి ఆలయాలు వానిదారిలో లేవు గాన, తప్పించుకొన్నవి. కానీ శ్రీరంగంలోని రంగనాథస్వామికి మాలిక్ కాఫర్ తలనొప్పి వచ్చేటట్టు భావింపబడింది. స్వామివారి నగలు, డబ్బు, దనర్కం అంతా

1. ఈ క్షేత్ర చరిత్ర వివరంగా యీ గ్రంథంలోనే వేరొకచోట వుంది.

దాచిపెట్టి ఆలయాన్ని మూసివేశారు. శ్రీరంగనాథస్వామి ఉత్సవ విగ్రహాన్ని 'పిళ్ళై లోకాచార్యుడు, ఇతర భక్తులు కలిసి పూరు దాటించారు. ఆవూరు ఈవూరు తిప్పి చివరికెలాగైతేనేం తిరుమలచేర్చారు. తిరుమల ఆలయంలోని రంగమంటపం శ్రీరంగం రంగనాథస్వామి కొరకే నిర్మింపబడినట్లు విశ్వ సింపబడినది. అయితే యీ మంటప నిర్మాత శ్రీరంగనాథ యాదవ రాయలనడానికి శాసనాధారం లేదు.

శ్రీరంగం ఆలయ చరిత్రను చాటిచెప్పే "కోయిల్ ఒలుగు" తేదీలు, మాలిక్ కాఫర్ దండయాత్ర తేదీలు సరిపడడం లేదు. అంటే రంగనాథ స్వామి తిరుమల ప్రయాణం కోయిల్ ఒలుగు స్పష్టం చేయలేకపోయింది. అయినా ఇబ్బంది లేదు. 60 సంవత్సరాల తరువాత రెండవ కంపన క్రింద, శెంజి అధికారి గోపన్న రంగనాథస్వామిని ముందు శెంజికోటకు, తదుపరి శ్రీరంగం తరలించినాడు.

ఖిల్జీల తరువాత తుగ్లకులు రాజ్యమునకు వచ్చిరి. క్రీ. శ. 1321 లో మొదటి పాలకుడయిన ఘియాసుద్దీన్, యువరాజయిన ఉలుగు ఖానుని కాక తీయుల మీద కంపగా, ఆతడోడి తిరిగివచ్చెను. తిరిగీ క్రీ. శ. 1323 లో దండెత్తి వరంగల్లును, యీ సారి ఓడించి ప్రతాపరుద్రుని బందీగా పట్టుకొని, కడప కర్నూలు మీదుగా దక్షిణాదికి పోయి మలబారు జయించి, తిరుగు ప్రయాణం తూర్పుతీరం వెంబడి పోవడంతో, ఈసారి కూడ తిరుమల - తిరుపతి దేవాలయాలు తప్పించుకొన్నాయి.

ఢిల్లీ పోయిన ఉలుగు ఖానుడు తన ప్రతాపానికి తానే మురిసిపోయి, తండ్రిని జంపి సింహాసనం మీద కూర్చుని, ఆ రోజుటి నుంచి తన పేరు మహమ్మదు బీన్ తుగ్లక్‌గా ప్రకటించుకొన్నాడు. ఈలోగా దక్షిణాదిలో ఆంధ్ర, తెలంగాణ, రాయలసీమ ప్రజలకు కనువిప్పు గలిగి, జాతీయత ప్రబలి అందరూ ఒకటై, వారి వారి పరగణాలలోని ముస్లిం ప్రతినిధులను, తమ పూర్వపు ప్రభువుల అండదండలతో ఢిల్లీకి తరిమినారు. వారు తుగ్లక్‌ను చూసి రావడానికి పోవడంతో, తాము స్వాతంత్ర్యులైనట్టు ప్రకటించుకొన్నారు.

వరంగల్లు ముట్టడికి మునుపు, కాకతి ప్రతాపరుద్రుని కొలువులో, సంగముని పుత్త్రులు హరిహర బుక్కరాయలనువారు కోశాధికారులుగా నుండిరి. వరంగల్లు ఉలుగుఖాను స్వాధీనమైనప్పుడు వారు పారిపోయిరి. పారిపోయి కంపిల చేరిరి. అచ్చట హిందూరాజు కొలువులో చేరగా, క్రీ. శ. 1327 లో తిరిగి తుగ్లక్‌గారి సైన్యాలు వచ్చి కంపిల నాక్రమించిరి. ఈసారి హరిహర బుక్కరాయలు వారికి దొరికిరి. దొరకినను నష్టము లేదయ్యె. ఎందు కనగా అన్నదమ్ములిద్దరికి పదవులు దొరికినవి. తుగ్లక్‌వారు అన్నదమ్ము లిద్దరినీ విడిపించి ఆతిథ్యమిచ్చి, హరిహరరాయలను రాజప్రతినిధిగ, బుక్క రాయలను సైన్యాధికారిగా తిరిగీ కంపిలకే పంపి, అచ్చట శాంతి భద్రతలు నెలకొల్పమనిరి. ఈ విధముగా విజయనగర సామ్రాజ్య నిర్మాణమునకు తుగ్లక్‌వారే పునాది వేసిరి. కంపిలకు మరో పేరు ఆనెగొంది.

హరిహర బుక్కరాయలు అల్లకల్లోలా లణచి రాయలసీమ తమదిగా చేసికొని, తుంగభద్రాతీరములో మాధవ విద్యారణ్యస్వామి దర్శనం చేసు కొన్నారు.

విద్యారణ్యస్వామి తండ్రి మాయణుడు, తల్లి శ్రీమతి. వీరిది తుంగ భద్రాతీరంలోని పంపానగరం. ఈయన భారతీ తీర్థవద్ద సన్యాసం గ్రహించి క్రీ. శ. 1333 లో శృంగేరి మఠానికి అధ్యక్షుడుగా వ్యవహరించారు. ఈయన రాజకీయ, సన్యాస, సాహితీరంగాలలో ప్రసిద్ధుడు. విజయనగర సామ్రాజ్య నిర్మాణానికి హరిహర బుక్కరాయలకు వూపిరి పోసిన దీ మహ నీయుడే !

క్రీ. శ. 1336 లో విజయనగర సామ్రాజ్యం స్థాపించి, తాము స్వాతంత్ర్యులమని, తమది హిందూ రాజ్యమని అన్నదమ్ములు ప్రకటించారు. ఈసంగతి తెలిసిన తుగ్లకుకు కాస్సేపు కాలూచేయి ఆడలేదు. అవతల అర్జంటు పనులుండడంతో యీ సంగతే మఱచిపోయినాడు.

ఈ విధంగా స్థాపింపబడిన విజయనగర సామ్రాజ్యం రెండు శతాబ్దాలు పైబడి దుర్నిరీక్షంగా వెలుగొందినది. ఈ ప్రాంతీయ చరిత్ర అంతా దీనితోనే ముడిపెట్టబడివుంది. అయితే, ఇది దాదాపు అందరికీ తెలిసిన చరిత్ర. అంత విపులంగా పోనవసరములేదు. అవసరమయిన కొన్ని సంఘటనలు మాత్రం తెలుసుకొంటే చాలు.

విజయనగర సామ్రాజ్య స్థాపనతో తురుష్కుల బారినుంచి తిరుమల - తిరుపతి ఆలయాలు శాశ్వతంగా తప్పించుకొన్నాయి. స్థాపన నాటినుంచీ, తొండ మండలము, వారి రాజ్యంలో కలిసిపోయింది.



శ్రీ రామానుజాచార్యులు

# నారాయణాద్రి

విజయనగరము నేలిన ప్రఖ్యాత రాజవంశములలో, సంగమ వంశము మొదటిది. వారిలో రెండవ కంపన (కుమార కంపన ఉడైయర్) సైన్యాధిపతి సాలువ మంగిదేవుడు. ఇతడు సైన్యమును అజమాయిషీ చేయుచు చంద్రగిరిలో నుండువాడు. మహామండలేశ్వర, మేదినీ మీసరగండ, అనునవి ఇతని బిరుదులు. 'సాలువ' అనునది కూడ మధ్య కాలములో వచ్చిన ఒక బిరుదు. క్రీ. శ. 1369 లో నితడు శ్రీవారి ఆనందనిలయ విమానము మీద బంగారు కలశమును ప్రతిష్టించెను.

రెండవ కంపన, శెంజికోట అధికారి గోపన్న - అలగియ మానవాళ పెరుమాళ్ (శ్రీరంగనాథస్వామి) ఉత్సవ విగ్రహాన్ని తిరుమల నుంచి తెచ్చి శెంజికోటలో పూజించి, తదుపరి మహమ్మదీయుల బాధ తొలగిపోయిన తరువాత శ్రీరంగం చేర్చినట్టు ఇదివరకే తెలిసికొంటిమి.

శ్రీరంగనాథస్వామి విగ్రహాన్ని తిరుమల చేర్చక మునుపు ఆయనను తెచ్చిన తండ్రీ కొడుకులు, తిరుమల మీద ఒక కోనలో, మహమ్మదీయుల భయంతో, తలదాచుకొన్న హృదయ విదారక గాథ ఒకటి ప్రచారంలో వుంది. శ్రీ వేంకటేశ్వరస్వామి ఉత్సవ విగ్రహమయిన మలయప్పస్వామిని గురించి కూడ అలాంటి కథే ఒకటి ప్రచారంలో వుంది. తుంబురు కోనలో తలదాచుకున్న తండ్రీ కొడుకులు, పిళ్ళైలోకాచార్య అతని కుమారుడు కావచ్చు. తుంబురుతీర్థంలోకి దారిలేక దారములతో గట్టి లోయలోకి దింపబడిరట.

రెండవ హరిహర రాయలకాలమున తిరుమల శ్రీవారికి పూంగోడు గ్రామము సర్వమాన్యంగా సమర్పించబడినది.

రెండవ దేవరాయల కాలమున సిద్ధకుట్టి, అను శ్రీనివాసపురము ఆదాయములో శ్రీవారికి సగభాగము పంచబడినది. ఈ గ్రామము కొట్టాల

స్థలములో నున్నట్లు తెలియజేయబడింది. ఇది ప్రస్తుతము కొటాలకు దిగువన నున్న శ్రీనివాసమంగాపురము. ఎందుకనగా కొట్టాలస్థలము వైకుంఠవల నాడులోనిదని చెప్పబడింది. ఈ వివరాలు ఇంకొకచోట వ్రాయబడినవి.

చంద్రగిరి ఒక రాజ్యము, తిరువేంగడ కొట్టము ఆరాజ్యంలోని జిల్లా వైకుంఠవలనాడు, తిరుక్కుడవూరునాడు ఆ జిల్లాలోని తాలూకాలు. ఇది పల్లవులనాటి రాజ్యవిభాగం, అయినా విజయనగర చక్రవర్తులు కూడ ఆ విభాగాలనే కొనసాగించారు.

రెండవదేవరాయల మరొక మంత్రి మల్లన. ఈయనను అమాత్యశేఖరమల్లన అని కూడ అంటారు. మాధవదానర్ అమనది ఇతని మరొకనామం శ్రీవారి ఆలయంలో బంగారువాకిలికి ముందున్న తిరుమామణి మంటపం కట్టించాడు. ఆనందనిలయ విమానమును జీర్ణోద్ధారణ గావించాడు. కొన్నిచోట్ల, ఇతడు ఆనందనిలయ విమానమునకు బంగారుపూత పూయించినట్లు చెప్పబడింది. అంటే ఇప్పటికి బంగారుపూత ముచ్చటగా మూడుసార్లు అయింది. ఈ సంగతి క్రీ. శ. 1417 నాటిది.

మొదటసారి జటవర్మ సుందరపాండ్యుడు, వీరనరసింగదేవ యాదవరాయలచే, రెండవసారి సాలువమంగిదేవునిచే, మూడవసారి మల్లనమంత్రిచే ఆనందనిలయవిమానం పసిడిపూతలు పులుముకొన్నది. చంద్రగిరికి సమీపంలోని * మల్లయపల్లి మల్లన్నను గుర్తుకుతెస్తున్నది. ఇతను చంద్రగిరిలో దాదాపు 58 సంవత్సరాలు నివశించినట్టు శాసనాలు తెలుపుతున్నాయి. ఇతని తరువాత మంత్రి అయిన సాళువ పెరి మల్లయదేవ మహారాజు పేరులోనే మల్లయ వుంది. కావున మల్లయపల్లి వీరిద్దరిలో ఒకరిది గావచ్చు. ఈ పెరి

---

* దోర్ణకంబాల మల్లయపల్లికి పోవుదారిలో, మల్లయపల్లిగుట్టమీద, మల్లనమంత్రిచే నిర్మింపబడినదిగా భావింపబడుతున్న, శ్రీ కాలభైరవస్వామి దేవాలయమున్నది. అచ్చట చెల్లాచదరుగా పడివున్న అసంపూర్ణ శిలాస్థంబాలు సమున్నతమయినవి. ఆలయ నిర్మాణం అర్ధాంతరంగా ఆగిపోయిందేమో ననిపిస్తోంది. అయినా ఆలయంలో దేవుడున్నాడు. రెండేళ్ల నుంచి పూజలు జరుపుకొంటున్నారు. ఇది చంద్రగిరికోటకు సమీపంలోనే వుంది.

మల్లయదేవమహారాజు తమ్ముని పేరుగూడ సాళువమల్లయదేవ మహారాజు. ఇతడు చంద్రగిరి మండలాధిపుడుగా నున్నప్పుడు (అన్న తరువాత) శ్రీవారికి ఎలంబాకం గ్రామాన్ని దానం చేశాడు.

సంగము వంశీయుల తరువాత సాళువ వంశీయులు విజయనగర రాజులయిరి. సాళువమనగా డేగ లేక శ్యేనము. ఈ వంశము వారి గుణగణములకు యీ పేరు తగివున్నది. ఈ వంశములో చెప్పుకోదగినవాడు సాళువ నరసింహరాయలు. వంశ పారంపర్యముగా చంద్రగిరి ప్రభువయినాడు. రెండవ విరూపాక్షుని హత్యతో బలహీనమయిన హంపీకేంద్ర ప్రభుత్వమును తన కైవసము గావించుకొన్నాడు. ఆనాటి యోధులలో ఇతడగ్రగణ్యుడుగా పరిగణింపబడినాడు. నూనిజ్ అను చరిత్రకారుని ప్రకారము ఇతడు క్రీ.శ. 1450 నుంచి 1493 వరకు అనగా 44 సంవత్సరాలు పరిపాలించినాడు.

క్రీ. శ. 1482లో తిరుమల - తిరుపతి పుణ్యక్షేత్రాల్లో గోపురాలు, మంటపాలు కట్టడానికి, సువర్ణముఖీతీరంలో నున్న దుర్గసముద్రం గ్రామాన్ని దేవాదాయగ్రామంగా శ్రీవారికి సమర్పించి, ఆ పైకముతో తిరుమల మీద అనేక మంటపాలు కట్టించినాడు. శ్రీవారి ఆలయ సంపంగి ప్రదక్షిణములో నాలుగు మూలలా నాలుగు మంటపాలు, స్వామిపుష్కరిణి చుట్టూ మంటపాలు, వేయికాళ్లమంటపంలో దక్షిణవైపున్న పాతమంటపం, తిరుమలరాయమంటప ముందుభాగం, యిలా అనేక నరసింహమంటపాలు ఆ పైకముతో కట్టబడినవే.

ఊంజలిసేవ, రామానుజకూటములో అన్నదానం యీయనకాలం నాటివే. ఇందులో మొదటి దానిని ప్రవేశపెట్టినాడు, రెండవ దానిని సంస్కరించినాడు. మొదటి డోలోత్సవము తారీఖు 17-12-1561 గా పరిగణింపబడినది.

సాళువ వంశము వారి కథ సమగ్రంగా "సాళువాభ్యుదయము" అను సంస్కృతకావ్యంలో వుంది. అసలు సాళువ నరసింహరాయలు కవియై స్వయముగా రామాభ్యుదయమను గ్రంథమును వ్రాసినట్టు తెలుస్తోంది. ఈ రెండు

గ్రంథాలు ఒకటే అయినట్టు నా కనిపిస్తోంది. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, రాజనాథడిండిమ ఇతని ఆస్థానంలో నున్నట్టు తెలుస్తోంది.

తిరుమల సోపానమార్గములో శ్రీనృసింహస్వామిని ప్రతిష్ఠచేసినాడు. ఇతని కాలములో ఆలయములో యీ క్రింది వుద్యోగులున్నట్టు ఒక శాసనం వల్ల తెలుస్తోంది.

తిరుప్పానిపిళ్ళై
లచ్చినాయకక్కరర్
ప్రబంధ పారాయణదారులు
కంగాణిప్పన్
వాహనాలు మోయువారు
అధికారి
పచ్చాధికారులు ( పంచాధికారులా ? ఇప్పటి పేష్కారులులాగ )
దీపములు వెలిగించువారు
విన్నపం చేయువారు ( భట్రాజులా ? )
కట్టెలు తెచ్చువారు
వంది మాగధుడు ( ప్రొక్లెయిమర్ )
నాట్యాచార్యుడు
కాలసూచనాధికారి ( టైమ్ కీపరు )
నాట్యకత్తెలు ( దేవదాసీ లనుకోవచ్చు )
వాయిద్యకారులు
నాదస్వరమువారు
సంగీత గాయకులు
కుమ్మరులు
శిల్పులు
కావలివాండ్రు.

ఈ జాబితా అంతా చదివితే, ప్రస్తుతము ఆలయములోలేని వుద్యోగులు పునరుద్ధరింవబడితే బాగుంటుందని అనిపిస్తుంది ఎవరికయినా!

సాళువరాజులు - సాళువ మంగిదేవుడు, సాళువ నరసింహరాయలు కళ్యాణ కటకమును జయించినట్టు, కల్యాణపురము మొదట వారి రాజధాని అయినట్టు - అది పరశురామప్రీతి అయిన తరువాత వారు చంద్రగిరి చేరినట్టు సాళువాభ్యుదయమను గ్రంథము వలన తెలుస్తున్నది. ఈ కళ్యాణకటకము గుల్బర్గా (పూర్వపు నిజాం రాజ్యం) మండలములోని ఒక దుర్గము.

సాళువ వంశరాజుల తరువాత విజయనగర సామ్రాజ్యము నేలిన ప్రఖ్యాత రాజవంశము తుళువ వంశము, పేరులోనే వుంది వారి గుణం.

సాళువ నరనరాయల వలెనే తుళువ వీరనరసింహరాయలు, విజయనగర సామ్రాజ్య సింహాసనమును అదనుచూసి ఆక్రమించుకొన్నాడు. తుళువ నరసరాజుకు ముగ్గురు భార్యలు. తిప్పాంబ, నాగాంబ, ఓబులాంబ. తిప్పాంబ కుమారుడు వీరనరసింహరాయలు, నాగాంబ కుమారుడు శ్రీకృష్ణదేవరాయలు, ఓబులాంబ కుమారులు అచ్యుతదేవరాయలు - రంగరాయలు.

విజయనగరము నేలిన రాజవంశములు నాలుగు. అందులో ప్రసిద్ధి జెందినవి మధ్యకాలములో పాలించిన సాళువ - తుళువ వంశములు. ఆ రెండు వంశములు చంద్రగిరిలో వుద్భవించినవే. చివరి వారగు అరవీటివారు; తుళువ వారికి అల్లుళ్లు. కాబట్టి వీరినికూడ వారితోనే కలుపవచ్చు.

విజయనగర సామ్రాజ్యస్థాపన క్రీ.శ. 1336

సంగమ వంశపాలన కాలము క్రీ.శ. 1336 – 1485

సాళువ వంశపాలన కాలము క్రీ.శ. 1485 – 1505

తుళువ వంశ పాలన కాలము క్రీ.శ. 1505 – 1576

అరవీటి వంశ పాలన కాలము క్రీ.శ. 1576 – 1649

తుళువ వంశమువారిలో ప్రఖ్యాతిగాంచిన మేటి మొనగాడు-సంగీత సాహిత్య సమరాంగణా చక్రవర్తి - శ్రీకృష్ణదేవరాయలు. ఆతని తరువాత అచ్యుత దేవరాయలు.

కృష్ణదేవరాయలను గురించి ఎంత వ్రాసినా అది తక్కువే అవుతుంది. ఆయనను గురించి స్వదేశీయులే గాక, విదేశీయులయిన నికోలో కాంటీ (ఇటలీ వర్తకుడు) అబ్దుల్ రజాక్, పేయజ్, న్యూనిజ్ (సెవెల్ వ్రాసిన ఫర్‌గాటన్ ఎంపైర్) మొదలగువారు కన్నులకు కట్టినట్టు వ్రాసినారు. ఆ మహారాజును గురించి-రాజ్యాన్ని గురించి ఎన్నో నవలలు, నాటకాలు, సినిమాలు వెలిసినవి.

అతని ఆస్థానంలో ''అష్టదిగ్గజములు'' అను ఎనిమిది మంది మహా కవులు వెలిసినారు. 'భువనవిజయము'ను సాహితీ పరిషత్ వెలిసినది. శిల్పము, నాట్యము, సంగీతము, గానము, కవిత్వము, చిత్రలేఖనము క్రొత్త రూపురేఖలు దాల్చుకొని, కళలకు క్రొత్త అర్థములు విప్పిచెప్పినవి. కళా కారులకు చేతినిండా పని. కవులకు ప్రౌఢకావ్యములు వ్రాయటమే పని. రాయలువారు స్వయముగా కవి.

తెలుఁగదేలయన్న దేశంబు తెలుఁ, గేను
తెలుఁగు నాయకుండఁ, దెలుఁ గొకండ;
ఎల్ల బాసలందు నెఱుఁగవే బాసాడి
దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స.

అని చాటిచెప్పిన మహానుభావుడు.

సైనికులు మహామ్మదీయ శిక్షకులనుండి అశ్వవిద్య, బాణవిద్యలు నేర్చుచుండిరి. ఈ కాలమున పనిలేని వా డరుదు. అందుకే దేశము మూడు పూవు లారు కాయలుగ వర్ధిల్లినది.

కృష్ణదేవరాయలు రాజ్యమును కటకము (ఒరిస్సా) వరకు వ్యాపింప జేసినాడు. పశ్చిమమున రాయచూరు ముద్గల్లు కోటలు తనవిగా చేసుకొన్నాడు.

కటకము దిగ్విజయానంతరము సింహాద్రి - పొట్నూరులలో విజయ స్థంభములు నాటించినాడు. అల్లసాని పెద్దనగారి మనుచరిత్ర, కృష్ణదేవ రాయలు స్వయముగా వ్రాసి, శ్రీ వేంకటేశ్వరస్వామి పాదారవిందముల కంకిత మిచ్చిన ఆముక్తమాల్యద, ముక్కుతిమ్మనగారి పారిజాతాపహరణము, కృష్ణ రాయల విజయము మొదలగు గ్రంథాలలో కృష్ణదేవరాయల ఘనత మిక్కిలిగా తెలుసుకోవచ్చు. జాంబవతీ కళ్యాణమను సంస్కృత నాటకమునుకూడ వ్రాశాడు రాయలవారు. సంగీత సూర్యోదయము అను గ్రంథము ఇతని ప్రోత్సాహము వల్ల పుద్భవించినదే.

మహామాత్యుడయిన తిమ్మరుసు ఇతనికి గురువు, దైవం, సచివుడు. పెరియ ఓబలనాయకర్, రామనాయకర్, రాయసం కొండమరసయ్య, త్ర్యంబక దేవ అనువారు కృష్ణదేవరాయల మేటి సైన్యాధిపతులు.

తిమ్మరుసు మంత్రి (అప్పాజీ) కృష్ణదేవరాయల కాలముననే గాక, అతని తండ్రికాలమున, అతని తరువాత, అతని తమ్ముని కాలమున (అచ్యుత దేవరాయల కాలమున కొన్ని ఏండ్లు) మహామాత్య పదవిని నిర్వహించినవాడు. అప్పాజీ తమ్ముడు గోవిందామాత్యుడు, అన్నదమ్ములిద్దరి ఆస్థానములలో పని చేసి మంచి అధికారిగ (గవర్నరుగ) ప్రఖ్యాతి గాంచినాడు. రాజులు - మంత్రులు ఒకే ఊరువారు (చంద్రగిరి) కావడంతో ఐకమత్యం వెల్లివిరిసింది గానీ, పొరపొచ్చాలు ఏర్పడలేదు.

శ్రీకృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509 – 1530) మొత్తం ఎనిమిది పర్యాయములు విజయనగర చక్రవర్తిగ, తిరుమల సందర్శించెను. క్రీ. శ. 1513 నుంచి 1521 వరకు యీ యాత్రలు జరిగినవి. అతని దేవేరులు - తిరుమలదేవి, చిన్నమదేవి ఆయనతోబాటు శ్రీవారిని దర్శించినట్టు శాసనాలలో లిఖింపబడినది.

ఆయన దర్శన సమయములలో శ్రీవారికి సమర్పించిన ధనము, కనకా భరణములు అమూల్యములు. దానముల చేయుటలో ఆయన దేవేరులు,

వారి హోదాకు తగినట్లు - ఆయనకేమాత్రం తీసిపోరనిపిస్తుంది. వానిలో ముఖ్యమైనవి కొన్నిమాత్రము చూద్దాం.

(1) బంగారు కిరీటం (నవరత్నఖచితం) ముప్పేట కంఠహారం, ముత్యాలహారం రాయలవా రివ్వగా ఆయన దేవేరులు శ్రీవారి పాల ఆరగింపుకు రెండు బంగారు పాత్రలు - పళ్లెరాలు సమర్పించిరి.

(2) 30,000 బంగారు నాణెములతో (చక్రంపన్) శ్రీ వారికి కనకాభిషేకము.

(3) 30,000 వరహాలతో ఆనందనిలయ విమానమునకు బంగారు పూత వేయించుట.

(4) 1000 వరహాలు ప్రతి గురువారం శ్రీ వారి పులికప్పు సేవ నిమిత్తము.

(5) 10,000 వరహాలు శ్రీ వారి ఆలయ ఖర్చులనిమిత్తం ఆయన రాణులు శ్రీ వారికి అమూల్య రత్నాలు పొదిగిన కంఠమాలలు, చక్రపటకము, ప్రభావళి, పతకములు, పటకములు మొదలగునవి అప్పుడప్పుడు వారి సందర్శన కాలములలో సమర్పించిరి.

శ్రీవారి ఆనందనిలయ విమానమునకు బంగారుపూతపని 9-9-1518 నాడు పూర్తయినట్టు తెలుస్తోంది. దీనితో శ్రీవారి ఆలయమునకు బంగారు పూతపని నాలుగుసార్లు అయింది. దీని తరువాతకూడ మూడు పర్యాయములు శ్రీ వారి ఆలయానికి బంగారు పూత పని జరిగింది.

5 వ పర్యాయము - కంచి నివాసుడయిన కోటికన్యకాదానం తాతాచార్యులువారు, మొదటి వెంకటపతిరాయల కాలమున బంగారు పూత పని చేశారు. ఇతడు పిచ్చాటూరు గ్రామాన్ని ఇంకా కొన్ని ఇతర గ్రామాలతో బాటు శ్రీ వారికి సర్వమాన్యంగా యిచ్చినాడు.

6 వ పరాయ్యము - హత్తిరాంజీ మఠమునకు చెందిన అధికారి శ్రీరామ లక్ష్మణదాస్ బావాజీ వారు చేయించినారు. మహంత్ శ్రీప్రయాగదాస్ బావాజీ వారికి ఈయన సోదర శిష్యుడు (బ్రదర్ డిసైపుల్.) 30 - 9 - 1908 తేదిన జరిగిన యీ మహత్కార్యము, శ్రీప్రయాగదాస్‌వారు తి. తి. దే. విచారణ కర్తగా నున్నప్పుడు జరిగింది.

7 వ పర్యాయము 27-8-1958 తారీఖున తి. తి. దేవస్థానము వారు, యీ కార్యమును 18 లక్షల రూపాయల వ్యయముతో పూర్తి చేసిరి.

దీనితో మొత్తం, ఏడు పర్యాయములు ఆనందనిలయ విమానం బంగారు పూతలు పూనుకొన్నది.

శ్రీ కృష్ణదేవరాయులు చేసిన గ్రామ దానములలో ముఖ్యమయినది - పొత్తపినాటిలోని తాళ్లపాక గ్రామం. కృష్ణదేవరాయలు తాళ్లపాక గ్రామాన్ని శ్రీవారి కర్పిస్తే - తాళ్లపాక గ్రామం తాళ్లపాక అన్నమాచార్య వంశ కవులను శ్రీవారి సేవ కర్పించి తన ఋణం తీర్చుకొన్నది. క్రీ. శ. 6 - 7 - 1514 తేదీన యీ గ్రామ దానం జరిగినట్టుగా గుర్తింపబడింది.

తిరుమల కొండకు దిగువ భాగమున రేణిగుంట సమీపమున నున్న కరకంబాడి గ్రామము యీ కాలంలోనే శ్రీవారికి సర్వమాన్యంగా సమర్పించ బడినట్టు తెలుస్తోంది.

ఈ కాలంలోనే సత్తయప్పనాయకర్ కుమారుడయిన ఎల్లప్పనాయకర్ అను రాయల వుద్యోగి తిరుమలలో కాల్‌తేర్ సత్రము కట్టించినట్టు తి. తి. దే. శాసనాలలో వుంది. ఎల్లప్పనాయకర్ కృష్ణదేవరాయలకును, అచ్యుత దేవ రాయలకును అంగరక్షకుడుగా పనిచేసినట్టు తెలుస్తోంది. ఇతడు కట్టించినది కాల్‌తేర్ సత్రము అనగా రాతితేరు సత్రం. ఈ రాతితేరు ఉత్తరమాడవీధి తూర్పుమాడవీధి కలిసే చోట ఇదివరకు వుండేది. ఇప్పుడు చంద్రగిరి సోపాన మార్గము వద్ద బహుసుందరంగా అమర్చబడివుంది. ఈ పని చాక చక్యముగాచేసిన తి.తి.దే. ఇంజనీరింగు డిపార్టుమెంటువారు అభివందనీయులు

మునుపు ఈ రాతితేరువున్న చోటనే ఆ సత్రం కూడ వుండినట్లు తెలుస్తోంది. ఈ రాతితేరు సత్రం నిర్మాణాన్ని క్రీ. శ. 29-3-1527 తారీఖున తాను స్వయంగా చేసినట్టు ఆతడు శాసనం వేయించాడు.

ఈ ఎల్లప్పనాయకర్ కుమారుడు తిరుమలై నాయకర్ అను నాతడు, తిరుచానూరుకు సమీపంలోని పానకం గ్రామ పొలాలకోసం, ఒక పంట కాలువను త్రవ్వించినట్టు శాసనంలో వుంది. ఈ పొలాల ఆదాయం శ్రీవారికి వచ్చేది.

చిత్తూరు సమీపంలోని పూతలపట్టు గ్రామవాసియైన సూరప్పరెడ్డి తమ్మురెడ్డి కుమారుడు చిన్నప్పరెడ్డి, యింకా కొందరితో కలసి కృష్ణరాయల సౌభాగ్యానికి, క్రీ.శ. 17–1–1527నాడు శ్రీవారికి ధనరూపేణా బహుమానం చేసినట్టు ఇంకో శాసనంలో వుంది.

కృష్ణరాయల కొలువులో సుబుద్ధి రామదాస, అంబికాముదుశిల అను ఇద్దరు వుద్యోగు లుండేవారు. వారు ఇదివరకు ప్రతాపరుద్ర గజపతి కొలువులో వుండేవారు. వారికి కృష్ణరాయలువారు, రెండు గ్రామాలు దానం చేయగా, వారు ఆరెండిటిని శ్రీవారికి దానం చేశారు. ఆ రెండు గ్రామాలు, తండ్లం ఒకటి, మరొకటి తడపల. తండ్లం గ్రామం తిరుచానూరు సమీపంలో వుంది. తడపల అక్కడ లేదు. బహుశా అది పూతలపట్టు సమీపంలోని తలపల గ్రామమేమో ?

కృష్ణదేవరాయల పాలనాకాలం స్వర్ణయుగంగా ప్రఖ్యాతి గాంచింది.

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి రాయలవారి ఇలవేలుపు. అందుకే ప్రతికార్యము చేయబోయే మునుపు ఆయన స్వామివారికి మ్రొక్కుకొనేవారు. కార్యం పూర్తయిన తరువాత తిరిగివచ్చి స్వామిని దర్శించి వెలలేని కానుకలు సమర్పించేవారు. స్వామి అనుజ్ఞ తీసుకొనే, ఆయన ప్రతియుద్ధం చేసినట్టు అనిపిస్తుంది.

ఆయన తిరుమల దర్శించిన తేదీలు:

1. మొదటి పర్యాయము క్రీ. శ. 10-2-1513
2. రెండవ " " 2-5-1513
3. మూడవ " " 6-7-1514
4. నాలుగవ " " 13-6-1515
5. ఐదవ " " 25-10-1515
6. ఆరవ " " 2-1-1517

(ఇది కళింగ యుద్ధము తరువాత దర్శనము)

7. ఏడవ పర్యాయము క్రీ. శ. 16-10-1518
8. చివరి పర్యాయము క్రీ. శ. 17-12-1521

పైన పేర్కొన్నవి గాక, 9-9-1518 నాడు ఆనందనిలయ విమాన బంగారు కలశము స్థాపనకు వచ్చారు. దీనిని బట్టి ఆయనకు శ్రీవేంకటేశ్వర స్వామివారిమీద భక్తి ఎంతటిదో వూహించుకోవచ్చు.

ఆయన తదనంతరము పాలనకువచ్చిన అచ్యుతదేవరాయలు అన్న గారి మరణం వరకు చంద్రగిరి కోటలో బందీ. విడుదల అవగానే నేరుగా తిరుమలకు వచ్చి, శ్రీవారి చేతిలోని శంఖుతో ధారగా నీరు నెత్తిన పోయించుకొని పట్టాభిషిక్తుడై, విజయనగర సామ్రాట్‌గ మారినాడు. ఆ శంఖంలోని నీటికి అంతప్రభావం వుంది. అంతటితో ఆగక, శ్రీకాళహస్తిలో ఒకసారి, హంపీ విజయనగరములో ఒకసారి, ముచ్చటగా మూడుసార్లు, మూడు పుణ్యక్షేత్రాల్లో పట్టాభిషిక్తుడయినాడు. ఈ మూడు పట్టాభిషేకాలు క్రీ. శ. 1529 అక్టోబరు నవంబరు - అంటే ఒక మాసం కాలంలోనే జరిగాయి.

అచ్యుతరాయలు తిరుమలకు రాకమునుపే ఆయన సౌభాగ్యానికి, కుమార రామానుజ అయ్యంగారు తిరుపతి శ్రీ కోదండరామస్వామి ఆలయానికి కొయ్యతేరు క్రీ. శ. 14-1-1530 న నిర్మింపజేసినాడు.

అచ్యుతరాయలు తిరుమల దర్శనానికి మొదటిసారి క్రీ. శ. 31 1-1533 న వచ్చాడు. అప్పు డాయనతోబాటు ఆయన దేవేరి వరదాజి అమ్మ, కుమారుడు కుమార వెంకటాద్రి వచ్చారు. శ్రీవారికి ఆయన స్వయంగా అర్చన చేశాడు. అనేక కానుకలు ఇచ్చాడు.

క్రీ. శ. 26-12-1535 న రెండవసారి శ్రీవారి దర్శనము చేసుకున్నాడు.

ఈయన కాలంనాటి ఒకశాసనంలో అప్పట్లో జరుగుతున్న ఉత్సవాల జాబితా ఇలా వుంది :—

9 బ్రహ్మోత్సవములు, గరుడవాహనము, రథోత్సవము, అచ్యుత రాయ బ్రహ్మోత్సవము, సంకీర్తన భాండార మెరవణ, గ్రీష్మపండుగ, అధ్యాయనోత్సవము, డోలోత్సవము (ఊంజలిసేవ), పవిత్రోత్సవము, సహస్ర కలశాభిషేకము, వసంతోత్సవము, అమవాస్య పండుగ, కళ్యాణోత్సవం, సహస్రనామార్చన, పౌర్ణమి పండుగ, దశమి, ఏకాదశి, ద్వాదశిపండుగలు, తిరుణం దినము, ఉత్తరం దినము, దీపావళి, ఉగాది, శ్రీ జయంతి, యురి యాడి (అడి), కార్తీకం, పారువేటిపండుగ, కనుమపండుగ, ఉత్థానద్వాదశి, ముక్కోటి ఏకాదశి, దమనారోహణం, కొడైతిరుణాల్, లక్ష్మీదేవి మాహాత్మ్యం, తెప్పోత్సవము, పల్లవోత్సవము, ఫలోత్సవము, మేషసంక్రమణం, రోహిణి, మృగశిర, పునర్వసు, ఉత్తర, మూల, పూర్వాషాఢ, ఉత్తరాభాద్ర, అర్పసి పురడం, మకరసంక్రమణం, పడియావెట్టై, తాయ్పూనం, తన్ని రాముదు, రథసప్తమి మొదలగునవి.

అచ్యుతదేవరాయలు - తిరుపతి కపిలతీర్థంలో - తీర్థానికి ఇరువైపులా సంధ్యావందన మంటపాలు కట్టించినాడు. ఈయన కాలంలోనే కపిలతీర్థం-చక్రతీర్థం లేదా ఆళ్వారుతీర్థమని క్రొత్తనామం దాల్చింది. తీర్థానికి అనగా

దానికి సమీపంలో ముందు 'కొట్టూరు' అనిపేరుగలిగిన గ్రామమున్న చోట అచ్యుతరాయపురము అను గ్రామాన్ని నిర్మించి, ఆ గ్రామంలో అచ్యుత పెరుమాళ్ ఆలయము కట్టించి, అందులో అచ్యుతపెరుమాళ్ అను దేవుని ప్రతిష్ఠచేసినాడు. దానిచుట్టూ 120 గృహాలు నిర్మించి అగ్రహారంగా దానిని రూపొందించినాడు. అచ్యుతదేవరాయలు ఇంకా అచ్యుతదేవరాయల సత్రం అచ్యుతదేవరాయల కోనేరు నిర్మింపజేసినాడు. ఇందులో సత్రం తిరుమల పడమటిమాడవీధిలో ఒకచోట వుండవచ్చు. కోనేరు పాతపుష్కరిణి. అది ఇప్పుడులేదు. పూడ్చబడి దానిమీద 'క్వ్యా' షెడ్లు నిర్మింపబడినవి. అందుకే ఆ ప్రాంతాన్ని పి. పి. సి. (పాతపుష్కరిణి కాటేజీలు) అంటారు.

అచ్యుతరాయపురమెప్పుడో శిథిలమయిపోయింది. ఇప్పుడొక చిన్న గోపురం కపిలతీర్థంరోడ్డులో తూర్పుభాగాన ఏకాకిగ మిగిలివుంది. దానికి పడమరగ, రోడ్డుకు ఎగువన, ముందు ఆలయమున్నచోట ఎన్. జి. వో. కాలనీ, పిల్లలకు ఒక ప్రాథమిక పాఠశాల జరుగుతోంది. ఈ ప్రాంతమంతా మునుపటి శిథిలాలుగ రాళ్లురప్పలు కుప్పలుగా కనిపిస్తున్నాయి.

పారువేటి తిరుణాలకు ప్రసాదాలు ఏర్పాటుచేయడమేగాక, లక్ష్మీదేవి మహోత్సవమనుపేరిట ఒక క్రొత్త ఉత్సవాన్ని ఏర్పాటుచేసినాడు.

ఇతనికాలంలోనే తాళ్లపాక పెద్దతిరుమలాచార్యులు (అన్నమాచార్యుల కుమారుడు) తిరుమల వరాహస్వామి ఆలయానికి ప్రహరీగోడ నిర్మించినాడు. శ్రీవారి ఆలయ తూర్పుగోపురము పునరుద్ధరించినాడు. స్వామిపుష్కరిణికి సోపానములు, ప్రదక్షిణమంటపాలు, నీరాళమండపము నిర్మించి తన భక్తిని వెల్లడించుకున్నాడు.

అచ్యుతదేవరాయల ప్రతినిధిగ చంద్రగిరిలో ''రామభట్టు'' అనే ఆయన పరిపాలిస్తూ వుండేవాడు. ఆయన చంద్రగిరి కొత్తపేటకు పాతపేటకు మధ్యగా కొండక్రింద తిరువేంకటాపురము అను ఒక అగ్రహారాన్ని నిర్మించి

నాడు. అందులో రఘునాథ ఆలయము ఒకటి కట్టించి, శ్రీ కోదండరామ స్వామిని ప్రతిష్టచేసినాడు. (తిరుమల ఆలయంలోని ఒక శాసనసారాంశము)

అదే ప్రస్తుతం చంద్రగిరి కోదండరామాలయముగ ప్రశస్తి గాంచినది. దాని నిర్మాణము క్రీ.శ. 1535 లో జరిగినది. క్రీ.శ. 1900 ప్రాంతములో శ్రీ మొగిలిరెడ్డి నారాయణస్వామిరెడ్డిగారిచే జీర్ణోద్ధారణ చేయబడినది.

శ్రీ మొగిలిరెడ్డి చంద్రమౌళిరెడ్డిగారు ఎండోమెంటు కమీషనరుగ వచ్చి, తిరిగీ పునరుద్ధరింపబడుటకు ఆజ్ఞ ఇవ్వడంతో - ఆలయము పునరుద్ధరింపబడి అష్టబంధనం ధ్వజస్తంభస్థాపనము జరిగి కుంభాభిషేకము మొదలగు హంగులన్నీ జరుపుకొన్నది (11 జూలై 1979). కట్టిన తరువాత బాగుపడడానికి ఆ ఆలయానికి సరిగ్గా 444 సంవత్సరాలు పట్టింది. సంఖ్య ఎంత సరిగ్గా వుంది. అచ్యుతదేవరాయలు తనపేరనే గాక, అన్నగారిపేర, భార్యపేర, కుమారునిపేర అచ్యుత అవసరం (నైవేద్యం) ఏర్పాటుచేసి తన భక్తిని వెల్లడించుకున్నాడు. శ్రీవారిమీద, యీయన భక్తి భావం, చాల దొడ్డది.

తొండవాడకు సమీపంలోని పైడిపల్లి గ్రామంలో అర్థభాగాన్ని వీర నరసింగదేవ యాదవరాయల రాణి 'యాదవరాయ నాచ్చియార్' ఇదివరకే శ్రీవారికి దానమిచ్చింది. ఇక మిగిలిన సగభాగం అచ్యుతదేవరాయల కాలంలో ఆయన రాణి 'వరదాజిదేవి అమ్మన్' శ్రీవారికి అప్పగించింది దీనితో పైడిపల్లిగ్రామ పూర్తి ఆదాయం శ్రీవారికి చెందడం ప్రారంభమయింది.

ఈ రాణిగారి అన్న 'సిరు తిరుమల రాజ' అను నతడు తిరుమల పడమటి మాడవీధిలో 'అంగన తిరువీధి'ని తన చెల్లెలిపేర నిర్మించినాడు. అంగన తిరువీధి అనగా మధ్యలో ఖాళీస్థలము చుట్టూ ఇండ్లు. ఇలాంటిది ఒకటి వున్నట్లు ఇప్పుడు కూడా గ్రహించవచ్చు. ఆల్ ఇండియా ఆర్యవైశ్య సమాజము సత్రము ప్రక్కన చుట్టూ ఇండ్లున్నాయి. మధ్యలో ఖాళీ ఇదివరకు వుండినది. ఇప్పుడు కొన్ని గుడిసెలు - ఇండ్లు మధ్యలో దూరాయి.

'అచ్యుతరాయాభ్యుదయము' అనే గ్రంథంలో అచ్యుతరాయలకు సంబంధించిన ఇంకా అనేక విషయాలున్నవి. అయితే అది కావ్యం. పూర్తిగా ఆధారపడదగినది కాదు.

అచ్యుతరాయల తదనంతరము సదాశివరాయలు విజయనగర రాజ్యానికి రాజయినాడు. అతను కేవలము రెండు పర్యాయములు క్రీ. శ. 1554 ఫిబ్రవరి - జూలైలో తిరుమల దర్శించినాడు. అతడు శ్రీవారికి సమర్పించిన కానుకలు చెప్పుకోదగినంత విలువయిన వేమీకావు. దానికి కారణము అతడు అలియరామరాజు చేతిలో కీలుబొమ్మ. తదనంతరము అలియరామరాజు, సదాశివరాయలను కారాగారములో బంధించి తానే రాజయి - ఆవిధంగా 'అరవీడు' వంశం పాలనకు రావడానికి కారకుడయినాడు.

విజయనగర సింహాసనమును బలవంతముగ ఆక్రమించుకొని పరిపాలించిన రాజవంశములలో అరవీడు వంశము మూడవది. అళియ రామరాయలు మూడవవాడు. అనగా మొదటివాడు సాళువ నరసింహరాయలు, రెండవవాడు తుళువ నరసింగరాయలు, మూడవవాడు అళియరామరాయలు. వీరెవరును ఆరాజ్యము కోసం - లేదా ఆ సింహాసనముకోసం రక్తం చిందించ లేదు. కేంద్రంలోని రాజులు బలహీనులవడంతో - చంద్రగిరి రాజ్యంలోని వీరు బలవంతులవడంతో నెమ్మదిగా పోయి సింహాసనము మీద నిశ్శబ్దంగా కూర్చున్నారు. అంతటితో పాలన వీరి వశమయింది.

అళియ రామరాయలకు ఇంకొక సదుపాయం కూడా వుంది. శ్రీకృష్ణ దేవరాయల కుమార్తె తిరుమలాంబను వివాహమాడి తుళువవారికి అల్లుడయి నాడు. అయినా, తన చిన్నమామను కారాగారంలో బంధించి, తాను రాజయి మామగార్ల ఋణం ఆవిధంగా అపసవ్యమార్గంగా తీర్చుకొన్నాడు.

రాజ్యానికి వచ్చినది మొదలు - దక్కనులోని సుల్తానులతో ఆడుకోవడం మొదలుపెట్టాడు. వారికి జుట్లులేవు గావున గడ్డాలు ముడివేశాడు. ముందు

గానే ముక్కిడి - అందులో పడితెము లాగయింది వారి పరిస్థితి. అవకాశం కోసం ఎదురుచూశారు. అంతా ఏకమయ్యారు.

క్రీ. శ. 1565లో రక్కసి - తంగడి గ్రామాలమధ్య చరిత్ర ప్రసిద్ధి జెందిన తళ్లికోటయుద్ధము జరిగింది. అనుకోని విధంగా యుద్ధంలో గాయ పడి నేలకొరిగినాడు. విజయనగర సేనలు కాళ్లకు బుద్ధిచెప్పాయి. విధి వైపరీత్యం.

రామరాయలు యుద్ధరంగంలో చనిపోవడంతో - అతని తమ్ముడు తిరుమలరాయలు హుటాహుటిన రాజధానికొచ్చాడు. వచ్చినవాడు క్రొత్త సైన్యాలను సమీకరించుకొని సుల్తానులను ఎదిరించకుండా, దొరికిందంతా చేజిక్కించుకొని, తన కుటుంబముతో, బందీయైన సదాశివరాయలతో పెనుకొండ మార్గం పట్టాడు. అతని కలాంటి బుద్ధిపుట్టడం - హంపీ విజయనగరానికి నొసట్రివ్రాత బాగులేకపోవడమే కావచ్చు.

పారిపోయిన వారిని వెంబడిస్తూ మసల్మానులు హంపీ విజయనగరం చేరారు. చేరిన తరువాత ఆ మహానగరాన్ని కొల్లగొట్టుతూ - శిథిలంచేస్తూ ఆరుమాసాలు గడిపారు. అప్పటికీ రామరాయలమీద వారికి కసి తీరలేదు గానీ, చేతులు నొప్పిపుట్టి మానుకున్నారు. దేశ విదేశీయులచే, వేలకొలది పుటల నిండా పొగడబడిన నగరం చూస్తూండగానే శిథిలరూపం దాల్చింది. ద్వేషబీజం ఎంతపని చేస్తుందో విజయనగరం నిరూపించింది. దీనితో దేశ చరిత్ర మరో మలుపు తిరిగింది.

దేశంలో శాంతి భద్రతలు కరువయ్యాయి, దక్కను పీఠభూమిలోని సుల్తానులు, తమ తొలి విజయంతో రెచ్చిపోయి, మాటిమాటికీ హిందూరాజ్యాల మీద దాడి చేయ నారంభించినారు. పందిట్లో సమారాధన అన్నట్టు, అంత వరకు విజయనగర రాజులకు సామంతుడుగా నున్న నాగమనాయకుని మనుమడు, విశ్వనాథనాయకుని కుమారుడు అయిన కృష్ణప్పనాయకుడు కూడా విజృంభించి నాడు. వీరంతా మధురనాయక రాజులుగా ప్రసిద్ధిగాంచినారు. కథా కాలము

నాటికి కృష్ణప్పనాయకుడు శెంజికోటకు అధిపతిగా నున్నాడు. అతడు విజృంభించి తొండమండలములో కొంతభాగాన్ని జయించి పాలించకుండా బాధించసాగాడు. అగ్నికి ఆజ్యం పోసినట్లు అరవీడు కుటుంబములోని వారికి రాజ్యకాంక్ష ఎక్కువయి తమలోతాము కీచులాడుకోసాగారు. దీనికి గాలి తోడయింది. ఢిల్లీ సింహాసనాధీశుడు, మొగలాయీ చక్రవర్తి అయిన షాజహాన్ బీజాపూర్, గోల్కొండ నవాబులను 'నేనున్నాను. మీపని కానీయండ'ని ప్రోత్సహించాడు. ఇంకేం! బీజాపూర్ నవాబులు పశ్చిమ కర్ణాటక రాజ్యాన్ని గోల్కొండ నవాబులు తూర్పు కర్ణాటక రాజ్యాన్ని క్రమక్రమంగా వాటపడినంతవరకు వశపరచుకోసాగారు. ఇదీ తిరుమలరాయలు రాజ్యాభిషిక్తుడయ్యేనాడున్న రాజకీయ పరిస్థితి. ఈ పరిస్థితులలో అతడు రాజయ్యాడు. అయినా పరిస్థితులు మారలేదు. అప్పుడే కాదు. ఆ తరువాత దాదాపు 250 సంవత్సరాల వరకు పరిస్థితులలో మార్పులేదు. తళ్లికోట యుద్ధానంతరము క్రీ. శ. 1570 లో అరవీడు వంశము రాజ్యానికి వచ్చింది.

తిరుమలరాయలు క్రీ. శ. 1570 - 1572 స్వల్పకాలం పాలించాడు. ఆతని కాలంలో తిరుమల శ్రీవారి ఆలయంలో ఊంజలి మంటపము భాగంగా వున్న తిరుమలరాయల మంటపము కట్టబడింది.

మొదటి శ్రీరంగరాయలు క్రీ. శ. 1572 - 1585 వరకు పాలించాడు. తిరుమలరాయల పెద్ద కుమారుడితడు. పెనుగొండ అధిపతిగా వుండి, తండ్రి తరువాత రాజయినాడు. ఇతని కాలంలో గోల్కొండ నవాబులచే కర్నూలు జిల్లాలోని అహోబిలనృసింహ ఆలయము ఆక్రమించబడింది. ఉదయగిరి - కొండవీడు దుర్గాలు కూడా వారి వశమయ్యాయి. శ్రీవేంకటేశ్వర స్వామిని చూడడానికి ఇతనికి తీరిక లేకపోయింది. ఇతనిని కాపాడడానికి ఆయనకు అంతకంటె తీరిక లేకపోయింది. వెంకటపతిరాయల పాలనకాలము క్రీ.శ. 1585-1614. తిరుమలరాయల రెండవ కుమారుడితడు. రాజధానిని పెనుగొండ నుంచి చంద్రగిరికి మార్చినాడు. తిరుమల ఆలయంలో తల్లి దండ్రులు - ( తిరుమల రాయలు - వెంగలాంబ ) శిలా విగ్రహాలతో బాటు తన

లోహ విగ్రహం చేయించుకున్నాడు. కృష్ణదేవరాయల లాగ అందరికీ లోహవిగ్రహాలు చేయించుకోవడానికి డబ్బు లేకపోయిందో ఏమో, ఆ విగ్రహాలతో తృప్తి పడినాడు. ఈ అభిప్రాయం, మారేమండ రామారావు గారిది. తక్కినవారు, వెంకటపతిరాయల ప్రక్కనున్న విగ్రహాలను అచ్యుత దేవరాయలు, ఆయన రాణి వరదాజీ అమ్మగా లిఖించినారు. ఆలయంలో కూడ అలాగే పరిగణన. అయినా, చక్రవర్తి అచ్యుతరాయలు రాతి విగ్రహాలు, చెక్కించుకుంటాడా? - అన్నది ప్రశ్న.

రెండవ శ్రీరంగరాయలు క్రీ. శ. 1614 లో రాజ్యానికి వచ్చీ రాక ముందే తన భార్య సోదరుడయిన జగ్గారాయునిచే కారాగారంలో బంధింపబడి తదుపరి చంపబడినాడు. ఎంతటి దౌర్భాగ్యుడనాలి. చావునుంచి తప్పించుకొన్న రంగరాయల కుమారుడు ఒకే ఒకడు రామదేవరాయలు. ఇతనిని వెలుగోటి వంశజుడయిన, యాకమ నాయకుడు నేర్పుగా కాపాడి తంజావూరు నాయక రాజుల స్వాధీనం చేయగా, వారు జగ్గారాయునిపై దండెత్తి, వానిని సర్వ నాశనం చేసి రామదేవరాయలను రాజుగా చేసినారు. రామదేవరాయలు క్రీ.శ. 1614 - 1630 కాలం పాలించాడు. రెండవ వెంకటపతిరాయలు క్రీ. శ. 1630 - 1642 పాలించాడు. గోల్కొండ నవాబు సేనలు పులికాట్ వరకు దండెత్తి వచ్చాయని తెలిసి, పరుగెత్తిపోయి ప్రక్కనేవున్న మల్లయపల్లి, దోర్న కంబాల కొండల్లో దాక్కున్నాడు. మంచిది కానీ, చెడ్డది కానీ ఇతనొక పని మాత్రం చేశాడు. తూర్పు ఇండియా కంపెనీకి చెందిన అధికారి ఫ్రాన్సిస్ డేకు, మద్రాసులో సెయింట్ జార్జి కోట కట్టుకోవడానికి అనుమతి ఇచ్చినాడు. అదే పాశ్చాత్యుల తొలి స్థావరం. దీనికి కారకుడు శ్రీ కాళహస్తి ప్రభువు దామెర్ల వెంకటాద్రి నాయుడు. ఫ్రాన్సిస్ డే దగ్గర ఎంత నజరానా ముట్టిందో ఏమోగానీ, సిఫార్సు మాత్రం చక్కగా పకడ్బందీగా చేసి - రాజుగారి దగ్గర బంగారురేకుమీద ఆర్డరు సంపాదించాడు. తన తండ్రి చెన్నప్ప నాయకుని పేరు ఆ క్రొత్తపట్టణానికి వుండాలని కూడ ఈస్టిండియా కంపెనీ వారికి చెప్పి పంపాడు. అందుకే అది చెన్నపట్టణం అయింది. మూడవ శ్రీరంగరాయలు

క్రీ.శ. 1642-1681. ఇతనితో విజయనగర సామ్రాజ్యము మూడుదోవలు బట్టి నామరూపాలు లేకుండా పోయింది. అతనుమాత్రం ఏంచేస్తాడు? ఇంటా బయటా అంతా విరోధులే వీరు చాలకుండా, బయటదేశం నుంచి వచ్చిన ఆంగ్లేయులు - ఫ్రెంచివారు కూడా తలనొప్పి తెచ్చారు. ఇక ప్రక్కనే వున్నాడు దామెర్ల వెంకటాద్రి- పక్కలో బల్లెం వలె. ఇదంతా చూసి తట్టుకోగలిగిన శక్తిలేక బ్రతుకు జీవుడా అని మైసూరుకు పారిపోయినాడు. అంతటితో జ్వరం అతన్ని విడిచింది గానీ, యీ ప్రాంతం వారిని పట్టుకొంది.

ఇదే కాలంలో అనగా క్రీ. శ. 1676లో ఆరణి, వేలూరు, జెంజి కోటలు పట్టుకోవడానికి శివాజీ మహారాజుగారు చంద్రగిరి తాలూకాలోని కల్లూరు కనుమగుండా బయలుదేరి వెళ్ళారు. అయిదేళ్ల తరువాత అనగా క్రీ. శ. 1681లో గోల్కొండ మంత్రి అక్కన్నగారు తిరుపతికి వచ్చాడు. పరిస్థితులన్నిటినీ చక్కబరచడానికి.

అచ్యుత దేవరాయల అనంతరము తిరుమల శ్రీవారికి చేయబడిన దానములు - కానుకలు బహుస్వల్పం. వాటిలో ముఖ్యమయినవి :

క్రీ. శ. 1546లో ఓగంపాడి తప్పడ బసవురెడ్డి కుమారుడు గంగు రెడ్డి. తిరుపతిలో భాగంగావున్న 'కొర్లగుంట' గ్రామంలో అర్ధభాగాన్ని తాను అనుభవిస్తూ ఆమేరకు శ్రీవారికి ధనం చెల్లిస్తానని శాసనం వేయించాడు.

పై సంవత్సరములోనే అళియ రామరాయల దాయాదు తిమ్మరాజయ్య అనునతడు శ్రీవారి ఉపయోగార్థము ఆలయానికి వైఋతి దిక్కున ఒక మంటపము కట్టించాడు. అంతేగాక, నాగలాపురం సమీపంలోని పాలమంగళము, పన్నూరు, వెంకటాపురము గ్రామాల ఆదాయాన్ని శ్రీవారికి సమర్పిస్తూ, ఆ పైకాన్ని శ్రీవారి పట్టు పీతాంబరాలకు, ఉత్సవ కాలంలో (పెరటాసి వుత్సవము) యాత్రికులకు ప్రసాదం పెట్టడానికి, దప్పిగొన్న వారికి ఊరి మొగసాలలో మజ్జిగ ఇవ్వడానికి, పల్లవోత్సవము జరపడానికి వాడమన్నాడు. అయితే యీపని చేసినవాడు తిమ్మరాజయ్య తమ్ముడు విఠలరాజు.

ఈ విఠలరాజు తమ్ముడు చిన్నతిమ్మరాజు శాసనంలో తిరుపతి రాజ వీధిలోని తన సౌధానికి పాలు పెరుగుతెచ్చు ఆలకాపరులు శ్రీవారిభాండా రానికి తలా కొంతనేయిదానం చేయాలనిశాసించాడు. అతని అంతఃపురము, అతడు కట్టిచిల్లరవర్తకులకు ఇచ్చిన కొట్టు ప్రక్కనేవుండవచ్చునని, అదే ప్రస్తుతము (గాంధీరోడ్డు) హైరోడ్డు, అని శ్రీ సాధుసుబ్రమణ్యశాస్త్రిగారి అభిప్రాయం.

పైకనబఱచిన విఠలరాజు, చిన్నతిమ్మరాజు ఎవరోకాదు - చంద్రగిరి పాలకులు. వారితోబాటు పావతిమ్మరాజు కూడ ఒకడున్నాడు. తిరుమలలో ఒక మంటపం కట్టించాడు. కల్లూరుగ్రామాన్ని శ్రీవారికి దానమిచ్చినాడు. ఇది రేణిగుంట సమీపంలో - ప్రస్తుతం చక్కెర కర్మాగారంవున్న చోటుకు దగ్గర వుంది. ఇతనిని పప్పుతిమ్మరాజు అనికూడ అంటారు.

చంద్రగిరి దుర్గముమీద ఉప్పుసట్టి - పప్పుసట్టి - అని రెండు కుండము లున్నవి. అందులో పప్పుసట్టి అనేకుండము ఇతని నామాంకితమేమో!

అరవీడు వంశానికి చెందిన రామరాజ కోనేటి రాజకుమారుడు కొండ రాజ అనునతడు, తిరుపతి శ్రీగోవిందరాజస్వామి గుడికి ఇరువైపులానున్న మాడ వీధులలోని ఖాళీస్థలము కొన్నట్టు శాసనాలలోవుంది. ఇతడు శ్రీగోవింద రాజస్వామిగుడికి ఉత్తరంగా అయ్యంగార్ తిరువీధి లేక శ్రీభాష్యకార్ల అగ్ర హారమనబడు స్థలమును కొని అక్కడ నమ్మాళ్వారుకు గుడికట్టి ఆయన నిత్య నైవేద్య పూజాదికములకు గాను పదిగ్రామాల ఆదాయం ఏర్పాటు చేసినాడు. శ్రీరామానుజకూటము సక్రమముగా జరుగుటకుగాను, మిగిలినపైకాన్ని వాడుకో వలసినదిగా శాసించినాడు. ఈ నమ్మాళ్వారు గుడి క్రీ. శ. 2-10-1550 కట్టబడింది. ఈ నమ్మాళ్వారునే శఠగోపాచార్య అని కూడ అంటారు. నెత్తిమీద కేశకిరీటం వుంటుంది. ఇప్పుడు తిరుపతి శ్రీగోవిందరాజస్వామి ఉత్తరమాడవీధిలో ఆ ఆలయం సలక్షణంగా వుంది. ఆలయంచుట్టూ అనేక గదులున్నాయి. ఒకప్పుడవి రామానుజకూట మనబడి శ్రీవైష్ణవ యాత్రికులకు

ఆవాసాలుగ వుండేవి. ఇప్పుడు దేవస్థానం వారి విద్యార్థుల వసతి గృహాలుగ, ఓరియంటల్ కళాశాలగ, పాఠశాలలుగా అటూ ఇటూ మారి, ప్రస్తుతం తి. తి. దే. వారి మ్యూజియంగా మారినది. ఇక నేమిగా మారమన్నదో ?

ఈనమ్మాళ్వారు గుడి, ఇదివరకే ఆపేరుతో కపిలతీర్థం వద్దనున్న గుడికి పోటీగా ఏర్పడింది. అరవీటి కొండరాజు ఇంకా కొన్ని భూములు కొన్నాడు. ప్రస్తుతము గోవిందరాజగుడి దక్షిణమాడవీధిలోనున్న తి. తి. దే. ఉద్యోగుల సంఘ ప్రాంగణము, దాని ప్రక్కన నున్న పెద్ద మంటపము కూడ, శ్రీగోవిందరాజస్వామి ఉత్సవర్ల రాకపోకలకు కట్టబడినవే. అప్పుడా పూల తోటకు ‘ సెల్వనారాయణన్‌పూదోట ’ అనిపేరు.

శ్రీగోవిందరాజస్వామి రథోత్సవము జరువడానికి, మాసి, ఆని, వైఖాసి మాసాల ఉత్సవాలు జరుపడానికి, ఆయన - నగరి, ఎలమంద్యం, రామాపురం గ్రామాలలోని భూముల ఆదాయం శ్రీ గోవిందరాజస్వామికి కేటాయించినాడు.

అరవీటి కొండరాజు, వినుకొండ సీమకు అధిపతిగా వుండేవాడు. శ్రీ గోవిందరాజస్వామికి - ఆళ్వారులకు మొత్తం 31 గ్రామాలు, అరవీటి రామ రాయల ద్వారా సదాశివ రాయలనుంచి, పన్ను లేకుండా సంపాదించగలిగి నాడు. ప్రస్తుతం ఎలమంద్యగ్రామంలో ఆళ్వారుపట్టెడ అనిపిలువబడే భూమి- ఆనాటిదే. పాపానాయుడుపేట సమీపంలోవున్న జీపాళెం జియ్యర్‌లపాళెం. అక్కడ వారి భూములు ఇప్పటికీ ఆపేరుతో వున్నాయి.

క్రీ. శ. 1548లో నంద్యాల నరసింగరాజు కుమారుడు నారప్పరాజు, శ్రీగోవిందరాజస్వామి ఆలయంలో ద్వార పాలకులను ప్రతిష్ఠించి వారి పూజాదికములకు పల్లిపట్టు గ్రామాన్ని దానంగా ఇచ్చాడు.

క్రీ. శ. 13-8-1546లో శ్రీపతి ఓబలేశ్వరుడను వాడు. శ్రీవారికి పేరూరు గ్రామం దానం చేసినాడు.

క్రీ. శ. 13-10-1546లో పొట్ల పాటిరంగరాజను వాడు శ్రీవారికి రాయలచెఱువు గ్రామాన్ని దానం చేయడమే గాక తిరుపతి జియ్యంగారి మఠములో—వానమామలై జియ్యంగారి ముందు, శ్రీ వేంకటేశ్వరస్వామి విగ్రహాన్ని నెలకొల్పినాడు.

ఈ కాలంలోనే బయకర రామప్పయ్య అను సంగీతకారుడు తాను రచించిన "స్వరమేళ కళానిది" అనే గ్రంథాన్ని అళియ రామరాజుకు అంకిత మిచ్చాడు.

ఇదే సమయంలో కుమ్మర పల్లి (రేణిగుంట సమీపం) నివాసుడయిన మూర్తి నాయకుడనువాడు తాను అనుభవిస్తూ వున్న పుదిపట్ల గ్రామాన్ని శ్రీవారికి సమర్పించినాడు.

దీని ప్రక్కనే నున్న పెరుమాళ్ల పల్లి గ్రామం క్రీ. శ. 1535-36లోనే కొందరు పశుపాలకులు చేరి, కొని ఇవ్వగా శ్రీవారికి చేరింది.

శ్రీ పద్మావతి కాలేజికి వెనుక వైపు కొద్ది దూరంలో రామానుజ పల్లి అను గ్రామముంది. అందు ముమ్మడి రెడ్డి కుమారుడు పోలిరెడ్డి ఇంకా తదితరుల పేర సెవ్వ నాయకుడనువాడు శ్రీ గోవిందరాజస్వామి ఉత్సవర్లు పారువేటకు పోయినప్పుడు ప్రసాదాలు ఏర్పాటు చేసినాడు. దీనిని బట్టి పోలిరెడ్డి అను వాడు ఆ ప్రాంతీయనాయకుడేమో ననిపిస్తోంది. ఈశాసనం క్రీ. శ. 1-1-1548 నాటిది.

కపిలతీర్థం—కపిలేశ్వర ఆలయంలో పిడుగుపడి ప్రాకారాలు—వంటశాల దెబ్బ తినగా దానిని తిరిగి కట్టడానికి క్రీ. శ. 30-1-1563 శ్రీగోవిందరాజస్వామి ఆలయంలో వున్న "సెవ్వసాని" అను ఆమె డబ్బు వాడుకోవలసిందిగా రాచవీడు నాయకుడనుమతించినట్టు ఒక శాసనంలో వుంది.

ఈ కాలంలోనే యాత్రీకుల నీటి సౌకర్యం కోసం - 'తన్నీరు పందల్' అను మంచినీటి చలి మందిరాలు కొండక్రింద కరకంబాడికి ఎగువనున్న మంగళం గ్రామంలో - తిరుపతి గోవిందరాజ ఉత్తర మాడ వీధిలో - తిరుమలలో

అనేకచోట్ల వెలిసినట్లు శాసనాలవల్ల తెలుస్తోంది. ఆకాలంలో తిరుపతికి, తూర్పు వైపు నుంచి వచ్చేవారు రేణిగుంట, కరకంబాడి, చెన్నయ్యగుంట, మంగళం, అక్కారాంపల్లి మీదుగా కొండక్రిందనే వచ్చి కపిలతీర్థంలో స్నానంచేసి దర్శనం చేసుకొని తదుపరి తిరుమలకు వచ్చేవారు. ఆదారి ఇప్పుడు కూడా వుంది గానీ, అటువైపు యాత్రీకులెవరూ రారు.

నొట్టకర్కర వెంకటయ్యన్ అనే బ్రాహ్మణుడు దానయ అచ్యుతాపురం నివాసి. అతడు శ్రీవారికి రజత శేషవాహనం - సింహవాహనం చేయించి, ఏ యే సందర్భాలలో ఏ యే దేవుళ్లు యీ వాహనాల మీద వూరేగింపు వెళ్లాలో- వారికి ఏ యే మంటపాల్లో ఏలాంటి నైవేద్యాలు ఇవ్వాలో నియమం చేసి, ఆఖర్చులకు గాను, తాను స్వయంగా త్రవ్వించిన పంట కాలువల క్రింద, నల్లమానికాల్వ, నడవలూరు గ్రామాలలో పండే పంటలను మతింపువేసి శ్రీవారికి సమర్పించినాడు. ఈ సందర్భంగా పూజలు పొందవలసిన దేవుళ్ల జాబితాలో *సేనాధిపతిని, హనుమంతున్ని, సుగ్రీవున్ని, అంగదున్ని కూడా మరచి పోకుండా చెక్కించాడు శాసనంలో. ఈశాసనం క్రీ. శ. 4-11-1614 నాటిది.

తిరుపతి బేరివీధిలో క్రీ. శ. 19-4-1596 లో శిలాంబిడిదయార్ అను రామాపురం బేరిశెట్టి, శ్రీవరదరాజస్వామిని, నాచ్చియార్ అమ్మను, తిరుకర్కచ్చి నంబిని ప్రతిష్టించి, సువర్ణముఖీ తీరంలో రామాపురం గ్రామంలో నున్న కసింకాల్వ భూములను వారికి మాన్యంగా సమర్పించినాడు.

ఈకాలంలో శేరులకు బదులు - [illegible]ణికలు, కుంచాలు మొదలగు ధాన్యం కొలిచే కొలతలు వున్నట్లు తెలుస్తోంది.

---

*ఈ నాలుగు పంచలోహ విగ్రహాలు శ్రీవారి ఆలయంలో రామార్ మేడై అను చోట స్నపన మంటపములో అరుగు మీద వున్నాయి శ్రీవారి దర్శనం చేసుకొనేవారికి, వీరు ముందుగానే దర్శనమిస్తారు.

ఇక చివరివాడు - అయినా దొడ్డవాడు మట్లకుమార అనంతరాయలు. వీరి ఇంటి పేరును "మట్లి" అనికూడా పిలుస్తారు. ఇతనికి, శ్రీకృష్ణదేవ రాయల రెండవ కుమార్తె కృష్ణమాంబను వివాహమాడి - కృష్ణరాయల అల్లుడయిన - మట్ల వరదరాజు, పినతండ్రి అవుతాడు (ఈవిషయం రామరాజీయ మను గ్రంథంలోవుంది.)

ఇతని తండ్రి తిరువేంగళనాథరాజు. తల్లి చెన్నమాంబ. తాత 'కాకుత్స విజయ'మను గ్రంథమును వ్రాసిన మట్ల అనంతరాజు. ఇతనిది రాయచోటికి చెందిన దేవచోడ కుటుంబము. భానువంశము. కడపజిల్లా రాజంపేట సమీపంలోనున్న 'అనంతరాజుపేట' ఇతని రాజధాని. ఇతని రాజ్యమునకు 'మట్లవారిసీమ' అనిపేరు. ఇది పూర్వపు పొత్తపినాడు.

ఇదివరకే చదివినట్లు, తిరుపతిలో ఇతని నిర్మాణాలు - శ్రీగోవింద రాజస్వామి రాజగోపురం. అలిపిరికి ఎగువనున్న కొత్తగోపురం. కొండచివర (ప్రస్తుతము విద్యుద్దీపాల నామమున్న) గాలిగోపురం. తిరుమలపోవు, పాదయాత్రికులు ఈగోపురాలలో ప్రవేశించే ప్రయాణం చేస్తారు.

గోవిందరాజస్వామి రాజగోపురము - ప్రవేశద్వారములో ఉత్తర వైపు రాతిగోడమీద, శ్రీవేంకటేశ్వరస్వామి ప్రతిమ — ఆయనకుమ్రొక్కుతూ చేతులు జోడించి వున్న కుమార అనంతరాజు తల్లి దండ్రుల బొమ్మలు పేర్లతో సహా చెక్కబడివున్నాయి. దక్షిణపు రాతిగోడమీద కుమార అనంతరాజు తనముగ్గురు రాణులతో చేతులు జోడించి నిలబడినట్టు చెక్కబడివుంది. అలిపిరిలోని కొత్త గోపురం మీద కూడ ఇలాంటి బొమ్మలు చెక్కబడివుండడమేగాక, తెలుగు తమిళంలో గోపుర నిర్మాణాన్ని గురించి శాసనముంది. కొత్తగోపురానికి దిగువన, ఒక మొండి గోపురముంది. ఇది - పిడుగు పడడంతో చీలిపోయి, చీలిపోయినా పడిపోకుండా అలాగే నిలబడివుండగా, తరువాత తి. తి. దే. వారు బాగుచేశారు. ఈగోపురంమూసి వేయబడివుంది. దారి ఇరుప్రక్కలా సోపానాలతో నిర్మాణమైవుంది. ఇది - అసలు అలిపిరి

అంటే! మునుపు అంత్యజులకు కొండమీద ప్రవేశం వుండేదికాదు. వారు శ్రీవారిని ఇక్కడనుంచి ప్రార్థించేవారు. దానికి ఆలంబనగా ఇచ్చటి చిన్న పూజామందిరం వెలిసింది.

* * * *

శ్రావణ శనివారాలు ఉపవాస ముండి, పిండి తళిగలు వేస్తారు. ఆపిండిమీద శ్రీవేంకటేశ్వరస్వామి పాదముద్ర వేస్తారు. అందరి ఇండ్లలో కాదు. తొండమండలములో ఉత్తరపుకొన శ్రీకాళహస్తి - అగ్రహారప్రాంత ములో ఒక హరిజనుని ఇంట — అదేవిధంగా దక్షిణము కాంచీపుర ప్రాంత ములో ఒక హరిజనునిఇంట. ఉత్తరంగా కుడిపాదం - దక్షిణంగా ఎడమ పాదం ముద్రలు పడతాయి. ఆపాదముద్రలను కొలతలువేసి శ్రీవారికి చర్మంతో చెప్పులు కుట్టుతారు. దానికి కుచ్చులు కుళ్ళాయిలు అన్నీపెట్టి అందంగా తయారుచేస్తారు. కాళహస్తి నుంచి ఒకడు - కంచివైపునుంచి ఒకడు కుడి, ఎడమ కాలి శ్రీవారి చెప్పులను నెత్తిన బెట్టుకొని, ఊరూర భిక్షమెత్తు కుంటూ వచ్చి అలిపిరిలో పూజచేసి ఆపాదరక్షలను ఆపూజామందిరంలో పెడతారు ఆశ్చర్యం - ఒక్కొక్కచెప్పు ఒకడికి తెలియకుండా మరొకడు కుట్టినా - కొలతలు తీసి ఒకడేకుట్టినట్టు సరిగ్గా జోడు సరిపోతాయి. అంటే నిజంగానే స్వామిపాదాలు అక్కడ ముద్రలు వేశాయన్నమాట. ఇది సంవత్సరానికి ఒక పర్యాయం జరుగుతుంది. ఈలోగా ఇక్కడ పెట్టిన పాత చెప్పులు - రోజూవేసుకుంటు న్నట్టుగా అరిగిపోతాయి. వేంకటేశ్వరస్వామిపాదాలు ప్రఖ్యాతిగాంచినవే! వాటిసైజు అందరికీ తెలిసిందే మరి ఆచెప్పులు ఎలా అరిగిపోతాయి? శ్రీస్వామి వారు, తనభక్తుల విశ్వాసం పరిరక్షించడానికి వాటిని వేసుకొని నడచి, అరిగి పోయేలా చేస్తారేమో!

స్వామివారి పాదరక్షలు తెచ్చేహరిజనులు ఇప్పుడు తెస్తున్నారో లేదో తెలియదు. వారికి ఆలయంలో ప్రవేశం కల్పించాక చెప్పుల సంగతి మరచి పోయారో ఏమో? ఆచారాన్ని కాలదన్నడం మంచిదికాదు - ఎవరి కయినా!

వేంకటేశ్వరస్వామి పాదాలు ప్రత్యక్షం కావడం — ఇప్పుడు వృద్ధులయినవారంతా ఎరిగివున్న విషయమే. చంద్రగిరి కాలిదారి వెంట - తిరుపతి కాలిదారి వెంట, తిరుమలనుంచి పాపవినాశం సోపాన మార్గములో అక్కడక్కడా యీ పాదముద్రలు శిల్పించబడి వున్నాయి. ఆయాప్రదేశాలలో పూర్వము స్వామివారి పాదముద్రలు పడడం వల్ల ఆచోటును మరచి పోకుండుటకై అప్పటివారు స్వామి వారి పాదాలను శిల్పించి అక్కడ ప్రతిష్ఠించారు. క్రీ.శ. 1900 ప్రాంతంలో ఇదివరకు 'తన్నీర్ పందల్' అను చలిమందిరము పెట్టబడిన 'మంగళం' గ్రామంలో స్వామివారి పాదాల ముద్రలు - మట్టిరోడ్డు మీదే పడినాయి. తెల్లవారు ఝామున కరకంబాడి గ్రామమునుంచి తిరుపతికి ఒకడు ఆవును తోలుకొని వస్తుండగా - అక్కడి కొచ్చిన ఆవు అవతల అడుగు వేయకుండా మొండికెత్తింది. తీరా తెల్లవారి చూస్తే అక్కడ స్వామి పాదాల ముద్రలు పడివున్నాయి. ఆ రాత్రి ఆ గ్రామంలో వీధినాటకం జరిగింది. నాటకాంతమున — వారు నటిస్తున్న పందిరి భూకంపం వచ్చినట్టు గడగడలాడింది. తెల్లవారుతూనే తెలిసిన విషయమిది. అక్కడున్న అన్ని గ్రామాల ప్రజలు స్వామి పాదముద్రలు చూడడానికి, పాదరజమును నోట్లో వేసుకోవడానికి ఎగబడి దాదాపు రెండు అంగుళాలలోతు, రెండడుగులకు పైగా పొడవున్న స్వామి పాదాలను రూపులేకుండా చేశారు. అయినా వాటిని దర్శించిన వారు ఇప్పటికీ జీవించి వున్నారు. ఆ గుర్తుగా అక్కడ స్వామి పాదాల ప్రతిష్ఠ జరిగింది. దాని చుట్టూ యీగ్రంథ రచయిత వేదిక నొకదానిని 1959లో నిర్మించాడు.

రేణిగుంట నుంచి తిరుపతికి వచ్చేటప్పుడు కొండమీద చూస్తే అక్కడక్కడా చిన్నగోతులు గోచరమవుతాయి. అవి స్వామి వారి అంగలుగ అక్కడి పల్లె ప్రజలు వాటిని పవిత్రంగా చూస్తారు

* * *

అలిపిరిలోని యీ పడాల (పాదాల) మంటపంలో చాలమంది శ్రీవారిని సాగిలబడి మ్రొక్కుతున్నట్టుగా శిల్పాలు చెక్కబడివున్నాయి. ఇవి అప్పట్లో తిరుమలకు రాలేని హరిజనులవి కావచ్చు. లేదా శరణాగతి నొందిన ఇతర వైష్ణవులవీ కావచ్చు. క్రీ. శ. 1623 నాటి కులాల్ తమ్మయ్య శరణాగతి శాసనం అలాంటిదే!

ఈ మొండి గోపురానికి ప్రక్కన తాను కట్టించిన మంటపాలలో క్రీ. శ. 1628లో మట్ల కుమార అనంతరాజు రెండు సీసమాలిక పద్యాలలో ఒక శాసనం వేయించాడు.

ఇవి మంటపముల లోతట్టు, తూర్పువైపు పడమరవైపు వున్నాయి. తమిళం-కన్నడంతో బాటు తెలుగులో శాసనాలు చెక్కించడం శ్రీకృష్ణదేవ

రాయలకాలంనుంచే ప్రారంభమయింది. ఈ శాసన పాఠం మరొక చోట వుదహరించబడింది. ఈ ప్రాంతంలో యీ శాసన కాలంనాటికి తెలుగు ముఖ్య భాషగా పరిగణనలోనికి ఎచ్చింది.

క్రీ. శ. 1681-1710 సంవత్సరాల మధ్య యీ ప్రాంతం కుతుబ్ షాహి రాజులపాలనలో నుండగా, మొగలాయి చక్రవర్తి షాజహాన్ కుమారుడు-ఔరంగజేబు రాజ్యానికి వచ్చాడు. అతడు కుతుబ్‌షాహి రాజులను ఓడించడంతో వారి రాజ్యంతో పాటు, యీ ప్రాంతం కూడ మొగలాయి సామ్రాజ్యంలో కలిసిపోయింది. ఈ మార్పులన్నీ చూసి ప్రజలకు కళ్లుతిరిగి పోయాయి. ఎందుకయినా మంచిదని చాలమంది బ్రిటీషువారు పాలిస్తున్న ప్రాంతాలకు వెళ్లిపోయారు.

ఢిల్లీ చక్రవర్తులు యీ ప్రాంతాన్ని కర్ణాటక 'నవాబి'గా నిర్ణయించి దీనికొక నవాబును నియమించారు. క్రీ. శ. 1710 లో సదాతుల్లాఖాన్ నవాబయినాడు. ఇతని సలహాదారుడే తోడరుమల్లు. ఇతని తల్లీ, భార్యల విగ్రహాలు శ్రీవారి ఆలయంలో వున్నవి.

క్రీ. శ. 1724 లో దక్కనులోని మొగల్ సుబేదారుడొకడు స్వతంత్రుడై కర్ణాటక నవాబి కూడా తనదేనన్నాడు. అనడమే కాదు క్రీ. శ. 1733 లో తన స్వంత నవాబు 'దోస్త్ ఆలీ'ని నియమించాడు.

క్రీ. శ. 1740 లో మహారాష్ట్ర యోధుడు రాఘోజీ, యీ ప్రాంతం మీద దండెత్తి, దామలచెఱువులో తనను ఎదుర్కొన్న నవాబు దోస్త్ ఆలీని చంపాడు. చంపడమేకాదు యీ ప్రాంతంలో దొరికినదంతా దోచుకున్నాడు. ఈ సమయంలోనే మరాఠాపీష్వా బాజీరావు, తనతల్లిని, భార్యను శ్రీవారి

దోస్త్ ఆలీ మరణంతో - సఫ్దర్ ఆలీ నవాబయినాడు. శ్రీ వారి ఆలయం నుంచి *50 వేల రూపాయిలు మరాఠులకిచ్చి వారి పీడ వదిలించుకున్నాడు. దీనివల్ల రెండులాభాలు మనకు కలిగాయి. ఒకటి - అప్పుడు తీసుకొనిపోయిన డబ్బును వడ్డీతోనహా యీ మరాఠులు ప్రతి శ్రీ వారి బ్రహ్మోత్సవ సమయంలో ఇక్కడకు వచ్చి స్థలం దొరకక్క ప్రతి గుడిసెను కూడ బాడుగకు తీసుకొని చెల్లిస్తున్నారు. రెండవలాభం. వారికి శ్రీవారిపట్ల భక్తి ఎక్కువయి రాకపోకలు ఆ నాటినుంచే ప్రారంభమయినాయి.

క్రీ. శ. 1744లో అన్వరుద్దీన్ నవాబయినాడు. ఇంతలోనే ప్రాంతీయ అధికారి - హైదరాబాదు నిజాము, ప్రాంత అధికారి - అన్వరుద్దీన్. ఇద్దరూ మాట్లాడుకొన్నట్లు చనిపోయారు. ఇక అధికారానికి పెనుగులాట ప్రారంభ మయింది. వీరికే కాదు. ఇంగ్లాండు ఫ్రాన్సులమధ్య కూడా యుద్ధం ప్రారంభ మయింది. వారే పోట్లాడలేదు. మనదేశంలో నున్న బ్రిటీషు - ఫ్రెంచి వల నల వారుకూడ పోట్లాట ప్రారంభం చేసినారు.

చనిపోయిన అన్వరుద్దీన్ కుమారుడు మహమ్మదాలి ఆంగ్లేయులు తనను నవాబుగ చేసినందుకు కృతజ్ఞతగా శ్రీవారి హుండీ నుంచి వారికి రెండు లక్షల రూపాయలు కానుకగా ఇచ్చాడు. ఈ కానుకను పుచ్చుకొన్న కంపెనీ అధికారి 'క్లైవు' డబ్బు చేతిలో పడేదాక ఆర్కాటులోనే కూర్చు న్నాడు. ఆంగ్లేయులు రెండు లక్షలు పుచ్చుకుంటే పుచ్చుకున్నారు గానీ, తిరిగి 1947లో దేశం వదలి పోయేంత వరకు శ్రీవారి ఆలయాన్ని కంటికి రెప్పవలె కాపాడి తమ ఋణం తీర్చుకొన్నారు.

నిజాం దత్త మండలాల క్రింద యీ ప్రాంతం ఆదాయాలు క్రీ. శ. 1750లో ఆంగ్లేయుల వశమయ్యాయి.

---

*ఈపైకం 1 కోటిరూపాయలని, అది శ్రీవారి 1 సంవత్సర ఆదాయమని శ్రీ టి. కె. టి. వీరరాఘవాచార్యులవారి అభిప్రాయం. రాఘోజీవారు తిరుమల శ్రీవారికి కొన్ని విలువైన నగలు ఇచ్చారు. అవి ఈనాటికీ వున్నాయి.

క్రీ. శ. 1753లో నెల్లూరు వైపు నుంచి మహమ్మద్ కమాల్ అను సాహసికుడు తిరుపతి ప్రాంతాన్ని కొల్లగొట్టడం ప్రారంభం చేయగా-కంపెనీ సేనలు వాడిని పట్టుకొని ఉరితీశారు. మిగిలినవారు పలాయనం చిత్తగించారు.

క్రీ. శ. 1757లో "నజీబుల్లా" అను నవాబు సోదరుడొకడు చంద్రగిరికి వచ్చి, అక్కడ తిష్ట వేసి కొండమీద నుంచి డబ్బు తెమ్మన్నాడు. అబ్దుల్ వహాబ్ అను ఇంకో సోదరుడు అన్నగారి అడుగుజాడల్లో నడుస్తూ, డబ్బు తెమ్మన్నాడు. ఆంగ్లేయులకు దత్తం చేసిన డబ్బు వీరికెలా వస్తుంది? అందువల్ల కంపెనీ సేనలు వీరిమీద కొచ్చేసరికి, వీరు పారిపోతూ దారిలో దొరికిన యాత్రీకులను దోచుకొని పోయారు. ఈనాడు కూడా యాత్రీకులు - బయలుదేరిన చోటునుంచి తిరిగి స్వస్థలం చేరేవరకు ఎంతమంది దోపిడికి గురవుతారో? - అయితే ఇది కొంచెం నాజూకయిన దోపిడి. కావున ఆ పేరుతో పిలువబడదు.

క్రీ. శ. 1758లో హైదరాబాదు నుంచి పుదుచ్చేరికి తిరిగిపోతున్న బుస్సీ - పై యిద్దరు అన్నదమ్ముల సహాయంతో - (నెల్లూరు నజీబుల్లా - చంద్రగిరి అబ్దుల్ వహాబ్) శ్రీవారి ఆలయం నుంచి ఒక సంవత్సర ఆదాయం కాజేసి ముగ్గురూ పంచుకొని మూడువైపులా పోయారు.

మహారాష్ట్ర యోధులు గోపాలరావు, నారాయణరావు తిరుమల దోపిడికి వచ్చారు. గోపాలరావు అర్జంటుగా తిరిగి పోవలసి వచ్చి నారాయణరావును కరకంబాడిలో వుంచి వెళ్ళాడు. నారాయణరావు అక్కడి పాలేగారు సహాయంతో తిరుమలకు వెళ్ళి అక్కడ తిష్ట వేశాడు. కంపెనీ సేనలు రెండు సార్లు పోరాడినా అతడు లొంగలేదు. చివరకు అతడు విడిది చేసిన కరకంబాడి గ్రామానికి నిప్పు పెట్టితే విధిలేక తిరిగి వచ్చాడు. ఇది క్రీ. శ. 1759 జూలైలో జరిగింది.

కాళహస్తి, కార్వేటినగరం, వెంకటగిరి జమిందారులు కూడా తమకు డబ్బు అవసరమయినప్పుడు యాత్రీకులను దోచుకొనేవారు. అప్పట్లో శ్రీవారి

ఆలయమును ఆంగ్లేయులు ఒక సంవత్సరానికి కోటి రూపాయలు గుత్త కిచ్చి నట్లు తెలుస్తోంది.

క్రీ. శ. 1759 - 1801 మధ్యకాలం, మైసూరు యుద్ధాలు జరిగాయి. మైసూరు మహారాజులను మోసగించి వారి సేనాధిపతి హైదరాలీ అధికారం చెలాయించసాగాడు. పులికాట్‌నుంచి పాండిచ్చేరివరకు - వేలూరుచుట్టూ పది మైళ్ళదూరం మారణహోమం చేశాడు హైదర్. అతనిని ఎదుర్కోవడం కంపెనీ సేనలకు, హైదరాబాదు నిజాముకు గగనమయింది. 1781 లో షోలింగర్‌వద్ద యుద్ధం జరిగింది. 1780 - 81 వేలూరుకోట ముట్టడి జరిగింది. ఈ మధ్యకాలంలో హైదరు దామలచెఱువు - కల్లూరు కనుమ వద్ద తిష్టవేసి ఆదారిగుండా ఆంగ్లేయులకు పోవు ఆహారధాన్యాలను పోనీయకుండా చేసినాడు. అతనికి కాళహస్తి, కార్వేటినగరం జమీందారులు - జిల్లాలోని పాలేగార్లు అందరూ సహాయపడినారు.

క్రీ. శ. 1782లో హైదరాలీ చంద్రగిరి కోటను ముట్టడించినాడు. నవాబు అబ్దుల్ వహాబ్‌ను బందీగా పట్టుకొని శ్రీరంగపట్నం పంపించాడు. ఆ ప్రాంతంలోనున్న తిమ్మాపురం ఆలయం కొల్లగొట్టి, శ్రీనివాసమంగాపురం లోని ఆలయం దోచుకున్నాడు కానీ, తిరుమల కొండమీద శ్రీవారి ఆశ వదలుకున్నాడు.

అందుకు కారణం - ఆతని హిందూమంత్రి చెప్పాడట - తిరుమలమీద నున్నది శ్రీవరాహస్వామివారి గుడి అని. "హిందువుల దేవుడు సువ్వర్, చస్తేకూడా నేను కొండమీద అడుగుబెట్టి ఆ సువ్వర్‌ను చూడన"ని శపథం చేసి చక్కాపోయాడు. పాపం! ఎంతవరకు పోయాడు - చిత్తూరు దగ్గరున్న నరసింగరాయనిపేట వద్ద వ్రణ సన్నిపాతము వలన 7-12-1782 న మరణించాడు. అచ్చట అతనికి గోరీ కట్టబడివుంది.

శ్రీనివాసమంగాపురంలోనూ, తొండవాడ (తిమ్మాపురం) - తిమ్మప్ప దేవాలయములోనూ వున్నది - ఇద్దరూ శ్రీవేంకటేశ్వరస్వాములే! ఆ దేవాలయా

లను కొల్లగొట్టిన లేదా కొల్లగొట్టుటకు అనుమతించిన పాపం - ప్రణసన్నిపాతం కంటే ఎక్కువగా పనిచేసి హైదరాలీని చిత్తూరుసీమ దాటనివ్వలేదు. ఇక్కడ హైదరాలీ పోయాడు. అక్కడ మైసూరులో అతని కుమారుడు టిప్పుసుల్తాన్ కంపెనీసేనలకు ఓడినాడు. క్రీ. శ. 1801 నాటికి కర్ణాటకము పూర్తిగా ఆంగ్లేయుల వశమయినది.

ఈ ప్రాంతంలో శాంతిభద్రతలు నెలకొల్పాలని ఆంగ్లేయులు ప్రయత్నించినారు. అందుకు చంద్రగిరి నవాబు అడ్డుపడినాడు. అతనికి కొంత పైకము ముట్టజెప్పి (అంటే పెన్షనుమీద) అతనిని తరిమివేసి క్రీ. శ. 1801 యీ ప్రాంత పరిపాలనను తామే స్వయంగా చేతికి తీసుకున్నారు. దీనితో యీ ప్రాంతం ఉత్తర ఆర్కాట్ జిల్లా పరిధిలోకి వచ్చింది.

ఈ ప్రాంతములోని జమిాందారులు పాలేగార్లు తిరుపతికివచ్చు యాత్రీకులను నిర్దాక్షిణ్యంగా దోచుకోసాగారు. వారి ఆటలు కట్టించడానికి కంపెనీవారు వారిని అడవుల్లోకి తరిమినారు. అయినా వారు తమ దోపిడీని మానుకోలేదు. చివరకు 'మార్షల్‌లా' పెట్టి, దారిలో అక్కడక్కడా సైన్యాలను కాపలా పెట్టి యాత్రీకులను కాపాడినారు ఆంగ్లేయులు.

హిందూదేవాలయాల యాజమాన్యం ఇష్టంలేని ఆంగ్లేయులు, తి.తి.దే. ఆలయాల పాలనను క్రీ. శ. 1843లో మహంతుల కప్పగించారు. చివరకు 1933 లో మద్రాను ప్రభుత్వము వారి ఉత్తర్వుతో దేవస్థానం బోర్డు ఏర్పడి అప్పటినుంచీ పరిపాలన బోర్డు సభ్యుల హస్తగతమైంది. 1911 లో చిత్తూరు జిల్లా ఏర్పడింది. అప్పుడీప్రాంతం చిత్తూరుజిల్లా - చంద్రగిరితాలూకా పరిధిలోకి వచ్చింది. 1953 లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. అప్పుడొక క్రొత్త హిందూదేవాదాయ ధర్మాదాయ చట్టం అమలులోకి వచ్చింది. 1979 లో ఒక ఆర్డినెన్సు ద్వారా పాలన సంస్కరింపబడింది.



ప్రతి బుధవారము సహస్రకలశాభిషేకము చేయుచుంటున్న భోగశ్రీనివాసమూర్తి.
క్రీ. శ. 966 లో పల్లవరాణి శమావై (కడవన్ పెరుందేవి) బహూకరణ.
(26-27 పేజీలు చూడుము.)



ఏడుపర్యాయములు బంగారుతొడుగులు తొడిగిన ఏడుకొండలవాని ఆనందనిలయ విమానం.
(54–55 పేజీలు చూడుము,)

# చంద్రగిరి

ప్రాంతీయంగా లభ్యమయిన పాండవ గుళ్ళవల్ల ఇచ్చట నవీన శిలా యుగము నుంచి మానవ నివాసమున్నదని ఇదివరకే తెలిసి కొంటిమి. సత్యవేడు నుంచి తిరుమల కొండలవరకు యీ ప్రాంతము షడారణ్యము అని కొందరి అభిప్రాయము. ఆర్కాటు అను ద్రవిడ పదమునకు సంస్కృత రూపమే షడారణ్యము. ఈ ప్రాంతమున ఆరు గొప్ప అడవులుండుట వలననే ఆరు + కాడు = ఆర్కాడు అను పేరు వచ్చినదని చారిత్రకుల అభిప్రాయము. ఇది మొదట కురుంబులను ఆటవిక జాతుల ఆవాసం. తదుపరి వీరిని అందొండై అను చోళచక్రవర్తి జయించెనని తమిళ పూర్వగాథలలో నున్నది. టాలమీ, ప్లినీ మొదలగువారి వ్రాతలను బట్టి యీ ప్రాంతమున క్రీ. శ. 1వ శతాబ్దమునాటికే జనావాసములున్నవని తెలియుచున్నది.

అయినా మొదటి 10 శతాబ్దములు యీ ప్రాంత చరిత్ర కానరాదు. పురాణాలలో సువర్ణముఖరీ నది ప్రస్తావన వున్నది గానీ, చంద్రగిరి పేరు కనబడదు. సువర్ణముఖరీ పురాణములో - కనబడు చంద్రనగము. హేమనగము అను కొండలలో - హేమనగమును ఒరసుకొని ప్రవహించడం వల్ల ఆ నది సువర్ణముఖి అయితే, చంద్రనగమును ఆనుకొని ఊరు ఏర్పడడం వల్ల - ఆ జనావాసము చంద్రగిరి అయినది.

కార్వేటినగరాదీశ్వరుడు ఇమ్మడి నరసింహ యాదవరాయలకు, ఇదివరకే నారాయణవరం రాజధానిగా వుంది గానీ, దానివల్ల అతనికి తృప్తి కలుగలేదు. కారణం - అక్కడ దృఢమైన కోటలేక పోవడమే. ఆ చింతతో, తిరుమలచేరి, శ్రీవారి దర్శనము చేసికొని బయటి కొచ్చాడు. అతని ఎఱ్ఱని తలపాగా చూసింది ఒక గ్రద్ద. అలాగే తన్నుకపోయి చంద్రగిరి కొండ మీద పెట్టింది. గ్రద్ద పోయిన దిక్కుకు పరుగెత్తిన భటులు సాయంకాలానికి తలపాగా తెచ్చి ఇచ్చారు. ఇదేదో దైవాదేశంగా వుందని యాదవరాయలు

ఆ ప్రాంతాన్ని స్వయముగా పరిశీలించి, అచ్చట శత్రు దుర్భేధ్యమయిన కోటను క్రీ. శ. 1000 న నిర్మించాడు. ఇది చంద్రగిరికోట పుట్టుక. దీనితో రాజుగారికి చింతదీరింది. కార్వేటినగరం వుంది. నారాయణవరం వుంది. కానీ, సురక్షితమయినది చంద్రగిరి మాత్రమే!

పల్లవులు, చోళులు, యాదవులు, విజయనగర చక్రవర్తులు, నిజాములు, మొగలు చక్రవర్తులు — ఆర్కాటు నవాబులు — ఆంగ్లేయులు ఇంతమంది రాజులు మారినా, కోట మాత్రం అన్నిటకీ సాక్షీభూతమై అక్కడే వుంది. లేదంటే కొన్నిచోట్ల శిథిలమయింది. ఎంతమంది రాజుల్ని, రాణుల్ని, అధికారుల్ని చూసిందో ఆ కోట! ఎన్ని సంప్రదాయాలను తనలో జీర్ణించు కొన్నదో!

ఈ కొండను చుట్టి సువర్ణముఖి ప్రవహిస్తుంది. కోటలోపల ఆనాటి అవశేషాలు ఎన్నో వున్నాయి. చిన్నవి, పెద్దవి అనేక సైజుల గుడులున్నాయి. కోటలోపల ఆనాడు వెలసిన పట్టణ ప్రజల దర్శనార్థము ఆ చిన్న గుడులు వెలసి వుంటాయి. అయితే ఎక్కువ భాగం మట్టి గోడలు. కొన్ని కూలి పోయాయి. కొన్ని ఇంకా నిలబడే వున్నాయి. అన్నిటికంటే పెద్ద కట్ట డాలు — రెండు మాత్రం. అవి రాజా మహల్ — తరువాత రాణీ మహల్. అని పిలువబడు గుఱ్ఱపుశాలో లేక ఏనుగుశాలో! ఈ కట్టడాలు శిథిలం కాకుండ సురక్షితంగా వున్నాయి. వీటిని సాళువవంశ రాజులు కట్టినట్టు విశ్వసింప బడుతున్నది. కోటలోపల పెద్ద కొలను వుంది. తామరపుష్పాలు, ఆకులు నీటిమీద తళతళ లాడుతూంటాయి. అది ఎప్పుడూ ఎండిపోయి నట్టు గుర్తులేదు. కోట లోపలికంతా కాలువల ద్వారా, ఆ కొలను నుంచి ఆ కాలంలో నీటి సరఫరా జరిగేది. రాజామహల్, రాణిమహల్ అని పిలువబడుతున్న సుందర హర్మ్యాలు ఇటుక, సున్నం రాయితో మాత్రమే నిర్మింపబడినాయి. ఎక్కడా కఱ్ఱ వుపయోగింపబడలేదు. రాజామహల్‌లో ఒక దర్బారు హాలు వుంది. ఆ దర్బారు హాలులోనే ఆంగ్లేయులకు చెన్నపట్టణంలో కోట కట్టుకోవ డానికి అనుమతి ఇవ్వబడిందని అందరి అభిప్రాయం. ఇది హంపీలోని పద్మ

మహల్ ఆకారంలో వుంటుంది గాన దీనిని కొందరు పద్మమహల్ అని కూడ పిలుస్తారు. ఇది మూడు శిఖరాలతో ఒప్పు మూడంతస్థుల భవనం. మూడు విభాగాలుగా కనిపిస్తుంది. దీని పొడవు 160 అడుగులు. వెడల్పు 50 అడుగులు. ఎత్తు 95 అడుగులు. చిత్తూరు రోడ్డునుంచి చీలిన ఒక కంకరదారి, కోటలోంచి ఈ మహల్ ప్రక్కనే పడమటి దిక్కుగా పోయి, పడమటి కోట ద్వారాలు దాటి తిరిగీ అదే హైరోడ్‌లో కలుస్తుంది.

రాణిమహల్ ప్రక్కగా కొండమీది దుర్గానికి సోపాన మార్గముంది. ఈ దుర్గం మహాలుల మట్టంనుంచి 600 అడుగుల ఎత్తు వుంటుంది. ఈ దారిలో కూడ అక్కడక్కడ శిథిలాలు కనిపిస్తాయి. శిథిలమయిన కొన్ని భవనాల - కోటగోడల అవశేషాలు మనకు విషాదం కలిగిస్తాయి.

దుర్గం అనబడునది విశాలమయిన ఒక నున్నటి బండ. దాని అంచులు చుట్టూ నునుపుగా వుండి ఎవరైనా పొరబాటున అక్కడ అడుగు బెడితే క్రింద పడిపోతారు. దానిమీద ఒక నీటి కుండముంది. అది రెండు భాగాలుగ సహజంగ ఏర్పడింది. ఒకవైపున్న నీటిని ఉప్పు సట్టి అంటారు. ఇంకోవైపున్న నీటిని పప్పు సట్టి అంటారు. ఉప్పు సట్టిలో నీరు వుప్పగాను, పప్పు సట్టిలో నీరు చప్పగాను వుంటుంది. అక్కడెవరయినా తలదాచుకోవాలంటే అందు కనువుగా మంటపాలున్నాయి. పశ్చిమ దిక్కున ఎప్పుడో పడిన ఒక పిడుగు అంత పెద్ద కొండ కొమ్మను రెండుగా చీల్చింది. ఆ చీలిక ఎంత లోతుందో తెలియదు. కొండ క్రింద ఒక బావిలోని నీరు తీయగా వుంటుంది.

కోటలోపల ప్రస్తుతం చిన్న గ్రామముంది. ఆ గ్రామాన్ని "కోట" అను పేరుతోనే పిలుస్తారు. కోట బయట రెండుపేటలున్నాయి. పాత వాడను పాతపేట అని, క్రొత్తగా ఏర్పడిన వాడను కొత్తపేట అని పిలుస్తారు.

చంద్రగిరి పట్టణం తాలూకా కేంద్రం. పంచాయితీ సమితి కేంద్రం. అన్నిటికీ మించి ఒక రెవెన్యూ డివిజను కేంద్రం. తిరుపతి పట్టణం యీ తాలూకాకు చెందినదే.

రాజుల పరిపాలనలో చంద్రగిరి పట్టణము చాల విశాలంగా, ఇప్పటి నగరాలు విస్తృతంగా ఏర్పడి వున్నట్టు, వ్యాపించి వుండేది. పశ్చిమంగా దానిహద్దు అగరాల గ్రామం. అగరాల అంటే మొదట వున్నది అని అర్థం. తూర్పు వైపున తొండనాడ (తూర్పువాడ) లేక తొండప్పాడి - దక్షిణంగా మల్లయపల్లి - ఉత్తరంగా నరశింగాపురము - ఇవి చంద్రగిరి హద్దులు. ఈ గ్రామాలన్నీ ఆకాలంలో చంద్రగిరి నామధేయంతోనే వ్యవహరింపబడేవి. ఇవి దాదాపు 15 చదరపుమైళ్ళ విస్తీర్ణం వ్యాపించివుండేవి. నాలుగు వైపుల వ్యాపించివున్న, యీపట్టణ సరిహద్దు గ్రామాలవరకు, విజయనగర రాజులు చంద్రగిరినుంచి సరళరేఖలు గీసినట్టుగ చక్కగా రస్తాలు వేశారు. అంతవరకు చక్కగావున్న రహదారులు — సరిహద్దులు దాటుతూనే వంపులు, మెలికలు తిరిగిపోవడం గమనార్హం. అంతేగాదు. దాన శాసనాలలో సర్వ మాన్యంగా ఇవ్వబడిన గ్రామాలలో నాలుగువైపుల నున్న యీ సరిహద్దు గ్రామాలపేర్లు లేవు. వాటి ప్రక్కనే వున్న కుగ్రామములపేర్లు తి. తి. దే. శాసనాలలో కొల్లగా వున్నాయి. కానీ యీ నాలుగైదు గ్రామాలపేర్లు మాత్రం లేవు. వాటి ఆదాయం రాజభాండారము చేరుతుంది గానీ శ్రీభాండారము చేరదు. దానికి కారణం అవన్నీ చంద్రగిరి పట్టణ ప్రాంతంగా (సబ్‌అర్బ్) పరిగణింపబడటమే.*

చంద్రగిరిని గురించి పెద్ద గ్రంథాలు ఏవీ వెలువడలేదు. రెండు చిన్నగ్రంథాలు 'చంద్రగిరిదుర్గము' అనుపేర వెలిసినవి. అందులో ఒకటి వచనకావ్యము. మరొకటి పద్యకావ్యము. అమ్మిశెట్టి లక్ష్మయ్యగారు - ఉభయభాషా ప్రవీణులు, ప్రౌఢకవి బిరుదాంకితులు. ఆయన వ్రాసిన 'చంద్రగిరి దుర్గము' అను కావ్యములోని యీ క్రింది పద్యము చదవండి.

*5 వ గ్రామం రెడ్డివారిపల్లి పేరుగూడా లేదు.

"తిరుపతి కొండపై నెగువతిప్పపయిన్ విలసిల్లు వేంకటే
శ్వరుగుడిగంట చంద్రగిరిపై హవణిల్లెడు రామదేవు బం
గరు జయఘంట నొక్కపరి ఖంగున మ్రోగుచునుండునంటయా
సిరి రఘునాధ యాచమ విశిష్ట బహూకృతియంటతేనికిన్.

(నవమ ఖండము)

తిరుమలకుపోవు దారిలో అవ్వాచారి కోనకు దక్షిణమువైపు కొండ చివర ఘంటా మండపము అను సాధారణ నాలుగుకాళ్ళ మండపము ఒకటుంది. దానిప్రక్కనే, నేడు తంతి తపాలా కార్యాలయమువారు తంతి వార్తలను ఆకర్షించు ఒకపెద్ద లోహపు జేకును అమర్చియున్నారు. తిరుపతి నుంచే ఆ సాధనమును చూడవచ్చును. ఈ ఘంటా మంటపమువద్ద నిలబడితే వాతావరణము అనుకూలిస్తే సువర్ణముఖరీ పరీవాహక ప్రదేశాన్నంతా మనం చూడవచ్చు. ఇక చంద్రగిరికోట సమీపాన్నే వుంది గాబట్టి స్పష్టంగా కనిపిస్తుంది. ఈఘంటా మంటపమువద్ద ఒక విచిత్రమైనగంట కట్టబడి వుండేదట. ఆగంటను వెంకటగిరి రాజాగారగు, రఘునాధ యాచమనాయ కుడు, చంద్రగిరి రాజుగారగు రామదేవరాయలకు (1614–1630) బహూకరించారట.

తిరుమలమీద శ్రీవారికి నైవేద్యం పెట్టేటప్పుడు మ్రోగించే గంటల శబ్దం, తరంగాలుగా మారి, యీ ఘంటామంటపం గంటను తాకగానే, అది తనంతట తానే మ్రోగుతుందట. ఈగంట శబ్దంకూడ, తరంగాలుగా మారి చంద్రగిరిపై, అందుకని ప్రత్యేకంగా కట్టబడిన గంటను తాకగానే-ఆ గంట కూడ తనంతటతానే మ్రోగుతుంచట. ఈశబ్దం, రాయలవారి చెవిని బడగానే, ఆయన శ్రీవారికి నైవేద్యం అయిందని తెలుసుకొని, తదుపరి భోజనం చేసేవాడట. ఆయన జీవిత కాలమంతా యీ నియమాన్ని పాటించాడని విశ్వసింపబడుతూవుంది. ఇదీ గంటల ఏర్పాటు. ఈనాటికీ తిరుమలదారి లోనూ, చంద్రగిరిమీద, ఆ మంటపాలున్నాయి గానీ — వాటి గంటలు ఏమయి

నాయో తెలియదు. ఉంటే బాగుండును. రాయలవారి ఘంటామంటపము వద్ద, తపాలాశాఖవారి నిస్తంతీవిధానము పాతక్రొత్తల మేలు కలయిక.

అచ్యుతదేవరాయలు చంద్రగిరిలో పట్టాభిషిక్తుడయినాడు. తిరుమల దేవరాయలకాలంలో ఆతని కుమారుడు వేంకటపతిరాయలు ఇచ్చటనే సామంతపాలకుడుగా నుండినాడు. ఆతనిని పొగడుతూ రామరాజభూషణుడు వ్రాసిన పద్యం—

మ. హరుఁడా తారకశైల దుర్గమున నధ్యాసీనుఁడై రాజశే
ఖర విఖ్యాతి వహించు చంద్రగిరి దుర్గంబందు శ్రీవేంకటే
శ్వరుఁడొప్పెన్ బహురాజశేఖర సదాసంసేవ్యుడైయారయి
ద్ధర బంటేలికవాసి తద్గిరులకుం దద్వల్లభశ్రీలకున్.

(వసుచరిత్రము ప్ర. అ. పద్యం 81)

రాజుగారిని దేవుడుకంటె గొప్పగా పొగిడిన యీ కవి అయ్యలరాజు రామభద్రుని ఎలా తెగిడాడో చదవండి

శా. "గుత్తిం బుల్లెలు గుట్టి చంద్రగిరిలోఁ గూడెత్తి పెన్గొండలో
హత్తిన్ సత్రమునందు నెండిబలు దుర్గాధీశ తాంబూలపుం
దిత్తుల్ మోసి పదస్థులైన ఘనులం దీపింప దీవించెదన్
మత్తారాతి యయాతి నాగమసుతున్ మంత్రీశ్వరుం దిమ్మరున్."

(చాటువు)

శ్రీకృష్ణదేవరాయల కాలమున, విజయనగర సామ్రాజ్యములో నున్న రాజ్యములన్నిటినీ, ఒక్క శ్లోకంలో వ్రాశారు:

ఘన గిర్యాఖ్య రాజ్యే చ గుత్తిరాజ్యే చ విశ్రుతే
రాజ్యే కందనవోల రాజ్యే గండికోటస్థ లోపి చ
సిద్ధవట్టా రాఖ్యయో సిద్ధ పోత్తపిసీమాఖ్య విశ్రుతే
చంద్రగిరాఖ్య రాజ్యస్య నామమండల సీమని.

చంద్రగిరి తొండమండల మందలి తిరువేంగడ కొట్టములోని వైకుంఠవలనాటి అంతర్భాగముగ ఇదివరకే తెలిసికొన్నాము. చంద్రగిరికి తిరుచానూరుకు దూరము పదిమైళ్లలోపు. అయినా తిరుచానూరు మరొక నాడు (తాలూకా). ఆ తాలూకాపేరు తిరుక్కుడవూరునాడు. అప్పట్లో అంత చిన్న నాడులను, తాలూకాలుండేవేమో!

విజయనగర చక్రవర్తులకాలములోనే తొండమండలము, జయంగొండ చోళమండలముగా కూడ వ్యవహరింపబడినది.

"సాళువ నరసింహరాయలు శ్రీవేంకటాద్రినాథ దయావర్ధిత రాజ్యలబ్ధి డౌటచే నితడు చంద్రగిరి నెలవీడుగా నొనర్చి చంద్రగిరి రాజ్యమేలెను.

విశమ్యత స్యేతి వచోనిరూపం నృపాల సింహోఽతితరాం ప్రహృష్టః
ఆరాధానైవ హరేర్నివాప మైచ్ఛన్ నృపశ్చంద్రగిరో నగర్యామ్॥"

(ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము - పుట 144, కుందూరి ఈశ్వరదత్తు.)

చంద్రగిరిలో వెలిసిన శ్రీ కోదండరామాలయమును గూర్చి యీ గ్రంథములోనే వేరొకచోట వ్రాయబడివున్నది. మూలస్థానమ్మ అనుపేరుతో ఇంకొక అమ్మవారి ఆలయముంది. చంద్రగిరి పాతపేటలోనున్న (కోటకు దిగువన) యీ అమ్మవారి ఆలయముకూడ ప్రాచీన మయినదిగ భావింపబడుతున్నది. అచ్చట చైత్ర వైశాఖమాసముల, శుక్రవారాలలో జరుగు జంతుబలులు అమితం. ఇంకా కావమ్మ, అంకాళమ్మ, పుట్టాలమ్మ, ఎల్లమ్మ మొదలగు గ్రామదేవతల గుడులు వూరునాలుగువైపులా కట్టబడివున్నాయి. చంద్రగిరి సమీపంలో ఎగువరెడ్డివారిపల్లి కెగువన, పత్తిగుట్ట (హేమసగము) కు - సువర్ణముఖరీనదికి మధ్యలో ఒకపెద్ద శిథిలాలయముంది. దాని గోపురము దాదాపు శ్రీనివాస మంగాపురంలోని గాలిగోపురమంత వుంది. అది శిథిలమైపోయిన నృసింహస్వామి ఆలయమని స్థానికులు అంటారు. గోపురముందిగానీ, గోడలు నేల కొరిగాయి.

ఉత్తర ఆర్కాడు జిల్లాలోని యీ ప్రాంతం, 1911 లో చిత్తూరు జిల్లా ఏర్పడడంతో, ఈ జిల్లాలోని ఒక తాలూకా కేంద్రమయింది.



తిరుమల ఆలయంలో, శ్రీకృష్ణదేవరాయలు ఆయవదేవేరులు - తిరుమలదేవి, చిన్నమదేవి కాంస్య విగ్రహాలు.

# శ్రీనివాస మంగాపురము

సువర్ణముఖినదికి ఉపనదులు రెండు. ఒకటి భీమానది. రెండవది కళ్యాణినది. కళ్యాణీనది తీరములో శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామి వెలిసినాడు. నదిపేరు - కళ్యాణి. రిజర్వాయరుపేరు కళ్యాణిడామ్. స్వామిపేరు - కళ్యాణ వేంకటేశ్వరుడు. అమ్మవారికున్న అనేక పేర్లలో నొకటి - 'కళ్యాణి' నామం. చెవికింపయిన శ్రుతిమెచ్చినరాగం - కళ్యాణి. తలనీలాలు సమర్పించు మంగలి కట్టపేరు కళ్యాణకట్ట. స్వామివారి పెళ్లి - కళ్యాణోత్సవము. శుభప్రదమయిన ప్రతిపనీ కళ్యాణప్రదమని అనబడుతుంది. ఇలా కళ్యాణ నామాంకితాలు ఎన్నో!

మునుపు ఈ అడవులలోని క్రూరమృగాలకు, తిరుమలలోని మలేరియా దోమలకు భయపడి శ్రీవారి దర్శనానికి యాత్రికులు సాహసించేవారుగారు. అయినా వారు దర్శనాన్ని వదులుకోలేరు. అందుకని, అలాంటి భక్తులకు క్రింద మైదానాలలో నాలుగు శ్రీ వేంకటేశ్వర ఆలయాలు వెలిసినవి. అందులో మూడు ప్రాచీనమయినవి. ఒకటి నవీనము అంటే 400 సంవత్సరాలకు మునుపు వెలిసినది. అవి

1. శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామి — శ్రీనివాసమంగాపురము
2. శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామి — నారాయణవరం
3. శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి — అప్పలయ్యగుంట (తిరుచానూరు)
4. శ్రీ తిమ్మప్పస్వామి — తొండవాడ.

పై మూడు ఆలయాలు ప్రాచీనమైనవి. అయినా నేటికి పూజా పునస్కారములు జరుపుకొంటున్నవి. నాలుగవది, నవీనమైనది కానీ శిథిలాలయము.

పై ఆలయాలన్నిటికంటే ముఖ్యమయినది - శ్రీనివాసమంగాపురం! అందుకుకారణం, ఆయన అసలు స్వామికి నేరుగా సరిగ్గా నేలమీద అందరికీ అందుబాటులోవుండటం అంతేకాదు! స్వామి కొండకు ఆనుకొని, కొండకు పోవుదారిలో వుండటంవల్ల - మిగిలినవారికంటే మహత్తుగలిగి వుంటాడని! ఇంకా చెప్పాలంటే, అసలు స్వామికంటే ఆకారంలో దొడ్డ. ఒడ్డూ పొడుగూ కలిగి ఆలయమంతా నిండినట్టు గంభీరంగా దర్శనమిస్తారు. అసలు స్వామిలా నవ్వటం, కవ్వించడం, కర్మలుచేయించటం, కానులు గుంజుకోవటం - ఇలాంటి వేవీ యీయనకు చాతకాదు. నమ్మినవాడు నమ్మనీ - నమ్మనివాడు పోనీ అని తనపాటికి తాను కడుపులోచల్ల కదలకుండా మిన్నకుంటాడు.



తనను ఆలయం కట్టినప్పుడు చూస్తూనేవున్నాడు. అది కొట్టుకొని పోయినప్పుడు చూస్తూనేవున్నాడు. శ్రీకృష్ణదేవరాయలు షోడశ దానాలుచేసినప్పుడు అలాగేవున్నాడు. తాళ్లపాక చిన్నతిరుమలయ్య గుడి కట్టినప్పుడు చెక్కుచెదరలేదు. చివరకు హైదరాలీ కొల్లగొట్టినప్పుడు వాడినేమీ అనలేదు. పోతూపోతూ వాడంతటవాడే చచ్చాడు చిత్తూరు దగ్గర. వాడికి సహాయం చేసిన కాళహస్తి, కార్వేటినగరం జమీందారులు వారంతటవారే త్రావులు దూలాలు అమ్ముకొని పోయారేకానీ, ఈయన వారినేమీ అనలేదు. అంతటి సౌమ్యమూర్తి. చివరికీనాడు తి.తి.దే. వారు పూజచేస్తూవుంటే చేయించుకుంటున్నాడే గానీ, "మీరు మొదటినుంచి ఎందుకుచేయలేదు? ఇన్నిరోజులు ఎందుకు పూరకున్నారు? మీ పెద్ద జియ్యర్‌లు, చిన్న జియ్యర్‌లు - వేద ప్రతిష్టాపనాచార్యులు, వేదాంత మార్గకేసరులు - విశిష్టాద్వైత దురంధరులు వీరంతా నిద్రపోయారా?" అని పల్లెత్తుమాట అనలేదు. ఇది ఆయన విశిష్టాద్వైతము.

ఈయనపట్ల జరిగిన నిర్లక్ష్యం - ఆలస్యం అసలుస్వామికి జరిగివుంటే ఆయన పూరకునేవాడా? వీళ్లను నిద్రపోనిచ్చేవాడా? వీళ్లకు మంచినీళ్లు దొరకనిచ్చేవాడా? చేతులుకాలాక ఆకులుపట్టుకొనేపని ఆయిన ఎప్పుడూ చేయడు.

ఈ కళ్యాణవేంకటేశ్వరస్వామి ఇప్పటివరకు మాకుతెలిసి రెండేరెండు పనులుచేశారు. మొదటిది కాంచీపురములోని *కృష్ణస్వామికి కలలో కనబడి తనకు పూజచేయమని చెప్పారు. పాపమాస్వామి ఆర్కియాలాజికల్ డిపార్టుమెంటువారి కాళ్ళావేళ్లాపడి పూజకు కుదిరి జీవితాంతం ఆపనేచేశాడు.

---

*శ్రీస్వామివారు అర్చకుడైన శ్రీకృష్ణస్వామికి కలలోకనబడినరోజు ననుసరించి శ్రీనివాసమంగాపురంలో సాక్షాత్కార వైభవోత్సవము జరుగుతుంది. ఈ ఉత్సవం ప్రతి సంవత్సరము ఆషాడమాసం (జూన్—జూలై) శుద్ధసప్తమిరోజున జరుగుతుంది. చుట్టుప్రక్కల భక్తులు యీ వైభవాన్ని చూడడానికి విశేష సంఖ్యలో హాజరవుతారు. ప్రతి సంవత్సరం జనవరి మొదటి తారీఖున అనగా ఆంగ్లసంవత్సరాదినాడు; తిరుమల శ్రీవారి ఆలయంలో రద్దీ ఎక్కువయినందున, అక్కడికిపోనిచ్చగించని, ఇతరప్రాంతాల భక్తులు ఇప్పుడిక్కడికి విశేషంగా రావడం - పూర్వప్రాశస్త్యాన్ని గుర్తుకు తెస్తున్నది.

చివరకు తి. తి. దే. వారు ఇక తనకు పూజలు నిలపరని నమ్మకం కలిగాక కృష్ణస్వామిని తనలో లీనం చేసుకున్నాడు. ఇక రెండవది - యీ గ్రంథ రచయితను యీ రచనకు పురికొల్పడం. ఇంతకుమించి ఎవరికయినా ఏమయినా చేశాడేమోకానీ, మాకుమాత్రం తెలియదు. ఇదీ ఆయన గొప్ప!

నారాయణవరంలో పద్మావతి అమ్మవారిని కళ్యాణం చేసుకొని, కళ్యాణ వేంకటేశ్వరుడై, పెళ్లికొడుకు తీవితో వస్తూ-దారిలో తొండవాడ వద్ద శ్రీ అగస్త్యా శ్రమంలోవున్న అగస్త్యమహామునిని పలకరించారు. అందుకాయన క్రొత్త పెళ్లికొడుకు, పసుపుగుడ్డలతో శైలమునెక్కకూడదని సలహా యిచ్చినాడు. అంతే! ఆరుమాసాలు, అగస్త్యమహాముని తిరిగిపొమ్మనేదాక, అక్కడే శ్రీనివాస మంగాపురంలో శ్రీ పద్మావతిదేవితోసహా వుండిపోయారు.

ఆయన అక్కడ నివాసం చేసినందుకు గురుతుగా ఒక ఆలయం వెలిసింది. ఎవరు, ఎప్పుడు కట్టారో ఏ శాసనంలోనూలేదు. అంతా పుక్కిటి పురాణాలు.

ఇక మన వూహలను చాలపరిమితంగా ప్రసరింపచేయవచ్చు. తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి ప్రతిమ, తిరుచానూరులో పూజింపబడేదన్న విషయం శాసనాలలో వుంది. ( తి. తి. దే. శా. సం-1-శాసనము 1 ) ఈ శాసన కాలం - క్రీ.శ. 830 సంవత్సరము. ఆ కాలంలో తిరుమలకు వచ్చి పూజ చేయలేనిమాటనిజమే. అయితే తిరుచానూరులో పూజింపబడిన శ్రీవారి విగ్రహం ఏమయింది? ఎక్కడుంది? ఆవిషయం శాసనాలు చెప్పలేదు. చరిత్రకారులు కూడ ఆ ప్రశ్న వేశారు కానీ - సమాధానం చెప్పలేదు. అప్పటి వారు తిరుమల శ్రీవారిని తిరుచానూరులో పూజచేసిన మాటనిజం. అయితే తిరుచానూరులోని ప్రస్తుత పద్మావతిదేవి ఆలయంలో కాదు. అక్కడకు 5 మైళ్లదూరంలోని అప్పలయ్యగుంట గ్రామంలోనున్న శ్రీ వేంకటేశ్వరస్వామిని పూజచేశారు. ఆలయ అధికారి తిరుచానూరు హెడ్‌క్వార్టర్సులో వుండేవాడు గావున, ఆలయ అర్చకులందరూ తిరుచానూరులో వుండేవారు గాబట్టి శాసనం

తిరుచానూరు ఆలయద్వారంలో వెలిసింది. లేకుంటే అప్పలయ్యగుంటలోనే వెలిసేది. ఇప్పుడా స్వామిని *శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి అను పేరుతో పూజిస్తున్నారు. ఆయనకు ఇద్దరు అమ్మవార్లు ఆవైపు ఈవైపు ప్రదక్షిణ ప్రాకారంలోవున్నారు. వారిలో ఒకామె పద్మావతీదేవి. మరొక ఆమె బీబీనాంచారమ్మని అక్కడివారంటారు.

ఈ కారణంతోనే మనకు తిరుచానూరులో శ్రీవేంకటేశ్వరస్వామి ప్రతిమ దొరకలేదు. ఇప్పుడా ఆలయంలో 'తిరువిలంకోయిల్' అను పేరుతో మునుపు శ్రీ వేంకటేశ్వరస్వామి పూజాగృహముగా పరిగణింపబడుతున్న మంటపము - నాలాంటి వాడి వాక్చాతుర్య ప్రభావజనితము. లేక నిజంగావే ఒక స్వామివారు వెలిసి, అవతల అదృశ్యమయిరేమో ?

సందేహాస్పదమయిన విషయం ఒక శాసనంలో వుంది. శాసనం, సందేహం కలిగించలేదు. అందులోని విషయం మాత్రం కలిగిస్తోంది. ఆ శాసనం తి.తి.దే. శాసన సంపుటము 1 - శాసనము 19, కాలం - (క్రీ.శ. 1014-41) దీనిలోనివిషయం తిరుమండ్యం సభైయర్ (సభ-లేక గ్రామస్తులు) డబ్బుపుచ్చుకొని శ్రీవారి ఆలయంలో 24 దీపాలు (కర్పూర దీపంతోసహా) వెలిగించడం. అందుకు బదులుగా వారు రెండు దీపాలు ముట్టించారట. అదీ విచారణ యీ శాసనంలో. ఈ శాసనం తిరుమల ఆలయంలోనిదే, సందేహం లేదు. ఉన్న సందేహమంతా ఆకాలంలో అనగా 11 వ శతాబ్దములో శ్రీవారి ఆలయంలో రోజూ దీపాలు వెలిగించేవారా ? అని. మనకు తెలిసినది, అందరూ అంగీకరించినది - 15 - 16 శతాబ్దం వరకు శ్రీవారి బ్రహ్మోత్సవము సమయంలో - లేక ఇంకా అలాంటి ఉత్సవ సమయాలలో తప్పితే - మిగిలిన రోజులలో ఆలయంలో గానీ, తిరుమల మీదగానీ మనుష్యులు వుండరని. అలాంటప్పుడు తిరుచానూరుకు 6 - 7 మైళ్ల దూరంలో వున్న

---

*చంద్రగిరి తాలూకా మంగళంపేట గ్రామంలోకూడ మరో ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయముంది.

తిరుమండ్యం గ్రామస్థులు, నెత్తిన నేయిబెట్టుకొని, తిరుమలకొండ ఎక్కి శ్రీవారి ఆలయంలో నేయి దీపాలు వెలిగించి, తిరిగి గ్రామం చేరేవారా? అని. ఆర్.టి.సి. బస్సులున్న యీ కాలంలో కూడ ఇది అసాధ్యమేమోననిపిస్తోంది. ఇక కాలినడకల కాలంలో, దుర్గమారణ్యంలో - రోజూ వచ్చిపోవడం సాధ్యమా? క్రీ.శ. 1652 లో, అనగా 17వ శతాబ్దములో జీన్‌బాప్టిస్టుటవర్నియరు అను ఫ్రెంచి దేశీయుడు చంద్రగిరిరాజు దర్శనార్థమై వచ్చి, శేషాచలం కొండలలో అడవి ఏనుగులను చూసినట్లు వ్రాసినాడు. అడవిలోనున్న శ్రీ కాళహస్తీశ్వర శివలింగాన్ని పూజచేసినది ఒక అడవి ఏనుగు. తిన్నడు (కన్నప్ప) ఆ అడవిలోని ఒక ఆటవికుడు, ఇది గుర్తించాలి మనం.

అయినా వారు దీపాలు, కనీసం రెండయినా ముట్టించేవారు. ఈ సంగతి ఆలయవుద్యోగులు కూడ ఒప్పుకున్నారు. అయితే వారు ఏ ఆలయంలో ముట్టించారు? వారి గ్రామానికి రెండుమైళ్ళ లోపున నున్న అప్పలయ్యగుంట శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయంలోనే ముట్టించి వుంటారు. అది ఆ కాలంలోవారికి సాధ్యం గనుక. ఈ శాసనం కూడ మొదట తిరుచానూరులోనే వుద్భవించివుంటుంది. పర్మనెంట్ రికార్డు గనుక - (అవతల ఆ దీపాల విషయం - ఆలయవుద్యోగులకు కేటాయించబడింది.) రేపు ఎవరయినా (ఇప్పటి లాగ) నేను దీపాలు వెలిగించను అని అంటారేమోనని - ఆలయవుద్యోగులు చూసుకొనేలా శ్రీ వారి ఆలయంలో చెక్కించి వుంటారు.

ఇంతకూ అన్నివిషయాలు పరిశోధించగా తెలిసినదేమిటంటే (మన వూహలకు) క్రీ.శ. 15వ శతాబ్దము దరిదాపుల శ్రీ వారి ఆలయంలో జన సంచారం రోజూ వుండేదని; తాళ్లపాక అన్నమాచార్యులగారు, రోజూ శ్రీ వారి సన్నిధిలో గానం చేసేవారని! అయితే, అప్పుడుకూడ రాత్రులందు ఇక్కడ వుండేవారుకారు. విశ్వసనీయమయిన విషయం - ఉదయం కొండఎక్కడం - సాయంకాలం కొండదిగడం - అన్ని పూజలు - నైవేద్యాలు - నందవిళక్కులు దిగే వేళకు పరిమితం. ఇదీసంగతి.

అందువల్ల రాజులిచ్చినవి, రాణులు దానం చేసినవి, భక్తులయిన ప్రజలు ఇచ్చిన కానుకలు, అన్నిటికీ కేంద్రస్థానం — తిరుచానూరు. అడ్మినిస్ట్రేటివు ఆఫీసు, ఆఫీసర్లు - బంగళాలు - విచారణలు - శిక్షలు అన్నీ అక్కడే.

ఆదాయం పోగొట్టుకోలేని శ్రీవారి ఆలయ సనత్తర్‌లు (అధికారులు - మేనేజర్లు) ఉత్తరదిక్కు వదిలేసి, ఎందుకంటే ఇదివరకే కొండమీద పెద్ద స్వామి వున్నారు గనుక; మిగతా మూడుదిక్కుల మూడు ఆలయాలు మైదానం మీద వెలయింపజేసినారు. ఇందుకు శాసనాధారం లేకపోయినా, విశ్వాసం తప్పగాదు. ఆలోచిస్తే ఆకళింపు అవుతుంది. ఒక ఆలయం చాలదా? అంటే — చాలదని వారికీ తెలుసు.

తాము స్థానిక శిల్పులచేత చెక్కించిన శ్రీ వారి విగ్రహాలు — అసలు స్వయంభూస్వామిలా, ఆకర్షించలేవు గనుక, వారి వారి ప్రాంతమువైపున్నా నిర్మిస్తే — భక్తులూ చూసినట్టు వుంటుంది. శ్రీ వారికి ఆదాయం వచ్చినట్టు వుంటుంది.

అందుకే తూర్పుదిక్కున ఆ వైపువారికి నారాయణవరంలో శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి వెలిసినాడు. శ్రీ వారి కళ్యాణం ఇక్కడే జరిగింది గాబట్టి ప్రజలకూ భక్తి ఎక్కువ.

దక్షిణదిక్కున తిరుచానూరు సమీపం * అప్పలయ్యాగుంట (అప్పుణ సరోవరం) లో శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామి. ఈయన అసలుస్థానంలో శ్రీ వారి ప్రతీకగావున్నాడు గాబట్టి, యీయనమీద భక్తి మరీ ఎక్కువ.

---

* ఇందులకొక కథవుంది. అప్పలయ్య - అప్పువున్నాడని ఎవడో వ్యాజ్యం - తెచ్చాడు. తాను అప్పుచేయలేదని శిలమీద వ్రాయించి కోనేరులో వదిలితే ఆ రాయి తేలిందట. అందుకే అప్పులేనయ్యగుంట అప్పలాయిగుంట అయింది. అప్పుణసరోవరం అన్నా అదే అర్థం. అప్పలయ్యగుంట తామరాకులు ప్రసిద్ధం. అలమేలుమంగమ్మకు, ఆ పద్మాలు ఇష్టం. ఆమె పద్మావతిగద!

పశ్చిమదిక్కున శ్రీనివాసమంగాపురంలో శ్రీకళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆవైపునుంచి వచ్చేవారికి ముఖ్యం. వివాహం తరువాత, శ్రీవారు ఇక్కడ ఆరుమాసాలు వసించారుగాన, యీయన మీద భక్తి అమితం.

ఈ మూడు ఆలయాలు, శిల్పకళారీతులనుబట్టి, కట్టిన విధానాన్ని బట్టి, అంటే ప్లానును బట్టి, ఒక్కరే, దాదాపు ఒకే సమయంలో నిర్మించారని భయపడకుండా చెప్పవచ్చు.

అయితే ఇప్పుడు కొన్ని మార్పులు వచ్చాయి. శ్రీనివాసమంగాపురం జీర్ణోద్దారణ జరిగింది. తిరిగీ శిథిలమయింది తిరిగీ తి. తి. దే. జీర్ణోద్ధారణ చేశారు.

నారాయణవరంలో — శిథిలమైన ఆలయాన్ని — ఆవూరి రాజు శ్రీవీర నరసింగదేవయాదవ రాయలు నిర్మించారు. తిరిగీ విరూపన్న నిర్మించారు. మరలా కార్వేటినగరాధీశ్వరులు జీర్ణోద్ధారణ గావించారు. తి. తి. దే. వారు కొంతచేశారు. ఇకపూర్తిగా జీర్ణోద్ధారణ చేయబోతున్నారు.

అప్పలయ్యగుంట ఆలయం — దేవాదాయ ధర్మాదాయ శాఖవారి ఆధ్వర్యంలోవుంది. వారు కూడా ఆలయంపై 20 వేల రూపాయలకు పైగా వెచ్చించి బాగుచేశారని తెలిసింది.

ఇన్నిమార్పులు జరిగాక, ఇక అసలుస్వరూపం ఎలా తెలుస్తుంది? అయినా మూలస్వరూపం మారలేదు. కాబట్టి గ్రహించవచ్చు.

తిరుచానూరు కేంద్రస్థానం. అప్పలయ్యగుంట 5 మైళ్ల దూరంలో వుందంటే — అది వారికి లెక్కలేదు. ఎందుకంటే, ఇప్పటికీ కొన్ని గ్రామాలలో ఆలయం తెరిపించాలంటే అర్చకుణ్ణి ఐదుమైళ్ల కవతలనుంచీ పట్టుకరావాలి.

ఈ మూడు ఆలయాలు అజమాయిషీకి లోబడినంత దూరంలోనే వున్నాయి. అప్పలాయిగుంట (అప్పలయ్యగుంట) నుంచి ముక్కుకు సూటిగా వెళ్లితే అవతల నారాయణవరం దాదాపు 12 మైళ్లు వుంటుంది, ఇవతల శ్రీనివాసమంగాపురం అంతేదూరంలో వుంటుంది. (ఇది షార్ట్‌కట్ మార్గం)

ఆలయాలు నిర్మించేటప్పుడు — ఇవి తాత్కాలికాలు అని తెలుసు వారికి — ఎప్పటికైనా ఏడు కొండలు ఎక్కవలసి వుంటుందని ఎరుగుదురు వారు. అంతే, వారిఆశయం — తాత్కాలికం — ఆ ప్రకారమే నిర్మించినారు ఆలయాలు. అందులో శిల్ప ఆలయాలు అమలులోకి వచ్చి అట్టే కాలం గాలేదు. శిలాశాసనాలు వేయించడం ఆచరణకు రాలేదింకా. వేయించినా అవి ఎక్కడో ఒకమూల చాకలి గుర్తులా వేయించి వుంటారు. అవతల మరచిపోయి వుంటారు. తాము చేసినపని — లోపాయికారిగా శ్రీవారి మ్రొక్కుబడులు రాబట్టుకోవడం — తమ జీవనార్థం చూసుకోవడం - పైకి భగవద్దర్శనం అన్ని చోట్లా చేయించడం కాబట్టి — ఈ విషయం తిరిగి ఆలయగోడల మీద చెక్కించి చాటింపు వేయవలసినంత అవసర మయినది కాదు. అంటే పర్మనెంటు రికార్డు కాదు. అందుకే తిరిగి శాసన పద్ధతి అమలులోకి వచ్చినప్పుడు వారాపని చేయలేదు.

క్రీ. శ. 16 శతాబ్దములో, అనేక వేల కీర్తనలను రాగిరేకులపై వ్రాయించి శ్రీవారి ఆలయంలో, తాళ్లపాక కొట్టులో భద్రపరచిన వంశజుడైన తాళ్లపాక చిన్న తిరుమలయ్యంగారు శ్రీనివాసమంగాపురంలో శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయ జీర్ణోద్ధారణ గావించి, కేవలం రెండు శాసనాలు మాత్రం చెక్కించాడంటే — దానిని బట్టి ఆయన వాటికిచ్చిన విలువ తెలుసుకోవచ్చు. తొండవాడ తిమ్మప్ప ఆలయంలో ఆపనికూడ చేయలేదేమో తాళ్లపాక చిన్నన్న. ఆ ఆలయం అడ్రసు — మెకంజీవారి కడప జిల్లా కైఫీయత్తులలో వెదుక వలసి వచ్చింది చిత్తూరు జిల్లా కైఫియత్తుల్లో దొరకనందువల్ల. తిరుపతిలోమాత్రం తి. తి. దే. వారి రాగిరేకుల్లో వుంది. ఇదీ విషయం. కాబట్టి పై మూడు ఆలయాల మొదటి నిర్మాణం లేదా మొరటు నిర్మాణం క్రీ. శ. 7వ శతాబ్దము నాటిదిగా పరిగణింపవచ్చు. మొరటు అని ఎందు కన్నానంటే దేవాలయంలో విగ్రహాలు తప్ప — చూడ దగిన శిల్ప కళ అంటూ ఏదీ లేదు. పల్లెలలో గ్రామ దేవతల గుడుల కంటే ఎక్కువ ప్రాముఖ్యమీయలేదు వారు — ఈ మూడు ఆలయాలకున్నూ, అందుకు తగ్గట్టు అవి వెలసినది పల్లెలలోనే!

తి. తి. దే. శాసనములలో కనిపించు శ్రీనివాసపురములు రెండు. అందులో ఒకదానిని శ్రీనివాసపుర గ్రామము (లేక సిద్ధకుట్టి అని కూడా) అంటారు.

తిరుపతికి దక్షిణంగా పట్టణ పొలిమేరలలో ఒక శ్రీనివాసపురము వున్నట్టు, అందు నరసింగ పెరుమాళ్ లేక నరసింగదేవర ఆలయమున్నట్టు, అది ఒక (బ్రాహ్మణ) అగ్రహార మయినట్టు, అందులో మహాజనం అనబడు గొప్ప వేద పండితులు, వారి శిష్యులు, వారికోసం వెలసిన రామానుజ కూటములు వున్నట్టు శాసనాలలో వుంది. దాదాపు పదిహేను శాసనాలలో యీ విషయం ప్రస్తావించబడివుంది.

అదేవిధముగా తిరుపతికి పశ్చిమంగా ఏడుమైళ్ల దూరములో శ్రీనివాస పుర గ్రామముందని, అక్కడ కూడ మహాజనం వున్నారని, అదికూడ అన్నీ పై లక్షణాలతోనే వుందన్న విషయం కూడ శాసనాలలో వుంది.

ఈ రెండు శ్రీనివాస పురములను గూర్చి కొంత సమాచారము తెలుసు కోవలసివుంది.

ఇందులో మొదటిది పట్టణ ప్రాంతము (సబ్-అర్బ) తిరుపతికి దక్షిణంగా వుంది. ఇది అగ్రహారము. ఇచ్చట నరసింహ పెరుమాళ్ ఆలయముంది. ఆ స్వామిని వీరనరసింహదేవర అనికూడ అంటారు. ఇచ్చట మహాజనం - (వీరు తిరుపతి శ్రీ గోవిందరాజాలయం, తిరుచానూరులలో వేద పారాయణం చేసేవారు) వారి శిష్యులు - వారికోసం వెలిసిన రామానుజ కూటములున్నాయి. ఈ విషయాలన్నీ వున్న శాసనాలలో ఒక ముఖ్యశాసన ముంది (అది తి. తి. దే శా సం. 1 - శాసనం — 224. కాలం క్రీ. శ. 1450—1.)

తొండవాడకు తూర్పున పయిండిపల్లి గ్రామముంది. దాని నిప్పుడు పైడిపల్లి అంటారు. ఆ గ్రామంలో 'కనక్కాల్వే' అంటే 'కసింకాల్వ' అనే పెద్ద ఊట కాలువ వుంది. అది నిజానికి తొండవాడ భూములలోనే వుంది.

దానిని ఆళ్వారు మొదలి, ఉలగుడైయ పెరుమాళ్ మొదలి అనేవారి దగ్గర నుంచి చెన్నకేశవ దానర్ అనేవాడు కొన్నాడు. ఆ నీటిని తిరుపతికి కాలువ ద్వారా తెచ్చి పంట పండించి, ఆ ఆదాయం శ్రీబాండారానికిస్తే వారు పైన జెప్పిన శ్రీనివాసపురం పిరనరసింగ పెరుమాళ్‌కు రాత్రి కైంకర్యం జరిపిస్తారు.

నీరు రాకముందే, ఆ గ్రామ ప్రజలు ఆలయ అధికారి (శ్రీగోవింద రాజస్వామి) కి ఆ నీరు లేకపోతే గ్రామం మునిగిపోతుందని, ఆ ప్రయత్నం విరమించమని వేడుకొన్నారు.

స్థనత్తర్, అధికారి యజ్ఞదానర్, ఇద్దరూవచ్చి పరిస్థితులను కళ్ళారా గాంచి, గ్రామ ప్రజలు చెప్పింది నిజమేనని, ఆ కాలువను గ్రామస్థులకే అమ్మివేసి, ఆ డబ్బు చెన్నకేశవదాసర్‌కిచ్చి, అతన్ని వేరే ఊట కాలువ త్రవ్వకోమన్నారు. త్రవ్వకున్నాడు. దానికి ఎల్లలు - *మానిత్తకాలువ - మానిత్తకాలువపట్టెడ (ఇప్పటిపేర్లు) వగైరా. ఇంత రామాయణం వ్రాసిన యీ శాసనంలో తొండవాడ పేరుకూడ లేదు. దీనినిబట్టి ఇది చంద్రగిరిలో భాగమని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఇందు తెలుసుకోదగింది తొండవాడ లోని కాలువలపేర్లు వున్నా - వూరుపేరు మాత్రం లేదు. చివరకు దాసర్, పేరూరుద్వారా ఆ కాలువ త్రవ్వగా - దాని పేరు పేరూరు కాలువ అయింది. అది అవిలాల చెరువుకు వూట కాలువ. తిరుపతి శాసనాలలో సింగారకోయిల్ వీధి - మేలై కైక్కాలవీధి ఇలాంటివన్నీ వున్నాయి. అన్నిటికీమించి శ్రీనివాసపురముంది. ఇది ఏదో కాదు. పళని టాకీసు ముందున్న అగ్రహార గ్రామం. ఇందులోని నరసింగపెరుమాళ్, పళని టాకీసుకు ఎగువన, తిరుపతి చెఱువులోవున్న (మహంతువారు శాశ్వత కౌలుకిచ్చిన) పొలాల్లో ఎండకు ఎండి వానకు తడుస్తూవుంటే ఒక ముసలామె తాటాకుల పందిరివేసి పూజచేస్తూ వుంది. అన్ని శాసనాల కెక్కిన స్వామి - ఏధార్మికుని మనసులోకి ఎక్కలేక పోవడం విచిత్రం.

---

*మాన్యపు మాతికాలువ. ఇది బ్రాహ్మణమాన్యం. అక్కడే బావనిత్తకాలువ వుంది. అంటే అది కూడ బ్రాహ్మణ మాతికాలువ.

ఇక శ్రీనివాసపురగ్రామం. ఇదియే శ్రీనివాస మంగాపురం. తి.తి.దే. శాసనము సంపుటము 1. శాసనములు 199 నుంచి 203. క్రీ. శ. 22-11-1433 నాటికి చెందినవి; యీ శ్రీనివాస (మంగా) పురమును వెలుగులోనికి తెచ్చుచున్నవి. పీటి సారాంశం:

తిరుమల శ్రీవారి ఆలయంలో వేదపారాయణం జరుగుతుండేది. అది ఏ కారణంచేతనో యీ శాసనకాలం నాటికి ఆగిపోయింది. అది తిరిగీ, చంద్రగిరిని రెండవ దేవరాయలు పాలించునపుడు పునరుద్ధరింప బడటం - విశేషం. అంటే ఇది విజయనగర తొలిచక్రవర్తులకాలం నాటికి చెందినది.

శ్రీనివాసపురం రెండు సమభాగాలు. ఒకభాగం శ్రీభాండారానికి చెందినది. రెండవభాగం రాజభాండారానికి చెందినది. ఈ రెండు భాగాలను కలిపి శ్రోత్రియంగా అంటే బ్రాహ్మణ మాన్యంగా ప్రకటించి, అందు నివశించు చున్న 24 మంది మహాజనంకు (వేదపండితులకు) అగ్రహారంగా సమర్పిం చారు — యీ శాసనాలలో. శాసనంలో సిద్ధకుట్టి అనబడే శ్రీనివాసపురం, అని పేర్కొనబడినది. దీనివునికి, తిరువేంగడ కొట్టము - వైకుంఠవలనాడు- కొట్టాలస్థలము.

అనగా కొటాల మజరా, వైకుంఠవలనాడు (చంద్రగిరి తాలూకా) తిరువేంగడ కొట్టము (తిరుమల లేదా తిరుపతి జిల్లా).

సువర్ణముఖీనది భీమానదితో సంగమించు ప్రదేశంలో కొట్టాల గ్రామ ముంది. చంద్రగిరి రైల్వేస్టేషనుకు పశ్చిమంగా ఒక మైలుదూరంలో కొట్టాల రైల్వేస్టేషను వుంది. ఇప్పుడు అందరికీ తెలియని యీ చిన్నగ్రామం- ఒకప్పుడు మజరాగా పేర్కొనబడటం విశేషం.

శ్రీనివాసమంగాపురానికి మొదటిపేరు సిద్ధకుట్టి. సిద్ధాయము అంటే పన్నులేక కప్పం కుట్టిమముది. అంటే జాతికట్టడపునేల. అనగా పన్నువిధించ బడిన జాతికట్టడపునేలగా దీనిని పేర్కొనవచ్చు. అలాగే తొండవాడ తిమ్మప్పదేవాలయమును కట్టినచోటును “ఆళ్లగట్టు అనే బలవపుగని రాయి ”

అని పేర్కొనబడటం వలన సువర్ణముఖికి ఆవైపు యీవైపువున ఒక రకమయిన సుద్దనేలలు అని చెప్పవచ్చు. ఎందుకంటే ఇప్పుడూ కనిపిస్తున్నాయి.

సిద్ధకుట్టిగ్రామం, శ్రీనివాస ఆలయం నిర్మించిన తరువాతనే, శ్రీనివాసపురంగా మారివుంటుంది. ఆలయనిర్మాణము జరిగిన తరువాతనే అక్కడ బ్రాహ్మణులు చేరివుంటారు. ఈ శాసనకాలంనాటికి 24 మంది మహాజనం వున్నారంటే, అక్కడ అంతకుమించిన కుటుంబాలు వుండనే వుంటాయి. దీనిని బట్టి క్రీ. శ. 1433 నాటికి, ఆ ఆలయం ఎంత ఉచ్ఛ స్థితిలోవుందో తేటపడుతుంది

తిరుమల శ్రీవారికి వేదపారాయణం చేయడానికి, తిరుపతిలోని తిరుచానూరులోని మహాజనం సంగతి అనుకోకుండా, శ్రీనివాసపురం వచ్చి 24 మంది మహాజనంను వేదపారాయణందారులుగా నియమించారంటే, నిజంగా వీరెంత గొప్పవారయివుండాలి. పైగా దీనివల్ల రాజుగారి శ్రీభాండారానికి, శ్రీవారి శ్రీభాండారానికీ మొత్తం 400 పణం నష్టం, అంటే ఈ గ్రామాదాయం రాజుగారికి 200 పణం, తిరుమల శ్రీవారికి 200 పణం వుండేది. ఆ ఆదాయం ఇద్దరూ పోగొట్టుకొని దానిని శ్రోత్రియంగా ప్రకటించి, వేదపారాయణం పునరుద్ధరించారంటే, దాని ఆవశ్యకతను ఎంతటిదిగా గుర్తించారు వారు! అప్పటికీ వారు ఒప్పుకుంటారో, లేదో అని ఈ 24 మంది మహాజనం సంవత్సరమంతా వంతులు వారిగా వేదపారాయణం చేస్తే చాలన్నారు. అంటే నెలకు ఇద్దరు చొప్పున పారాయణం చేస్తే సంవత్సరము సరిపోతుంది.

దీనివల్ల శ్రీవారికి 200 పణం నష్టం అంటే శ్రీభాండార ఆదాయం ఆ గ్రామంనుంచి ఇక రాదు. ఎవరు అంగీకరించినా, తిరుమల శ్రీవారు డబ్బు నష్టానికి మాత్రం ఎప్పుడూ అంగీకరించరు. అందుకని యీ క్రింది గ్రామాల వారు గ్రామానికి ఇంత అని చందాలు వేసుకొని, ఆ నష్టాన్ని భర్తీ చేసి, భవిష్యత్తులోకూడా అంటే ఆచంద్రార్కముగ చెల్లించగలవారమని, స్వామిపుష్కరిణిలో జలాలు దోసిళ్ల ఎత్తి వాగ్దానం చేసినారు.

రోజుకిద్దరు చొప్పున కలకాలం వేదపారాయణం చేసే మహాజనంకు ఆచంద్రార్కముగ శ్రీనివాసపురగ్రామం మాన్యమయింది.

శ్రీవారికి చెందవలసిన 200 పణం ఆచంద్రార్కముగ చెల్లించునట్లు స్థనత్తర్‌ముందు, రాజప్రతినిధులముందు, ఈ గ్రామాలవారు స్వామిపుష్కరిణి పవిత్రజలాలసాక్షిగా మాట ఇచ్చారు. వేదపారాయణం ఎటూ ప్రారంభ మయింది. ఈ విధంగా ఎవరికీ నష్టంలేకుండా, లేదా నష్టమని గుర్తించలేని విధంగా పనులు జరిపించుకోవటం - తిరుమల శ్రీవారికి వెన్నతోబెట్టిన విద్య. అంటే, ఇది రోజూ హత్తీరాంజీమఠంవారు సుప్రభాత సమయంలో సమర్పించే పెరుమాళ్లపల్లి మురుగువెన్నగాదు. ఇది అప్పటమయిన, వ్రేపల్లె గోపికల చేతి తాజా వెన్న. ఇక 200 పణం చందాలువేసుకొన్న గ్రామాలు.

| పూర్వనామము | ప్రస్తుతనామము |
|---|---|
| అవిలాలై | అవిలాల |
| విక్రమాదిత్తన్‌మంగలమ్ | మంగలము తిరుపతి తూర్పున నున్నది ( కావచ్చు) |
| పాడి | (తొండప్పాడి అంటే తొండవాడకాదు) పాడిపేట కావచ్చు |
| ఎలమండ్యం | ఎలమండ్యం (రేణిగుంట కె. ఎల్ ఆసుపత్రికి తూర్పు) |
| తిరువేంకటనల్లూర్ | నడవలూరు |
| కలిదిరమంగలమ్ | కదిరిమంగలము |
| కొర్రమంగలమ్ | కొట్రమంగలము |
| పానకమ్ | పానకం |
| పయిండిపల్లి | పైడిపల్లి |
| పుదుప్పట్టు | పుదిపట్ల |
| వాదూర్ | వేమూరు |
| కొట్టాలమ్ | కొటాల |
| అదిత్తప్పల్లి | అయితేపల్లి |

మధ్యలో రెండు గీతలు ఖాలీ. అవి ఏగ్రామాలో తెలియదు. పై గ్రామాలన్నీ చంద్రగిరి, రేణిగుంట పరిసరప్రాంతాలు - ఆ మధ్యలో వున్నవే. మొత్తానికి ఆ గ్రామాలవారంతా కలిసి 200 పణం ఇచ్చి శ్రీభాండారానికి నష్టం లేకుండా చేశారు.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు 1335 అగు నేటి ప్రమాదీచ వృశ్చిక శుద్ధ దశమి రేవతి నక్షత్రమందు, శ్రీమాన్ మహారాజాధి రాజ, రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప దేవరాయ మహారాయలవారు తూర్పు పశ్చిమ ఉత్తర దక్షిణ సముద్రములకు నాథుడై యీ భూమిని పాలిస్తుండగ, శ్రీనివాసపుర గ్రామం, సర్వమాన్యంగా, శ్రీవారి ఆలయంలో వేదపారాయణం చేయు మహా బ్రాహ్మణులకు సమర్పించినందుకు సాక్షులుగా, తిరుక్కుడవూరు నాడు (తిరుచానూరు) తిరువిడైయాట్టం గ్రామాలలోని గ్రామస్థులు మరియు వైకుంఠవలనాడు (చంద్రగిరి) తిరువిడైయాట్టం (దైవదత్తం) గ్రామాలలోని యీ క్రింది గ్రామస్థులు సాక్షి సంతకాలు చేశారు. పై రెండు నాడులలోని తిరువిడైయాట్టం గ్రామాలలోని గ్రామస్థు లందరి తరఫున - పెరియనాట్టువేలన్ చేవ్రాలు.

| | | | | |
|---|---|---|---|---|
| అవిలాల గ్రామస్థుల తరఫున | | - | చిన్నవేలర్ పమ్మాండై | ,, |
| కుంట్రపాకం | ,, | ,, | వడుక్కవేలన్ | ,, |
| పాడి (పేట) | ,, | ,, | నందవేలన్ అంగాడై | ,, |
| నడవలూరు | ,, | ,, | పొక్కరాయన్ (గణికుడు) | ,, |
| కొట్రమంగళం | ,, | ,, | రత్తివేలర్ మరాండై | ,, |
| అయితేపల్లి | ,, | ,, | సెల్లవర్ తిమ్మాండై | ,, |
| పానకం | ,, | ,, | నందవేలర్ నాగాండై | ,, |
| కదిరిమంగలము | , | ,, | మలైయవేలర్ తిమ్మాండై | ,, |
| ఎలమండ్యం | ,, | ,, | దేశియత్తియర్ తిమ్మాండై | ,, |

విక్రమాదిత్యమంగలము తరఫున, సభైయ్యర్ (గ్రామసభ) తరఫున పెరియ నాట్టువేలన్ చేవ్రాలు.

శ్రీభాండారానికి 200 పణం ప్రతి సంవత్సరం ఇచ్చు వాగ్దానము చేయడానికి వచ్చినవారు తమ గ్రామముల తరఫున పై సంతకాలు చేయడం గమనార్హం.

పై పేర్లు చదివితే, వీరు పల్లవుల, చోళుల, పాండ్యరాజుల కాలంలో యీ గ్రామాలలో వశిస్తుండిన తమిళులుగా నున్నది. క్రీ. శ. 1433 నాటికి అంటే విజయనగర తొలిచక్రవర్తుల నాటికి పై గ్రామాలలో నున్నారు. విజయ నగర మలిచక్రవర్తుల కాలం నాటికి వీరి సంఖ్య క్రమంగా తగ్గిపోయి, రెడ్డి, కమ్మ, తెలగ (బలిజ), వెలమల సంఖ్య క్రమంగా పెరుగుతూ వచ్చింది. వీరితో ఇతర వర్ణాలవారూ వచ్చారు. అంటే తమిళుల ప్రాబల్యం తగ్గిపోయి, తెలుగువారి ప్రాబల్యం ఎక్కువవుతూ వచ్చింది.

ఈ శాసనంలో ఇంకొక సంగతుంది. ఈ బ్రాహ్మణ మాన్యాన్ని ఎవరయినా బలవంతంగా లాక్కుంటే, లేదా ఎవరయినా లాక్కునేట్లు చేస్తే - అలాంటివారు 60,000 సంవత్సరాలు పురుగులుగా పుడుతూనే వుంటారట పాపం! లాక్కున్న వారికి ఆ సంగతి తెలియదు. ఇప్పుడక్కడ బ్రాహ్మణులకు పొలాలు వున్నట్టు లేదు.

సిద్ధకుట్టి, శ్రీనివాసపురమయింది. తరువాత, యీ శ్రీనివాసపురం ఏ శాసనంలోనూ కనిపించడం లేదు. క్రీ. శ. 1517 సంవత్సర ప్రాంతంలో శ్రీ కృష్ణదేవరాయలు తన సామ్రాజ్యంలోని పుణ్యక్షేత్రాలు, తీర్థాలు సేవించ డానికి తీర్థయాత్ర బయలుదేరాడని "రాయవాచకము" అను గ్రంథంలో వున్నట్టు, తి. తి. దే. ఎపిగ్రాఫికల్ రిపోర్టు 178 – 179 పుటలలో వర్ణితమై యుంది. ఈ కథనం ప్రకారం, శ్రీ కృష్ణదేవరాయలు గోలకొండ, విజయ పురము, అహమద్‌నగరముల దర్శించి ఆ ప్రభువుల సన్మానముల పొంది, పనిలోపనిగ, గుల్బర్గ (కలుబెరిగె) కోటను వశపరచుకొని, అక్కడ గుజ్జారి కళ్యాణరావును తన ప్రతినిధిగ నిలిపి తిరుపతి కొస్తాడు. వచ్చి, అలమేలు మంగా సమేత శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామిని దర్శించి షోడశదానాలు చేస్తాడు.

ఈ కళ్యాణ వేంకటేశ్వరుడు - అసలు తిరుమల వేంకటేశ్వరస్వామి యని అందరూ సర్దుకున్నారు. కానీ నాకు సర్దుబాటు కావడంలేదు. దానికి కారణం ఎవరూ ఏ శాసనంలోనూ శ్రీ వేంకటేశ్వరస్వామికి 'కళ్యాణ' పదము తగిలించ లేదు. పోనీ రాయవాచకం రచించిన కవి తగిలించాడనుకొందామనుకొంటే, శాసనాలలో లేని మాట, వాడుకలో లేని పదం ఎలా వాడి వుంటాడు? — అలా జరగదు. కాన రచయిత రాయలవారితో నయినా యాత్రచేసి వుండాలి. లేదా యాత్రచేసిన వారిని, అడిగి తెలుసుకొని అయినా వ్రాసి వుండాలి. అంతే గానీ, కళ్యాణ వేంకటేశ్వరస్వామి అసలు వేంకటేశ్వరస్వామి కారు. కనీసం ఉత్సవర్లు కూడ ఆ పేరుతో పిలువబడరు. ఆయన పేరు మలయప్పస్వామి, అందరూ అలానే పిలుస్తారు. పైగా శ్రీకృష్ణదేవరాయలు దర్శించినది అల మేలుమంగా సమేత శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామిని తిరుమలమీద అలమేలు మంగమ్మ వుందా? లేదు. ఆమె వున్నదీ - తాళ్ళపాక చిన్నన్న సమావేశ పరచిన సభలో సాక్ష్యమిచ్చినది - అంతా శ్రీనివాస మంగాపురంలోనే జరిగింది. హైదరాలీ దండయాత్ర తరువాత ఆలయంలోంచి అదృశ్య మయింది అమ్మవారు. కాబట్టి, శ్రీకృష్ణదేవరాయలు తన తీర్థయాత్రను పురస్కరించుకొని శ్రీనివాసపురంలోని శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామిని తప్పక దర్శించి వుంటాడని నా అభిప్రాయం. *షోడశదానాలు అక్కడే జరిగి వుంటాయి. పాత ఆలయం వుండివుంటే, లేదా ఆ ఆలయపు ప్రాకారకుడ్యాల రాళ్లయినా దొరికివుంటే ఆ సంగతి ఖచ్చితంగా తెలిసేది - దానిమీద రాయల వారు ఎటూ శాసనం చెక్కించివుంటారు. ఒకవేళ చిన్నతిరుమలాచార్యుడు అక్కడి ప్రాచీన శాసనాలు సేకరించి పెట్టివుంచినా, అవి పూర్లోవారి కట్టడాలకు పనికి వచ్చివుంటాయి. మనకు దక్కినది - చిన్నతిరుమలయ్య శాసనములే.

ఈ కళ్యాణ వేంకటేశ్వరస్వామినే చూసి వుండాలని గ్యారంటి ఏమిటి? నారాయణవరంలో చూసివుండ కూడదా అంటే, దానికి సమాధానం గుల్బర్గా నుంచి దారి అటురాదు. గుల్బర్గా — రాయచూరు, గుత్తి, పెనుగొండ, చంద్రగిరి ఇలా తిరుపతికి చేరి వుండాలిగానీ, ఆవైపు దారి అప్పుడు లేదు.

---

*షోడశదానాలు - గో, భూ, తిల, హిరణ్య, రత్న, విద్య, కన్య, దాసి, శయ్య, గృహ, అగ్రహార, రథ, గజ, అశ్వ, ఛాగ, మహిషీ దానములు.

కుంభకోణంలో 'మహామఖ' అనే ఉత్సవం 12 ఏళ్లకు ఒకసారి జరుగుతుంది. దానిని సందర్శించారు రాయలవారు. అక్కడికి పోతూ ఇక్కడికి వచ్చాడు. పై గ్రంథం ఆధారంగా ఆయన దారి చంద్రగిరి, శ్రీనివాస పురం, తిరుమల (ఆలయంలోని కృష్ణరాయల కుటుంబ లోహ విగ్రహాలు అప్పుడే ప్రతిష్ఠించారట) శ్రీకాళహస్తి, నారాయణవరం, నాగలాపురం, కంచి, తిరువణ్ణామలై, చిదంబరము, కుంభకోణం అని నేను భావిస్తున్నాను.

క్రీ. శ. 1517 నాటికి శ్రీనివాసపురంలో శ్రీ కళ్యాణ వేంకటేశ్వర స్వామి సలక్షణంగా వున్నాడు. క్రీ. శ. 1540 – అంటే 23 ఏళ్ల కాలంలో ఏమయింది? పోనీ కృష్ణదేవరాయలు దర్శించలేదనుకొంటే కూడ, క్రీ.శ.1433 క్రీ.శ. 1540 – అంటే 107 సంవత్సరాల కాలంలో ఏమయింది? ఊరు పేరు మారిపోయింది. ఆలయం జీర్ణోద్ధారణకు వచ్చింది. భూకంపాలు లేవు. మహమ్మదీయుల దండయాత్రలు లేవు. స్వర్ణయుగంగా బాసిల్లిన కృష్ణ దేవరాయల పరిపాలన అప్పుడే అంతమయి అచ్యుతదేవరాయలు పాలన కొచ్చాడు. చంద్రగిరిలోనే పట్టాభిషిక్తుడయినాడు. మరి శ్రీనివాసపురం ఏమయింది? ఈ క్రింది శాసనం చూడండి. తి. తి. దే. శా. సం॥ 4. శాసనము 144.

"1. స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు
౧౪౬౩ అగునేటి శార్వరి చైత్ర శుద్ధ
2. ౧౫ లు చిత్తానక్షత్రమందు శ్రీ మద్వేదమార్గ ప్రతిష్ఠాచార్య
శ్రీ రామానుజ సి(ం)ద్ధాంత(స్థా)పనాచార్య
3. వేదాంతాచార్య కవితార్కిక కేసరి శరణాగత వజ్ర
పంజరులైన శ్రీ తాళ్లపాక పెదతిరుమలయ్యంగారి
4. కొమారుండు శ్రీ చిన్న తిరుమలయ్యంగారు స్కందపురాణో
క్తమైన శ్రీ వేంకటేశమాహాత్మ్య(ము) –
5 లో విరజ్యా నదీ తీరమందు శ్రీరంగమాహాత్మ్యంలోను దశా

6. తమ (కైంకర్యంగాను) సర్వమాన్య అగ్రహారమైన అల
మేలు మంగపురమందు జీర్ణోద్ధారణంగాను
7. శ్రీ వేంకటేశ్వరులాను నాచ్చియారును అనంత గరుడ
విష్వక్సేనాదు లాను .... ... పెరు -
8. మాళ్లను ఆళ్వారులాను వుడైయవరును పూర్వాచార్య
లాను అన్నమాచార్యులైన తమ ఆచార్య
9. లాను తిరుప్రతిష్ఠచేశి ఆ యాళ్వారుల సన్నిధిని
ప్రొద్దుగుంకి అప్పుడు నిత్యాను సంధానాలు
10. మొదలైనది అనుసంధించి ఆచార్య పురుషులు జీయ్యరు
... . . శ్రీ వైష్ణవుల ... . . ప్రొ -
11. ద్దు గ్రుంక్కిన అప్పుడు ఆరగింపు ... ...ఫలం చందనకాపు
సమ –
12. ర్పించి ఇది తమ పుత్ర పౌత్ర పరంపర ఆ చంద్రార్కం
గాను శ్రీ ........ శ్రీ యతిరాజియ్య
13. ంగారి చాతను వ్రాయించిన శిలాశాసనం (॥*)"
ఈ శాసనం తారీఖు 22–3–1540

ఈ శాసనం చాల స్పష్టంగా వుంది. దీనితోబాటు ఇంకొక శాసనం కూడ శ్రీనివాసమంగాపురం ఆలయంలో వుంది. అందులోని విషయం - ఆళ్వారుల తిరు నక్షత్రాలు – వృత్తులు – ఈ శాసనం పాడయింది. స్పష్టంగా లేదు (అయినా వేరొకచోట వ్రాయబడింది.)

పైకనబఱచిన శాసనంవల్ల అనేక క్రొత్త విషయాలు తెలుస్తున్నాయి. శ్రీనివాసపురం – అలమేలుమంగాపురంగా మారిపోయింది. శ్రీ వేంకటాచల మహాత్మ్యం ప్రకారం – కళ్యాణినది పేరు వికల్య. శ్రీ రంగమాహాత్మ్యం వర్ణన ప్రకారం (దశమ అధ్యాయం) ఇలాంటి నది – దేవళతీర్థం అనబడుతుంది. తాళ్లపాక చిన్న తిరుమలయ్యంగారు చేసినది జీర్ణోద్ధారణ గానీ, క్రొత్త ఆలయం నిర్మించడంకాదు. ఆలయం నదీతీరంలో

వుంది. అలమేలుమంగాపురం తమ ( కైంకర్యంగాను ) సర్వమాన్య అగ్రహారమన్నారు. నిజానికి అది ఇదివరకే వేదపారాయణం దారుల సర్వమాన్య అగ్రహారంగావుంది. మరి వీరి సర్వమాన్య అగ్రహారం ఎలా అయింది? వీరు — ( వీరి వంశంలో ఎవరయినా ? ) వేదపారాయణం దారులా ? అందువల్ల ఆ ఆలయం జీర్ణోద్ధారణ గావించారా ?

ఇన్ని ప్రశ్నలకు శాసనాలలో సమాధానం దొరకదు. శ్రీనివాసపురం గానీ, కనీసం — సిద్ధకుట్టి గానీ, లేక అలమేలుమంగాపురం గానీ, తాళ్లపాకం వారికి సర్వమాన్యంగా — విజయనగర చక్రవర్తులు ఇచ్చినట్టు దాఖలాలేదు. కానీ చరిత్రకారులందరూ, విజయనగర చక్రవర్తులు శ్రీనివాసమంగాపురం తాళ్లపాకంవారికి సర్వమాన్యంగా ఇచ్చినట్టు గుర్తించారు. అలానే వ్రాశారు. ఒకవేళ యీ విషయం శిలాశాసనానికి నోచుకోక, ఎక్కడయినా రాగిరేకు శాసనంలో వుందేమో ! అలా ఇచ్చివుంటే, వేదపారాయణందారులు — వారి మాన్యం ఏమయినట్టు ? గ్రామాన్ని వదలిపెట్టి పారిపోయారా ? అనుకుందామా అంటే, యీ ప్రాంతంలో యింకా ముస్లిముల దండయాత్రలు ప్రారంభం కాలేదు.

విజయనగర చక్రవర్తులు తాళ్లపాకవారికి గ్రామదానాలు — సర్వమాన్యాలు ఇచ్చారు. అవీ అచ్యుతరాయల కాలంనుంచే. అంతకుముందు లేవు శాసనాలలో. అయితే అవన్నీ కడపజిల్లాలోనివే గానీ, చిత్తూరుజిల్లాలో ఒక్కటికూడ లేదు. అవికూడ తాళ్లపాకవారు తమకోసం వుంచుకోలేదు. వెనువెంటనే, ఇచ్చిన గ్రామానికి దగ్గర ఏ దేవాలయంవున్నా ఆ దేవాలయానికి సర్వమాన్యంగా అంటే తమకు ఎలా లభ్యమయితే అలానే ఇచ్చివేశారు. గ్రామ సమీపంలో ఏ ఆలయమూ లేకపోతే అన్నిటికీ ఆ వేంకటేశ్వరుడే వున్నాడని ఆయనకు ( అంటే శ్రీ భాండారానికి ) దానం చేస్తూవచ్చారు.

వీటన్నిటికి ఒకే సమాధానం వుంది. కొన్ని సంవత్సరాలు పరిశీలించిన తరువాత యీ అభిప్రాయానికి రాక తప్పలేదు. శ్రీనివాసపురం వరద తాకిడికి గురయింది. ఇది క్రీ. శ. 1517 తరువాత క్రీ. శ. 1540 లోగా జరిగి

వుంది. అలమేలుమంగాపురం తమ ( కైంకర్యంగాను ) సర్వమాన్య అగ్రహారమన్నారు. నిజానికి అది ఇదివరకే వేదపారాయణం దారుల సర్వమాన్య అగ్రహారంగావుంది. మరి వీరి సర్వమాన్య అగ్రహారం ఎలా అయింది? వీరు — ( వీరి వంశంలో ఎవరయినా ? ) వేదపారాయణం దారులా ? అందువల్ల ఆ ఆలయం జీర్ణోద్ధారణ గావించారా ?

ఇన్ని ప్రశ్నలకు శాసనాలలో సమాధానం దొరకదు. శ్రీనివాసపురం గానీ, కనీసం — సిద్ధకుట్టి గానీ, లేక అలమేలుమంగాపురం గానీ, తాళ్లపాకం వారికి సర్వమాన్యంగా — విజయనగర చక్రవర్తులు ఇచ్చినట్టు దాఖలాలేదు. కానీ చరిత్రకారులందరూ, విజయనగర చక్రవర్తులు శ్రీనివాసమంగాపురం తాళ్లపాకంవారికి సర్వమాన్యంగా ఇచ్చినట్టు గుర్తించారు. అలానే వ్రాశారు. ఒకవేళ యీ విషయం శిలాశాసనానికి నోచుకోక, ఎక్కడయినా రాగిరేకు శాసనంలో వుందేమో ! అలా ఇచ్చివుంటే, వేదపారాయణందారులు — వారి మాన్యం ఏమయినట్టు ? గ్రామాన్ని వదలిపెట్టి పారిపోయారా ? అనుకుందామా అంటే, యీ ప్రాంతంలో యింకా ముస్లిముల దండయాత్రలు ప్రారంభం కాలేదు.

విజయనగర చక్రవర్తులు తాళ్లపాకవారికి గ్రామదానాలు — సర్వమాన్యాలు ఇచ్చారు. అవీ అచ్యుతరాయల కాలంనుంచే. అంతకుముందు లేవు శాసనాలలో. అయితే అవన్నీ కడపజిల్లాలోనివే గానీ, చిత్తూరుజిల్లాలో ఒక్కటికూడ లేదు. అవికూడ తాళ్లపాకవారు తమకోసం వుంచుకోలేదు. వెనువెంటనే, ఇచ్చిన గ్రామానికి దగ్గర ఏ దేవాలయంవున్నా ఆ దేవాలయానికి సర్వమాన్యంగా అంటే తమకు ఎలా లభ్యమయితే అలానే ఇచ్చివేశారు. గ్రామ సమీపంలో ఏ ఆలయమూ లేకపోతే అన్నిటికీ ఆ వేంకటేశ్వరుడే వున్నాడని ఆయనకు ( అంటే శ్రీ భాండారానికి ) దానం చేస్తూవచ్చారు.

వీటన్నిటికి ఒకే సమాధానం వుంది. కొన్ని సంవత్సరాలు పరిశీలించిన తిరువాత యీ అభిప్రాయానికి రాక తప్పలేదు. శ్రీనివాసపురం వరద తాకిడికి గురయింది. ఇది క్రీ. శ. 1517 తరువాత క్రీ. శ. 1540 లోగా జరిగి

దాటితే సువర్ణముఖరిలో కలుస్తుంది కాబట్టి శాంతపడుతుంది. ఇదంతా అక్కడి పరిస్థితి చూసినవారు గ్రహించగలరు. ఇప్పుడుకూడ, ఆలయానికి ఎగువనున్న మామిడితోట లేకుంటే, ఆలయానికి రక్షణ లేదు.

ఇందువల్ల కళ్యాణి వరదలు శ్రీకళ్యాణవేంకటేశ్వరస్వామిని, శ్రీనివాసపురాన్ని తుడిచిపెట్టుక పోయివుంటాయి. తిరుమల మీద వేద పారాయణానికి పోయిన ఇద్దరు మహాబ్రాహ్మణులు మాత్రం మిగిలివుంటారు. గ్రామమే పోయినప్పుడు పొలాలుంటాయా? అందులో ఆ గ్రామ పొలాలన్నీ నదీతీరంలోనే వున్నాయి. ఈ విధంగా అగ్రహారం అన్తమించి వుంటుంది.

అవతల వెలసిన క్రొత్త గ్రామం — అలమేలుమంగాపురమయివుంటుంది. ఆ క్రొత్త గ్రామాన్ని తాళ్ళపాకంవారు విజయనగర రాజులనుంచి క్రొత్తగా సర్వ మాన్యముగా గ్రహించి వుంటారు ఇదీ సంగతి.

అయితే వరదలు ఒక్క గ్రామానికే తగిలాయా అంటే, ఆ తీరములో నున్న ఇంకాకొన్ని గ్రామాలకు సంభవించి వుంటాయి. దీనిని బలపరచ డానికి ఇంకో శాసనాధారంవుంది.

తొండవాడ గ్రామం సువర్ణముఖరీ తీరంలోవుంది. అది మొదటి నుంచీ చంద్రగిరి పట్టణానికి చెందినది. అంటే సబ్‌అర్బ్ అన్నమాట. ఇది రాజులు నివశించే వూరు గాబట్టి, వారు చంద్రగిరి పట్టణాన్ని దానం చేయరు. చేయలేదు. చుట్టూవున్నవాటిని తిరుచానూరు, తిరుపతి (తిరుపీడి యాట్టం) గ్రామాలనన్నిటినీ దానంచేసినారు కానీ చంద్రగిరిని దానం చేయలేదు. అందువల్ల తొండవాడపేరు ఏ శాసనంలోనూ, అంటే ఏ దానం లోనూ వుండదు

కానీ ఆ గ్రామస్థుడొకడు ఒకసాక్షి సంతకంవేశాడు. అందువల్ల వూరుపేరయినా దొరికింది. ఆశాసనం — తి. తి. దే. శాసన సంపుటము 1. శాసనము - 205. శాసనకాలము క్రీ. శ. 1433. అంటే శ్రీనివాస పురమును అగ్రహారంగా ప్రకటించిన నాటి శాసనమన్నమాట.

ఇది తిరుపతిలో ఇంటిజాగా విక్రయానికి చెందిన శాసనం. విక్రయ శాసనంలో సాక్షులు—

1. పెరుమాళ్.
2. అప్పావేలన్ *తొండప్పాడి (తొండవాడ)
3. వెన్నమురెడ్డి — దుర్గసముద్రము.

ఇంకా వగైరాలున్నారు.

పాడి=పాడిపేట, తొండప్పాడి=తొండవాడ.

పాడి - చంద్రగిరి, అన్నాకూడ తొండవాడే.

ఇదేకాలమునకు చెందిన తి. తి. దే. శా. సం. 1 - శాసన సంఖ్య 230. అసంపూర్ణ శాసనములో —

చంద్రగిరిలోని పాడి అని వుంది.

తరువాత శాసనాలలో యీపేరు కానరాదు. శ్రీనివాసమంగాపురములో ఆలయజీర్ణోద్ధారణ గావించిన తాళ్లపాక చిన్నతిరుమలాచార్యుని తమ్ముడు అదే కాలములో అనగా క్రీ. శ. 1542 లో తొండవాడ దగ్గర శ్రీతిమ్మప్పదేవాలయ మును నిర్మించినాడు. దాని వునికి - "చంద్రగిరికి తూర్పుభాగమందు ....... ఆళ్లగట్టు క్రయసిద్ధిచేసి తీసికొని యీ గట్టురాయి" ....... అన్నారేగానీ, తొండప్పాడి పేరుగానీ, తొండవాడ పేరుగానీ ఎత్తలేదు. కావున క్రీ. శ. 1433 లో శాసనాలలో కనిపించిన తొండప్పాడికి కూడ శ్రీనివాసపురము గతి పట్టినదేమో? లేకపోతే కనీసం పై క్రీ. శ. 1542 దానపత్రంలో నయినా కనిపించదా? లేక గ్రామమున్నా - అది దానపత్రంలో వ్రాయనవసరం లేదని భావించివుందురా? దానపత్రంలో చంద్రగిరికి తూర్పు అనకుండా - చంద్రగిరిలో అనివున్నా ఇబ్బందిలేక పోవును. తొండప్పాడి చంద్రగిరి అంతర్భాగం కావున.

***సువర్ణముఖీతీరంలో 'వాడ' అని చివరవచ్చు పేర్లుగల గ్రామాలు రెండున్నాయి. తొండవాడ, చిగురువాడ ఈ రెండిటిపేర్లు మునుపు, తొండప్పాడి. చిరుపాడి ఈ రెండిటికి**

కాబట్టి తొండప్పాడి కొట్టుకపోయిన కొంతకాలం తరువాత "తొండవాడ" అనుపేరుతో క్రొత్తగ్రామము వెలిసి వుంటుంది. తాళ్లపాక చిన్నన్న, తిమ్మప్ప ఆలయం నిర్మించడంతో! ఆ వివరాలు మరొకచోట తెలుసుకో వచ్చు.

తాళ్లపాక చిన్న తిరుమలయ్యంగారు శాసనంలో - శ్రీవేంకటేశ్వరులను, నాచ్చియారును (అమ్మవారిని) అనంత, గరుడ, విష్వక్సేన, ఒక పెరుమాళ్ను, ఆళ్వారులను, వుడైయవరును, పూర్వాచార్యులను, తమ ఆచార్యుడైన అన్నమాచార్యులను వీరందరిని క్రొత్తగా తిరుప్రతిష్ఠ చేసినట్టు వుంది. అయితే ముందున్న విగ్రహాలు ఏమయినాయి?

కొన్ని ఇసుకలో పూడిపోయి వుంటాయి. కొన్ని భిన్నమయిపోయి, పూజకు అనర్హమై వుంటాయి. అందువల్ల అన్నీ క్రొత్తగా తయారుచేయించి ప్రతిష్ఠ చేసివుంటారు. వారికి నిత్యనైవేద్య పూజాదికములు ఏర్పాటు గావించి, ఏ యే నక్షత్రములో ఏ దేవునికి ఎలా పూజ, ఉత్సవము జరిపించాలో అన్నిటినీ నిర్దేశించినాడు చిన్నతిరుమలయ్య. గ్రామాదాయాన్ని కూడ భాగాలు చేసి, ఎలా ఎవరికెంతెంత ఖర్చుపెట్టాలో ఆవిషయంకూడా శాసనంవేయించాడు. కానీ అది మంచిస్థితిలోలేదు గావున, విషయం సంపూర్ణంగాలేదు. ఇది తి. తి. దే. శా. నం. 4 శాసనం 145. ఇది శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామి ఆలయ ప్రవేశద్వారములో ఎడమవైపు వుంది. ముందువ్రాసిన శాసనం అదే చోట కుడివైపు వుంది. ఈ శాసనం కూడ చూడండి.

మొదటి భాగము

1. ఆళ్వారులు ఆచార్యులు తిరునక్షత్ర వివరాలు (11*) కందాళ మోదలియాండన్ అశ్విని భరణి
2. పెరియ నంభిగారు కృత్తిక, తిరుమంగయాళ్వారు రోహిణీ, తిరుప్పాణాళ్వారు మృగశిర తిరుకచ్చి
3. నంబింగారు ఆర్ద్ర ఉడైయవరు పునర్వసు కులశేఖరాళ్వారుపుష్యమి పెరియ తిరుమలనంబింగారు 1.

4\. ............. .........

రెండవ భాగము

వృత్తులు ౧౨౮

1. పెరుమాళ్లు పెద్ద తిరుపీధులు........నెల ౧ కి దశములు ౨ ఏకాదశులు ౨ పున్నిమ ౧

2. అమావాస్యా ౧ ........ పులాణం....వుళ్ తిరుపీధులు వేంచేసి తిరు-

3. నక్షత్రాలు రోహిణీ మృగశిర ఆరుద్ర పుబ్బ వుత్తర హస్త 2. "

సర్వమాన్యమైన అలమేలుమంగాపుర గ్రామ ఆదాయాన్ని 128 భాగాలు చేసి, అందులో పెద్ద వీధులలోని ఆదాయం శ్రీవేంకటేశ్వరస్వామికి, ....నెలలో వచ్చు రెండు దశమిలు, రెండు ఏకాదశులు, ఒక పూర్ణిమ ఒక అమావాస్య - ఈరోజులలో వుత్సవము జరిపించవలసి వుంటుంది. చిన్న వీధులలోని ఆదాయిం పై ఉత్సవాలనాడు ఖర్చు పెట్టవలసివుంటుంది. ఇది దీని సారాంశము. ఇక పైభాగంలో వున్నది పూజావివరములు నక్షత్రములు.

క్రీ. శ. 1540 లో అనగా 439 సంవత్సరాల క్రితము నిర్మించిన యీ ఆలయం ఇప్పుడయినా నిర్మించినట్టు యథాతథంగా వుందా? లేదు. మరలా శిథిల మయింది. అయితే యీ శిథిలానికి కారణం వుంది.

* * *

కానీ ఇది శిథిలం కాని నాటి పరిస్థితి ఏమిటి? ఇంతకాలం సిద్ధకుట్టి, శ్రీనివాసపురం అని పిలువబడిన యీ గ్రామం - తాళ్లపాక చిన్నతిరుమలయ్యంగారు శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామి ఆలయం నిర్మించడంతో అలమేలుమంగాపురం అయింది. ఈ ప్రాంతంలో నివసించు పల్లవ, చోళ, పాండ్యులనాటి తమిళులు - తమిళ రాజ్యాలు అంతరించడంతో క్రమక్రమంగా ఖాళీచేసి, తమరాజులు పాలించు ప్రాంతాలకు అనగా దక్షిణాదికి వలసలు పోనారంభించారు.

విజయనగర చక్రవర్తులు రావడంతో, వారు తెలుగువారు కావడంతో, తెలుగువారి ప్రాబల్యం పెరుగుతూ వచ్చింది. విజయనగర చక్రవర్తుల కొలువులో మహామంత్రులుగా, దండనాయకులుగా, ప్రాంతీయ అధికారులుగా, సామంతులుగా తెలుగు నడిగడ్డమీదనుంచి వచ్చిన ఆంధ్రులు స్థిరపడ సాగారు. అష్ట దిగ్గజాల ఆవిర్భావంతో తెలుగు కావ్యాలు, కవనాలు, కవితలు ఆవిర్భవించాయి. చతుష్షష్టి కళలు - తెలుగు సంస్కృతికి, ఆచార వ్యవహారాలకు — తెలుగు తీయదనానికి దర్పణం పట్టసాగాయి. తమిళులు ఖాళీచేసిన ప్రదేశాలను తెలుగువారు క్రమంగా ఆక్రమించుకోసాగారు. వలస పోనిచ్ఛగించని తమిళులు ఆంధ్రులతోనే కలిసిపోయారు. వారి ఆచార వ్యవహారాలు, వీరి ఆచార వ్యవహారాలు రెండూ కలిసిపోయి, ఒక క్రొత్త సంస్కృతి వెలిసింది.

ఆ సంస్కృతిని- లేదా ఆ క్రొత్త కలయికను - చిత్తూరు భాష, చిత్తూరు తెలుగు, చిత్తూరు మనిషి - అని ఆంధ్రులు పరిహసించసాగారు. ఇంకా పరిహసిస్తూనే వున్నారు. ఇంకా నయం. గుడియాత్తంలోని తెలుగువారు (వారు ఒకప్పుడు, ఉత్తర ఆర్కాడు జిల్లా వారుగానే, జిల్లాలోని యీ ప్రాంతాన్నుంచి ఆ ప్రాంతానికి పోయారు). ఇప్పుడు మాట్లాడు తెలుగు ఎలా వుంటుందంటే మీరు రండా, పొండా, వాడు పూడ్చినాడు. ఈ తరహాలో వుంటుంది. రండ అంటే తెలుగులో అర్థమేమిటి? పూడ్చినాడు అంటే ఏమిటి? పూర్తి అపార్థపు అర్థాలు వస్తాయి. అయినా మాట్లాడువారు ఆ వుద్దేశంతో, ఆ అర్థంతో మాట్లాడరు గనుక, వినేవారు ఆ సంగతి గ్రహిస్తారు గాబట్టి ఇబ్బంది లేకుండా పోతుంది.

తెలుగువారు లేదా తెలుగు జాతులు ఎన్నో వచ్చి ఎంతో కాలం నుంచి స్థిరపడినా అరవ సంప్రదాయాన్ని - ఆచార వ్యవహారాలను యీ ప్రాంతము నుంచి తుడిచిపెట్టలేకపోయారు. పోనీ, కనీసం అధిగమించలేక పోయారు. తిరుమల శ్రీవారి ఆలయంలో సంస్కృత మంత్రాలకంటే అరవ ప్రబంధాల పారాయణం ఎక్కువ. ఆలయంలో వాడే నిత్య వాడుకలోని పద

జాలమంతా అరవమే. తిరుమంజనం - తిరుప్పావడ - కొప్పెర - తళిగె తోమాలసేవ వగైరా.

క్రొత్తపేరు సంతరించుకొని అలమేలుమంగాపురం వెలిసినట్లే, తొండప్పాడి, పేరుపోయి 'తొండవాడ' అను గ్రామం వెలిసింది. ఈ మార్పులన్నీ అచ్యుతరాయల తదనంతరమే కలిగాయి. అంటే దాదాపు క్రీ. శ. 1542 ప్రాంతంలో. ప్రతిచోటా ఆలయాలు గ్రూపుగా (టెంపుల్ కాంప్లెక్స్) వెలిశాయి.

అలమేలుమంగాపురంలో శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయం, ఆ ఆలయానికి కొద్ది దూరంలో అమ్మవారి ( శ్రీ పద్మావతి ) ఆలయం — అసలు ఆలయంలోని ప్రాకార మంటపాలలో ఆళ్వారుల — ఆచార్య పురుషుల పూజా మందిరాలు వెలిశాయి. ఆలయం ముందున్న కళ్యాణ మంటపంలోని స్తంభాల మీద తాళ్లపాక వంశజులు తంబురలు మీటుతూ శ్రీవారి అధ్యాత్మ శృంగార కీర్తనలు పాడుతున్నట్లు శిల్పింపజేసినాడు చిన్న తిరుమలయ్య.

చంద్రగిరి కొత్తపేట బ్రాహ్మణవీధి చివర అంటే దాసరివీధికి ఆనుకొని సువర్ణముఖరీ తీరంలో ఒక శివాలయం వెలిసింది అప్పుడే! ఎందుకంటే శ్రీ వేంకటేశ్వరస్వామి వున్న ప్రతిచోట *(తిరుమలలో తప్ప) తప్పక ఒక శివాలయం కట్టించారు- ఆనాటివారు. అందుకు కారణం, శ్రీ వేంకటాచల మాహాత్మ్యంలో శ్రీవారు కానీ, శ్రీ పద్మావతి అమ్మవారు కానీ చాలాసార్లు శివాలయంలో పూజలు జరిపినట్లు, అభిషేకాలు చేయించినట్లు, శ్రీ అగస్త్యాశ్రమం - శ్రీ అగస్త్య మహామునిని దర్శించినట్లు లిఖించబడి వుండటమే. ధరణీదేవిని వకుళమాల శివాలయంలోనే కలుసుకొన్నది. వివాహానంతరము నూతన వధూవరులైన శ్రీవారు - అమ్మవారు, శ్రీ అగస్త్యాశ్రమంలో ఆరు మాసాలు గడిపారు. ఈవిషయాన్ని బలపరుస్తూ ఈ ప్రాంతంలో వెలిసిన నూతన శ్రీవారి ఆలయాలన్నిటి దగ్గర, ఒకటి రెండూ శివాలయాలు వుండనే వున్నాయి. అలాగే చంద్రగిరి

---

*ఆయనకు కూడ తిరుపతిలో శ్రీ కపిలేశ్వరస్వామిని వెలయింపజేసినారు. కొండకు ఆనుకొని వున్న ఆ తీర్థాన్ని కపిలతీర్థం - లేదా ఆళ్వారు తీర్థం అంటారు.

కొత్తపేట కోనేటి వద్ద వెలిసిన శివాలయం శ్రీనివాస మంగాపురంకు చెందినదే. ఇప్పుడా ఆలయంలేదు. శిథిలాలు మాత్రం కొన్ని వున్నాయి. అందులో శిథిల గోపురం ఒకటి. దానికీ వరదబాధే. కోనేరు పూడిపోయి, రాళ్లు చిందరవందరగా పడివున్నాయి. ఈ ఆలయం శ్రీనివాసమంగాపురం కళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయానికి దాదాపు రెండుమైళ్ల దూరంలో వుంటుంది. ఇదొక యూనిట్.

అంతకంటే తక్కువ దూరంలోనే, తూర్పు దిశలో తొండవాడ శ్రీ అగస్త్యేశ్వరస్వామివారి ఆలయముంది. తొండవాడకు ఎగువన తాళ్లపాక చిన్నన్న నిర్మించిన తిమ్మప్ప దేవాలయం శిథిలమై వుంది. అమ్మవారి దేవాలయాన్ని మాత్రం ఆయన తొండవాడలో నిర్మింప జేసినాడు. కానీ, అది ప్రస్తుతమున్న గ్రామస్థుల ముందుతరం నాటికే శిథిలమై అస్తమించింది. ఈ ఆలయాలు ఆ కాలంలో ఒక యూనిట్‌గా పరిగణింపబడినాయి.

గోవిందరాజస్వామి ప్రతిష్ఠాపనతో గోవిందరాజ పట్టణముగా పరిగణింపబడిన తిరుపతి పట్టణము ఒక యూనిట్. అక్కడ శివాలయం ప్రసక్తి రాదు. ఎందుకంటే శ్రీ వేంకటేశ్వరస్వామికి తిరుపతిలో ఆలయాలు లేవు గనుక. ఉన్న కపిలతీర్థం - తిరుమల అంతర్భాగంగా పరిగణన. ఒక్క గోవిందరాజస్వామి ఆలయమే ఒక చిన్న గ్రామమంత వుంది. అందులో అనేక దేవుళ్లు చోటు చేసుకున్నారు. తిరుపతిలో ఇంకా శ్రీ కోదండరామస్వామి ఆలయము, తాతయ్యగుంట గంగమ్మ, తాళ్లపాక గంగమ్మ, నమ్మాళ్వారు వగైరాలకు చిన్న ఆలయాలు అనేకం వున్నాయి.

తిరుచానూరు శ్రీ పద్మావతి అమ్మ ఆలయంలో శ్రీ వరదరాజస్వామి, శ్రీ కృష్ణస్వామి, శ్రీ బలరామస్వామి కూడ వున్నారు. ఐదు మైళ్లదూరంలో శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామివారి ఆలయముంది. ఆ ఆలయానికి దగ్గరలోనే ఒక శివాలయముంది. అదికాక తిరుచానూరులోని యోగిమల్లవరంలో శ్రీ పరాశరేశ్వరస్వామి ఆలయముంది. ఇవన్నీ కలసి ఒక యూనిట్.

నారాయణవరం — నాగలాపురం యూనిట్లు ప్రత్యేకంగా వర్ణింపబడింది. ఇక గుడిమల్లం, తొండమనాడు, శ్రీకాళహస్తి అవన్ని విడి విడిగా

దేనిపాటికది ఒక్క యీనిట్టు - అలా వెలిసినాయి ఈ ప్రాంతంలోని ప్రాచీన ఆలయాలు.

దాదాపు 240 సంవత్సరాలు అలమేలుమంగాపురంలోని శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి - నిత్యకళ్యాణం పచ్చతోరణంతో - రంగ రంగ వైభోగంగా వెలిగినాడు. కళ్యాణినదీ తీరంలో కళ్యాణ కట్టలు వెలిసినాయి. యాత్రీకులు ఇక్కడే స్వామివారికి తలనీలాలు సమర్పించి, కళ్యాణి నదిలో స్నానం చేసి, శ్రీ కళ్యాణ వేంకటేశ్వరులను దర్శించి, అవసరమైతే తిరుమలమీద ఉత్సవాలు ఏవయినా వుంటే, జనం వంద మందికిపైగా వుంటే - తిరుమలకు వెళ్లేవారు, లేదంటే ఊరి ముఖం పట్టేవారు. కళ్యాణినదీ తీరంలో మొదట వెలిసినాయి గాబట్టి, మంగలి కట్టలకు — కళ్యాణ కట్టలని పేరు వచ్చింది. తిరుపతి చేరిన యాత్రీకులు యీ తలనీలాల పని కపిలతీర్థంలో చూసుకొని, అక్కడే తాన మాడి, తదుపరి కొండ ఎక్కేవారు — గుంపులు గుంపులుగా! వీరు దారిలో ఎక్కడా తప్పి పోకుండా — తప్పి పోయినా, అంటే ప్రయాణంలో ముందు. వెనుకబడినా కలుసుకోవడానికి బాకా వూదే మనుషులు కూడా వుండేవారు. ఇప్పటికీ మైసూర్ ప్రాంతమునుంచి వచ్చేవారు ఈ బాకా వూదు సంప్రదాయాన్ని కొనసాగిస్తున్నారు. శ్రీనివాసమంగాపురంలో కళ్యాణ కట్టలు అస్తమించాక, తిరుమలలోని చంద్రగిరి రస్తా ప్రక్కనున్న మంగలి బావివద్ద యీ మంగలి కట్టలు వెలిసినవి. ఊరికి దూరంగావున్న యీ కట్టలు, క్రమక్రమంగా ఆలయం ప్రక్కనే చోటు చేసుకోవడం - గమనార్హం. మొదట కొండక్రింద తదుపరి కొండపైన దూరంగా - తదుపరి స్వామిపుష్కరిణి ప్రక్క, ప్రస్తుతం దేవస్థానంవారి ప్రోద్బలంతో కొద్ది దూరంలో నున్నాయి.

తాళ్లపాక చిన్న తిరుమలాచార్యుల మూడవ తమ్ముడు తాళ్లపాక చిన్నన్న లేక చిన్న తిరు వెంగళనాథుడు యీ అలమేలుమంగాపురంలోనే, శ్రీ పద్మావతి అమ్మవారి ముందు పద్మసాలీల — జాంద్రవారి తగాదాలను, అమ్మవారిని సాక్షాత్కరింపజేసి ఆమెద్వారా పరిష్కరింపచేసినాడు. అంతటి మహోన్నతమయిన యీ ఆలయము చివరికెలా పతనమయింది?

క్రీ.శ. 1780 లో పులికాట్ విజయంతో గర్వించిన హైదరాలీ ఈ ప్రాంతానికి వచ్చాడు. అప్పుడు చంద్రగిరి కోటలో హైదరాబాదు నిజాం తరఫున అబ్దుల్ వహాబు నవాబుగా వున్నాడు. ఇదివరకు హైదరాలీకి హైదరాబాదు నిజాం స్నేహితుడు. ఇప్పుడు హైదరాలీ ఇంగ్లీషు వారితో యుద్ధంలో వున్నాడు. హైదరాబాదు నిజాం బ్రిటీషువారికి కూడ స్నేహితుడు గాబట్టి, హైదరాలీకి విరోధుడయినాడు.

తూర్పు ఇండియా కంపెనీవారికి (వేలూరు కోటకు) ఆహార ధాన్యాలు కల్లూరు - * దామలచెఱువు కనుమగుండా పోతున్నాయని, వాటిని అవరోధించ డానికి హైదరాలీ దామలచెఱువులో మకాం పెట్టాడు. తిరుపతి దామల చెఱువు మధ్య ప్రాంతాన్ని తరచుగా తిరుగసాగినాడు.

అప్పుడే శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయం కొల్లగొట్టుతాడని ప్రచారాలు ప్రారంభమయ్యాయి. తిరుమల ఆలయ అధికారులు, అర్చకులు భయపడి చేసేది లేక, శ్రీవారి నైవేద్య సామగ్రినంతా ఆయనముందుపెట్టి, ఇకమీదట నైవేద్యం సంగతి ఆయననే చూసుకోమని, ఆలయం మూసివేసి తాళాలు గట్టిగావేసి, ఉత్సవర్లు శ్రీమలయప్పస్వామిని, శ్రీదేవిని - భూదేవిని భద్రంగా బయట ఎక్కడోదాచి, తిరుమల ఖాళీచేసి వెళ్లిపోతూ కాలిబాట కనబడ కుండా కంపలు, కొమ్మలు కొట్టివేసుకుంటూ తిరుపతి చేరినారని ఇప్పటికీ చెప్పు కొంటూంటారు. మనదేవుడు సువ్వర్ (పంది - శ్రీవరాహస్వామికి హైదరాలీ పెట్టిన పేరు) గాబట్టి - అతడు కొల్ల గొట్టలేదు. అంతా కొల్లగొట్టతాడనే భావించారు. కానీ భగవంతుడు అతనికి ఆ బుద్ధి పుట్టించలేదు, లేదంటే తనకు పోటీగా మంగాపురంలో వెలిసిన శ్రీకళ్యాణ వేంకటేశ్వరస్వామిని, తొండవాడలో వెలిసిన శ్రీ తిమ్మప్పస్వామిని మాత్రం కొల్లగొట్టమని హైదరాలీకి బుద్ధి పుట్టించాడు. హైదరాలీ ఆపనే చేశాడు.

---

* ఈ దామలచెఱువు ప్రాంతం పూర్వపు చోళ చాళుక్య రాజ్యముల సరిహద్దు. ఆ సరి హద్దును ఒక ఎత్తయిన మట్టి కట్టతో గుర్తించినారు. ఇప్పుడు మట్టికట్ట త్రవ్వివేయబడినది.

మన ఆలయాలు కొల్లగొట్టి మనకు లేకుండా చేశాడని మనం హైద రాలీని దూషిస్తాం గానీ నిజానికి అతని తప్పులేదు. తప్పంతా మనది. అంటే మనజమిందారులు - పాళేగార్లది.

హైదరాలీ సంవత్సరం పైగా సైన్యాన్ని మేపవలసివచ్చింది. అతనికీ ప్రాంతంలో సహాయకులుగా నిలిచింది - కార్వేటినగరంరాజా, కాళహస్తిరాజా- ఇంకా యీ పరిసరంలోని పాళేగార్లు. హైదరాలీ తమనెక్కడ డబ్బు తెమ్మంటాడోనని, ముందుగా తమ విరోధియైన చంద్రగిరి నవాబును చూపిం చారు. హైదరాలీ చంద్రగిరి నవాబును బందీగా పట్టుకొని శ్రీరంగపట్నం పంపించాడు - శ్రీరంగనాథస్వామిని చూసిరావడానికి కాదు - కారాగార వాసానికి! అంతా కొల్లగొట్టి వాడి ఖజానాచూస్తే - వాడు నవాబుకాదు ఫకీరని తెలిసిపోయింది. చంద్రగిరికోట కొల్లగొట్టిన డబ్బు మైసూరు సైన్యానికి ఆరు మాసాలకు కూడా రాలేదు.

ఇకనేం చేస్తారు? రాజాలు, పాళేగార్లు శివాలయాలలో డబ్బుండదని, వున్నదంతా వైష్ణవాలయాల్లోనే వుంటుందని; తొండవాడవైపు ఒకడు, మంగా పురంవైపు ఒకడు చేతులు చూపించారు. చూపించడమే కాదు - ఆలయాల్లో ధన కనకాలు వెదుకవలసినచోటు కూడ చెప్పి పంపారు. పోటీగావున్న ఈ రెండు ఆలయాలపతనంతో తమ కాళహస్తిగుడికి ఎక్కువగా జనం వస్తారనుకొన్నాడు కాళహస్తిరాజా తమ నారాయణవరంకు ఎక్కువమంది యాత్రికులొస్తారని లోలోన మురిసిపోయాడు కార్వేటినగరంరాజా. ఇందులో మొదట చెప్పిన రాజా వుద్దేశం నెరవేరినా, రెండవరాజా వుద్దేశం నెరవేరలేదు. నారాయణవరం ఆలయం ఆనాడుగానీ, యీనాడుగానీ ఎక్కువమంది యాత్రికులను ఆకర్షించ డంలో సఫలీకృతం కాలేదు.

మన స్థానిక రాజాగార్లు, పాళేగార్లు యింతపని **చేశారంటే ఎవరికీ** నమ్మకం కుదరదు కానీ చేశారు. వారుమాత్రం ఏంచేస్తారు? అప్పటికే వారి

* సంస్థానాలు అప్పుల్లో మునిగి తేలుతున్నాయి. ఇక హైదరాలీకి ఎక్కడనుంచి అప్పుతెచ్చి యిస్తారు? ఇంకా అతడేమయినా ఇస్తాడేమో పుచ్చుకొందామని, ఇవ్వకపోయినా కొల్లగొట్టినచోట్ల దొరికిన మేరకు స్వాహా చేద్దామని వాడితో కలిశారేగానీ, లేకపోతే యుద్ధం చేయడానికి వారి చేతులకు తీట పట్టలేదు.

ఈస్టిండియా కంపెనీ రికార్డులు చూస్తేగానీ, కాళహస్తి సంస్థానంవారు అచ్చువేసిన 'హిస్టరీ ఆఫ్ కాళహస్తి' — (రెండు వాల్యూములు - 1891 నాటి ప్రచురణ హిందూ ప్రెస్ ముద్రణ) చదివితే, పొరబాటు వ్రాయలేదని తెలుసుకొంటారు.

ఆంగ్లేయులు అడవులలోకి తరుమగొట్టినా, మార్షల్‌లా ప్రకటించినా, తిరుమల యాత్రీకులను దారులుగాచి కొల్లగొట్టిన రాజాగార్లు, పాళెగార్లు హైదరాలీకి ఆలయ దోపిడీలకు దారి చూపించలేరా? చూపించారు. అయితే పాపం, వారుకూడ హిందువులే గదా! అందుకని దైవ విగ్రహాలను ఏమీ చేయకూడదని వారిదగ్గర మాటతీసుకొన్నారు.

దోపిడివిషయం ముందుగానే తెలిసిన తొండవాడ భాకర అగ్రహారం లోని ఆలయ అర్చకులు ఆలోచనలేకుండా, తిమ్మప్ప ఆలయానికి, తొండ వాడలోని అమ్మవారి ఆలయానికి తాళాలు బిగించారు. అదీ జరిగిన పొరబాటు. సైనికులు ఖచ్చితంగా ఆలయాలు పడగొట్టి లోపలకు ప్రవేశించవలసి వచ్చింది. ఆ విధంగా ఆ రెండు ఆలయాలు శిథిలమయ్యాయి. కానీ విగ్రహాలు వారు భిన్నం చేయలేదు. అవతల మనవారు కొందరు పీఠంనుంచి విగ్రహాలను పూడబెరికి అవతలబెట్టి, స్థానంలో ఆ బంగారు నవరత్నాల నిధికోసం అన్వేషించారు. వారికెంత లబ్ధి దొరికిందో?

---

* తిరుమల ఆలయం మహంతుల పాలనలో నున్నప్పుడు కార్వేటినగరంరాజా తి.తి.దే.కు తిరుత్తణి తాలూకా అత్తిమంజేరిపేట నగం తాలూకా అమ్మినాడు. కాళహస్తిరాజా కచ్చినాడు తాలూకా అమ్మినాడు. సంస్థానాలు అప్పులుపాలయి ఇలాగయిపోయాయి. వీరిద్దరిని భగవంతుడిలా శిక్షించాడా?

అలమేలుమంగాపురం అర్చకులు తెలివయినవారు. వారు ఆలయానికి తాళాలు వేయలేదు. సైనికులు నేరుగా లోపలికిపోయారు. స్వామి దర్శనం చేసుకున్నారు. ధనంకోసం ఆయనను కదలిద్దామనుకుంటే, ఆయనే వీరిని కదలించేటట్టున్నాడు. ఆయనను చూసి జడుసుకొని బయటవచ్చి, అమ్మగారు ఆళ్వారులు, ఆచార్యపురుషులు వీరంతా సాత్త్వికులు గాన అక్కడ దొరకిన దంతా చేబుచ్చుకొని చక్కగా సారాయి అంగళ్లకు పోయారు - సేదతీర్చుకోవడానికి.

తిమ్మప్పస్వామి విగ్రహం శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి విగ్రహమంత వుండివుంటే బాగుండేది. కానీ తిమ్మప్పస్వామి నాలుగడుగులకు మించి లేడు. అందువల్ల ఆయనను వూడబెరికి అవతల బెట్టగలిగారు - మన పాళేగార్లు.

మ్లేచ్ఛులు ప్రవేశించిన ఆలయాలలో, నిత్యానుష్ఠానముచేయు బ్రాహ్మణులు ప్రవేశించ నిరాకరించడంతో పరిస్థితి తారుమారయింది. ఆలయాలు పవిత్రం చేయు కార్యక్రమము లటుండనిచ్చి, వున్న విగ్రహాలను కళాకారులు-ఆకోవకు చెందినవారు, అలంకరించి, ఆనందించడానికి, అపహరించడంతో 'వున్నది పోయెరా!.... దేవుడా!, అన్నమాట నిజమయింది. చిన్నతనంలో మేము చూస్తూండగానే (1949 లో) మైసూరు మ్యూజియంకని తిమ్మప్ప (శ్రీ వేంకటేశ్వరస్వామి) విగ్రహాన్ని కొందరు తీసికెళ్లారు. తీరా విగ్రహం మైసూరు చేరిందో లేక ఇంకెక్కడయినా చేరిందో తెలియదు. మైసూరు మ్యూజియం మేము చూడలేదు.

ఈవిధంగా, పదిమందిలో ప్రత్యక్ష సాక్ష్యం చెప్పిన అలమేలుమంగమ్మ ఎక్కడుందో, ఏ మ్యూజియం చేరిందో తెలియదు. అమ్మవారు, ఆళ్వారులు, ఆచార్యపురుషులు అదృశ్యం కావడంతో అలమేలుమంగాపురం నామంలోని 'అలమేలు' అన్న పదంకూడ అదృశ్యమయి కేవలం 'మంగాపురం' అన్న మాట ఆ గ్రామానికి స్థిరపడింది.

ఇన్నాళ్లు తిరుచానూరుగ ప్రసిద్ధిగాంచిన గ్రామం, ఈ సంఘటన తరువాత క్రమ క్రమంగా, "అలమేలుమంగాపురం" గా ప్రఖ్యాతి గాంచింది.

ఇటీవల ఆ ఆలయంలో రెండుమూడు భిన్నమయిన ఆళ్వారుల విగ్రహాలు బయటపెట్టివుంచారు. అవి ఇటీవల అక్కడ బయటపడివుంటాయి. అదే విధంగా ఆలయానికి ఆగ్నేయంగా పెద్ద పెద్ద రాతికూనములు స్తంభము లున్న చోట పరిశీలించి త్రవ్వితే అమ్మవారు కూడ ఆ విర్భవించవచ్చు - (ఇసుకలో పూడివుంటే.)

అమ్మవారు అదృశ్యం అయినా, స్వామివారు నిశ్చలంగా మొండిగా అక్కడే నిలబడినారు. హైదరాలీ పోయినాడు. టిప్పు సుల్తాన్ ఓడినాడు. ఆంగ్లేయుల ఆర్కియలాజికల్ డిపార్టుమెంటువారు వచ్చి వున్నది పోకుండా కాపాడినారు.

తి. తి. దే. వారు నాగలాపురం, నారాయణవరం ఆలయాలతో బాటు యీ కళ్యాణ వేంకటేశ్వరస్వామివారి ఆలయాన్ని కూడా తమ పాలన లోకి తీసుకొన్నారు. ఆరోజునుంచి యీ గ్రామం పేరు తిరిగి శ్రీనివాస పద యుక్తమయి, శ్రీనివాస మంగాపురంగా ఖ్యాతిగాంచినది. కీ. శే. శ్రీతాళ్ల పాక సూర్యనారాయణ చిన్నన్న సంతతివాడు. ఈయన అన్నమాచార్యుల దేవతార్చన విగ్రహాదులను శ్రీనివాసమంగాపురం ఆలయం చేర్చినాడు. అన్న మాచార్యుల పూజామండపం, భజనచిరుతలు, తులసీతావళం, ఒక స్ఫటిక హారం, ఇత్తడి మకరతోరణం, వెండి గొడుగులు వీటిలోవున్నాయి. వీటి నక్కడ ఎంతో పవిత్రంగా పరిగణిస్తూ పూజిస్తారు.

శ్రీ ఎం. చంద్రమౌళిరెడ్డి తి. తి. దే. కార్యనిర్వహణాధికారిగా నున్న పుడు ఈ ఆలయగోపురాలు, ప్రాకారాలు, కొన్ని లక్షలరూపాయల ఖర్చుతో పునరుద్ధారణ చేసి మంచిస్థితికి తెచ్చినారు. ఆలయానికి ఆదాయం పెరిగింది. స్థానికులకు భక్తి హెచ్చింది, ఇన్నాళ్లు పూజచేసిన శ్రీకృష్ణస్వామి అస్తమించినా, ఆయన దగ్గర తర్ఫీదుపొందిన అర్చకులు పూజలు సక్రమంగా చేస్తున్నారు. వేదపారాయణం జరుగుతోంది. అంతా సవ్యంగావుంది.

ఈ ఆలయం తిరుపతినుంచి మదనపల్లెకుపోవుదారిలో తిరుపతినుంచి 7 మైళ్లదూరంలోవుంది. చంద్రగిరి రైల్వేస్టేషను నుంచి ఒకమైలు. ఇక్కడి నుంచి తిరుమలకు సగందూరంబస్సు - అక్కడినుంచి కాలిదారి మార్గమున్నది. ఇక్కడ దేవస్థానంవారి ధర్మశాలకూడవుంది. ఈ గ్రామంలో ఒక రేణుకా దేవి ఆలయం ఒక చిన్న భజనగుడివున్నాయి.



శ్రీనివాసమంగాపురం ఆలయ ప్రస్తుతదృశ్యం

# సువర్ణముఖి - తొండవాడ

## (శ్రీ అగస్త్యేశ్వర క్షేత్రము)

అగస్త్య మహాముని దక్షిణాదికి వచ్చునపుడు, వింధ్యాచలము గర్వ మణచిన విధము.

"వింధ్యాచలేంద్ర! పృథ్వీభృత్కుల శ్రేష్ఠ!
దక్షిణాపథము తీర్థంబు లాడఁ
బోవుచున్నార మీవువ్వఁ బోఁడియు నేను
బెద్దకాలమునాఁటి పెరువఁ గాన
లావుచాలదు, జరాక్లైబ్యంబు కతమునఁ
బొడ వెక్కునప్పుడు డిగెడునపుడు
అభ్రంకషములైన యానీశిరశ్శృంగ
శృంగాటకములిట్లు చిఱుతపఱచి

అనఘ! నే గ్రమ్మఱఁగ వచ్చునంత దాఁక
నుండ వలయు ధరిత్రిలో నొదిఁగి నీవు
చేయు నాయాజ్ఞ లెన్నయాఁ, జేయకున్న,
నెటిఁగెదవు గాక రాజాడ నేల యిపుడు.

అనిన వింధ్యంబు 'మహాత్మా! చరాచరంబైన జగంబునందు నీయాజ్ఞ జేయనివారునుం గలరె? నీవు మరలి విచ్చేయునంత దాఁకను నిట్లయుండెద' ననినఁగుంభ సంభవుం డతని దీవించి, నిజపాదాంభోరుహ విన్యాసంబుల విశ్వంభరా భాగంబు భాగ్యవంతంబు గావించుచు దక్షిణ దిశాభిముఖుండై చనియె."

—(శ్రీనాధుని కాశీఖండము నుండి.)

ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళములో సువర్ణముఖిని గూర్చి ఇట్లు వ్రాయ బడివున్నది.

"ఉత్తరార్కాడు మండలములో (ప్రస్తుతము చిత్తూరు జిల్లా) చంద్రగిరి కొండలలో అగస్త్యాచల సమీపమున నుద్భవించి, చంద్రగిరి తాలూకాలో ఆగ్నేయ మూలముగా ప్రవహించి, తూర్పుముఖమై. రేణిగుంట సమీపమున రాళ్ళకాల్వతోగలుసుకొని, పెన్నానదికి సమదూరముగా కాళహస్తి, వెంకటగిరి తాలూకాల మధ్యమండిపారి, సూళ్ళూరుపేట తాలూకాలో ఈశాన్యమూలగా పోయి, గూడూరు తాలూకాలో తూర్పుగా ప్రవహించి, సిద్ధపరము సమీపమున పూర్వసముద్రములో (బంగాళాఖాతము) గలియుచున్నది.

"శ్రీకాళహస్తి మాహాత్మ్యములో *ధూర్జటకవి యీ సువర్ణముఖనదీ జనన ప్రకారము వర్ణించియున్నాడు. అగస్త్యమహర్షి దక్షిణ తీర్థయాత్రకు భార్యాసమేతుడై వెడలి సిద్ధవటనాథునిగూర్చి, యాప్రాంతభూముల పుణ్యనదీ ప్రవాహములేని కతమున నచ్చటమునులచే నొకనది ప్రవహింప వేడుకొనబడి, సిద్ధవట క్షేత్రమునకు జతుర్యోజన మాత్రమున నొక్క కొండచెంత ఘోర తపస్సు చేయగా పరమేశ్వరుని యాజ్ఞచొప్పున బ్రహ్మనతని యెదుట. ప్రత్యక్షమై వరమేది యేని వేడుకొమ్మనెనట.

ఉ. ఏనజుడన్ మునీంద్ర! పరమేశుడు నీకు నభీప్సితంబున
నీనియమించి పంచె, వరమెయ్యది వేడుమటన్ననభ్రగం
గానది దెచ్చియిచ్చట నఖండగతిం బ్రవహింపజేయవే!
దానమనోరథము ఫలితంబగునాకు బయోజ సంభవా!

ఉ. నావుడు దమ్మిచూలి గగనంబుగనుంగొనగా సువర్ణశో
భా విభవంబుతో బహుళభంగ మహాముఖరత్వ సంపదన్
దేవనదీ ఝురంబు సనుదెంచిన గాంచి విరించి తద్గుణ
శ్రీ వెలయన్ సువర్ణముఖరీప్రథ దానికి గల్గజేయుచున్.

---

*ధూర్జటిని గురించిచాటువు. "స్తుతమతి యైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల కల్గెనీయతులిత మాధురీ మహిమ"

శా. అంతర్ధానముసేసెః సంయమికులాధ్యక్షుండు సంతోషిత
స్వాంతుండయ్యెః వహించెనగ్గిరి యగస్త్య గ్రావవిఖ్యాతిః నా
శాంతంబుల్ పగులంగ మ్రోయుచు నభంబాద్యంతమున్ శీకరా
క్రాంతంబైమెఱయున్ సువర్ణముఖరీ గంగానదీ రత్నమున్.

శ్రీకాళహస్తి మాహాత్మ్యము. ప్రథమాశ్వాసము పద్యములు 139; 140; 141.

ఆకాశము నుండి గంగ సువర్ణశోభతో భూమికి డిగ్గినందున, ఈ నదికి సువర్ణముఖియని పేరు వచ్చెననియు, నా నది పుట్టిన కొండ ప్రాంతమునకు అగస్త్యాచలమని పేరు వచ్చెననియు (పి. కొత్తకోట సమీపం - ఆదినేపల్లి గ్రామం) పైవర్ణనములోని భావం. ఈ నది నెల్లూరు మండలములలో దక్షిణ ప్రాంతమున ప్రాచీనదేశ విభాగమగు పడనాటి మధ్య ప్రవహించుచున్నది."

శాసనములలో సువర్ణముఖరీ నది ప్రస్తావన ఇలా వుంది.

1. చంద్రగిరి ర్యాహ్వామే రాజ్యే పడనాడు మహీతలే
పోరూరు సీమ విఖ్యాత ప్రతిష్ఠితమనుత్తమమ్.
సువర్ణముఖరీ నద్యాదక్షిణాందిశి మాశ్రితం
తండంచ (తండ్లం) గ్రామసంయుక్తం లింగం పాడ్పితి నామకం॥

(క్రీ. శ. 1429 - 30)

2. చంద్రగిర్యాఖ్య రాజ్యేతు పడనాడోస్తు సీమని
నద్యా సువర్ణముఖ్యాయాః స్థలే పుణ్యేమనోహరే।
కావలూరం (కాలూరు) మహా గ్రామం వాసయోగ్యం మనీషిణాం॥

(ఎన్. ఐ. సి. పి. నంబ. 15. క్రీ. శ. 1336 - 37)

ఈ శాసనాలు కూడ పైగ్రంథములోనివే.

పురాణాలలోని ప్రస్తావనలు - ప్రశస్తి అటుండనిచ్చి - శాసనాలలో వైకుంఠవలనాడుగా పల్లవుల కాలములోనే పేర్కొనబడినది యీ ప్రాంతం. క్రీస్తుపూర్వంనాటి శాతవాహనులకు, ఆంధ్రులైన పల్లవులు సామంతులు. వారి

తరువాత చోళులు, బాణరాజులు, పాండ్యులు, తెలుగు పల్లవులు, తెలుగు చోళులు, వైదంబులు, యాదవరాజులు ఇందరి పరిపాలనలో అంతర్భాగంగా వున్న యీ ప్రదేశం క్రీ. శ. 1336 లో విజయనగర రాజ్యస్థాపనతో వారి ఏలుబడిలోకి వచ్చినది.

విజయనగర రాజ్యస్థాపన నాటిదయిన, పైరెండవ శాసనంలో శ్రీ అగస్త్యేశ్వర ఆలయానికి ఉత్తరంగా సువర్ణముఖినదీ తీరంలోనున్న కావలూరం (కాలూరు) గ్రామం పేర్కొనబడటం గమనించ దగినది. ఆలయానికి తూర్పుగా కొద్ది ఆగ్నేయంగానున్న పైడిపల్లి గ్రామం వీరనరసింగదేవయాదవ రాయల కాలమున క్రీ. శ. 1209 - 1262, మరియు అచ్యుతదేవరాయల కాలమున పేర్కొనబడినది. ఆలయానికి దక్షిణం కొద్దిగా నైఋతిదిక్కులో నున్న * తొండవాడ (తొండప్పాడి) రెండవ దేవరాయల కాలమున (క్రీ.శ. 1406 - 1447) అనగా క్రీ. శ. 1433 లో పేర్కొనబడినది. కానీ అది అప్పటికే చంద్రగిరిలో అంతర్భాగం. క్రీ. శ. 1433 నాటి శ్రీనివాస పురము (శ్రీనివాసమంగాపురము) శ్రోత్రియంగా వేదపారాయణ దారులకు సమర్పించినప్పుడు యీ గ్రామాల వారంతా సాక్షినంతకాలు వేశారు. తాళ్ల పాక చిన్న తిరుమలయ్యంగారు క్రీ.శ. 1540 లో మంగాపురంలో జీర్ణోద్ధారణ చేసినపుడుగానీ, క్రీ. శ. 1542 లో తాళ్లపాక చిన్నన్న తిమ్మప్ప ఆలయం తొండవాడలోనే నిర్మిస్తూన్నప్పుడు గానీ, యీ తొండప్పాడి గ్రామం పేర్కొన బడలేదు. అందుకు కారణం క్రీ. శ. 1433 - 1542 మధ్య కాలంలో వరదలు వంటి ప్రకృతి వైపరీత్యాలు సంభవించడం దాంతో గ్రామం అంతరించడం.

అప్పటికి గ్రామంలో నివశిస్తున్న పెరుమాల్‌లు, అప్పావేలన్‌లు ఏమయినట్లు ? వారే దక్షిణ దేశానికి వలసబోయి తొండప్పాడి నుంచివచ్చిన వారుగాన, తొండమానులయి, చరిత్ర ప్రసిద్ధికెక్కినారు.

---

* పన్నెండుగురు ఆళ్వారులలో ఒక ఆళ్వారు పేరు తొండవాడ పేరుకు సన్నిహితంగా వుంటుంది. ఆయన "తొండరడిప్పొడి ఆళ్వారు" ఈయనను తెలుగు వారు విప్రనారాయణుడని

శ్రీ వేంకటాచల మాహాత్మ్యంలో కడుముఖ్యులైన ఆకాశరాజు గానీ, ఆయన తమ్ముడు తొండమానుడు గానీ చోళరాజులుగా ప్రసిద్ధిగాంచి, చరిత్ర కారులచే చోళులుగా స్థిరపఅచబడిన వారు.

ఇక యీ తొండమానులు ఎవరు? పుదుక్కోట ఆంధ్రుల చరిత్రలో, యీ తొండమాను రాజులు తిరుపతి ప్రాంతమును౧చి వచ్చిన వారని పేర్కొన బడినది. తిరుపతినుంచి పోయినంతమాత్రమున తొండమానులను పేరు ఎలా వస్తుంది? కాబట్టి తొండప్పాడి నుంచి పోయిన వారు తొండమానులయినారని చెప్పవచ్చు లేదా తొండమండలమునుంచి పోయినవారన్నా తొండమానులు అని చెబితే అర్థముంటుంది. పుదుక్కోట వారు 1891 సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం తామంతా ఉత్తరాదినుంచి (వడుగ తెలుగు) వచ్చామని చెప్పారు. అట్టివారి సంఖ్య 1,80,884. వీరంతా నరసింగరాయల రాజ్యము నుండి (కృష్ణదేవరాయల అన్న క్రీ. శ. 1500 ప్రాంతం) వచ్చిన వారని ఫాదిరి ఓరంటినో వ్రాసినాడు. క్రీ.శ. 1542-44 ప్రాంతాల మున్న సేంట్ జీవియరను జెసూయిట్ ఫాదిరి తన ఉత్తరాలలో వీరిని (బడుగులుగా) పేర్కొన్నాడు. కాబట్టి ఖచ్చితంగా తెలుగువారి ప్రాబల్యం పెరిగేసరికి, నగం తెలుగు వారయిన యీ తొండమానులు చంద్రగిరి ఖాళీచేసి దక్షిణాదికి వెళ్ళిపోయారు. వారిలో రఘునాధ తొండైమాను, కరుణాకర తొండైమాను ప్రసిద్ధులు. రఘునాధ తొండైమానుడు పుదుక్కోట సంస్థానాధిపతి. క్రీ. శ. 1769-89 నాటి వాడయిన తెలుగు కవి వెంకన్న, తొండమాను వంశావళి వ్రాసినాడు. ఇతని కుమారుడు సాంబయ్య తొండమాను విజయమును రచించినాడు.

ఇది తొండప్పాడి వదలిపోయిన తొండమానుల కథ. వీరు వదలి వెళ్ళేసరికి, చంద్రగిరి రాజుల చిన్న పట్టణాలు (నబ్ అర్బలు) వెలిసినాయి. తి. తి. దే. శాసనాలలో చంద్రగిరిలోని చిన్న పట్టణాలు కొన్ని కనిపిస్తాయి. ఇవన్నీ కూడ క్రీ. శ. 1542 అంతంలో అంటే అచ్యుతదేవరాయల పాలనా చివరి కాలములో, సదాశివరాయల కాలములో వెలిసినట్లున్నాయి. దానికి

కారణం - శ్రీనివాసమంగాపురములో ఆలయజీర్ణోద్ధారణ జరిగినది. తొండ వాడలో తిమ్మప్ప ఆలయ నిర్మాణము క్రొత్తగా జరిగినది. కావున జనా వాసముల కావశ్యకత ఏర్పడినది.

చంద్రగిరిలో వెలసిన చిన్నపట్టణాలు (సబ్ అర్బ్‌లు): కృష్ణరాయ పట్టము, గోపిదేవిపాళెం, కృష్ణరాయపురము, నరసింగరాయపురము గ్రామం. శ్రీనివాసపురం గ్రామం. తిరుపతికి చంద్రగిరికి మధ్యదూరము 6 మైళ్లు కాబట్టి తిరుపతిలోని చిన్న పట్టణాలు (సబ్ - అర్బ్) కూడ తీసుకొని భాగిస్తూ పస్తే అన్నీ సరిపోవచ్చు. భాష్యకార అగ్రహారం, శ్రీనివాసపురం, రఘునాధ పురం, తిరువేంకటాపురం, నరసింగరాయపురం, అచ్యుతరాయపురం. నాథముని అగ్రహారం, వాది రాజపురం.

## తిరుపతి చరిత్రకారులు ఇదివరకు నిర్ణయం చేసినవి:

భాష్యకార అగ్రహారం — శ్రీ గోవిందరాజస్వామి, సన్నిధి వీధి, ఉత్తర దక్షిణ, తూర్పుపడమరమాడవీధులు.

రఘునాధపురం — శ్రీ కోదండరాముల వారిగుడి. సన్నిధి వీధి, నాలుగు మాడ వీధులు.

నరసింగరాయపురం — మంచినీళ్లగుంట - అనగా నరసింహతీర్థ ప్రాంతము

అచ్యుతరాయపురం — కపిల తీర్థం దగ్గర తూర్పువైపున్న శిధిలాలు - ఇది వరకటి కొత్తూరు లేక కొట్టూరు.

నాథముని అగ్రహారం — నాథముని వీధి పరిసరాలు.

## కొంత సందేహంగా నిర్ణయం చేసినవి.

శ్రీనివాసపురం — ప్రస్తుత పళని సినిమాటాకీసు ముందున్న అగ్రహారం గ్రామం.

వాదిరాజపురం — తిరుచానూరు.

శ్రీనివాసపురం గ్రామం — శ్రీనివాసమంగాపురం.

## అసలు నిర్ణయం చేయకుండా వదలి వేసినవి.

| | |
|---|---|
| తిరువెంకటాపురం | — ఇక్కడ శ్రీరామాలయం వుండాలి. అది ఎక్కడా కనబడలేదని వదలివేశారు. చంద్ర గిరి మధ్య అంటే రెండు పేటల మధ్యనే వుంది. ఆ విషయం వారికి తెలియక పోయి వుండవచ్చు. |
| నరసింగరాయపురం గ్రామం | — నరసింగాపురం. |
| గోపిదేవి పాళ్యం | — మిట్ట పాళ్యం. |
| కృష్ణరాయపురం లేక కృష్ణరాయపట్టణము | ఇది ఖచ్చితంగా తొండవాడ అయివుండాలి. |

ఎందుకంటే చంద్రగిరిలోని కొత్తపేట దాని పేరును బట్టే అది ఇటీవల ఏర్పడి నది. పైగా చంద్రగిరిలోనే వుంది గాబట్టి అది సబ్అర్బ్ కానేరదు. ఇక పశ్చిమంగా వున్న అదిత్తిపల్లి లేక అయితేపల్లి, గ్రామాలలో వచ్చివేసింది, అలాగే మల్లయపల్లి కూడ - *మల్లయ మంత్రి పేరు మీద వెలిసింది. ఈ కాలం నాటికి యీ ప్రాంతాలలో ఎవరు నివశిస్తున్నారు? క్రి. శ. 1540 నుంచి 1700 వరకు, భాష్యకార్ల అగ్రహారం, రఘునాధపురం, నరసింగరాయ పురం, అచ్యుతరాయపురం, శ్రీనివాసపురం, శ్రీనివాసపురం గ్రామం, నాథ ముని అగ్రహారం, వాదిరాజపురం, తిరువేంకటాపురం - ఇదంతా బ్రాహ్మణులు నివశిస్తున్నారు. తక్కిన నరశింగరాయపురం గ్రామం, కృష్ణరాయ పట్టణము, గోపిదేవి పాళ్యం - ఈ చిన్న పట్టణాలలో వర్తకులు మాత్రం నివశిస్తున్నారు. పట్టణాలు గదా! అందువల్ల వ్యాపారస్తులు, వర్తకులు వీరు మాత్రం నివశిస్తున్నట్టుంది. అక్కడ నివసించిన వారి కొన్ని పేర్లు చూడండి. అప్పయ సెట్టి, ఎల్లప్పయ్యర్, కృష్ణప్ప సెట్టి, నామిసెట్టియార్, రామభట్టర్, శిష్ట భట్టర్, తిమ్మరసయ్యర్, వెంగాలు సెట్టియార్ - మొదలగునవి.

---

*సాలువ మల్లయ దేవమహారాజు తిరుమలలోని వేయిగాళ్లమంటపమును క్రి. శ. 1456 ప్రాంతంలో నిర్మించినాడు.

ఈ వ్యాపారస్తులందరు, ఈ ప్రాంతాలలో హైదరాలీ దండెత్తే దాక వున్నారు. పట్టణాలలో ప్రవేశించి ఆలయాలు కొల్లగొట్టడమే కాకుండా, ప్రక్కనున్న పల్లెలలో జొరబడి ఇండ్లలో ప్రవేశించి సైనికులు ఏంపని చేస్తారో ఆ పనే చేశారు హైదరాలీ సైనికులు. ఈ ప్రాంతములోని ప్రజలు హైదరాలీ సైనికుల చేతిలోపడిన పాట్లు, శ్రీ వేంకటాచల విహార శతకములో వర్ణింపబడివున్నవి. కవినామం తెలియదుగానీ, ఆతడు నిందాస్తుతిగ వ్రాసిన పద్యములు :

సీ॥ వడిగుళ్లు సొచ్చి దేవళ్ల బద్దలుచేసి
ఘట్టించి తేజీలఁ గట్టునపుడు
జిగురు పాలకటంచుఁ జిగిరించు, రావిమ్రాఁ
కులు నజ్జు నజ్జుగాఁ గొట్టునపుడు
గురుసార్వభౌముల గోడుపోసుక పట్టె
నామము ల్మొదలంట నాకునపుడు
గద్దించి వెన వైదికపు బాపనయ్యల
పిల్ల జుట్లూడంగఁ బెఱుకునపుడు

తే.గీ॥ సెక్కెమా నీకుఁ దురకలఁ జక్కఁ సేయ
విన్నవించితి నా వెఱ్ఱి విన్నపంబు
పరఁగ మీ చిత్తమిదె నాదుభాగ్యమౌర.
శత్రుసంహార వేంకటాచల విహార.

సీ॥ పొట్టేళ్ల గతిఁబట్టి బోడినన్యాసుల
ఢీయని తాఁకులాడించు నొకఁడు
సోమయాజుల బ్రహ్మసూత్రముల్ ద్రెంచి సిం
గాణివిండ్లకుఁ నల్లెఁగట్టునొకఁడు
పైకాలుగొమ్మని బల్మిఁగోమటివారి
చెలువపైఁబడి బూతుసేయు నొకఁడు

తే.గీ॥ యవనసమ్మర్దదుర్దినంబైన దిగువ
తిరుపతినిఁజూడు మిటువంటి తఱిని నిదుర
పోవుచున్నాఁడు మీయన్న లేవలేక
శత్రుసంహార వేంకటాచల విహార.

సీ॥ మామిడిక్రింది సోమరిపోతు శ్రీభాష్య
కారులకేల సంగరము గొదువ
అలుమేలుమంగ సొమ్ముల పెట్టియలు కాచు
కొనియుండుటేచాలు హనుమనికిని
శీవిని బంకమంటివిరు ల్సమర్పించి
తెరు గాటుకరిగెను గురువనంబి
చెంచుమిటారితో బంచబాణక్రీడ
లోలుడయ్యెను కప్పడాల నృహరి

తే.గీ॥ నీకు మదికోపమింతయు లేకపోయెఁ
బోయె గాకేమి తొండమాన్భూమిపాలుఁ
డున్న నింతకుఁ దురకల మన్నిగొనడె
శత్రుసంహార వేంకటాచల విహార.

అంతకు మునుపుకూడ యీ ప్రాంతీయులు సుఖశాంతులు ఎరుగరు. పైగా భీకరక్షామం వచ్చింది. అందుకని క్రమంగా సుఖశాంతులులభ్యమయ్యే చోటికి వలసలు పోయారు. ఇదీ రెండవ వలస, మొదట తొండమానులు పోయారు.

క్రీ. శ. 1801 నాటికి దత్తమండలాలు హైదరాబాదు నవాబు ఈస్టిండియా కంపెనీకి అప్పజెప్పడంతో, ఈస్టిండియా కంపెనీవారు యీ దత్త మండలాలయిన కడప, కర్నూలు, బళ్లారి, అనంతపూరు, చిత్తూరులకు ప్రత్యేకంగా ఒక కలెక్టరును నియమించారు. ఆయనే ప్రసిద్ధి గాంచిన సర్ థామస్‌మన్రో. ఆయన వీలయినంత త్వరలో యీ ప్రాంతములో శాంతి భద్రతలను నెలకొల్పిన వాడుగ ప్రసిద్ధి గాంచినాడు. ప్రస్తుతము తిరుమల శ్రీవారి ఆలయంలో మన్రో ఉభయం ( గంగాలం ప్రసాదం ) కూడ వుంది.

క్రీ. శ. 1801 లో రాయలసీమలో భీకర క్షామం ఏర్పడింది. ఈ క్షామం తరువాత శాంతి భద్రతలు నెలకొనడంతో యీ ప్రాంతాలలో ఇప్పుడున్న గ్రామస్థుల ముందు తరంవారు స్వర్ణముఖి నీటి సౌకర్యం చూసి వలసలు వచ్చి ఇచ్చట స్థిరపడినారు. ఉదాహరణకు ఒక తొండవాడ గ్రామం చూడండి.

ఆ పూరివారు అని పిలువదగిన వారు, రెండు మూడు కుటుంబాలవారు మాత్రమే. తక్కిన వారంతా బయట నుంచి వచ్చినవారు. చిర్రారెడ్డిగారు, లండువారు, చిన్ననరసప్పగారు, జోగిరెడ్డిగారు ఆ గ్రామస్థులు. పల్లివాళ్లు - అక్కడ కొండ క్రిందపల్లి నుంచి వచ్చారు. ఈ నాలుగు కుటుంబాలకు చెందిన బంధువులంతా బయట నుంచి వచ్చిన వారని, వారి ఇంటి పేర్లు చెబుతున్నాయి.

| ఇంటిపేరు | వలసకు మునుపు వారి స్వస్థలము |
|---|---|
| మొగిలిరెడ్డివారు | -చిత్తూరు కవతల మొగిలి. ఇప్పుడక్కడ చాలమంది మొగిలిరెడ్లున్నారు. మొగిలి ప్రసిద్ధ శైవక్షేత్రం. |
| మండ్యంవారు | ఎల్లమండ్యం — గాజులమండ్యం. |
| బోయిరెడ్డిగారు | బోయిలుగడ్డవారు (తిరుమండ్యం దగ్గర). |
| రామిరెడ్డిపల్లివారు | రామిరెడ్డిపల్లి చంద్రగిరి దగ్గర. |
| మల్లంవారు | మల్లం, గుడిమల్లం లేక గూడూరుదగ్గరి మల్లం |
| తాతేకాల్వవారు | తాతయ్యకాల్వ - రేణిగుంట సమీపం. |
| సొరకాయలవారు (వీరు మొదట మడిరెడ్డివాళ్లు ఇంటిపేరు మధ్యలో మారింది.) | పైడిపల్లిగ్రామం - తొండవాడ సమీపం. |
| అవిలాలవారు | అవిలాలగ్రామం - తిరుపతి సమీపం. |
| తనపల్లివారు | తనపల్లిగ్రామం - తిరుచానూరు సమీపం. |
| జీపాళెంవారు | జీపాళ్యం (పాపానాయుడుపేట దగ్గర). |
| విగతమాలవారు | వికృతమాల ,, |
| వడమాలవాడు | వడమాలపేట సమీపం. |
| పచ్చికాలవ (వేగపరెడ్డివారు) | పచ్చికాలవ. |
| మామండూరువారు | మామండూరుగ్రామం. |

| | |
|---|---|
| పూతలపట్టువారు | పూతలపట్టు (చిత్తూరుదగ్గర). |
| కాణిపాకవారు | కాణిపాక (సిద్ధివినాయకక్షేత్రం) చిత్తూరు దగ్గర. |
| ప్రొద్దుటూరువారు (తుంగరామన్నపల్లి) | వీరు మొదట నగరిదగ్గర ప్రొద్దుటూరు, తదుపరి తుంగరామన్నపల్లి. |
| వెంకటాపురంవారు | వెంకటాపురం. |
| బొందు, బొబ్బు, పాలపాటివారు అడవిరెడ్డివారు | చంద్రగిరి, పెరుమాళ్లపల్లె, నరసింగాపురం నుంచి వచ్చినవారు. |

పై జాబితానుబట్టి, తొండవాడలో ఆవూరు వారనదగినవారు - ఏ నాలుగైదు కుటుంబాలో తప్ప తక్కిన వారంతా వలనవచ్చినవారు.

కృష్ణరాయపురం లేదా పట్టణం తిరిగీ తొండవాడ ఎలా అయింది? మధ్యలో వచ్చిన కృష్ణరాయపట్టణం మధ్యలోనే పోయింది. అచ్యుతదేవరాయలు తన అన్నగారిమీద ప్రేమతో ఆపేరు పెట్టారు. విజయనగర చక్రవర్తులున్నంతవరకు ఆ పేరుతో పిలువబడి వుండవచ్చు. నవాబుల రాకతో పూర్వపు తొండప్పాడిలో నివశించువారు తొండపాడోళ్లు, తొండవాడోళ్లు అయి, గంధర్వనామము 'తొండవాడ' అయివుంటుంది. శ్రీకాళహస్తికి సమీపంలోని తొండమనాడులోని వారికిని, తొండవాడ వారికిని సంబంధబాంధ్యవ్యములు ఇప్పటికీ వున్నాయి. ఈ పేరులలోని సామ్యము గమనించదగినది.

మద్రాసురాష్ట్రములోని ప్రాచీనస్థలాలు, గ్రంథాలు, పత్రాలుజాబితా తయారుచేస్తూ రాబర్ట్‌సివెల్ అను ఆంగ్లేయుడు (క్రీ. శ. 1882లో) యీ తొండవాడగ్రామంలోని అగస్త్యేశ్వర ఆలయ స్థలపురాణం, శ్రీకాళహస్తీశ్వర ఆలయ ప్రధాన అర్చకుల దగ్గరుందని వ్రాసినాడు. ఆ ప్రధాన అర్చకుడు దీనిని తమవారికి ప్రధానంగానే ఇచ్చాడు గానీ వారు దానిని అప్రధానంగా చూశారు. ప్రస్తుతం మన జిల్లా గెజిటీర్లు తయారుచేయువారు తమకు తొండవాడ అను గ్రామముందని, అక్కడంతటి ప్రాచీనాలయముందన్న సంగతి

తెలియనే తెలియదని అన్నారు. ఇలాంటి వారికంటే ఆంగ్లేయులు నయంకదా! కనీసం వారు తయారుచేసినవాటిని, చూసిఅయినా తయారుచేయాలికదా! — మన గెజిటీర్‌లను.

అన్నిటినీ ఇప్పుడు పరిశోధించి, దొరకని విషయాలు వూహించి, వూహించిన విషయాలు నిజమో అబద్ధమో అని తేల్చుకొని వ్రాయవలసి రావటం - మన దురదృష్టం.

సువర్ణముఖి తొండవాడ చేరేసరికి, దాని వుపనదులైన భీమానది, కళ్యాణినది కలుసుకొని వుంటాయి గాబట్టి యీ అగస్త్యేశ్వరక్షేత్రం - త్రివేణీ సంగమమయింది. భారత పురాణాలలో త్రివేణీ సంగమములకున్న ప్రాముఖ్యం అందరికీ తెలిసిందే. ఇచ్చట సువర్ణముఖి శ్రీ అగస్త్యేశ్వరునకు అభిముఖంగా ప్రవహించి ఆయన పాదాలు స్పృశిస్తూ, అవతల దక్షిణదిశగా మారుతుంది. ఈ ప్రవాహమే ఉత్తరవైపువచ్చి శ్రీ అగస్త్యేశ్వరుని చుట్టు ప్రవహించివున్నట్టయితే, ఇది కాశీక్షేత్రంలాంటి ప్రాముఖ్యము వహించివుండేదని విజ్ఞుల అభిప్రాయం. దక్షిణకాశీ అని పిలువబడే అనేక దక్షిణాదిక్షేత్రాలలో ఇదికూడ ఒకటి. దక్షిణాదిలో అగస్త్య ప్రతిష్ఠిత శివలింగాలలోకూడ నిదియునొకటి. సువర్ణముఖినదిలో స్నానంచేస్తున్న శ్రీ అగస్త్యమహామునికి ఒకశివలింగం దొరకడంతో ఆ పవిత్ర లింగాన్ని ఆయన అలాగే ప్రతిష్ఠచేసినారు. అందువల్ల ఆ శివలింగం సహజంగా వుంటుందిగానీ శిల్పించినట్టు వుండదు.

సువర్ణముఖిలో తొమ్మిదికాళ్లమంటపము ఒకటుంది. ఆ మంటపము తన అడుగుననున్న శ్రీ వేంకటేశ్వర పాదాలను అత్యంతభక్తితో రక్షిస్తూన్నట్టు గంభీరంగా నిలబడి వుంటుంది. అచ్చటున్నదే ప్రఖ్యాతిగాంచిన అగస్త్య పూజిత * విష్ణుపాదం. శ్రీ వేంకటేశ్వరస్వామి పెళ్లయిన క్రొత్తలో, శ్రీనివాస మంగాపురములో ఆరుమాసములు నివశించినపుడు రోజూ అగస్త్యాశ్రమమును

---

* ఈ విష్ణుపాదం పవిత్రత, గయక్షేత్రంలోని విష్ణుపాదం పవిత్రతతో సమానమైనదని సావల్ - ఇ - జవాబ్ అను గ్రంథంలో వ్రాయబడివుంది.

దర్శించినందుకు, కృతజ్ఞతతో అగస్త్యుని కోరికపై తన పాదముద్రలను ఒక శిలపై అనుగ్రహించినాడు కావున ఆ పాదముద్రలు అగస్త్యపూజిత విష్ణుపాదం అని ప్రశస్తినొంది, పుణ్యప్రదములైనాయి.

అగస్త్యేశ్వరస్వామిని శ్రీఅగస్త్యమహాముని ప్రతిష్ఠించిననాడు, ముక్కోటి దేవతలు పుష్పవృష్టి కురిపించారని పురాణోక్తి. అందుకు తగ్గట్టు యీ పుణ్య క్షేత్రానికి 'రుద్రపాదాలముక్కోటి' అను పేరు స్థిరపడింది. ఇచ్చట ప్రతి సంవత్సరము కార్తీక (అక్టోబరు — నవంబరు) పౌర్ణమినాడు యీ పేరుతోనే గొప్ప ఉత్సవము జరుగుతుంది. కొన్నివేలమంది భక్తులు ఆ రోజు స్వామి దర్శనం చేసుకుంటారు.

శ్రీ అగస్త్యేశ్వర పుణ్యధామము, ప్రకృతి రామణీయకతను పుణికి పుచ్చుకొన్న ప్రదేశము. ఉదయం సూర్యోదయం తరువాత ఆ క్షేత్రంలో నిలబడి పశ్చిమదిక్కుకేసి చూస్తే, భీమానది ఆవిర్భవించిన శేషాపురం కొండలు, తలకోన సిద్ధేశ్వరక్షేత్ర పుణ్యజలాలను మోసుకొచ్చి కళ్యాణిగ మార్చిన నాగపట్ల కనుమ, చంద్రగిరి - హేమగిరి, చంద్రగిరిమీదనున్న విజయనగర చక్రవర్తుల ప్రాచీన కోటగోడలు, మామిడితోటలలోనుంచి నిక్కి చూసే శ్రీనివాసమంగాపుర రాజగోపురం, పచ్చని చెట్ల గట్టులమధ్య పసిడి కాంతులీను స్వర్ణముఖి, తిరుపతి చిత్తూరు రస్తామీద అంతులేని శకట సంరంభం. యీ దృశ్యాలన్నీ హృదయానికి హత్తుకుపోతాయి. ఉత్తరవైపు చూస్తే శ్రీ వేంకటాచలము - చంద్రగిరి సోపానమార్గము - దానికెగువన శ్రీ వేంకటేశ్వర అతిథిభవనం - మైక్రోవేవ్ స్టేషనువున్న నారాయణగిరి, దక్షిణ వైపుచూస్తే స్వర్ణముఖికి మరొక వుపనది దోసిళ్లవంకను ప్రసాదించిన దోర్ణ కంబాల కొండలవరుస, జానంబట్ల తోటలు, పైడిపల్లి పైగట్టు ఇవన్నీ మనస్సును రంజింపచేస్తాయి.

ఇలాంటి సుందర ప్రదేశం కావుననే యీ దక్షిణ త్రివేణీ సంగమములో అగస్త్యప్రతిష్ఠత శ్రీ అగస్త్యేశ్వరస్వామి వెలిసినారు. పూర్వాలయం ఎవరో ఇటుకలతో నిర్మించారు. తదుపరి రాతితో నిర్మించిన యీ ఆలయంలో శిల్ప

కళారీతులు పల్లవ సంప్రదాయాన్ని పోలివున్నాయి. అంతరాలయాలను చాల ఆకర్షణీయంగా నిర్మించారు. అనవసరమయిన శిల్ప కళజోలికి వీరు పోలేదు. అవసరమయిన చోట్ల శిల్పించ కుండా వుండలేదు. ముఖద్వార కుడ్యంమీద, శ్రీ అగస్త్యమహాముని, తదితర మహర్షులు కొందరు పద్మాసనంలో కూర్చున్నట్టు ఆకర్షణీయంగా శిల్పించారు. గర్భాలయకుడ్యాలమీద బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మూడువైపుల ప్రతిష్ఠించారు. అమ్మవారిపేరు ఆనందవల్లి - పేరులోనే వుంది ఆమెమహత్తు. మొన్నటివరకు శ్రీ విఘ్నేశ్వరస్వామి, శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ఆలయద్వారపాలకులుగా వుండేవారు. వారికిప్పుడు ప్రత్యేక ఆలయాలు వెలిసినాయి. వారితోపాటు శ్రీకాలభైరవస్వామి వెలిసినాడు. నవగ్రహాలు వున్నాయి. తిమ్మప్పదేవాలయం శిధిలం కావడంతో ఆయనకు అభిముఖంగావున్న ఆంజనేయస్వామి ఇక్కడ ఒక చిన్న మంటపంలో వెలసినారు. ఇప్పుడు ఆలయానికి క్రొత్త ద్వారపాలకులు వచ్చారు.

ఈ ఆలయాన్ని ఎన్నోపర్యాయాలు బాగుచేశారు. ఒకటి రెండు పాత ఆలయాలు పడగొట్టారు, క్రొత్తవి కట్టారు. ఇవన్నీ అసలు ఆలయాన్ని తాకకుండా ముందున్న మంటపాల భాగంలో జరిగాయి. శాసనాలు దొరికే చోటు అదే. ఆరాళ్ళేతొలగించి, ఆలయింబాగు చేయడంతో యీ ఆలయ నిర్మాణము సంగతి అంతులేకుండా పోయింది.

కానీ, తి. తి. దే. వారిశాసన సంపుటి - 6 మొదటి భాగం, నంబరు 25 శాసనములో ఒకప్రస్తావనవుంది. ఈ శాసనం అలిపిరి పడాలమండపము లోభాగాననున్నది. ఈ శాసనము సీసమాలిక పద్యరూపముననున్నది. ఇది మట్ల ప్రభువైన *కుమార అనంతరాజుది. అంటే గోవిందరాజ రాజ గోపుర - అలిపిరిగోపుర నిర్మాణ కర్తశాసనము. ఈ శాసనము క్రీ. శ. 1628 నాటిది. చాలపెద్దది.

---

*ఈ మట్ల కుమార అనంతరాజు వితరణము గురించి ఒక కథచెప్పుకొంటారు. ఈయన గోవిందరాజస్వామి ఆలయ రాజ గోపురనిర్మాణమునకై బండ్లమీద సంచులలో ధనము పంపగా చిల్లులుపడి అది దారిలో కారిపోయినదని, ఆలయ శిల్పి రాజుగారిని పరీక్షింపనెంచి, అలా చెప్పి పంపెనట. దానికి రాజుగారు బాధపడకుండా, మీరు పనికానీయండి తిరిగీ పంపుతాను అని చెప్పారట. ఇదీ కథ

మనకు కావలసిన శాసన భాగము :
"10....చక్రధరుండు 1 పటుతర గోపుర ప్రతిపాదన దయావలోకన సోమ శిలాకపదిన్...."

సోమశిల=చంద్రగిరి, కపర్ది: శివుడు. ఈ శాసనాలను ఎత్తివ్రాసిన శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, మట్ల కుమార అనంతరాజు చంద్రగిరిలో శివునికి ఒక గోపురము కట్టెనని వ్రాసియున్నారు. చంద్రగిరి అనడానికి శాసనములో, సోమశిల, అనివుంది.

ఇది ఇక్కడిది కాదని, నెల్లూరు జిల్లాలోని సోమశిల - అంటే ఇప్పుడు సోమశిల ప్రాజెక్టు కట్టుచోటు ఏమోనని పరిశీలించగా అదికూడ కాదని తేలినది. చంద్రగిరిలో శివాలయాలు లేవు. కోట లోపలనున్నవి గోపురం కట్టగల అంతపెద్ద ఆలయాలు - వైష్ణవాలయాలు-అవికూడ శిధిలమై పోయాయి. ఇక చంద్రగిరి కొత్తకొనేటివద్ద వెలిసిన శివాలయం అనుకొందామాఅంటే, ఒక రాజుగారివూరిలో, ఇంకోరాజు గోపురంకట్టడం సాధ్యమా ? అది ఆవూరి రాజుకు నామోషీగదా ! పైగా ఈ కాలంనాటికి చంద్రగిరి రాజ్యాన్ని భక్తుడయిన శ్రీరామదేవరాయలవారు (ఘంటామంటపం ప్రశస్తి) పాలిస్తున్నారు. అందువల్ల ఇక మట్లరాజగోపురం చంద్రగిరి సబ్‌అర్బ్‌అయిన తొండవాడ శ్రీ అగస్త్యేశ్వర క్షేత్రంలోనేకట్టివుండాలి. ఎందుకంటే అది తొండవాడలో లేదు. ప్రక్కన వుంది. అది ఇటీవల జీర్ణోద్ధారణ జరిగిన గోపురం అవునో కాదో చెప్పలేము. ఎందుకంటే దానిమీద శాసనాలులేవు. పైగా అది పూర్తిగా ఇటుకల కట్టడం.

క్రీ. శ. 1628లో మట్లకుమార అనంతరాజు కట్టించిన గోపురము క్రీ. శ. 1780-81లో హైదరాలీ కొల్లగొట్టిన ఆలయాల జాబితాలో చేరిందేమో ! ఎందుకంటే యీ ఆలయం కూడ తిమ్మప్ప ఆలయంవలె తిరుపతి నుంచి చంద్రగిరికి పోవుదారిలో దారి ప్రక్కనేవుంది. ఆలయ గోపురంచూసి హైదరాలీ సైనికుల కళ్లు చెదిరినాయోఎమో ? శిధిలమయింది. తరువాత తొండవాడ చేరిన ఇప్పటివలన కుటుంబాల వారు చిన్నగోపురంగావున్న దానిని బాగుచేసి వుంటారు.

ఈ ఆలయం మొదట శ్రీ కాళహస్తీశ్వరాలయాధికారులయిన మహేశ్వరుల స్వాధీనంలోవుండేది. మహేశ్వరుల అనంతరము నాటుకోటి శెట్టియార్లు శ్రీ కాళహస్తీశ్వరాలయముతో బాటు దీనికి కూడ ధర్మకర్తలుగ వ్యవహరించారు. వారి కాలములో యీ ఆలయము జీర్ణోద్ధారణ చేయవలసి వచ్చింది. శ్రీకాళహస్తినుంచివచ్చి యీ ఆలయ నిర్మాణము చేపట్టుట అధిక వ్యయ ప్రయాసలతో కూడుకొన్నదిగాన, వారు యీఆలయ ధర్మకర్తృత్వమును తొండవాడ గ్రామములోని మొగిలి రెడ్లకు అప్పగించారు.

నూతన ధర్మకర్త అయిన శ్రీమొగిలి నారాయణస్వామిరెడ్డి ఆలయము దగ్గరనే రెండున్నర సంవత్సరములకు పైగా నివాసముండి ఆలయమును జీర్ణోద్ధారణ గావించినాడు. అశ్వత్థవృక్షవేదిక నొకదానిపై క్రీ. శ. 1909 పన్నగబింబ ప్రతిష్ఠాపన అని వ్రాసివున్నది గాన, యీ శిలాప్రవచనాన్ని ఆధారంగాతీసుకొని ఆలయమప్పుడు జీర్ణోద్ధారణ జరిగివుండవచ్చునని విశ్వసింపవచ్చు. ఆయన యీ ఆలయాన్నేగాక, చంద్రగిరిలోని శ్రీకోదండ రామస్వామి ఆలయాన్ని, నారాయణవరంలోని శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయాన్ని జీర్ణోద్ధారణ చేసి కీర్తిశేషుడయినాడు. ఆంగ్లేయులకాలంలో (క్రీ. శ. 1900 ప్రాంతంలో) ఆయన, యీ ప్రాంతీయ ఆలయాలన్నిటికి ధర్మకర్తగా వ్యవహరించినట్టు తోస్తోంది.

ఆయన తదనంతరము శ్రీమొగిలి కేశవరెడ్డి గారు, యీ ఆలయమునకు ధర్మకర్తగా వ్యవహరించిరి. ప్రస్తుతము శ్రీమొగిలి సుందరరామరెడ్డిగారు ధర్మకర్తగా వ్యవహరించుచున్నారు.

1969లో శ్రీకంచి కామకోటి పీఠాధిపతులు యీ ఆలయమును దర్శించిరి. 1979 ఫిబ్రవరిలో ఆలయమునకు అష్టబంధనముచేసి, జీర్ణోద్ధారణ గావించి, శ్రీ విఘ్నేశ్వరునకు, శ్రీ సుబ్రహ్మణ్యస్వామికి, శ్రీ కాలభైరవునకు నూతన ఆలయములు నిర్మించి, బయట ఒక పెద్ద నందీశ్వరుని నిర్మించి, ఏప్రిలు నాటికి శ్రీకంచి కామకోటి పీఠాధిపతి (జూనియర్‌స్వామి) శ్రీ చంద్రశేఖర జయేంద్ర సరస్వతిస్వామి వారిచే కుంభాభిషేకము జరిపించబడినది.





కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖర జయేంద్ర సరస్వతీస్వామి

ఈ సందర్భములో ఆయన, అమ్మవారిముందు శ్రీ చక్రప్రతిష్ఠాపన గావించిరి. మూడురోజులుపాటు బ్రహ్మాండముగ ఉత్సవములు జరిగాయి. అనేకమంది భక్తులు పాల్గొన్నారు. మహాకుంభాభిషేకము జరిగిన తారీఖు 12-4-1979. ఈ ఆలయజీర్ణోద్ధరణకు తి. తి. దే. వారు ద్రవ్య సహాయముచేశారు. కొంతపైకమును ఆంధ్రప్రదేశ ప్రభుత్వదేవాదాయ ధర్మాదాయ శాఖవారు సహాయముచేశారు. ఆలయనిర్మాణమునకు ప్రభుత్వస్థపతులుకూడ సాంకేతిక సహాయము అంద చేసినారు.

ఇదేసమయమున తొండవాడ గ్రామమునందు శ్రీరామ భజనమందిరమును, యీ గ్రంథరచయిత, మధురాంతకం బాలసుబ్రమణ్యం ముందు నిలబడి విరాళములు ప్రోగుచేసి భక్తులు, ధర్మకర్తలు, గ్రామస్థులచే నిర్మింపజేసిరి. ముందున్న భజనమందిరమును యీ గ్రామ స్థిర నివాసులగు చిర్రారెడ్డిగారు నిర్మించియుండిరి. అది 22 సంవత్సరములకు పూర్వము కూలిపోయినది.

మనుపుకూడా శ్రీ అగస్త్యేశ్వర ఆలయ జీర్ణోద్ధారణ శ్రీరామ భజన మందిరనిర్మాణము, ఒకే సమయమున జరిగినవట. దైవనిర్ణయము ప్రకారము, యీ సారికూడ అలాగే జరిగినది. ఈ భజనమందిరము ఫిబ్రవరి మాసములో (7-2-1979) శ్రీ శ్రీ శ్రీ 108 శ్రీరామ్‌జీదాస్ (జాబాలిస్వామి) వారిచే శంఖుస్థాపన చేయబడి, 28-4-1979 శనివారం రాత్రి 12-40 గ॥కు (అనగా 29-4-79 ఆదివారము ఉదయాత్పూర్వము) పై జెప్పిన శ్రీ జాబాలి తీర్థకైంకర్యస్వామి వారిచే ప్రతిష్ఠాపన జరిగినది. ఈ ఆలయమునకు 8-6 1979 యీ గ్రంథరచయిత జన్మదినమునాడు మండల పూజ జరిగినది.



జాబాలిబాబాజీ శ్రీరామ్‌జీదాస్.

శ్రీ అగస్త్యేశ్వర ఆలయములో 30-5-1979 బుధవారము నాడు మండలాభిషేకము జరిగినది.

70 ఏళ్ల తరువాత యీ 1979 సంవత్సరము యీ ప్రాంత ఆలయములకు స్వర్ణయుగమని చెప్పవచ్చును. చంద్రగిరి శ్రీ కోదండరామస్వామి

ఆలయమునకు నూతన ధ్వజస్తంభముతో బాటు జీర్ణోద్ధారణ 11-7-1979 నాడు * జరిగినది. ఈ ఆలయ ధర్మకర్త కూడ శ్రీ ఎం. సుందరరామరెడ్డి తొండవాడ. అలాగే శ్రీ అగస్త్యేశ్వరాలయము, తొండవాడ శ్రీరామ భజన మందిరమునకును నూతన శకము ఆరంభమయినది. శ్రీనివాస మంగాపురము ఇదివరకే నూతన శోభను పొంది, శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి విశేషముగా భక్తులను ఆకర్షించ సాగారు.

తొండవాడ గ్రామంలో ఇంకా ఒక శ్రీరామ భజన మందిరమున్నది. అది కూడ చాల ప్రాచీనమైంది. బాగుపడవలసిన ఆలయమిది ఒక్కటే - ఈ గ్రామంలో ఇంకా ముత్యాలమ్మ, తండ్లమ్మ, గురప్ప, వీరుళ్ళు, గంగమ్మ మొదలగు గ్రామ దేవతల ఆలయాలు - అక్కగార్లు మునేశ్వరుడు మొదలగు వన దేవతల పూజా ప్రదేశములు వున్నాయి.

* * *

పురందరదాసు 16 వ శతాబ్దమునకు చెందిన వాగ్గేయ కారుడు. ఆయన కన్నడములో శ్రీ వేంకటేశ్వరుని గూర్చి అనేక వేల కీర్తనలు రచించి, పాడి, ప్రసిద్ధిగాంచినారు.

...."ఆతడు వృద్ధుడై యుండగా కర్ణాట భాషలో వేలకొలది సంకీర్తనములను రచించి ప్రఖ్యాతి వహించిన శ్రీ పురందరదాసుడు అన్నమాచార్యుని దర్శింపవచ్చి యాతని సంకీర్తనములు విని తనిసి నీవు వేంకటేశ్వరుని

* నంగునేరి వానమామలై జియ్యర్‌స్వామి శిష్యులగు, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్‌స్వామి పై కార్యక్రమములను 7-7-79 నుంచి 14-7-79 వరకు, స్వాధ్యాయ జ్ఞానయజ్ఞముతో బాటు జరిపిరి. ఈ స్వామి తిరుమలలో 28-6-1972 న సహస్ర హోమకుండములతో శ్రీ లక్ష్మీ నారాయణ క్రతువును జరిపిరి. స్వామి మన దేశమున 108 క్రతువులు చేసి క్రతు స్థంభములను గట్టిరి. 107 స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞములు చేసి - 108వ యజ్ఞము 20-2-80 తిరుమలలో జరుగవలసి యుండగా, వైకుంఠ ఏకాదశినాడు రాత్రి అవగా ద్వాదశి ఘడియలలో వైకుంఠ ప్రాప్తి నొందిరి. ఆయన వదలిన చివరి (108) వ స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞమును ధార్మికులు కొందరు నిర్వహించుచున్నారు. స్వామి అవతారము : 1-9-1909 పరమపదము 30-12-1979. శ్రీ మత్పరమహంస, పరివ్రాజికాచార్య, ఉభయ వేదాంత ప్రవర్తక మొ॥ స్వామివారి బిరుదులు.

యవతారమే యని సన్నుతింపగా అన్నమాచార్యుడు పురందరదాసుని సంకీర్తనములను విని నీవు శ్రీ పాండురంగ విఠలుని యవతారమనే యని సన్నుతించెనట ...."
—విజ్ఞానసర్వస్వము 4. తె. సం. 2 పుట 715.

పురందరదాసు శ్రీ వేంకటేశ్వరస్వామిని, వేంకటరమణ, వేంకటేశ, శ్రీనివాస, తిమ్మప్ప, శేషాద్రి, తిరువేంగడ, వృషాచల నివాస, అలమేలు రంగ రమణ మొదలగు పేర్లతో సంబోధించి కీర్తించినాడు.

ఈ కన్నడ వాగ్గేయ కారుని మీద తనకున్న గౌరవ భావంతో, ఆ కవి-గాయకుడు కీర్తించిన "తిమ్మప్ప" అను పేరును, తను కట్టించిన క్రొత్త శ్రీ వేంకటేశ్వరాలయమునకు పెట్టినాడు - తాళ్లపాక చిన్నన్న.

ఈ చిన్నన్నకు ఏడినిమిది పేర్లున్నవి. అందు తాళ్లపాక చిన్నతిరువెంగళ నాథుడనునది ముఖ్యము. ఈయన తాళ్లపాక పెదతిరుమలాచార్యుని నాలుగవ కుమారుడు. ప్రసిద్ధిగాంచిన తాళ్లపాక అన్నమాచార్యుని మనుమడు. శ్రీనివాస మంగాపురములో శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయము జీర్ణోద్ధారణ చేసిన - తాళ్లపాక చిన్నతిరుమలాచార్యుని మూడవ తమ్ముడు.

తిమ్మప్ప పదము కొందరికి క్రొత్తగా వుంటుంది. కానీ, ఇది తెలుగు సాహిత్యమునకు పాతపదము. తిరుమల + అప్పడు తిరుమలప్పడు తిమ్మప్పడు = శ్రీ వేంకటేశ్వరస్వామి. "కొండమీది తిమ్మప్పని వంటి కావ్య పతి యబ్బుట యబ్బురము" అని కాకమాని మూర్తికవి తన రాజవాహన విషయము అను గ్రంథములో వ్రాసినాడు.

కాబట్టి క్రొత్త ఆలయము - క్రొత్త పేరు బాగుంటుందని - తనలోని *కవితాగుణానికి ప్రాధాన్యత ఇచ్చి తిమ్మప్పాలయము - తిమ్మప్పకు కట్టించాడు తాళ్లపాక చిన్నన్న.

---

* తెనాలిరామకృష్ణ కవి తాళ్లపాక కవులనుగూర్చి చెప్పిన పద్యం అప్పకవీయంలో వుంది.

చిన్నన్న ద్విపద కెఱఁగును
బన్నగఁ బెద తిరుమలయ్య పదమున కెఱఁగున్
మిన్నంది మొరసె వరసిం
గన్నకవిత్వంబు పద్యగద్య శ్రేణిన్.



అగస్త్యపూజిత విష్ణుపాదము.

ఈ ఆలయ నిర్మాణము ఒక కథ. పద్మసాలీలకు - జాంగ్ర వారికి తగాదా వచ్చింది. మేము శ్రీ వారి దేవేరి పద్మావతమ్మ వంశము వారమని పద్మాసాలీలన్నారు. మీరు కాదు. మేము ఆమె వంశము వారమని జాంగ్ర వారన్నారు. నిర్ణయం జరిగేవరకు నిద్రపోము అనుకున్నారు ఇరు వంశాల వారు.

ఎవరేయే వంశస్థులో ఎవరికెరుక ? తాళ్లపాక చిన్నన్న కెరుక ఏమో యని ఆయనను అడిగారు. ఆయన నాకూ తెలియదు. అమ్మవారినే అడుగతాను. మీరంతా ఒక శుభదినం అలమేలుమంగాపురం ( శ్రీనివాస మంగాపురానికి ) రండి అన్నాడు.

అలాగే అంతా అలమేలు మంగాపురంలో అమ్మవారి ముందు ఆసీను లయినారు. తాళ్లపాక చిన్నన్న, తిరుమల తాతాచార్యుల వారిని కూడ పిలుచు కొచ్చాడు - తోడుగా వుంటాడని. ( చంద్రగిరి రాజయిన ) పురుషోత్తమరాయలు వారు కూడ వచ్చారట. ఇది అచ్యుతదేవరాయల పాలనాకాలం అంటే, క్రీ. శ. 1542. ఈ పురుషోత్తమరాయ లెవరో చరిత్రలో కానీ, విజయనగర చక్రవర్తుల వంశావళిలో కానీ కనబడడు. అయినా అచ్యుత దేవరాయల వారికి, వేలువిడిచిన బంధువుగా వుంటాడని వూహించవచ్చు. ఎటూ చేసే పనిలేక, తిని వూరక కూర్చోలేక, తమాషా చూద్దామని, మంగాపురం దాకనే గదా ! అని, చిన్నన్న మాటత్రోసి పుచ్చలేక వచ్చివుంటాడు.

ఆసీనులయిన అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తింది అలమేలు మంగమ్మ. తాను పద్మసాలీల ఇంటి ఆడపడచునని ఢంకామీద దెబ్బకొట్టినట్టు ఖచ్చితంగా చెప్పివేసింది. అందుకేనేమో నారాయణవరంలో వున్న వారంతా పద్మసాలీలు. తిరుచానూరు సమీపమున నున్న యోగిమల్లవరంలో కూడ అందరూ పద్మసాలీలున్నట్టుంది. అమ్మవారు తనంతటతానుగా, ప్రత్యక్షమై అలాచెబితే ఇక చేసేదేముంది ? అనుకోని యీ సంఘటనకు అందరూ నోరు తెరచి చూస్తూండిపోయారు. జాంగ్రవారికి ఇకనేం చేయాలో తోచలేదు. పద్మసాలీలు మాత్రం భుజాలెగురవేశారు. పురుషోత్తమరాయలు వీరికి బిరుదులు గండపెండేరం, సింహతలాటం వింజామరలు ఇచ్చి, భటులచేత కైవారం చేయించారట.



తొండవాడ, శ్రీ ఆనంద వళ్లిదేవి అమ్మవారు.



తొండవాడ, అగస్త్యప్రతిష్ఠిత - శ్రీ అగస్త్యేశ్వర స్వామివారు.

పద్మసాలీలు తమ కులం వుద్ధరించిన శ్రీ తాళ్లపాక చిన్నన్నకు 20 వేల వరహాలు చెల్లించారు. పదివేల వరహాలు వారు స్వంతంగా తెచ్చారు. 10 వేల వరహాలు దేవరవారి భండారాన్నుంచి తెప్పించి పురుషోత్తమ రాయల ముందే చిన్నన్నకు పాదకానుకగా సమర్పించినారు — ఒక ఆలయం కట్టించమని.

ప్రథమ శ్రీ తాళ్లపాక అన్నమాచార్యోత్సవ సందర్భమున (అనగా ఏప్రిల్ 1949 లో) ప్రచురించిన ఒక పుస్తకమునందు యీ విషయమిట్లున్నది. * "........ఛప్పన్నదేశములలోని పద్మసాలీలకు గురువై రాజాశ్రయమే కాక శిష్యార్జనమును చేయుచుండినట్లు తెలియుచున్నది. పద్మసాలీలును జాంద్ర వారును లక్ష్మీదేవి పుట్టింటి వారెవరని వివాదపడి తీర్చుఁడని చిన్నన్నను వేడినపుడు ఆయన అలమేలుమంగను ప్రార్థించఁగా నామె తన పుట్టింటి వారు పద్మసాలె వారెయని పలుక వారందుకై చిన్నన్నకు నిరువది వేల వరహాలు పాదకానుక సమర్పించి దానితో 'చంద్రగిరి తూర్పున ఆళ్లగట్టు అనే బలవపుగని రాయి క్రయశుద్ధిచేసి యీ గట్టురాయరు దేవాలయం కట్టించి' మరియు 'దేవరవాల్లా తిరుమాళిఘ కైంకర్య ధర్మ వెచ్చానకు సంవత్సరం ౧-కి మొగ్గం ౧-కి అపరంజిరూకలెఖ్ఖనుంన్ను పెండ్లి ౧ కి రూకలెఖ్ఖ నుంన్ను సమప్పించి నడిపిస్తూ రాగల వాల్లాము దేవరవాల్లా తిరువెంగ్గళనాథసామి మర్యాద మీరు మాకు గురువులు గన్కుశిష్య పారంపర్యంత్తరంగాను పుత్ర పారంపర్యం తరంగ్గాను ఆ చంద్రార్కా స్థాయిగాను నడపగలవారము' అని ధర్మశాసనము శక 1463, శుభకృతు కార్తికశు 15వ వ్రాయించి యిచ్చిరి. ఈ శాసనములోని శకవర్షము 1463 శుభకృత్సంవత్సరముతో సరిపడుట లేదు. చిన్న తిరుమలయ్య మంగాపురములో కల్యాణ వేంకటేశ్వరస్వామి వారి దేవాలయమును జీర్ణోద్ధారణముచేసి విగ్రహములను ప్రతిష్ఠించినది యీ శక వర్షము 1463 కి సరియగు శార్వరి సంవత్సరము చైత్రమాసమున. అది అప్పటికే పూర్తి యయినది. గనుక నీ పద్మసాలీల శాసనములోని శుభకృత్సం వత్సరము శక 1465 కు సరియగును. కావ చిన్నన్న చంద్రగిరికి తూర్పున కట్ట నుద్దేశించిన దేవాలయము చంద్రగిరి కుత్తరమున నుండు మంగాపుర దేవాలయము కాదని తెలియుచున్నది. తిరుపతి నుండి చంద్రగిరికి పోవు మార్గములో మార్గమున కుత్తరపు ప్రక్కన చంద్రగిరికి నొకమైలులోగా (తొండ

---

* "ఈ విషయమున్న రాగిరేకు దానశాసనాన్ని, తాళ్లపాక అన్నమయ్య జీవిత చరిత్ర తాళపత్రాలనుంచి ఎత్తి వ్రాసిన కాగితపు ప్రతిని కీ. శే. తాళ్లపాక సూర్యనారాయణగారు తి. తి. దే ఇచ్చినారు.

వాడ) నొక శిథిలమైన దేవాలయమున్నది. దీనిని గొల్లదాని గుడియందురు. ఇదియే చిన్నన్న తనకు శిష్యులైన పద్మసాలీలు సమర్పించిన నిరువదివేల వరహాల పాదకానుకతో తాను కట్టిన దేవాలయముగా నుండ వచ్చును. దాని సమీపముననే 'ఆళ్లగట్టు అనే బలపపుగని రాయి' యుండవచ్చును."

— సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి.

తొండవాడ శ్రీ తిమ్మప్పస్వామి ఆలయం కథ ఇది. దీనిని గట్టినది-సుద్దవేల. దానిని ఆ కాలములో ఆళ్లగట్టు-బలపపు గనిరాయి అని వివిధ పేరులతో పిలిచారు. ముఖ్యమైన- పది మందికీ తెలిసివున్న చంద్రగిరి పేరు మాత్రం పేర్కొన్నారు గానీ, తొండప్పాడి పేరు పేర్కొనలేదు.

తాళ్లపాక చిన్నన్న యీ ఆలయం గట్టించి దాని ప్రక్కనే ఒక కోనేరు నిర్మించినాడు. దానినిప్పుడు 'కోనేటి బొంద' అని పిలుస్తారు. ఈ పుష్కరిణి స్వర్ణముఖినదికి-యీ ఆలయానికి మధ్యలో నుండేది. స్వర్ణముఖి నుండి యీ పుష్కరిణికి నీరురావడానికి ఏర్పాటు వుండేది. ఇప్పుడది పూడిపోయివుంది.

స్వామి పుష్కరిణికి వచ్చిన నీరు మరొక మార్గంలో బయటకు వచ్చి తమ్మకాలువ ద్వారా పొలాలకు పారుతుండేది. అసలీ కాలువ పేరు కూడ తిమ్మప్పకాలువ అని వుండివుంటుంది. అదిప్పుడు తమ్మకాలువ అయింది. ఈ కాలువ, ఆలయం ముందునుంచే పొలాలకు పారుతుండేది. ఇప్పుడు కూడ వర్షాకాలములో ప్రవహిస్తుంది.

ఈ కాలువకు తూర్పుగ, తిమ్మప్పస్వామికి అభిముఖంగ శ్రీ ఆంజనేయ స్వామి గుడి వుండేది. అది శిధిలం కావడంతో ఆ విగ్రహం అగస్త్యేశ్వర క్షేత్రం చేరింది.

ఆలయమంతా శిథిలమైనా, రాజగోపుర పీఠం (పునాది) మాత్రం అలాగేవుంది. అది, శిఖరంకూలిపోయినా ద్వారం మాత్రం కలిగివుంది. ఆలయ ద్వారంలో రెండువైపులా బొమ్మలు శిల్పించారు. ఒకవైపు రామాయణం లోని దృశ్యాలు, మరొకవైపు భారతంలోని దృశ్యాలున్నవి.

ఈ శిల్పసంపదను కొంతవరకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాంగణానికి తరలించారు. ఇంకా కొంత ఇక్కడేవుంది. చాల స్తంభాలు చుట్టుప్రక్కల గ్రామాల వారికి కట్టుడురాళ్లుగా పనికి వచ్చాయి.

ఆలయానికి దగ్గరలో ఉత్తరంగా సువర్ణముఖీ తీరంలో భాకర అగ్రహారంవుంది. ఈ అగ్రహారం యీ తిమ్మప్ప ఆలయానికి చెందినదిగనే భావించవచ్చు. భాకర అగ్రహారం అంటే? బ్రాహ్మణ అగ్రహారం - అలా పరిణామం చెందిన దేమో ననుకుంటాను.

అమ్మవారి ఆలయం తొండవాడ గ్రామంలోనే వెలిసిందనుకుంటాను. ఎందుకంటే, అక్కడ ఇటీవలి వరకు ఒక శిథిలాలయ అవశేషాలు వుండేవి. ఆస్తంభాలేమిటని అడిగితే అమ్మవారి ఆలయమనేవారు. అంటే పద్మావతి అమ్మవారి ఆలయమనుకొంటాను. ఆ స్తంభాలలో కొన్ని ప్రస్తుతము శ్రీ అగస్త్యేశ్వర క్షేత్రంలోనే వున్నాయి. తిమ్మప్ప ఆలయం వద్ద ఒక ప్రత్యేకమైన ఆలయశిథిలాలు ఏవి లేవుగాన, అలా నమ్మవలసి వస్తోంది. తిరుమల తిరుచానూరుల పద్ధతి అవలంభించి అలా నిర్మింపజేసినాడేమో చిన్నన్న.

తిమ్మప్ప దేవాలయానికి చెందిన యీ ఇతివృత్తం మెకంజీ సేకరించిన కైఫీయతులలో వున్నది. ఈ కైఫీయతులు కూడ అన్ని ఒక విధంగాలేవు. తి.తి.దే. వారికి లభ్యమయిన రాగిరేకు దానపత్రానికి "కడప శిలాశాసనములు వగైరా" అను గ్రంథములో చిట్టివేలు తాలూకాలో కొన్ని దానపత్రముల నకళ్లు - అను శీర్షికలో ప్రచురించిన కైఫీయతుకు తేడావుంది. రెండూ ఒకే దాని ప్రతులైనా యీ తేడా ఎందుకు వచ్చిందో?

తి. తి. దే. వారి సప్తగిరి (తెలుగు) ఫిబ్రవరి 1978 పత్రికలో యీ పద్మసాలీయుల దానపత్రము మెకంజీ కైఫీయతు పూర్తిగా ప్రచురింపబడినది. అక్కడక్కడా స్వల్ప తేడాలు వున్నా భావంలో మాత్రం మార్పులేదు.

మనకు లభ్యమయింది దానపత్రం మాత్రమే. లభ్యముకానిది ఆలయ నిర్మాణశాసనము. అది తప్పకుండా వుండివుంటుంది. ఆ శిథిలాలలో

ఎక్కడో కలిసిపోయి వుంటుంది. దానిని వెలికి తీసేవారెవరు? అది వెలుగులోకి వస్తే, మనకింకా ఎన్నో విశేషాలు తెలిసే అవకాశముంది.

మన అవసరాలతో హైదరాలీకి - ఆతని సైన్యానికి ఏంపని? వారి పని వారిది. మనం పోగొట్టుకొన్నది మరొక్క వేంకటేశ్వరాలయమని, అది శిల్పకళలో మిన్నయని హైదరాలీకి తెలుసా?



---

విన్నపము: 131 పేజీలోని, రెండవ సీస పద్యములో ఐదు ఆరవ గీతలు అచ్చుకాలేదు. అవి ఇలా చదువుకో ప్రార్థన.

ఖూబ్ ఖోడాయంచు గుడికీలు గుమ్మము
నెక్కి థేయని తరబెత్తు నొకఁడు

# అరుణానదీలోయ

నగరి కొండల్లో ఉత్తరవైపు వరుస సువర్ణముఖీ లోయకు సరిహద్దయితే, దక్షిణవైపు వరుస అరుణానదీలోయకు సరిహద్దుగా, సహజంగానే ఏర్పడింది. తూర్పు పడమరగా వ్యాపించిన యీ రెండు కొండల వరుసలో - మధ్యగా అరుణానది ప్రవహిస్తుంది. వర్షాలు పడి నీరు వస్తేనే యీ ప్రవాహం కనబడుతుంది. ఉత్తరవైపు కొండల వరుసలోంచి ఒక చీలిక శ్రీ కాళహస్తి దాకా వ్యాపించింది. ఈ కొండ చీలికకు ఒకవైపు అనగా ఉత్తర కొసలో శ్రీకాళహస్తి క్షేత్రముంది. దక్షిణవైపు కొసన రామగిరి క్షేత్రముంది. ఈ రెండూ శైవక్షేత్రాలు. ఈ రామగిరి క్షేత్రమున్నకొండ ఆధారంగానే ఆరణి యార్ ప్రాజెక్టు పిచ్చాటూరువద్ద నిర్మింపబడింది.

చంద్రగిరి లేదా స్వర్ణముఖిలోయ ఎంత ప్రాచీనమయిందో, యీ అరుణానదీలోయ కూడా అంతే ప్రాచీనమయింది. గజిబిజిగా వ్యాపించిన యీ కొండల్లో అనేక జలపాతాలు స్వతస్సిద్ధంగా ఏర్పడినాయి. కైలాస నాథకోన, వేయి లింగాలకోన, సదాశివకోన వీటిలో ముఖ్యమైనవి. ఇవి పుణ్యతీర్థాలుగా ప్రసిద్ధికెక్కాయి.

ఇందులో మొదటిది కైలాసనాథకోన - అరుణానదీ లోయలో నుండగా, చివరి రెండూ సువర్ణముఖీలోయలోనున్నాయి.

అరుణానదీలోయలో కొన్ని దివ్య క్షేత్రాలు కూడ వున్నాయి. వాటిలో పుత్తూరులోని శ్రీ సుబ్రహ్మణ్యస్వామి గుడి, శ్రీ ధర్మరాజుల గుడి, ఈశ్వరాలయము ముఖ్యమైనవి. ఇక నారాయణవరంలోని శ్రీ కళ్యాణవేంకటేశ్వర స్వామిని గూర్చి ప్రత్యేకంగా తెలుసుకొంటాము. నారాయణవరం దాటుతూనే రెండుమూడు మైళ్లలో దక్షిణ దిక్కు కొండల్లోంచి దూకుతుంది కైలాసనాథ జలపాతం.

కైలాసనాథకోన అని పిలువబడు యీ పుణ్యతీర్థ జలాలు, అనేక

చేయడంలో ప్రసిద్ధిగాంచాయి. ఇచ్చట కొండ పేటి క్రింద శ్రీ కైలాసనాథస్వామి శివలింగం - ఆ పేరుతోనే పూజింపబడుతూ వుంది. ఆయన కెదురుగా నంది విగ్రహం, స్వామి ప్రక్కన వీరభద్రస్వామి విగ్రహం, ఆయన ప్రక్కన శ్రీ కామాక్షిదేవి, అమ్మ వారి - ప్రక్కన ఆదిశంకరాచార్యులు - ఇలా విగ్రహా లన్నీ ఆ పేటిక్రింద అరలలో చోటు చూసుకొని, పూజింపబడుతూ వున్నాయి. నారాయణవరంలో శ్రీ పద్మావతి వేంకటేశ్వరుల కళ్యాణంకోసం - కళ్యాణం చూతము రారండి! అని వచ్చిన శివ పార్వతులు, శ్రీ అగస్త్యమహాముని ఆతిథ్యము స్వీకరించిన తరువాత, ప్రకృతి రామణీయకతకు పేరు గాంచిన యీ కైలాసనాథ కోనలో తిష్టవేశారని ఐతిహ్యం. వారికేం! ఆది దంపతులు కదా! ఎక్కడయినా వుండవచ్చు.

ఈ తీర్థంలో ఫలవృక్షాలతో కూడిన మంచివనం వుంది. బ్రహ్మ జ్ఞానస్వామి, జ్ఞానానందస్వామి వారి ఆశ్రమాలున్నాయి. ఇందులో బ్రహ్మ జ్ఞానస్వామి, తన స్వహస్తాలతో నిర్మించుకొన్న సమాధిలో - బ్రహ్మైక్యం పొందారు. జ్ఞానానందస్వామివారు మహాశివరాత్రి, కార్తీకదీపం - ఇలాంటి పర్వదినాలలో తప్పకుండా అక్కడుంటారు. తక్కిన సమయాలలో దేశా టనం చేస్తూవుంటారు. ఆయన బాగా చదువుకున్నవారు. చక్కగా ఉప న్యాసాలివ్వగలరు.

ఈ క్షేత్రం దాటి, ఇంకా తూర్పువైపు ప్రయాణిస్తే - (అంటే మద్రాసు వైపు) ఆరణియార్ ప్రాజెక్టు వస్తుంది. ఆ ప్రాజెక్టు కానుకొనివున్న కొండ మీద (అంటే రామగిరి వద్ద) రామగిరి క్షేత్రముంది.

ఇక్కడినుంచి శ్రీ కాళహస్తి దాకా ఏర్పడిన దాదాపు 40 మైళ్ళ నగరి కొండల చీలిక సర్పాకృతి అయితే, దాని తలపై శ్రీ కాళహస్తీశ్వర క్షేత్రం- పుచ్ఛముపై రామగిరిక్షేత్రం వెలసినాయి.

రామగిరిక్షేత్రం - నాగపూరు సమీపంలోని రామ్‌టేక్‌ను గుర్తుకు తెస్తోంది. ఎందుకంటే రెండిటిపేర్లు ఒకటే. రామగిరిలాగ రామ్‌టేక్‌కూడ ప్రకృతి రామణీయకతకు పేరుగాంచినది. రామ్‌టేక్‌లో శ్రీరామచంద్రుడు

అధిష్టానదైవం. అది విదర్భకు చెందిన ప్రాంతం. కాళిదాస మహాకవి కొంతకాలం నివశించినచోటు. పైగా ఆయన ఆ కొండమీద నిలబడి, మేఘాలు తనను స్పృశించగా - ఆయన మనసులో మేఘసందేశం కావ్యం మెదిలింది. అక్కడే కూర్చుని కావ్యాన్ని పూర్తిచేశాడు. మహారాష్ట్ర ప్రభుత్వమువారు, ఆయన కక్కడ ఒక స్మారకచిహ్నం ఏర్పాటుచేశారు.

రామగిరి క్షేత్రంలో శ్రీ వాలీశ్వరస్వామి అధిష్టాన దైవం. ఈ శివ లింగం వాలిపోయి వుంటుంది కావున ఆ పేరు వచ్చింది. శ్రీరామచంద్రుడు రావణుని వధానంతరం - బ్రహ్మహత్యాపాతక దోషనివారణకై రామేశ్వరంలో శివలింగ ప్రతిష్టాపన చేయాలనుకొని, కాశీనుంచి ఒక శివలింగాన్ని తెమ్మని ఆంజనేయస్వామిని పంపగా, ఆయన శివలింగం తెస్తూ - రామగిరి సమీపానికి వచ్చేసరికి దప్పిక వేసింది. పసులకాపరి వేషంలో కాలభైరవస్వామి కని పించగా, శివలింగాన్ని పట్టుకోమని చెప్పి, దప్పిక తీర్చుకొని వచ్చేసరికి చేయవద్దన్న పనినిచేశాడు కాలభైరవుడు, పరీక్షిద్దామనే శివలింగాన్ని నేల మీద పెట్టాడు, అది అతుక్కుపోయింది. మారుతి తన తోకతో పట్టిలాగగా, అది వాలిపోయింది, గానీ, పైకిరాలేదు. కోపం వచ్చింది. దాంతో ఆయన తన మామూలు పనులన్నీ చేశాడు. తిరిగీ కాశికివెళ్ళి మరోలింగం తెచ్చే సరికి, రామేశ్వరంలో శ్రీరాములవారు, ముహూర్తం మించి పోతుందన్న కారణంతో సైకతలింగ ప్రతిష్ఠచేసినారు. చేసేది లేక ఆంజనేయస్వామి తెచ్చిన శివలింగాన్నికూడ దాని ప్రక్కనే ప్రతిష్ఠించారు. ఇదీ కథ. రామేశ్వరంలో రెండు శివలింగాలుండడానికి కారణం రామగిరి క్షేత్రం. ఇచ్చటి శివుడు, వాలిపోయినందువల్ల వాలీశ్వరుడయినాడో లేక వాలముతో పెళ్లగించబడినందు వల్ల వాలీశ్వరుడయినాడో చెప్పలేము. రామగిరికి మరోకపేరు-'తిరుక్కారికరై' ఈ పేరుతోనే తమిళ శైవపురాణంలో యీ క్షేత్రాన్ని గురించి వ్రాయబడి వున్న దట. భాగవత పంచమ స్కంధ ద్వితీయాశ్వాసంలో — శుకయోగి, పరీక్షిత్ మహారాజును సెలవిచ్చిన భూగోళ నిర్ణయంలో కూడ యీ క్షేత్ర ప్రస్తావన వున్నదట. దీనిని బట్టి యీ క్షేత్ర ప్రాచీనతను గుర్తించవచ్చు.

రామగిరిలో రెండు దేవాలయాలు వున్నవి. అందులో మొదటిది-ప్రధానమైనది, శ్రీ వాలీశ్వరస్వామి దేవాలయం ఆయన దేవి మరకతవల్లి. చాలఅందమైన అమ్మవారు. రెండవ దేవాలయం కాలభైరవస్వామిది. దేవేరి కాళికాదేవి. కాలభైరవుని విగ్రహం - ఆయన ప్రక్కనేవున్న వాహనం కుర్కురం (కుక్క) చాల అందమైన విగ్రహాలు. మ్రొక్కుకున్నవారంతా ముడుపులు - కుక్కల రూపంలో చెల్లిస్తూంటారు - కావున అచ్చట, కుర్కుర సంతానం ఎక్కువ. రామగిరిలో అడివారం క్రింది దేవాలయం శిధిలమైపోయింది. కాబట్టి ఇక్కడ రెండు ఆలయాలు అనడం కంటే - ఆలయాల సముదాయం అనడం మంచిది.

ఇక్కడ ఇంకొక విశేషముంది. మహానందిలోలాగ, మొగిలి క్షేత్రంలో లాగ, ఇక్కడకూడ నంది నోట్లో నుంచి జలధార ప్రవహిస్తుంది. ఈ ప్రవాహం ఒక చిన్న కుండముగా ఏర్పడింది. దీనిలో, పుణ్యనదులలో కలిపినట్లు అస్థులు కలుపుతారు కానీ, స్నానం మాత్రం చేయరు. కంచిలోలాగ ఇక్కడ కూడ 'బల్లి' కి ఎక్కువ ప్రాధాన్యం వుంది. బల్లిపూజ, అనాది నుంచీ వస్తున్న సరీసృపపూజా చిహ్నంగా భాసిస్తోంది.

ఈ నందీశ్వరుని మీద శిల్పి తన పేరు శిల్పించాడు. ఈ శిల్పి చెన్న పట్నం సమీపంలోని కువ్వం వాడు. అతనిపేరు పెరుంతచ్చన్. తల్లి పేరు చాముండి.

(1) శ్రీ పరమేశ్వరన్ దరిశనత్తి
(2) పరిదు ప్రసాద ఇాాచమ్య
(3) చాముండి మగన్ కూపత్తు (పె)రు
(4) న్దచ్చనిట్ట ఎరుదు.

ఈశాసన లిపినిబట్టి ఇది క్రీ. శ. 9-10 శతాబ్దాల మధ్యకాలమునాటి దయిఉంటుందని భావిస్తున్నారు. ఇక్కడ యింకోకొలను గట్టున విరిగి పోయిన బసవయ్య వున్నాడు. ఆ నందిమీద పల్లవలిపిలో 'శ్రీపరమేశ్వర' అను మాటలు మాత్రంమిగిలిన ఒకశాసనంవుంది. ఇది మైలగుంట. దీనిలో

అందరూ స్నానంచేయవచ్చు. తిరుత్తణిలాగ యీ క్షేత్రానికి కావళ్లుకూడ, కృత్తిక నక్షత్ర దినాలలో విశేషంగా వస్తాయి. ఇచ్చటి షణ్ముఖుని ముత్తు కుమారస్వామి అంటారు.

నందీశ్వరుని నోట్లోధార మూడుపాయలై, ఉత్తరదిక్కున సువర్ణముఖి నదిలోనికి ఒకపాయ, పశ్చిమ దిక్కున 'ఆరె' గ్రామపొలాలకు ఒకపాయ, తూర్పున 'నద్దికట్టమడుగు' అనుమడుగులోనికి ఒకపాయ ప్రవహిస్తోంది.

ఈ దేవాలయచరిత్రనుగూర్చి 'ఆంధ్రపత్రిక ప్రత్యేక ప్రతినిధి' 14-7-1968 తారీఖు ఆదివారంనాటి ఆంధ్రపత్రికలో ఇలా వ్రాశారు. "....దేవాలయ మహద్వారం దాటిన తర్వాత రెండవ ద్వారంగా పూర్వంవున్న ద్వారంలో రెండువైపులా పల్లవరాజులకాలపు సింహాల స్తంభాలు వున్నాయి. దేవాలయం ప్రదక్షిణమార్గంలోని కుమారస్వామి శిల్పం మొదలయినవి ఎంతో కాలం శ్రమపడి చెక్కి అందాలు తీర్చినట్టివి.

చోళులలో కరికాళ చోళుడు ఈ వాలీశ్వర దేవాలయాన్ని కట్టించి నట్టు రూఢి. పల్లవలిపిశాసనాలు కనిపించడం వల్ల పల్లవులుగూడ ఈ దేవాలయాన్ని ఆదరించకపోలేదని తెలుస్తున్నది. పెక్కుశాసనాలు దేవాలయ ప్రాకార కుడ్యాలమీద కనిపిస్తున్నాయి. విజయనగర రాజులు తమదక్షిణ దిగ్విజయ యాత్రకు ముందుగానో, తర్వాతనో ఈదారిని వెళ్లుతూ, ఈ దేవాలయం దర్శించి పెక్కు కానుకలు, గ్రామాలు ఇచ్చినట్లు శాసనాలు కనిపిస్తున్నాయి.

వీరకంపణుడు 1370లోను, బుక్కరాయుడు 1387లోను, ద్వితీయ హరిహరుడు 1400లోను, తృతీయ విరూపాక్షుడు 1480లోను వేసిన శాస నాలు కనిపిస్తాయి. (ఈశాసనాలను చదువరులు సౌత్ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్ వాల్యూం 17లో చూడవచ్చు.)"

నారాయణవరం, కైలాసనాథకోన, రామగిరి, నాగలాపురం - ఇవన్నీ 20 మైళ్లలోపునే వున్నాయి. రామగిరిలో ఇదివరకు కాళింగమడుగు వుండేదట.

ఆంజనేయస్వామి వాలీశ్వరుని విషయంగా కోపంవచ్చి - "కారిగిరి" అనే కొండను కాళింగమడుగులో విసరివేసినందువల్ల - ఆమడుగు అదృశ్యమై పాతాళానికి ఇంకిపోయి, ఆ నీరు నందీశ్వరుని నోటిలో నుంచి వెలువడు తోందని అక్కడి వారంటారు.

రామగిరినుంచి నాగాలాపురం 10మైళ్ళదూరంలో వుంటుంది. ఈ నాగలాపురం చరిత్ర ప్రత్యేకంగా ఒక అధ్యాయంలో వ్రాయబడింది.

నాగలాపురం పోవుదారిలోనే అరుణానదీతీరంలో తుంబూరు అను ఒక గ్రామముంది. అక్కడొక శివాలయము ఒకవిష్ణ్వాలయము వున్నాయి. నాగలాపురాని కవతల సత్యవేడులో మాతంగేశ్వరాలయముంది. అచ్చటికి సమీపంలోని సురుటుపల్లిలో పల్లికొండేశ్వరాలయము, వాల్మీకేశ్వరాలయ మున్నాయి. ఇవన్నీ అంతో ఇంతో చరిత్రకలిగిన దేవాలయాలు. తొండవాడ భజన మందిరము, శ్రీ అగస్త్యేశ్వర ఆలయము, చంద్రగిరి శ్రీ కోదండ రామాలయము, జీర్ణోద్ధారణ నిర్మాణ కాలముననే, సురుటుపల్లిలో కూడ జీర్ణోద్ధారణ కార్యక్రమమును చేపట్టి, ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయ శాఖవారు అచ్చట కుంభాభిషేకము మొదలగు కార్యక్రమములన్నీ జరిపినారు. అన్నిటితోబాటు ఆ ఆలయంకూడ బాగుపడడం దైవేచ్ఛ.

ఇక అరుణానది వృత్తాంతమును గూర్చి నారాయణవరం చరిత్రలో వ్రాయబడివుంది. ఆకాశరాజు యాగార్థమై, నీటికొరకు ఆరణియను మూలికచే సృష్టించబడడంవల్ల యీనదికి అరుణానది యని పేరువచ్చినదని అందరి విశ్వాసం. తిరువణ్ణామలైలోని కొండపేరు అరుణగిరి. అక్కడి మహాదేవుని పేరు అరుణాచలేశ్వరుడు. ఆయన 'జ్యోతిర్లింగము' అని అంటారు. అరుణగిరినాథర్ అనిపేరు గలిగిన గొప్పశివభక్తుడున్నాడు. పరమశివుని మీద ఆయన చేసిన కవితలు — అనన్యసామాన్యమైనవి.

పుత్తూరునుంచి బంగాళాఖాతంవరకు వ్యాపించియున్న అరుణానదీ లోయ చరిత్ర ఎంతవ్రాసినా తరగదు. కొద్దిపుటలలో ఆచరిత్రకు న్యాయం జరుగదు. మనకింతకంటే అవసరం లేదు. అందుకే ఇది క్లుప్తంగా ముగించ బడినది.

# నారాయణవరం - శ్రీకళ్యాణ వేంకటేశ్వరస్వామి

శ్రీ వేంకటేశ్వరస్వామి నారాయణవరంలో (నారాయణవనం, నావ్నారం అనికూడ అంటారు) ఆకాశరాజు కుమార్తె శ్రీపద్మావతి అమ్మవారిని వివాహం చేసుకున్నట్లు అందరికీ తెలుసు. ఈనారాయణ వరానికి - నారాయణపురం (పల్లవుల కాలంలో) నారాయణవనం (చోళుల కాలంలో) నారాయణవరం (ఇప్పుడున్న పేరు - ఇది విజయనగర చక్రవర్తుల కాలంనుంచీ) పేర్లు వున్నాయి. ఇది ఒకప్పటి యాదవ రాజుల రాజదాని. తదనంతరం వారు కార్వేటి నగరమును, చంద్రగిరిని కూడ తమ రాజధానులుగ చేసుకొన్నారు. ఇది అరుణానదీ తీరంలోవుంది. ఈఅరుణానది మీదనే 'ఆరణియార్' ప్రాజెక్టు నిర్మింపబడినది. ఈ ప్రాజెక్టు వున్న వూరు పేరు పిచ్చాటూరు, తిరుపతి, ఊత్తుకోట, మద్రాసు మార్గంలో వుంది.

నారాయణవరం పుత్తూరు రైల్వేస్టేషనుకు ఐదు కిలోమీటర్ల దూరంలో వుంది ఇచ్చట శ్రీసొరకాయస్వామి అను సిద్ధుడు, అరుణానది గట్టున సమాధి అయినాడు. ఈసమాధి శ్రీకళ్యాణ వేంకటేశ్వరస్వామి సన్నిధి వీధికి ఆనుకొనే వుంది. ఇప్పు డచ్చట ఒక చిన్న ఆలయము - శ్రీ సొరకాయ స్వామి సమాధిమీదనే కట్టబడి వుంది. దీనిప్రక్కనే ఆంజనేయస్వామి ఆలయముంది. శ్రీ సొరకాయస్వామి ఎక్కడివారో - ఎచ్చటనుండి వచ్చి నారో - ఆయన కుటుంబ వివరాలు ఎవరికీ తెలియవు. ఆయనకు తమిళం బాగుగా వచ్చు. తెలుగు కొద్దిగావచ్చు.

ఆయనను పదిమందీ గుర్తించేసరికి, ఆయనవయస్సు దాదాపు 70 సంవత్సరాలున్నట్లు అంచనా. అంతవరకు ఆయన తిరుమల తిరుపతులలో బిక్షగాడి రూపంలో - రెండు సొరకాయబుఱ్ఱలు, రెండుకుక్కలు - వీపున మూటలు గలిగి సంచరిస్తూవుండేవాడు. ఆ వయసులో యీప్రాంతాన్ని వదలిపెట్టి శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి సన్నిధి చేరినాడు. పెద్దపెద్ద తిరు నామాలు ధరించేవాడు. రెండు తెల్లనామములు - మధ్య ఎఱ్ఱని నామం -



నారాయణవరం శ్రీ కళ్యాణ వేంకటేశ్వర స్వామి రాజగోపుర విమాన దృశ్యములు.

బాగుగా పెరిగిన తెల్లని గడ్డం-తలకు పెద్ద అంగవస్త్రం కిరీటంలా చుట్టి-పొట్టిగా వయసుమీరి, నెమ్మదిగా సంచరిస్తూ యీవూరు - ఆవూరు తిరుగుతూ, దాదాపు 202 సంవత్సరాలు జీవించి దేహత్యాగం చేశాడు.

ఆయన యాదవ కులస్థులని, తిరుపతి సమీపంలో ఒక కుగ్రామంలో జన్మించారని, ఆయనను గురించి చెప్పేవారు.

నారాయణవరం సమీపమున ఒక కిలోమీటరు దూరమున నున్న శిధిలాలను ఆకాశరాజుకోట శిధిలాలుగ చెబుతారు. ఈకోట పునాదులు రెండు ఆవరణలుగా వున్నాయి. వీటిని స్థానికులు చిత్రాంగి రత్నాంగికోట లంటారు. శ్రీవేంకటేశ్వర సుప్రభాత గద్యంలోకూడ, రత్నాంగీ, కనకాంగీ పేర్లు

వినబడతాయి. ఇచ్చటనే భూవరాహస్వామి ఆలయము శిధిలావస్థలోవుంది. భూవరాహస్వామి ఆదిలక్ష్మీ సమేతుడై, ఆదిశేషుని పడగమీద వున్నట్టు శిల్పించారు. అవనాక్షమ్మ ఆలయం తరువాత చెప్పుకోదగ్గవిశేషం. అమ్మవారు చాల సుందరంగా అష్టభుజములుగలిగి ఆదిపరాశక్తి రూపంలో దర్శనమిస్తోంది. మిగతా ఆలయాలు వీరభద్రస్వామి, శక్తివినాయకస్వామి; అగస్త్యేశ్వరస్వామి. ఈఅగస్త్యేశ్వరస్వామి, ఆకాశరాజువారి ఇలవేలుపు. శ్రీనివాసునిచూసి, మదనావస్థ నొందిన పద్మావతి అమ్మవారి, స్వస్థతకు ఆమెతల్లి ధరణీదేవి, తండ్రి ఆకాశరాజు ఇక్కడనే అభిషేకాలు - పూజలుచేయించారు. పురాణాలలో యీయన ప్రసక్తి వుంది. ఈయన అరుణానదీతీరాన వెలిసినారు. అదేవిధంగా సువర్ణముఖరీ తీరంలో వెలిసిన శ్రీ అగస్త్యేశ్వరస్వామి ఆశ్రమము ఆలయాల గురించిన ప్రసక్తి శ్రీవేంకటాచల మాహాత్మ్యంలో విపులంగావుంది. ఇది తొండవాడయందలి క్షేత్రం.

ఆకాశరాజుకోటలో మునుపు శ్రీకోదండరామస్వామి ఆలయముండేదట. దానికి నిదర్శనంగా ఇప్పుడచ్చట ధ్వజస్తంభం నిలబడివుంది. కోదండ రాములవారు మాత్రం ప్రస్తుతం కళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయాన్ని ఆశ్రయించి వున్నారు.

నారాయణవరంలో పరాశరేశ్వరస్వామి ఆలయం కూడా వుంది. ఇదంతా వ్రాసుకొన్తూంటే ఒక విషయం స్ఫురించు తోంది.

* * *

ఈప్రాంతంలో ఐదు యూనిట్ల దేవాలయాలు వెలిసినవి.

ఇందులో మొదటియూనిట్టు లేదా గ్రూపు తిరుమల - తిరుపతి తిరుచానూరు - ఆలయాలు.

రెండవగ్రూపు - శ్రీనివాసమంగాపురం - చంద్రగిరి ఆలయాలు.

మూడవగ్రూపు - తొండవాడ తిమ్మప్పదేవాలయము - శ్రీఅగస్త్యేశ్వర స్వామి ఆలయాలు.

నాలుగవ గ్రూపు - గుడిమల్లం - తొండమనాడు శ్రీకాళహస్తి ఆలయాలు. పైకనబఱచినవి సువర్ణముఖీ తీరంలోనివి.

ఐదవగ్రూపు - ఆలయాలు అరుణానదీ తీరంలోని నారాయణవరం-దానికి సంబంధించిన నాగలాపురం ఆలయాలు.

అన్ని గ్రూపులను గురించి వివరంగా విడిగా వ్రాయాలంటే సాధ్యం కాదు. పై ఆలయాలన్నీ, శ్రీ కాళహస్తీశ్వర ఆలయంగ్రూపు శ్రీ అగస్త్యేశ్వరాలయము - చంద్రగిరి ఆలయాలు మినహాయించి - మిగతావన్నీ, తి. తి. దే. యాజమాన్యంలో వుండటం - ఎన్నదగ్గ మరోవిశేషం.

*　　　*　　　*

నారాయణవరం గ్రామాన్ని చుట్టి అరుణానది ప్రవహిస్తుంది. ఆకాశ రాజు యజ్ఞం కొరకు జలం కావలసివస్తే, 'అరుణి' అనే మూలికతో యీ నది సృష్టి జరిగినట్లు, అందువలననే ఆ నదికి అరుణానది అని పేరు వచ్చినట్టు కథలున్నాయి. ఈ కథలు ఎలాగున్నా భారతదేశములోని నదులపేర్లు మాత్రం బహు సుందరంగా, వినసొంపుగా వున్నాయనేది మాత్రం నిజం. 'నీరు పల్ల మెరుగు - నిజం దేవుడెరుగు' అన్న సామెత కూడ వినడానికి సొంపయినదే. ఎందుకంటే, అది కూడ నీటి నుంచి పుట్టిందే!

సుందరమయిన ప్రకృతి - అందమయిన అరుణానది, నదీ తీరంలో నారాయణవరం, నారాయణవరంలో వెలిసిన నర - నారాయణుల ఆలయాలు కొన్ని శిధిలమయినాయి, కొన్ని శిధిలావస్థలో వున్నాయి. కొన్ని శిధిలావస్థ నుంచి తేరుకొని తిరిగీ నిలబడుతున్నాయి. ఎక్కడచూసినా ఒకనాటి నాగరికత సంస్కృతి, మత ధార్మికతలకు స్మృతి చిహ్నాలుగ మిగిలిన యీ అవశేషాలను చూస్తూంటే, *తొండమాను చక్రవర్తి గుర్తుకొస్తాడు. పురాణాలలోని తొండమాను

---

* "పుదుకోట్టను పాలించిన తొండమాను చక్రవర్తుల వంశమొకటి వున్నది. వీరు తిరుపతి నుంచి వచ్చి, మొదట పల్లవులకు, చోళులకు రాజకీయంగా సహాయపడుతూ చివరకు తామే రాజులైరి. వీరు క్రీ. శ. 16 - 17 శతాబ్దములకు చెందినవారు." —విజ్ఞానసర్వస్వము.

చక్రవర్తిగానీ, ఆకాశరాజుగానీ, చోళచక్రవర్తులనే పలువురు చరిత్రకారుల అభిప్రాయం. ఆ అభిప్రాయాన్ని అబద్ధమని ఎవరూ వాదించలేదు. పోనీ నిరూపించనూలేదు.

ఆకాశరాజు అంతఃపురాలు, హర్మ్యాలు, కోటలు అనంతప్రకృతిలో కలిసిపోయాయి. ఇక ఆలయ అవశేషాలు మాత్రం మిగిలి వున్నాయంటే, అవి ఎప్పటివి ? అందులో కొన్ని ఇప్పటికీ మంచి స్థితిలోనేవున్నాయి. కాబట్టి యీ ఆకాశరాజు అతని తమ్ముడు తొండమాను చక్రవర్తి, వీరంతా ఎప్పటి వారు ? ఇవి ప్రశ్నలు. ఇక సమాధానాలు చూడండి.

నిస్సందేహంగా తొండమాను చక్రవర్తి శాతవాహనుల కాలంనాటి వాడు. అందుకు నిదర్శనము, ఆ కాలంనాటికే యీ ప్రాంతానికి తొండమ నాడన్నపేరు స్థిరపడిపోయింది. తిరుమల శ్రీనివాసస్వామిగానీ, నారాయణవర పద్మావతీ అమ్మవారు గానీ తుండీరమండల వాసులే. ఆకాశరాజు, ధరణీ దేవి కూడ క్రీస్తుపూర్వం ఒకటవ లేదా రెండవ శతాబ్దమునకు చెందినవారుగా భావించవచ్చు. వారు కూడ తిరుమల శ్రీనివాసుని విష్ణు అంశగా భావించి నారని వ్రాయబడినదే గానీ, సాక్షాత్తు విష్ణువే అని వ్రాయబడలేదు. ఇక శ్రీనివాస కళ్యాణం ఆ కాలంలో జరిగినదిగానే భావించవచ్చు.

ఆ కాలంనాటికి శిల్పకళ అభివృద్ధి చెందలేదు. ఆలయాలు ఇటుకలు సున్నం, కఱ్ఱలతో కట్టేవారు. అందుకే అవి మన కంటికి కనబడకుండా పోయాయి. ఇక శాసనాల సంగతి దేవుడెఱుగు. ఆ కాలంలో వెలిసిన కొన్ని బౌద్ధస్తూపాల చెక్కడాలను గ్రీకో, రోమన్ శిల్ప పద్ధతి అన్నారేగానీ, భారతీయ పద్ధతి అనలేదు. దక్షిణ దేశంలో శిలలతో ఆలయనిర్మాణాలు, శిల్పాలు, గుహాలయాలు ఇవన్నీ పల్లవులతో ప్రారంభమయినాయి. క్రీస్తుపూర్వం వున్న పల్లవులకు, క్రీస్తు వెనుక 3 వ శతాబ్దం వరకు వున్న పల్లవులకు కూడ శిల్ప నిర్మాణం రాదు. ఆ తరువాత పల్లవులకే అది అబ్బింది. వారు కూడ మొదట మొరటుగా గుహాలయాలు ప్రారంభించి క్రమేణా నాజుకుగా ఆలయనిర్మాణం సాగించారు. వాటి మీద శాసనాలు చెక్కించడం ప్రారంభం చేసినారు.



నారాయణవరం శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి - దేవేరులు (ఉత్సవర్లు)

కాబట్టి పద్మావతి శ్రీనివాసులకు ఆకాశరాజు నిర్మించిన ఆనాటి ఇటుకల ఆలయాల అడ్రసు మనకు తెలియదు. ఇతరులచే కట్టబడిన ఆలయాలను, అన్నదమ్ములు కట్టించిన ఆలయాలుగ ఆపాదించడం జరిగింది. అంతేకాదు. ఆ కాలంలో తిరుమల శ్రీ వారిని దర్శించలేని రోజుల్లో ఆయనకు బదులుగా వెలసిన మూడువైపుల మూడు ఆలయాల్లో ఇది ఒకటి. తూర్పు వైపు భక్తులు యీ స్వామిని చూసి తృప్తిపడేవారు. మనకు తెలిసిందల్లా, అచ్యుత దేవరాయల కాలంలో, ఆయన ఆంతరంగిక సిబ్బందికి చెందిన పెనుగొండ వీరప్పన్న, నారాయణవరంలో శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామి ఆల

యాన్ని *క్రీ.శ. 1541-42 సంవత్సరాల కాలంలో నిర్మించడం. (ఈ సంగతి మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టు 1912 సం॥ 56 పేరాలోవుంది.)

లేపాక్షి నందిలక్కిశెట్టి, ముద్దమ్మలకు ముగ్గురు కుమారులు. వారిలో పెద్దవాడు వీరవ్పన్న, కొందరు విరూపన్న అనికూడ పిలుస్తారు అతన్ని. వారిది పెనుగొండ.

అచ్యుతదేవరాయలకు విరూపన్న అంగరక్షక అధికారిగా వుండేవాడు. నారాయణవర ఆలయం నిర్మించి, (జీర్ణోద్ధారణ చేసి) వెంకటాద్రిరాయ మహారాయల సౌభాగ్యానికి తాను నిర్మించినట్టు శాసనం వేశాడు.

## లేపాక్షి

అనంతపురం జిల్లా హిందూపురానికి 8 మైళ్ళ దూరమున నున్న లేపాక్షి క్షేత్రం విరూపన్నకు ఆచంద్రార్కకీర్తిని ప్రసాదించింది. పూర్తి కాని వీరభద్ర స్వామి ఆలయమది. అయినా అచ్చటి శిల్పకళ చిత్రకళ అనితరలభ్యం. అందులో ఎక్కడా అసభ్యచిత్రంకానీ శిల్పం కానీ మనకు కానరాదు. అచ్యుత రాయలకు కోపమొచ్చి తన కళ్లు పీకివేయమన్నాడని విని, తన కళ్లను తానే పీక్కున్న విరూపణ్ణ విషాదగాథ, యిప్పటికీ అచ్చట గోడలమీద అతని కళ్ల గుంతలు, కారిన నెత్తుటి మరకలు మనకు విషాదం కలిగిస్తాయి. మన కళ్లకు పండుగ చేయడం కోసం తన కళ్లను పోగొట్టుకొని "లేనక్షి" అయి మనకు లేపాక్షిని ప్రసాదించినాడు. స్టేట్‌ట్రేడింగ్ కార్పరేషన్‌వారు † "లేపాక్షి"

---

* తొండవాడ, శ్రీనివాస మంగాపురం, నారాయణవరం - యీ గ్రామాలలోని శ్రీవారి ఆలయాల జీర్ణోద్ధారణ, నిర్మాణ కాలం దాదాపు ఒకటేనని, దీనిని బట్టి గ్రహించవచ్చు. శిల్పులు అందుబాటులోకి రావడమే ఇందుకు కారణం. పైగా ఒక ఆలయం తరువాత సమీపంలోనే మరొక ఆలయం సహజంగా వారు చేబడుతూ వుంటారు.

† లేపాక్షి పేరు - రామాయణకాలంలో - జటాయువు రావణునితో పోరి, తన రెక్కలు పోగొట్టుకొని ఇక్కడ పడియుండగా - శ్రీరామచంద్రుడు ఆ పక్షిని చూసి, అప్యాయంగా - లే! పక్షీ! అన్నాడట. అందుకని లేపాక్షి అని పేరు వచ్చింది. అందుకు తగ్గట్టు సీతమ్మవారిది ఒకే పాదంగుర్తు వుంది యీ గుట్టమీద.

పేరుతో చేతిపనుల షో రూములు తెరిచి, కోట్ల రూపాయల వ్యాపారం చేస్తు న్నారు. "లేపాక్షి బసవయ్య లేచిరావయ్యా!" అని పాడిన అడవిబాపిరాజు గీతం తప్పుకాదు. నిజంగానే లేచి వచ్చేటట్టున్నాడు ఆ బసవయ్య. శిల్పాల లోని సిరియాల చక్రవర్తి కథ మనోహరం. పార్వతీదేవి నగ్నంగా పరమశివునికి బిక్ష పెట్టడం—సుందరశిల్పం. బండమీద సీతమ్మపాదం శిల్పించినట్టు లేదు బండమీద అచ్చొత్తించినట్టువుంది. మరోపాదం పెనుగొండ దుర్గం మీద వున్నది.

విరూపన్నకు చేదోడు వాదోడుగా అతని తమ్ముడు వీరన్న వుండినాడు కావుననే, ఈ మహత్కార్యాలన్నీ చేయగలిగాడు—విరూపన్న.

లేపాక్షిలో వీరభద్రస్వామిగుడి 108 పవిత్ర శైవక్షేత్రములలో నొకటి. ఆ కొండను కూర్మశైలమంటారు. ఇచ్చటి పాపనాశేశ్వర లింగం అగస్త్య ప్రతిష్ఠ మంటారు. ఈ ఆలయానికి ఎదురుగా రఘునాథమూర్తి ఆలయముంది. అలాంటి అగస్త్యప్రతిష్ఠ వున్న నారాయణవరంలో కూడా కళ్యాణవేంకటేశ్వరా లయముతో బాటు వీరభద్రస్వామి ఆలయము కూడా నిర్మించాడు విరూపన్న.

* * *

నారాయణవరఆలయం, ఆకాశరాజు సంతతిగా పేర్కొనబడిన కార్వేటి నగరాధీశ్వరుల యాజమాన్యంలో వుండేది. వారి సంస్థానము పతనమయిన తరువాత, ఆలయనిర్వహణ తిరుత్తణి శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవస్థానమువారు చేపట్టిరి. తిరుత్తణి తాలూకా, పటాస్కరు అవార్డుతో మద్రాసు రాష్ట్రానికి చెందడంతో, 1960 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు, ట్రస్టీలబోర్డు నేర్పఱచి, ఆలయనిర్వహణము వారికప్పగించినారు. ఈ బోర్డువారు తమ నిర్వహణకాలంలో అనగా 17—5—1964 న బాలాలయం నిర్మించి, సన్నిధుల—విమానముల జీర్ణోద్ధారణ గావించి, అష్టబంధన, మహాసంప్రోక్షణ కుంభాభిషేకములను 21—8—1966 తారీఖున నిర్వహించిరి.

తి.తి.దే. వారు ఈ ఆలయ పాలనను 29-4-1967 న స్వీకరించిరి. అప్పటి కార్యనిర్వహణాధికారి శ్రీ కె. ఉమాపతిగారు. ఇంతటితో ఈ ఆలయానికి పట్టిన శని విరగడ అయింది. ఇప్పుడిహ గ్రహబాధలేదు. దీనిని ఒక్కప్పుడు కాంచీపురము లాగ ఆలయాలనగరంగా రూపొందించాలనుకున్న వారి ఆశయం యీ విధంగా నెరవేరింది.

ఆలయంలో అమ్మవారి సన్నిధిముందు ఒక పెద్ద తిరగలిరాయి పడి వుంది. దానితో ఆమె పెళ్లినాడు బియ్యం విసరినారట. బియ్యం విసరినారో లేక రాగులు విసరినారో కానీ, దానిని త్రిప్పాలంటే మానవ బలంచాలదు. అంతపెద్దది. ఆలయంలో ఆళ్వారుల విగ్రహాలు, దశావతారాల విగ్రహాలు మంచి స్థితిలో వున్నాయి. శ్రీ వరదరాజస్వామి, ఆండాలమ్మ, శ్రీ కోదండ రాముల వారు, శ్రీ రంగనాయకస్వామి, శ్రీ రాజమన్నారుస్వామి, శ్రీ ప్రయాగ మాధవస్వామి వీరి విగ్రహాలు చక్కని స్థితిలో అందంగా వున్నాయి. ఈ ఆలయ రాజగోపురము ఎత్తు 963 అడుగులు.

ఉత్సవ విగ్రహాలలో శ్రీ భక్తాంజనేయస్వామి, శ్రీ ఆండాళమ్మ విగ్రహాలు సౌందర్యోపేతములై యున్నవి. అలాంటి మరొక సౌందర్యమూర్తి శ్రీ కోదండరాముల వారి ఉత్సవ విగ్రహం. ఆయనను చూస్తే 'సుందరరామా' అని పిలవాలనిపిస్తుంది. అంతటి అందగాడు మరి.

ఈ ఆలయ పుష్కరిణి ఊరి బయట పశ్చిమంగా మూడు ఫర్లాంగుల దూరంలోవుంది. ఈ పుష్కరిణిలో శ్రీ పద్మావతీ సమేత శ్రీకళ్యాణ వేంకటేశ్వర స్వామి తెప్పోత్సవము (ప్లవోత్సవము) ప్రతి సంవత్సరము కార్తీక (అక్టోబరు-నవంబరు) శుద్ధ దశమినుంచి చతుర్దశి వరకు అనగా 5 రోజులపాటు జరుగుతుంది.

తొలిరోజు శ్రీ రామచంద్రమూర్తి, రెండవ రోజు శ్రీ కృష్ణస్వామి - ఆండాళమ్మ (గోదాదేవి) గారు, మిగత మూడు రోజులు శ్రీ పద్మావతీ సమేత శ్రీకళ్యాణ వేంకటేశ్వరస్వామి వారు తెప్పలమీద వుత్సవంజరిపించు కొంటారు.

తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవ క్రమంలోనే యిక్కడ కూడ శ్రీ కళ్యాణ వేంకటేశ్వరులకు - శ్రీ పద్మావతి అమ్మవారికి బ్రహ్మోత్సవం జరుగుతుంది. ఈ ఉత్సవం ప్రతి సంవత్సరము జ్యేష్టమాసము (మే - జూన్) శుద్ధదశమి నుంచి బహుళచవితి వరకు అనగా 10 రోజులపాటు వైభవంగా జరుగుతుంది.

నారాయణవరం శ్రీ అవనాక్షి అమ్మవారు.



# నాగలాపురము

'నాగ' శబ్దం చూడండి. "శాతవాహనులలో చివర చక్రవర్తి మూడవపులుమావి, క్రీ.శ. 3వ శతాబ్దములోని రెండవ దశాబ్దమున పాలించు నప్పుడు, మహాజన పదమను పేరుగల గొప్ప దక్షిణ ప్రాంతమును, మహాసేనాపతి స్కందనాగుడనువాడు పాలిస్తున్నాడు. వాని రాజ్యమునకు పశ్చిమముగా చూతనాగులనువారు వనవాసి (వందవాసి) నుంచి పాలించుచుండిరి. దీనిని బట ్టి క్రీ.శ. 3 వ శతాబ్దము ప్రారంభం నాటికి తొండమండలము నాగుల పాలనలోనున్నది. టోలిమీ అను గ్రీకు భూగోళశాస్త్రజ్ఞుడు బస్సరానాగులను, తన గ్రంథములో పేర్కొన్నాడు. ప్రాచీన తమిళ వాఙ్మయము ఓవియ నాగులను పేర్కొనుచున్నది. పల్లవుల నాగకన్యలను వివాహమాడి, నాగమండలమున రాజ్యము స్థాపించిరి.... పై విధముగా, శాతవాహన సామ్రాజ్యము అంతరించు నాటికి, వారి సామ్రాజ్య తూర్పుకొననున్న నాగులు, ఆ నాగులకు అల్లుడై, పల్లవవంశ మూలపురుషుడైన సింహవర్మ (వీరకుర్చి) పల్లవ రాజ్యమును తొండమండలముననే స్థాపించెను. ఆతడు తొండమండలమందలి నాగులందరికి నాయకుడై ... సింహళ నాగవంశ రాజకుమారిని ఒక చోళరాజు వివాహమాడినాడు. ఆమె కుమారుడు తిరిగీ సింహళానికి నాగవంశరాజుగా పోయినాడు...."

(— ఈ గ్రంథంలోనే 21 నుంచి 23 పేజీలు చూడండి. వృషభాద్రి-నీలాద్రి అధ్యాయాలు.)

పై వివరణలనుబట్టి, నిస్సందేహంగా, నాగులరాజ్యము లేదా నాగులపురము-నేటి నాగలాపురమని చెప్పవచ్చు. కృష్ణదేవరాయల తల్లి నాగమాంబ నరసరాజు ప్రేమించిన నాగపడుచు కావచ్చు. ప్రస్తుతము నాగాలాండ్‌లో తప్ప, నాగులింకెక్కడాలేరు. కావున ఇక్కడి ఇతర వర్ణాలవారితో కలసిపోయారు యిచ్చటి ప్రాచీననాగులు.

ఇది నాగలాపురం. పేరులోనే పెన్నిధి అన్నట్టు యీ పేరులో ఏదో మహాత్మ్యం వుంది. ఈ పేరే పదిమందినీ ఆకర్షిస్తుంది. నిజానికి, నాగలాపురం ఆలయం, అందులోని శిల్పరాజాలు అందరినీ ఆకర్షిస్తాయి.

నాగలాపురములు రెండు. ఒకటి హంపీలోవుంది. మరొకటి మన చిత్తూరుజిల్లా సత్యవేడు తాలూకాలో - తిరుపతి నుంచి మద్రాసుకు నారాయణ వరం మీదుగా పోవు బస్సుమార్గంలోవుంది. హంపీ విజయనగర చక్రవర్తులు తమ రాణుల పేరిట హంపీలో - తిరుమలదేవియమ్మ పట్టణము, వరదాజీయమ్మ పట్టణం, నాగలాపురము అని యీ విధంగా తమ వుప పట్టణాలకు (సబ్-అర్బ్‌లకు) పేర్లు పెట్టారు. అందులో యీ నాగలాపుర - అనునది ఒకటి.

ఇది పేరుమోసిన ఢిల్లీమిఠాయి. మనకేకాదు తుళువ నరసరాజుకు. అందుకే అతడు తన భార్యపేరును చిరస్మరణీయం చేశాడు. ఆమె కృష్ణదేవ రాయలకు చల్లనితల్లి. మరచిపోలేని మందారవల్లి. అందుకే ఆయనకూడ తన తల్లి పేరును చిరస్మరణీయం చేశాడు. నరసరాజు, 'నాగలాపుర' అని అప్యాయంగా పిలిస్తే, కృష్ణరాయలు 'నాగలాపురము' అని సగౌరవంగా పిలిచినాడు. ఒకరిది భార్యప్రేమ. మరొకరిది తల్లిప్రేమ.

ఇంతకూ ఈ నాగలదేవి ఎవరు? ఇంత చరిత్రకు, ఇంత పురాణానికి, ఇంత ప్రచారానికి, పెట్టి పుట్టిన ఆయమ్మ ఎవరు? ఎక్కడిది? అందరూ చెప్పేది - ఒప్పుకొనేది - ఆ నాగలదేవి అనే ఒక స్త్రీ, సామాన్య కుటుంబానికి చెందినది. ఆమె స్వగ్రామం - ప్రస్తుత నాగలాపురం. ఆమె కన్యగా ఆ గ్రామంలో జీవించినంతవరకు ఆ వూరుపేరు వేరు. ఆమె సమ్మోహనాకారం చూశాడు తుళువ నరసరాయలు. ఆకర్షితుడై ఆమెను విజయనగర పట్టపురాణిగ చేసినాడు. తనను రాణీగా చేసుకొన్న నరసరాజు ఋణం వుంచుకోలేదు ఆమె. కృతజ్ఞతగా కృష్ణదేవరాయలను ప్రసాదించినది. నరసరాజుకేకాదు, ఆంధ్ర భూమికే కాదు, దక్షిణ హిందూదేశానికే గాదు, హిందూ మతానికే గాదు, యావత్భారత భూమికి చిరస్మరణీయుడైన మహా చక్రవర్తిని ప్రసాదించింది. సామాన్య కుటుంబంలోనుంచి వచ్చిన ఆనాగలాంబ నాగులాంబ ప్రతిభ అట్టిది.

ఆమె పేరుతో వెలిసిన 'నాగలాపుర' అనుపదం అంత ఆకర్షిస్తే, ఆమెను స్వయంగా చూసిన నరసరాజు ఎంత ఆకర్షితుడై వుండాలి? అందుకే అన్నాను - పేరులోనే పెన్నిధి అని, పేరుమోసిన ఢిల్లీమిఠాయి అని.

నాగలాపురములు రెండు వున్నట్టే - నాగపుడోలులు కూడా రెండు. ఒకటి నాగపుడోలి ఇది సామాన్యం. ఇక రెండవది, చతుర్వేది మంగళమనే నాగలాపుడోలి ఇందులో మొదటిది ఏది? రెండవది ఏది?

మూడవ కుళోత్తుంగ చోళుని పరిపాలనా చివరి కాలంలో, రాజమల్ల దేవుడనేవాడు నాగపుడోలి అన్నగ్రామంలో తన పూర్వీకుడయిన యాదవ నారాయణపేరుతో ఒక ఆలయం నిర్మించాడు. ఈ రాజమల్లదేవునకు భుజబల సిద్ధరనన్ అని, యాదవరాయన్ అని యింకా రెండు పేర్లు వున్నాయి. ఈ రాజమల్లుని పరిపాలనా కాలం - క్రీ.శ. 1208–1237. కావున ఈ కాలం లోనే మొదట (క్రొత్తగా) యాదవనారాయణ ఆలయ నిర్మాణం జరిగివుండాలి.

ఈ రాజమల్లదేవుడు యాదవరాజు. ఇతని తండ్రిపేరు ఘట్టిదేవుడు. ఈ ఘట్టిదేవుడు నెల్లూరుసీమను పాలించినవాడు. ఆ కాలంలో నారాయణవరం, కార్వేటినగరం, శ్రీకాళహస్తి, వెంకటగిరి, యీ ప్రాంతాలన్నీ యాదవరాజుల పాలనలో నుండినవి గాన, నెల్లూరు శాసనాలలో - నాగపుడోలి అనేవూరు, వెంకటగిరి సమీపంలోని నాగవోలుగా నిర్ధారించినారు శాసనములు ఎత్తివ్రాసిన వారు. నిజమే కావచ్చు. అక్కడ యాదవ నారాయణుని గుడి వుండాలి. యాదవనారాయణుడంటే కృష్ణుడు. మరి అక్కడ శ్రీకృష్ణుని ఆలయముండాలి గదా! లేదు. ఉన్న ఒకే ఒక ఆలయం - అన్ని గ్రామాలలో వుండే భజన మందిరం - పోనీ గుడి అందామా అంటే అది శ్రీరామాలయము అవుతుంది గానీ, కృష్ణాలయమెలా అవుతుంది? మరి ఈ యాదవనారాయణుని గుడి ఏమయింది? కాలగర్భంలో - భూగర్భంలో కలిసి అంతరించి పోయిందా? ఏమో, అన్నీ సందేహాలే!

ఇది ఇలావుండగా, మరొక నాగపుడోలి కనిపిస్తోంది శాసనాలలో. ఇది చతుర్వేది మంగళమనే నాగపుడోలి. చతుర్వేది మంగళమంటే - తెలుగులో

సర్వమాన్యం లేదా దైవదత్తం - అనే అర్థానికి, అరవంలో - చతుర్వేది మంగళమంటారు. ఇంకా వివరించాలంటే నాలుగు వేదములలో నిష్ణాతులైన పండితోత్తముల అగ్రహారమన్నమాట. ఈ వూరు ఎక్కడుంది? ఎక్కడుందో తెలియదుగానీ, నా మనస్సులో బలంగా నాటుకొన్న విషయం మాత్రం - చతుర్వేది మంగళమనే నాగపుడోలి ఏదో కాదు. మన నాగలాపురం. ఆ శాసనంలోని యాదవనారాయణుడే మన వేదనారాయణుడు.

శ్రీ కృష్ణదేవరాయల శాసనాలలో, ఆ దేవునికి మ్రొక్కినట్టు, ఆ ఆలయ అభివృద్ధికి నిర్వహణకు దానాలు చేసినట్టు వుంది గానీ, ఆ ఆలయాన్ని, ఆయన నిర్మించినట్టు ఎక్కడాలేదు. ఆయన కాకపోయినా, మరొకరు నిర్మించినట్టు కూడా లేదు. ఎవరూ నిర్మించకపోతే ఆ ఆలయం ఎలా వచ్చిందిమరి? పురాణాలలో చెప్పినట్టు, ఐదు ప్రాకారాలతో, సూర్యభగవానుడు తన సేవ నిమిత్తం నిర్మించాడా? పైగా ఆలయంలోని మూర్తులు - నారాయణవరం ఆలయంలోని మూల విగ్రహాలు - ఒకే కాలంలో ఒకే శిల్పిచేత శిల్పించబడినట్టు ఆ విగ్రహాలను పరిశీలించినవారు ఎవరయినా అంగీకరిస్తారు. వేదవల్లి తాయారును, పద్మావతమ్మను స్థానాలు మార్చి. తారుమారు చేశామంటే, ఆలయ అర్చకులే కనుక్కోలేరు. అదీకథ. అందుకని నా కథకూడ తప్పుగాదు. తమ రాజధాని నారాయణవరంలో గుడిగట్టిన యాదవరాజులే, అచ్చటికి సమీపంలోని (15 మైళ్లు) నాగలాపురం గుడి గట్టివుంటారు. శ్రీకృష్ణదేవరాయల జీర్ణోద్ధారణ ప్రణాళికలో శాసనాలు అదృశ్యమయి పోయివుంటాయి. పైగా అప్పటికి 300 సంవత్సరాల కాలం - మధ్యలో గడిచింది ఆలయం జీర్ణోద్ధారణకు తప్పకుండా వచ్చివుంటుంది.

రాజమల్లుడు చతుర్వేది మంగళమనే నాగపుడోలిలో యాదవనారాయణుని ఆలయాన్ని నిర్మించి, దైవప్రతిష్ఠచేసి, పూజా పునస్కారములు ఏర్పాటు చేసినాడు. ఇతని తదనంతరము పాలనకొచ్చిన తిరువేంగళనాథ యాదవరాయలు తిరుమల శ్రీవారికి, తిరుపతి గ్రామాన్ని సర్వమాన్యంగా ఇచ్చినాడు గానీ, యాదవనారాయణునికి ఏమీ చేసినట్టు కనబడదు.

* యాదవనారాయణుని ఆలయ నిర్మాణం క్రీ. శ. 1208 – 1237 మధ్య కాలంలో జరిగినదిగా భావించబడినది. ఆ తరువాత ఆ ప్రాంతాన్ని అంటే అక్కడికి పదిమైళ్ల దూరంలోని రామగిరి క్షేత్రాన్ని క్రీ.శ. 1370 లో వీరకంపణుడు, 1387లో బుక్కరాయడు, 1400లో ద్వితీయ హరిహరుడు, 1480 లో తృతీయ విరూపాక్షుడు వీరంతా దర్శించి, అక్కడ శాసనాలు వేయించారు. కొండమీదున్న వాలీశ్వరుని కింత ప్రాధాన్యం ఇచ్చినవారు, మైదానంలోవున్న యాదవనారాయణుని విస్మరించి వుండరు. కానీ వారి దాన శాసనాలు ఏవీ నాగలాపురంలో లేవు. పైగా జీర్ణోద్ధారణ తరువాత అవి మనకు దొరికే అవకాశమూలేదు. అందుకని ఆ చరిత్ర మనకు దొరకదు.

ఇక్కడ గ్రహించవలసిన విషయం ఏమంటే - నాగలాపురము, నాగపుడోలియై - తరువాత అరిగండాపురమయి, ఆ పిమ్మట హరిగండాపురమయి, చివరకు నాగలాపురముగానే నిలిచినది. ఇది ఒక పద్ధతి. తొండప్పాడి (తొండవాడ) మధ్యలో అదృశ్యమయి చివరకు తొండవాడ నిలిచింది. ఈ పద్ధతిని ఏమని పిలువ వచ్చునంటే - తాతపేరు మనవడికి పెట్టడం. అంటే మధ్యలో వచ్చిన తండ్రిపేరు వేరుగా వుంటుంది. ఇతనికి మనవడు పుట్టితే, ఇతనిపేరు తిరిగీ వస్తుంది. ఇది ప్రాచీన ఆచారం దీనికి చింతించ వలదు. అర్థంచేసుకుంటే అంతేచాలు.

చాలకాలం నుంచి ఆలయాలను, పూజారులను, అక్కడ జరిగే నిత్య కర్మకాండను, నిశితంగా పరిశీలించాను గాబట్టి, ఆ అనుభవంతో ఒక చిన్న కథ అల్లుతాను. నమ్మితే నమ్మండి. నమ్మకపోయినా వచ్చిన నష్టమూలేదు.

13 వ శతాబ్దివాడయిన రాజమల్లదేవుడు, నాగపుడోలిలో యాదవ నారాయణుని విగ్రహం ప్రతిష్ఠించి, పూజాపునస్కారములు జరిపించు కాలం లో ఒక పిల్లపూజారి, తన సహజ దుడుకుతనంతో శ్రీకృష్ణుని నెమలిపింఛాన్ని విరగ్గొట్టాడు. విగ్రహం భిన్నమయింది. ఆ సంగతి పెద్ద పూజారులకు చెప్ప

* యాదవనారాయణు డను పేరుతో తిరుమల ఆలయంలో - ఒక ఆలయోద్యోగి వుండినట్టు శాసనాల వల్ల తెలుస్తోంది.

లేదు. చెప్పినా వినిపించుకొనే స్థితిలో వారు లేరు. పెద్దవారికి తెలియదు గాబట్టి, రాజులకు అంతకన్నా తెలియదు. తెలిసినా, వారి తీరిక మనకు తెలిసిందే. అవతల ఎప్పుడో కనుక్కున్నారు. భిన్నమయిన విగ్రహానికి పూజ జరపకూడదని నియమం. యాదవరాజులకు యీ సంగతి తెలిస్తే వీపు విమానం మోత మోగుతుంది. రాజుగారు తలుచుకొంటే దెబ్బలకు కొదువా? అనిగదా సామెత. అందుకని - ఎందుకు చెప్పడం - చీవాట్లు తినడం అని మిన్నకున్నారు. ఈ లోగా పూజలు మానలేక, చేయనూలేక త్రిశంక స్వర్గంగా గడిపారు దాదాపు 250 సంవత్సరాలు. ఎన్ని తరాలవారు త్రిశంక స్వర్గంలో గడిపారో చెప్పలేము

ఈలోగా రాజులూ మారారు. రాజ్యాలూ మారినాయి. అర్చకులూ మారినారు అందులో కొంత ధైర్యంగలిగిన పూజారులు వచ్చారు. రాత్రికి రాత్రే విగ్రహాన్ని పూడబెరికి, క్రొత్తవిగ్రహం చేయించాలంటే కాలాతీతమవు తుంది గాబట్టి — పైగా అందరికీ తెలుస్తుంది గాబట్టి — గుట్టుచప్పుడు కాకుండా — దొరికిన తాపీవనివాన్ని పట్టుకొచ్చి, సున్నం ఇసుకకలిపి ఆకాలం నాటి కాంక్రీటుతో కృష్ణవిగ్రహానికి బదులు విష్ణువిగ్రహం పోత పోయించారు కారణం? ఆ తాపీవనివాడు — నెమలిపింఛము — మురళీవాయిద్యం, చెవుల జుంకీలు, వయ్యారపుహొయలు — యీనున్నితశిల్పం, తన కాంక్రీటులో రావన్నాడు. పైగా తనకు చాతకాదన్నాడు. "బాబ్బాబు! ఏదో ఒకటి చెయ్యి. నీకు పుణ్యముంటుంది, విష్ణువన్నా ఒకటే, కృష్ణుడన్నా ఒకటే. ఒకశంఖు, ఒకచక్రం మాత్రం పెట్టు, సర్దుకొంటాం" అని అర్చకులు కోరడంతో ఈ విధంగా కృష్ణునికి బదులు విష్ణువిగ్రహంవచ్చింది. ఈ సంగతి ఎవరికీ తెలియదు — ఇరువైపులామున్న రుక్మిణి సత్యభామలకు తప్ప.

తన తండ్రి గ్రామాంతరము పోగా ఈ సంగతి తెలియని మరొక పిల్లపూజారి — కడివెడు నీళ్లు తెచ్చిమునుపటిలాగ అభిషేకం చేశాడు స్వామి వారికి. రెండుపాదాలు, కాంక్రీటు బలహీనంగా వుండడముతో నీళ్లతోబాటు చేపపాలునులు పూడినట్లు ఊడిపోయాయి. ఆరోజుటినుంచి స్వామివారికి జలాభి

షేకం నిషిద్ధం, ఉన్నవిగ్రహం కొట్టుకొని పోకుండా యథాతథంగా విగ్రహాన్ని వుంచాలి గాబట్టి తైలాభిషేకం ప్రవేశపెట్టారు.

ఇకపాదాలు లేని స్వామి ఎవరుగా వుంటారు? మత్స్యావతారం. వెంటనే, నాగలాపురంలోని కృష్ణుడు 8 అవతారాలకు మునుపు వెళ్ళి కాంక్రీటు పొలుసులు పోగొట్టుకొని మత్స్యావతారుడై పోయాడు. ఇదంతా చూస్తున్న రుక్మిణి, సత్యభామలు — 'తమనేమి చేయకపోతే, చాలురాస్వామీ!' అని, నోరుమెదపకుండా వుండిపోయారు. దాంతో రుక్మిణి — భూదేవిగా, సత్య భామ — నీలాదేవిగ మారిపోయారు. ఇది కథే అయినా, పూర్తిగా అబద్ధం గాదు. నాగలాపురంలోని ఉత్సవవిగ్రహాలపేర్లు — వేదనారాయణస్వామి, శ్రీ దేవి — నీలాదేవి ఇందులో నీలాదేవి కృష్ణావతారం నాటిదేగానీ, మత్స్యావ తారంనాటిది మాత్రంగాదు. శ్రీదేవి — భూదేవి అనిపేర్లు పెట్టివుంటే — గుట్టుచప్పుడు కాకుండా తప్పించుకొని వుండవచ్చును. అలా జరుగలేదు. పైగా ఉత్సవ విగ్రహాలలో, బాలకృష్ణుని పంచలోహ విగ్రహం, నాట్య భంగిమలో, వున్నతంగా వుంది. ఈ విగ్రహ పరిమాణంచూస్తే, ఒకప్పుడు ఆ ఆలయ అధిష్టానదేవత, ఆయనే నేమో నన్న విశ్వాసం బలపడుతుంది. ఇది ఒకప్పుడు కృష్ణాలయం కాబట్టే దీనికి అభిముఖంగా ఆంజనేయస్వామిగానీ గరుడాళ్వారు గానీ ప్రతిష్ఠింపబడలేదు. యాదవరాజులకు శ్రీ కృష్ణుడు కులదైవం గాబట్టి - నాగలాపురం ఆలయాన్ని పోగొట్టుకొని, వారు కార్వేటి నగరంలో క్రొత్తగా శ్రీ వేణుగోపాలస్వామిని ప్రతిష్ఠించుకున్నారు.

అనూహ్య పరిస్థితులు ఎదురవడంతో, పురాణాలు పరిస్థితుల ప్రభా వానికి తగ్గట్టుగా మారిపోయాయి. వాతావరణం అనుకూలించింది. భౌగోళిక పరిస్థితులుకూడ అనుకూలించాయి, స్థలపురాణం క్రొత్తగా వెలిసింది. సముద్రం దగ్గరగాన, పైగా యీ ప్రాంతమంతా ఆదిలో సముద్రాంతర్భాగం కావున మత్స్యావతారకథ సరిగ్గా సరిపోయింది. ఆలయానికి ఎదురుగా ఆంజ నేయస్వామిగానీ, గరుడాళ్వారుగానీ లేక పోవడంతో సూర్యసేవ ప్రారంభ మయి, మార్చిమాసం నాటికి సూర్యకిరణాలు అసలుస్వామిని తాకుతాయి

కావున * సూర్యసేవకూడ అతికించినట్లు సరిపోయింది. అసలు ఆలయంలో గర్భగుడిలో అమ్మవార్లు ఇద్దరుండగా, ప్రత్యేకంగా వేదవల్లీదేవిని సృష్టించి — ఆమెకు ప్రత్యేకంగా గుడికట్ట వలసిన అవసరం ఇందువల్లనే (యీకథవల్లనే) కలిగింది.

మత్స్యావతారంలో, వేదములు దొంగిలించిన హిరణ్యాక్షుడిని సంహరించి, వేదములుపుద్ధరించి నందువల్ల వూరిపేరుకూడ అందుకు తగ్గట్టు మార్చ వలసి వచ్చింది. అరి=శత్రువు, గండము=ఆపద, శత్రువులకు ఆపద లేక ప్రాణసంకటము కలిగించు ప్రదేశము అని ఒక అర్థము. ఇంకొక అర్థము అరి=చక్రము, కండము: మాంసము, అనగా చక్రముతో ఖండించ బడిన మాంసము (కళేబరము). ఇది స్వామివారి ప్రయోగ చక్రమునకు సరిపోతుంది. దీని తరువాత వచ్చినపేరు — హరిగండాపురం. హిరణ్యాక్ష సంహారార్థము వెళ్లిన విష్ణుమూర్తి వైకుంఠంలో కనబడకపోగా పరమశివుడు వెదుక్కుంటూవచ్చి, నాగలాపురంలో ఆయన్నికనిబెడతాడు. అందుకని హరి గనబడినపురం, హరిగండాపురమయింది. ఆవూరిలో నాగలాదేవి పుట్టింది గాబట్టి, పుట్టకపోయినా కృష్ణరాయల తల్లిపేరు నాగులాంబ గాబట్టి ఆవూరిపేరు తిరిగి నిలబడింది. ఇలాంటివి మన కథలు — చరిత్రలు. రెండు శిల్పాల మధ్య (రుక్మిణి – సత్యభామల) సున్నంతో నిలబడివున్న మన వేదనారాయణ స్వామి కథ ఇది. ఆయన వేదముల నుద్ధరించినా, మన మాయనను వుద్ధరించ లేకపోతిమి గదా! మన తి.తి.దే. నకు ఎంత డబ్బున్నను ఏం లాభం?

తి.తి.దే. శాసనాలలో సంపుటము 3, శాసనములు 103, 111, 112, ముఖ్యమైనవి. వీటిలోనాగలాపురముపేరు అరిగండాపురముగానున్నది. ఈ శాసనములకాలము క్రీ. శ. 1515, 1516.

---

* తిరుమల ఆలయంలోకూడ రెండవప్రాకారగోపురం కొంచెం దూరంగావుండి - గరుడాళ్వారు ఎదురుగా లేకపోతే, సూర్యనారాయణస్వామి, వేంకటేశ్వరస్వామిని నిత్యం - ప్రొద్దు పొడుస్తూనే సేవించేవాడు.

అదే సంపుటములోని 136 శాసనము (క్రీ. శ. 10-9-1519) నాటికి అనగా మూడునాలుగేళ్ల తరువాత అరిగండాపురము లేక హరి గండా పురము నాగలదేవిఅమ్మన్ పురముగా మారిపోయినది. దీనిని బట్టి కృష్ణ దేవరాయలరాక – ఆయన తీర్థయాత్రాసమయము – మహామఖ అను * కుంభ కోణం ఉత్సవం – క్రీ. శ. 1517 నాటిది – నిజమని రూఢి అవుతోంది. అనగా కృష్ణదేవరాయలు క్రీ. శ. 1517లో అరిగండాపురమును దర్శించి విరివిగా దానములు చేయుటతో, ఆలయ పునర్నిర్మాణము ప్రారంభమయి, ఆయన తల్లిపేరుతో ఆ గ్రామం పిలువబడడం ప్రారంభమయింది.

అదే సంపుటములోని 155 శాసనకాలము నాటికి (అనగా క్రీ. శ. 29-10-1523) నాగలదేవిఅమ్మన్ పురము – నాగలదేవి పురముగా మారి నది. తరువాత నాగలాపురముగా మారడం మన మెఱిగినదే

శాసనాలలో నాగలాపురము అడ్రసు (కుల్రవర్ధన కొట్టం – (జిల్లా) నిన్రైయూర్‌నాడు (తాలూకా) అరిగండాపురం.

నాగలాపురములో అవిరి (అవిడి) కాళప్పర్ తిరువేంగటముడైయార్ అను ప్రాంతీయ అధికారి ఒకరుండేవారు, కృష్ణరాయల కొలువులో! నాగలాపుర ఆలయ నిర్మాణం పని, కృష్ణరాయల వారు ఆయన కప్పగించారు. ఈ కాళప్పర్ తిరువేంగటముడైయార్ మరొక పేరు, ఆనైత్తలగుంకండ హరిహర సర్. ఇతడు శివకేశవుల భేదంలేకుండా హరిహరసర్ అని పేరు పెట్టుకొన్నా అందరూ ఇతన్ని హరిదాసు అని ముచ్చటగా పిలిచేవారు. ఇతడు నాగలాపురము లోని కరియమానిక్కప్పెరుమాళ్ అను ఆలయ ధర్మకర్తలలో నొకడు. ఈ పేరు కూడ నాకు శ్రీ కృష్ణుని గుర్తుకు తెస్తోంది. కరియమానిక్కప్పెరుమాళ్ అంటే

* కుంభకోణంలో, 12 సం॥లకు ఒకసారి, కుంభమాసంలో మహామఖ అను ఉత్సవం జరుగుతుంది. ఈ ఉత్సవానికి కొన్ని లక్షల మంది యాత్రికులు హాజరవుతారు. ఇది అన్ని పుష్కరాలవలెనే ఆదినుంచీ వస్తున్న సంప్రదాయం. ఈ సంవత్సరం శ్రీ సిద్ధార్థినామ సంవత్సరం ఫాల్గుణ (కుంభమాసం) పౌర్ణమినాడు వచ్చినది. అనగా 1-3-1980. తిరిగి 1992 సం॥ వస్తుంది. ఇదే రోజు ఉత్తర దేశంలో హోలీ పండుగ జరుపుకుంటారు.

నల్లని వజ్రంలాంటి దేవుడు - నీలమేఘశ్యాముడన్న మాట. ఈ నల్లమాణిక్యుని పోతన గారు తన భాగవతంలో - "నల్లనివాడు, పద్మనయనంబుల వాడు కృపారసంబు ...." అని వర్ణించడంతో మనకు కృష్ణునిఫోటో చూపగలిగాడు. ధన్యోస్మి. ఈ హరిదాసుకు ముచ్చటగా ముగ్గురు కుమారులు. మొదటివాడు వడమాలై అన్నంగల్. ఇతడు తిరుపతిలోని శ్రీ గోవిందరాజ స్వామికి మొత్తం 2650 నర్ - పణం సమర్పించినాడు. ౧తని తమ్ముని పేరు పెరుమాల్ మొదలియార్. ఇతడు తిరుపతి శ్రీ గోవిందరాజస్వామికి, 11000 నర్ - పణం సమర్పించినాడు. అక్కడ డబ్బు ఖర్చుపెట్టి తమ ఊర్లో ఆలయం బాగుచేసుకోకుండా, తిరుపతికి వచ్చి ముడుపు చెల్లించి పోయాడు. వచ్చేవాడు వూరకవచ్చాడా? తమ ఆలయ స్థనత్తర్‌ను పిలుచుకొని వచ్చాడు. ఈ కరియమానిక్క ఎంపెరుమాన్ ఆలయ స్థనత్తర్ తమ ధర్మకర్తల కంటే బుద్ధిమంతుడు. అక్కడే తమ ఆలయానికి డబ్బు గుంజుకోకుండా, తిరుపతికి వచ్చి, అక్కడ తిరుమల స్థనత్తర్ లేకపోయినా, శ్రీ వైష్ణవుల అనుమతితో, వాడు చేయవలసిన పని తానే చేశాడు. గోవిందరాజాలయము మీద తానే శాసనం చెక్కించాడు. డబ్బు వస్తుందంటే - అనుమతి - ఎవరయినా ఇస్తారుగద. అందులో తిరుపతి శ్రీ వైష్ణవులు 11000 నర్ పణం పోగొట్టుకుంటారా?

హరిదాసు మూడవ కుమారుని పేరు తిరుమలైయ్యప్ప మొదలియార్. ఇతడు తిరుపతి శ్రీ గోవిందరాజస్వామికి, తిరుమల శ్రీవారికి, ఇద్దరికీ కలిపి 4700 నర్ - పణం సమర్పించినాడు. ఇంతటి అమాయకులు ఎక్కడయినా వుంటారా? తమ స్వంత ఊర్లో ఆలయం అసంపూర్ణంగా, అల్లకల్లోలంగా వుండగా డబ్బు తెచ్చి ఇక్కడ చెల్లిస్తారా? తిరుపతి దేవుళ్లు ఆ విధంగా బుద్ధి పుట్టించివుంటారు! వారు మాత్రం ఏంచేస్తారు పాపం?

ఈ తిరుమలైయ్యప్ప పేరు విచిత్రంగా వుంది. ఈ అయ్యప్ప లంతా ఇప్పుడు, శబరిమలై పేరు పది మందికీ తెలిశాక వెలిశారు. ఇప్పటి శబరిమలై అయ్యప్పల్లాగ, ఆ కాలంలో తిరుమలయ్యప్పలు వెలిశారా?

ఏమో? 16వ శతాబ్దంలో పసుపు గుడ్డలు కట్టుకొని పవిత్రంగా వుండే తిరుమల య్యవ్పలుండే వారేమో ?

ఈ హరిహరనర్ కుటుంబీకులు తండ్రీ - ముగ్గురు కుమారులు - తిరునగరి (నాగలాపుర పట్టణభాగం) అను పట్టణమునకు చెందినవారు. ఈ తిరునగరి అను పట్టణమే - చతుర్వేది మంగళమనే నాగపుడోలి - అని నా అభిప్రాయం. ఆ రెండు పేర్లకు అర్థం ఒకటే. అందువల్ల అలా భావించడం జరిగింది. ఇక వీరి కుటుంబమునకు 'కారాలర్' అని పేరు. శ్రీ కృష్ణ దేవరాయలు దానంచేసిన పైకం - కరియమాణిక్యప్పెరుమాళ్ ఆలయ నిధులు - వీరు నాగలాపురంలో ఖర్చు పెట్టలేకపోయారు. అందుకు కారణం - స్థానిక రాజకీయాలు. ఆలయ నిర్మాణానికి నిధులకోసం సర్వమాన్య గ్రామాలలోని పొలాలు దున్నుతున్న రైతులను అడిగారు. కఱువు కాటకాలవల్ల రైతులు దానం చేయడం అటుంచి, దేవునికివ్వవలసి గుత్తగింజలు కూడ ఇవ్వలేదు. బలవంతం చేశారు. రైతులు తిరుగుబాటు చేశారు. ఆ వుద్యమం ఎంతటి దంటే, కట్టుతున్న ఆలయాన్నే కట్టనీయకుండా ఆపుచేసినారు. కట్టితే, తాము గుత్తగింజలు ఇవ్వవలసి వస్తుందేమోనన్న భయంతో. కృష్ణదేవరాయలవారు కూడ ఈ రైతు వుద్యమాన్ని నిర్లక్ష్యంచేసి, ధర్మకర్తలనే సర్దుకోమన్నాడు. వారు ఆ కోపంతో, తమ చేతితో మిగిలివున్న పైకాన్ని తిరుపతి దేవుని కప్పగించి, నాగలాపుర ఆలయ నిర్మాణం ఆపుచేశారు. ఇదీ జరిగిన విషయం.

* ఈ నాగలాపురం కథంతా తక్కిన పేజీలలో చదవండి.

చిత్తూరు జిల్లా, సత్యవేడు తాలూకాలో అరుణానది పరీవాహిక ప్రదేశంలో వున్నది యీ నాగలాపురము. మునుపు తమిళనాడు చెంగల్పట్టు జిల్లాలో వుండేది. 1959 లో పటాస్కరు అవార్డు మూలంగా మనకు సత్యవేడు తాలూకా వచ్చింది. తమిళనాడుకు తిరుత్తణి తాలూకా పోయింది. అంటే

* తి. తి. దే. శాసనాలలో నాయకపాలి - అనే పేరు కనిపిస్తుంది, ఇది చంద్రగిరి సమీపంలోని నాగయపల్లి లేక నాగయ్యగారిపల్లి అని భావించవచ్చు, లక్కనాయకర్, నాగు నాయకర్ అను యీ గ్రామవాసులు తిరుమల శ్రీవారికి 1500 వర్ - పణం సమర్పించారు.

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి పోయారు. శ్రీ వేదవల్లీ సమేత వేదనారాయణస్వామి వచ్చారు. ఈయన వైష్ణవుడు గదా మరి. అందుకని తిరువేంగడ కొట్టము జిల్లాకు కోరేవచ్చి వుంటారు. ఎందుకయినా మంచిది శ్రీ వేంకటేశ్వరస్వామి - సహవాసం చేద్దామని. పైగా ఇదివరకు ఆయన తన డబ్బు తిన్నాడని.

ఆయన కోరినట్లే జరిగింది. 29–4–1967 లో తి. తి. దేవస్థానము వారు తమ యాజమాన్యం క్రిందికి తీసుకొన్నారు ఆ ఆలయాన్ని. నారాయణ వరం, శ్రీనివాస మంగాపురం కళ్యాణ వేంకటేశ్వరస్వాములతో బాటు యీ నాగలాపురం వేదనారాయణస్వామి కూడ వేదవల్లితో సహా తి. తి. దే. యాజమాన్యానికి వచ్చారు.

హిరణ్యాక్షుడిని సంహరించి, వాడు అపహరించిన వేదములను వుద్ధరించి వేదోద్ధరుడైనందున, ఈయిన వేదనారాయణస్వామిగా పిలువబడు తున్నారు. ఇది మత్స్యావతారము సంభవించిన ప్రదేశము. అవతారము నాటికి అంతా జలమయం, అయినా ఇప్పటికీ తూర్పు సముద్రము (బంగాళా ఖాతము) 40 మైళ్ల దూరంలో వుంది. మత్స్యమునకు అనగా చేపకు కాళ్లు వుండవు గాన యీయనకు కూడ లేవు. కానీ స్వామి వారికి, పాదములు, ప్రత్యేకంగా లోహంతో తయారుచేసి పెట్టారు. హిరణ్యాక్షుడిని చంపడానికి వుపయోగించిన చక్రము అంటే సుదర్శన చక్రము ప్రయోగదశలో వుంది గావున యీయన చేతిలోని సుదర్శన చక్రమును ప్రయోగ చక్రం అంటారు. అంటే చాల శక్తివంతుడైన మూర్తి అన్నమాట. ఎవరి మీదయినా ఆగ్రహం గానీ, అనుగ్రహం కానీ వచ్చిందంటే - దానికి అంతుపొంతు వుండదు. ఇదీ యీయన ఆది అవతారంలోని విశేషం. ఈ స్వామికి చెరొకవైపు శ్రీదేవి - * భూదేవి వున్నారు. ఉన్నా వేదవల్లి దేవి మాత్రం ప్రత్యేక ఆలయంలో వుంది. ఆమె వేదములే మూర్తీభవించిన వేదమాత గదా! అందుకని ప్రత్యేక ఆలయంలో వున్నట్లువుంది.

---

* ఈమెను నీలాదేవి అని కూడ పిలుస్తున్నారు.

ఈ ఆలయంలో గొప్ప విశేషం - *సూర్యసేవ. ప్రతి సంవత్సరము మార్చి 25 వ తారీఖు నుంచి 27 వ తారీఖు వరకు అనగా ముచ్చటగా మూడు రోజులు జరుగుతుంది. ఈ మూడు రోజులలో సూర్యకిరణాలు సాయంకాలం నాలుగు గంటలకుపైన ఆలయంలో ప్రవేశిస్తాయి. తొలిరోజు స్వామి పాదాలు స్పృశిస్తాయి. మలిరోజు నాభి ప్రాంతాన్ని మ్రొక్కుతాయి. మూడవ రోజు స్వామి వారి ముఖారవిందాన్ని ముద్దుపెట్టుకొంటాయి. ఇదీ సూర్యసేవ అంటే. ఆలయానికి ఎదురుగా బలిపీఠం, ధ్వజస్తంభము, రాజగోపురం. సన్నిధి వీధికి ఎదురుగా ఆవలివైపు ఇళ్లు అన్నీ వున్నాయి. అయినా సూర్యభగవానుని సేవకు ఇవేవీ అడ్డురావు. లేదంటే, ఆయనకు ఎదురుగా గరుడాళ్వారు గానీ, భక్తాంజనేయస్వామి గానీ, వీరెవరూ లేరు. సూర్యసేవ జరుగు యీ మూడు రోజులూ స్వామి వారి ప్లవోత్సవము (తెప్పోత్సవము) జరుగుతుంది. తొలిరోజు శ్రీ సీతా సమేత శ్రీరామచంద్రమూర్తి కోనేటి అలలపై విహారం చేస్తారు. మిగతా రెండు రోజులు శ్రీ వేదవల్లీ సమేత శ్రీ వేదనారాయణస్వామి కెరటాలపై తేలియాడతారు. ఈ ప్లవోత్సవము జరుగు కోనేరు వూరి బయట వుంది. ఆలయ ప్రాకారంలో వున్న పుష్కరిణి ఇప్పటికి పూడిపోయివుంది. త్వరలోనే క్రొత్తగా నిర్మాణం కాబోతోంది. శ్రీ వేదనారాయణస్వామికి ప్రతి సంవత్సరము చైత్ర వైశాఖ మాసాలలో (మార్చి - ఏప్రిల్) 10 రోజులు పాటు బ్రహ్మోత్సవము జరుగుతుంది. తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవము జరుగు క్రమములోనే అంతా జరుగుతుంది.

తి. తి. దే. వారి ఆలయాలన్నీ ఒక ఎత్తు. ఈ ఆలయం ఒకటీ ఒక ఎత్తు. ఎత్తు అంటే పొడుగులో కాదు. భిన్నత్వంలో. అసలీ ఆలయనిర్మాణమే విలక్షణమయినది. ఇలాంటి ఆలయాలు ఎక్కడో అరుదుగా వుంటాయి. పది అవతారాలలో మొదట అవతారం మత్స్యావతారము. ఈ అవతారంలోని

---

* సూర్యుడు కర్మసాక్షి. కావున యీ మొదటి అవతార పురుషుణ్ని నిత్యం సేవిస్తూ వుంటాడు. స్థలపురాణంలో సూర్యుడే యీ ఆది దేవునికి మొదటి ఆలయం ఐదు ప్రాకారాలతో నిర్మించాడని వుంది. శ్రీ కృష్ణదేవరాయలు ఏడు ప్రాకారాల ఆలయం నిర్మించాలనుకొన్నాడు. కానీ జరగలేదు. ఇప్పుడు రెండు ప్రాకారాలున్నాయి.

విష్ణుమూర్తికి అసలు ఆలయాలుంటాయా అని సందేహం. ఉన్నావాటిలో యీ ఆలయం అగ్రస్థానం వహిస్తుంది. ఇది మూడు (లోపలి ప్రదక్షిణ ప్రాకారంతో కలిపి) ప్రాకారాలతో కూడు కొన్న ఆలయం. ఆలయనిర్మాణం - అత్యాశతో కూడుకొన్నది. అందుకే అది పూర్తి కాలేదు. కట్టుతూ వున్న ఆలయం సగంలో వదలివేస్తే ఎలా వుంటుందో అలావుంది యీ ఆలయ నిర్మాణం. మొదటి గోపురము మూడంతస్తులతో ఆగిపోయింది. పూర్తి అయివుంటే శ్రీ గోవిందరాజస్వామి రాజగోపురాని కంటె ఎత్తుగానే వుండేదేమో ?

నాగలాపుర ఆలయముఖమండప దృశ్యం.



విఘ్నమూర్తికి అసలు ఆలయాలుంటాయా అని సందేహం. ఉన్నావాటిలో యీ ఆలయం అగ్రస్థానం వహిస్తుంది. ఇది మూడు (లోపలి ప్రదక్షిణ ప్రాకారంతో కలిపి) ప్రాకారాలతో కూడు కొన్న ఆలయం. ఆలయనిర్మాణం - అత్యాశతో కూడుకొన్నది. అందుకే అది పూర్తి కాలేదు. కట్టుతూ వున్న ఆలయం సగంలో వదలివేస్తే ఎలా వుంటుందో అలావుంది యీ ఆలయ నిర్మాణం. మొదటి గోపురము మూడంతస్తులతో ఆగిపోయింది. పూర్తి అయివుంటే శ్రీ గోవిందరాజస్వామి రాజగోపురాని కంటె ఎత్తుగానే వుండేదేమో ?

నాగలాపుర ఆలయముఖమండప దృశ్యం.



వున్నాయి. చెట్లకోసం కరెంటు మిషన్ బావి బయటి ప్రాకారంలోనే వుంది. లోని చెట్లకు పంపు ద్వారా వస్తాయి నీళ్లు.

ఇక మూడవ ప్రాకారం ముచ్చటయినది. ముఖ్యమైనదీనూ, ముందొక పెద్ద మండపము (అంతరాలమండపం) దానికానుకొని చిన్న మండపం. ఈ చిన్న మండపము చుట్టూ వ్యాపించి వరండాలా తయారయింది. అయినా సూర్యభగవానుడు రోజూ తొంగిచూడడానికి చుట్టూ పైలాదును ఖాళీగా వదిలారు. ఈ ఆలయ నిర్మాణం చూసి తీరవలసినదేగానీ అర్థం అయ్యేలాగ వ్రాయలంటే-అర్థంగాదు కానీ పేజీలు మాత్రం ఎక్కువవుతాయి.

ఈ మూడవ ప్రాకారంలో దివ్యసుందర విగ్రహాలన్నీ చోటు చేసుకున్నాయి. ఈ ఆలయ శిల్పసంపదంతా ఈ విగ్రహాలలో - అర్ధాంతరముగా నిలచిపోయిన ఆ గోపురాలలోనే వుంది. అవి పూర్తి అయివుంటే, ఎంతో బాగుండేది. అందుకు మనం నోచుకోలేదు.

ఈ వసారాలోనున్న * త్రిమూర్తి విగ్రహం-త్రివిక్రమ విగ్రహం-వాటి కవేసాటి. వీటి శిల్పసౌందర్యం-వర్ణనాతీతం. మిగతా విగ్రహాలలో శ్రీ వేణుగోపాలస్వామి, శ్రీ హయగ్రీవస్వామి, శ్రీ లక్ష్మీవరాహస్వామి, శ్రీ లక్ష్మీనారాయణస్వామి ముఖ్యమైనవి. గర్భఆలయ కుడ్యాల (విమాన ప్రదక్షిణంలో) గూళ్లలో శ్రీ మావరాహస్వామి, దుర్గాదేవి, వీణా దక్షిణామూర్తి శిల్పాలు బహుసుందరమయినవి.

ఆలయంలో ప్రవేశిస్తూనే ఒకవైపు శ్రీ విఘ్నేశ్వరస్వామి, మరొకవైపు ఒక ద్వారపాలిక (విష్ణుదుర్గ) ఇద్దరూ నిలబడుకొనే ఆహ్వానిస్తారు. రెండవ ద్వారంలో ఒక ద్వారపాలకుడు ఇంకొక ద్వారపాలకుని కోసం నిరీక్షిస్తున్నాడు కాన ఇద్దరూ ఇంకా స్థలాలు ఆక్రమించలేదు. మూడవ ద్వారంలో ఇద్దరు ద్వారపాలకులు. ఇక చివరిద్వారంలో ఒక ద్వారపాలకుడు (మను), ఒక ద్వారపాలిక

---

* ఈ విగ్రహాన్ని మీటితే సప్తస్వరాలు వలుకుతాయట ఇది ప్రచారంలోకి వస్తే విగ్రహం పాడయి అవతల దీనాలాపం చేస్తుంది.

(నంధ్య) వీరంతా మనల్ని ఆప్యాయంగా ఆహ్వానిస్తారు. శ్రీవేదనారాయణస్వామి తన ప్రయోగ చక్రంతో ఆశీర్వదిస్తాడు. అయ్యవారు అమ్మవార్లు అందరూ కలిసి ఒకే చోట వున్నారు గాబట్టి-ద్వారపాలక-ద్వారపాలికలను ఏర్పాటు చేశారను కుంటాను. అయినా విఘ్నేశ్వరస్వామి అక్కడికెలా వచ్చినట్టు? వేద నారాయణుడు అందరికీ పూజ్యుడే గదా అని వచ్చాడేమో? శ్రీ వేదవల్లీదేవి అభిముఖంగావున్నా ఓమూల ఆలయంలో వుంది. రెండవ ప్రాకారపు మంటపాల ఆలయాలలో శ్రీ సీతా * రామచంద్రులు, శ్రీ వీరాంజనేయస్వామి, శ్రీ లక్ష్మీనరసింహస్వామి వున్నారు. ఈశాన్యమూలలో మరొక భక్తాంజనేయ స్వామి చాల అందంగా కనిపిస్తారు.

---

* ఈ కోదండరామస్వామి తన కోదండం పోగొట్టుకొని మాములు రాముడయినాడు. మూలవిరాట్టులోనే కోదండం లేకపోవడం విచిత్రం. స్వామివారి చేతులు అలాగే విల్లంబులు ధరించినట్టున్నాయి.

త్రిమూర్తి విగ్రహం - నాగలాపురం.



పంచలోహ విగ్రహాలలో అత్యంత ఆకర్షణీయమైనవి - పన్నిద్దరు ఆళ్వారులు. వారిలో గోదాదేవి అత్యద్భుతం, ఆమెను చూస్తే-నిజంగా రంగనాథస్వామి ఆమెను ప్రేమించే వుంటాడని విశ్వసిస్తాము. ఈ విగ్రహాలన్నీ మొన్నటిదాకా నేలమాళిగలో వుండేవి. ఎవరు భద్రపరచారో ఏమోగానీ, అక్కడున్న మట్టి తీయబోయి హఠాత్తుగా వాటిని కనిపెట్టాడు పూర్వపు ధర్మకర్తలలో నొకరయిన శ్రీ బాలిరెడ్డి. మంచి విగ్రహసంపద అందించాడు మనకు.

నాగలాపురం శ్రీవేదనారాయణస్వామి - దేవేరులు (ఉత్సవర్లు)



బయట విడిగావున్న విగ్రహాలలోని జీవం - శిల్పకళ, లోపల ప్రతిష్ఠించబడివున్న మూల విరాట్టులలోలేదు. తిరుపతిలోని శ్రీ గోవిందరాజ స్వామి విగ్రహంలా యీ మూల విరాట్టును కూడ సున్నం కాంక్రీటుతో మూస పోశారు. అందుకే యీ స్వామికి తైలాభిషేకం చేస్తారు, గానీ జలాభిషేకం చేయరు. శుక్రవారం అభిషేకం వేదవల్లి తాయారుకే గానీ, యీయనకు లేదు.

శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీలో ఎం. ఫిల్. డిగ్రీకోసం, 1979 జనవరి మాసములో శ్రీ కె. రెడ్డెప్ప అను ఒక చరిత్రోపన్యాసకుడు - నాగలాపురము ఆలయాన్నిగురించి ఒక పరిశోధన వ్యాసం వ్రాశారు. ఆయన ఉద్యోగం వెలుగోడిలో. ఆయన పరిశోధన విషయాలను శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీలో — అసిస్టెంట్ లైబ్రరీయన్‌గా పనిచేయుచున్న శ్రీ మధురాంతకం బాలసుబ్రమణ్యంగారు తెలియజేసినారు. చర్విత చర్వణం బాగుండదు గాబట్టి, అవసరమైన ముఖ్యవిషయాలను, ఆయన తెలియజేసిన విషయాలలో నుంచి క్రోడీకరించి క్లుప్తముగా ఇక్కడ వ్రాశాను.

**పురాణం కథ :-** గత కల్పంలో ఒక బ్రహ్మవుండేవారు. అప్పుడు ప్రళయం వచ్చింది గానీ సంపూర్ణ ప్రళయంగాదు, అయినా భూమి — తదితరలోకాలన్నీ సముద్రములో మునిగిపోయాయి. బ్రహ్మదేవుడు చాలాకాలంగా మేలుకొనివున్నాడు గాబట్టి, యీ ప్రళయమప్పుడు ఆయనకు తూగువచ్చింది. తూగువచ్చిందో లేదో — ఆయన నోట్లోవున్న వేదాలను, మహా పరాక్రమశాలియైన హయగ్రీవుడు దొంగిలించాడు. ఈ హయగ్రీవుడు దానవులరాజు, ఇతని దొంగతనం తెలుస్తూనే వెంటనే శ్రీ మహావిష్ణువు సఫారి చేపరూపమెత్తి (మత్స్యావతారమెత్తి) వేదముల నుద్ధరించినారు.

**చరిత్ర :-** దక్షిణాదిలో పాండ్య, చేరరాజుల జయించి, హంపీ విజయనగరము పోతూ దారిలో నాగలాపురములో విడిది చేసినారు — శ్రీకృష్ణదేవరాయలవారు. అక్కడ ఆయనకు తల్లిగుర్తువచ్చింది. వెంటనే ఒక పట్టణము నిర్మించి ఆపట్టణానికి తన తల్లిపేరు — అనగా నాగలాంబపేరు — పెట్టారు, నాగలాంబపురమే చివరకు నాగలాపురము అయింది.

రెండవ పర్యాయము, కృష్ణదేవరాయలు కుంభకోణం నుంచి తిరిగి వస్తూ, నాగలాపురములో, వేదనారాయణస్వామి-వేదవల్లి తాయారుల దర్శనం చేసుకుందామని అక్కడ ఆగారు. ఆరాత్రి కలలో ఆయనకు వేదనారాయణ స్వామి కనబడి, తనకు ఏడుప్రాకారముల ఆలయము అక్కడే నిర్మించమని కోరారు. మరునటిరోజు రాయలవారు. ఆలయనిర్మాణంపని అప్పగించడానికి అర్హుడెవడా అని ఆలోచించగా, వేదనారాయణస్వామికి పరమభక్తుడయిన *హరిదాసుగుర్తు కొచ్చాడు. అతనిపేరు వడమాల. రాయలవారు అతనికి ఆలయ నిర్మాణంపని అప్పగించాడు. ఈ హరిదాసుడు ఐదు ప్రాకారముల ఆలయం నిర్మించాడు. ఆలయంలోపూజా పునస్కారములు నిర్వహించడానికి, రాయల వారు హరిదాసునికి 'హరికండాపురము' అను గ్రామాన్ని దానం చేశాడు. ఆ విషయాలన్నీ శిలాశాసనం వేయించాడు.

**ఆలయచరిత్ర:-** ఈ ఆలయమునకు 7 గోపురములు, మండపములు, చిన్న గుడులున్నాయి. ఈ ఆలయము మొత్తము విస్తీర్ణము 12 ఎకరాలు. గర్భాలయ మొదటి ద్వారంలో వున్న ద్వారపాలక విగ్రహాలను †మణి-సంధిక అని స్థానికులు పిలుస్తారు. వీటిలో మొదటిది పురుషవిగ్రహం. రెండవది స్త్రీవిగ్రహం. రెండవ, మూడవ ద్వారాలలో కూడ ద్వారపాలకులున్నారు. అందులో మూడవ ద్వారములో ద్వారపాలకులుగా జయ-విజయులున్నారు. నాలుగవ ద్వారములో అనగా మహామండప ద్వారములో ద్వారపాలకులుగా

---

*ఇక్కడ హరిదాసుపేరు వడమాల - అని వ్రాశారు, ఇది చరిత్రయో లేక హరిదాసు కథయో నాకుతెలియదు. అసలు విషయం - అవిరి కాళప్పర్ తిరువేంగటముడైయార్‌కు మరొక పేరు ఆనైత్తలగుంకండ హరిహరనర్. ఇతడు రాయల పాలనలో ఒక ప్రాంతీయ అధికారి. ఇతని పేరే హరిదాసు. ఈ హరిదాసుకు ముగ్గురు కుమారులు, మొదటివాడు వడమాలై అన్నంగల్. రెండవవాడు పెరుమాళ్ మొదలియార్, మూడవవాడు తిరుమలైయ్యప్ప మొదలియార్. ఈ విషయం నేనిది వరకే వ్రాశాను. ఉన్నవి మూడు ప్రాకారములయితే, ఐదు ప్రాకారములన్నారు. తక్కినవి రెండు ఏమయినాయి ? ఇందులో హరికండాపురమనునది నాగలాపురమేగానీ, వేరుగాదు.

†మణి—పురుషవిగ్రహం. సంధిక కాదు సంధ్య-ఇది స్త్రీ విగ్రహం. ఒక పురుష-ఒకస్త్రీ విగ్రహములన్నమాట.

గణపతి-దుర్గాదేవి విగ్రహాలున్నాయి. దుర్గాదేవి చేతులలో శంఖు చక్రము లున్నాయి. స్థానికులు ఆమెను నాగలదేవి అని పిలుస్తారు. 80 సంవత్సరాల క్రితం-బాలిరెడ్డి అనే ధర్మకర్తకు దొరికిన అనేక పంచలోహ విగ్రహాలలో లక్ష్మీ నారాయణ, విష్వక్సేన, నమ్మాళ్వార్ మొ॥ ముఖ్యమైనవి. వాటితోబాటు ఒక దీపస్తంభము కూడ దొరికినది. ఇవన్నీ గర్భగుడిముందు ఒక సొరంగములో దొరికినవి. నాగలాపురములో, ఇదివరకు ఒక కోటవుండేదని చెప్పుకుంటారు.

ఉత్తరవైపు మహద్వారం సమీపంలో రెండు గుడులున్నాయి, అందులో నొకటి *హరికండేశ్వరస్వామి ఆలయము. రెండవది నవగ్రహముల గుడి. † సోమకాసురుని జంపిన మత్స్యావతార విష్ణువు సముద్రమునుంచి వేదములు వెలికి తీసికొని రాగానే, దేవతలంతా ఆయనను చూడవచ్చారట, అందులో పరమశివుడు వేదనారాయణస్వామిని మొట్ట మొదట చూశాడట. అందువల్ల ఆ శివుడు హరికండేశ్వరు డయినాడు. తి. తి. దే. వారు 23-9-1976 లో క్రొత్తగా ధ్వజస్తంభము నాటిరి. వారికి పాత ధ్వజస్తంభము క్రింద ఒక రాగిరేకు దొరికినది. వారు దానిని అలాగేతీసి క్రొత్త ధ్వజస్తంభము క్రిందనే పాతిపెట్టిరి.

అదే తారీఖు (23-9-1976 లో) నారాయణపరము, మంగా పురములలో కూడ పాత ధ్వజస్తంభములను పూడబెరికి, క్రొత్త ధ్వజస్తంభము లనునాటిరి.

నాగలాపురములో -సూర్యసేవ, తెప్పోత్సవము, బ్రహ్మోత్సవములే కాకుండ, ఏకాదశి ఉత్సవములు గూడ జరుగుతాయి. ప్రతి శుక్రవారము వేదవల్లితాయారుకు అభిషేకము జరుగుతుంది. అదే రోజు ప్రాకారోత్సవము కూడ జరుపబడుతుంది. ప్రతి శనివారము వేదనారాయణస్వామికి ** అభిషేకము జరుగుతుంది.

---

* ఇది శివాలయము.

† మొదట హయగ్రీవుడన్నారు. ఇప్పుడు సోమకాసురు డంటున్నారు. అందరూ ఎఱిగిన వేదముల దొంగ హిరణ్యాక్షుడు.

** అభిషేకము జరుగుతుందన్నారు గానీ, జలాభిషేకమని గానీ, తైలాభిషేకమనిగాని అనలేదు.

ఆలయ శాసనములు:- నాగాలాపురము తమిళనాడులోని చెంగల్పట్టు జిల్లాలో నున్నపుడు, కృష్ణదేవరాయల పది శిలా శాసనములు కాపీ చేయబడినవి. 1904 నాటి 628 శాసనములో *హరిదాసుడను ఒకనికి కలలో ఎంబెరు మాన్ (విష్ణుమూర్తి) కనబడి, వేదనారాయణపెరుమాళ్ ఆలయమును నిర్మించమని ఆజ్ఞాపించినట్లు శాసనము చెక్కబడింది. †క్రీ. శ. 1523–24 నాటి రెండుశాసనములలో, కుంభకోణంలో జరుగబోవు మహామఖ (గ) ఉత్సవానికి పోతూ, రాయలవారు అరిగండాపురము దర్శించడం (1904 నాటి 628, 628ఏ శాసనములు.)

రాయలవారి కుంభకోణయాత్ర, సింహాచలంలో విజయ స్తంభము నాటించి, తిరుపతి దర్శించిన తరువాత జరిగినదిగా చెప్పబడింది. అదే కాలమునకు చెందిన ఒకరాగిరేకు శాసనములో, **నీలమాణిక్యదేవునికి (శిలా శాసనములలోని కరియమాణిక్య ఎంబెరుమాన్-అంటే వేదనారాయణపెరుమాళ్), హరిదాసునకు అనేక గ్రామములు దానము చేయబడినట్లు వుంది. హరిదాసునకు ఆలయ వ్యవహారములు (ధర్మకర్తృత్వము) నెఱపుటకు ఆ గ్రామదానములు చేయబడినవి.

నాగలాపురం ఆలయంలోని పది శిలాశాసనాలు మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టునందు (1904) ఉదహరించబడినాయి.

ఉత్తర, దక్షిణ, తూర్పు వైపున్న గర్భాలయకుడ్యాల మీద కొన్ని శాసనాలున్నాయి. వీర ప్రతాప వీర కృష్ణరాయల కన్నడ శాసనమొకటి (619 - 1904) కొన్ని గ్రామదానములను తెలియజేయుచున్నది. ఈ శాసన కాలము సందేహాస్పదము. వేదవల్లి తాయారు ఆలయ ఉత్తరకుడ్యంమీద

---

* ఇక్కడ కృష్ణరాయల స్వప్నం అదృశ్యమయి, హరిదాసు స్వప్నం ప్రత్యక్షమైంది.

† కొన్ని గ్రంథములలో యీ సంవత్సరము 1517 గా వుంది.

** నీలమాణిక్యదేవుడు-అంటే తిరిగి కృష్ణుడు గుర్తుకొస్తున్నాడు. నాగలాపురం ఆలయములో-శ్రీవేణుగోపాలస్వామి శిలా విగ్రహం చూడముచ్చటగా వుంది. పైగా నవనీత కృష్ణుని (ఉత్సవ విగ్రహం) పంచలోహ విగ్రహముంది. ఇవి యాదవ నారాయణాలయమును గుర్తుకు తెస్తున్నవి.

శ్రీరంగదేవ మహారాయలవారి తమిళ శాసనముంది. ఇందు పంచబట్టర్‌కు కొన్ని హెూదాలు ఇవ్వబడిన విషయముంది.

అదే ఆలయములోని ఉత్తర, దక్షిణ, పశ్చిమ కుడ్యాలమీద కొన్ని శాసనాలున్నాయి (621 - 1904) ఇవి 1436 శాలివాహన శకమునకు చెందినవి (భావనామ సంవత్సరం) వీటిలోని విషయం కృష్ణరాయల భూదానం.

అదే ఆలయములోని ముఖమండప పశ్చిమ వైపు (622 - 1904) ఒక శాసనమున్నది. దాని కాలము 1436 శకము (భావ) ఇది కూడ కృష్ణదేవరాయల శాసనము. సంస్కృతములోనున్నది.

ఆ మండపములోనే ఉత్తరవైపు 1442 శకమునాటి (623-1904) కృష్ణరాయల తమిళ శాసనమున్నది. వర్తకులకు సంబంధించిన కొన్ని అగ్రిమెంటులు అందులోని విషయం. అక్కడేవున్న మరొక (624 - 1904) కృష్ణరాయల శాసనములో కొట్టములు - నాడులు గురించిన విషయమున్నది.

రెండవ గోపుర ద్వారములో కుడివైపు (625 - 1904) 1442 శకమునకు చెందిన కృష్ణరాయల సంస్కృతశాసనము గ్రామ దానములకు చెందినది.

1451 శకమునకు చెందిన సర్వధారి సంవత్సర కృష్ణరాయల కన్నడ శాసనము (626 - 1904) భూదానమునకు చెందినది. ఇది కన్నడములో నున్నది.

ఈ రెండవ గోపురములోనే కుడి ఎడమలవైపు 1445 శక, స్వభాను సంవత్సర కృష్ణరాయల సంస్కృత (627 - 1904) శాసనము భూదానమునకు చెందినది. ఈ భూదానము సంస్కృత వేదము మరియు ద్రవిడ వేదము లేదా ప్రబంధములు ఆలయములో పారాయణము చేయుటకుద్దేశింపబడినది.

ఉత్తర వైపు గోపుర ద్వారము 1445 శకమునాటి స్వభాను సంవత్సర కృష్ణరాయల శాసనమున్నది. ఈ తమిళ శాసనము ఆలయస్థల పురాణమునకు చెందినది.

అక్కడే వున్న మరొక 1445 శకమునకు చెందిన స్వభాను సంవత్సర కృష్ణరాయల తమిళ శాసనము (628 - 1904) భూదానమునకు చెందినది.

ఆలయ బయటి ప్రాకారం తూర్పు వైపున్న కృష్ణరాయల శాసనం తమిళములో నున్నది.

ఈ వివరాలు తెలియజేసిన శ్రీ మధురాంతకం బాలసుబ్రమణ్యంగారికి ఈ రచయిత కృతజ్ఞతలు.



శ్రీ వేదనారాయణస్వామికి ఐదుప్రాకారములతో ఆలయము నిర్మించినట్టుగా భావింపబడుతున్న శ్రీ సూర్యనారాయణస్వామి.

ఇక ఆంధ్ర పత్రిక ప్రత్యేక ప్రతినిధి - ఆరు ఆదివారాలు ప్రచురించిన విషయం చదవండి. ఈ రచయిత పాయసం సుబ్రహ్మణ్యం అనుకొంటాను.

ఆంధ్రపత్రిక దినపత్రిక సౌజన్యంతో
సారస్వతానుబంధం నుంచి పునర్ముద్రితం.

# నాగలాపురం-నాడు నేడు

**ఆదివారం జూన్ - 2, 1968 నుంచి**
**ఆదివారం జూలై - 7, 1968 వరకు ప్రచురింపబడినది.**

తెలుగుదేశంలో శిల్ప చాతుర్యానికీ, వాస్తువైభవానికీ ఆటపట్టయిన ప్రాచీన దేవాలయాలలో నాగలాపురంలోని శ్రీ వేదనారాయణస్వామి దేవాలయం ప్రాముఖ్యం వహిస్తున్నది. ఈ దేవాలయం ఉన్న నాగలాపురం మద్రాసు — తిరుపతి బస్సు మార్గంలో మధ్యన ఉన్నది.

శ్రీ కృష్ణదేవరాయలు శ్రీ వేదనారాయణస్వామి కైంకర్యంకోసం ఈ ఊరికి తమ తల్లి నాగలాదేవి పేరుతో నాగలాపురమని నామకరణం చేసి అర్పించారు.

ఒకప్పుడు వేద వేదాంగాలకూ, శాస్త్రాలకూ, దివ్య ప్రబంధ బోధకు శిల్పవాస్తు వికసనానికి, నృత్యనాట్య వైభవానికి కేంద్రమైన ఈ దేవాలయాన్ని ఆంధ్రావళి దృష్టికి తెస్తున్నాము.

నమస్తుంగ శిరశ్చుంబి
చంద్రచామర చారవే
త్రైలోక్య నగరారంభ
మూలస్తంభాయ శంభవే.

శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, వీరప్రతాప, గజపతి దళవిభాళ, గజపతి సప్తాంగహరణ, మూరురాయరగండ, భాషెగె తప్పువర మిండ, హిందూరాయ సురత్రాణ ఇత్యాది బిరుదాంచితులైన వీరకృష్ణదేవ రాయలవారు పొట్నూరులో (పొటనూరు) విజయస్తంభం నాటిన పిదప పట కుటీరంలో కొలువుదీరి సుఖసత్కథా వినోదాలతో వోలలాడుతున్నారు. ఎటు చూచినా విజయోత్సాహం పొంగులు వారుతూంది. పటకుటీరం వెలువల వీరజైత్ర భటుల విజయకోలాహలం వినిపిస్తూంది. పటకుటీరంలో ఒకవైపు వందిమాగధులు—

"తొలుదొల్త నుదయాద్రి శిలదాకి కెరలు నీ యసి లోహమున వెచ్చనై జనించె
మరికొంత వేడెక్కి మార్కొని నలియైన యల కనవాప్మాత్రుసంటి రాజె
అట సాగి జమ్మిలోయ బడి వేగ దహించె గోనబిటేర్చె గొటాన దగిలె
నకగిరిస్ఫూర్తి గరచె గౌతిమిగ్రాగె నవులన పొట్నూర రవులుకొనియె
మా డెములు వ్రేల్చె నొడ్డాది మసియొనర్చె కటకపురి గాల్చె గజరాజు గలిగిపరవ
దొక జిచ్చనగనీ దురవగాహ, భేలదుగ్రప్రతాపాగ్ని కృష్ణరాయ"

అని కైవారాలు చేస్తున్నారు.

మరొకవైపునుంచి "ప్రజల రాజాధిరాజ వీర ప్రతాపా బహుపరాక్! రాజపరమేశ్వరా బహుపరాక్! ఆర్థదుర్గా నటేశా బహుపరాక్! సాహితీ సమ రాంగణ సార్వభౌమా బహుపరాక్! ఇభరాడుదయోర్వీధర తత్పితృవ్యకృత నవ్యోపాయనోష్ణీష రత్నదృగంచత్పదా బహుపరాక్! సింహాచల దంభకేసరి పదాభీషార్చనా పుణ్యలబ్ధ దురుట్టంకణ పొట్టనూరి విజయస్తంభోపలోట్టంకితాంక దృఢెషాక్షరాబహుపరాక్! నీలాచలనీలచేలక సుభద్రేందీవరా భాక్షికోణ దృగంచద్భుజ వీర్యదుర్య జయసన్నాహార్భటీవాద్య భీత్యుదితేభేశ్వరా బహు పరాక్! అని బరాబరలు వినిపిస్తున్నాయి.

రాయలవారి ఆస్థానంలో దక్షిణదేశ విషయజ్ఞుడైన వడమలెయణ్ణ లేచి రాయలవారికి తలవంచి నమస్కరించి, దగ్గరికివచ్చి చేతులు కట్టుకొని నిలబడ్డాడు. ఏదో విన్నపం సేయబోతున్నవాడిలా ముందుకు వంగాడు.

రాయలవారతనిని అనుగ్రహ దృష్టితో సత్కరించి మందహాసం పెదవులపై చిందులాడి విజయసంతోషానికి మెరుగులు పెట్టగా "వడమలణ్ణ గారూ, ప్రత్యేకమైనవార్త కాదు కదా ? ఏమైనా అత్యవసరంగా కోరుతున్నారా ?" అని ప్రశ్నించారు.

వడమల్లైయణ్ణ సవినయంగా, మహారాయా, దేవరవారి రామరాజ్యంలో అంతాసుభిక్షమే. ప్రజలకు ఏలాటి కొరతాలేదు. నాకుమరీను. వేదగిరి వాసుడైన వేదనారాయణస్వామి అనుగ్రహంవల్ల, ఆరణినదీ తీరాన ఏటా మూడుపంటలు పండి ఏలాటికోరికాలేదు. ఈ ఉత్తర దిగభిక్రమణంలో దేవరవారికి విజయం అనుగ్రహించాలి. అని మా అరిగండపురం వేద నారాయణస్వామిని వేడుకున్నాను. దేవరవారి బలపరాక్రమాలకు మా స్వామి కరుణాకటాక్షం ఆలంబము. అలనాడు వేదాలు ఉద్ధరించి బ్రహ్మకు అందించిన వేదనారాయణుడు దేవరవారికి విజయం అందించాడు. దేవరవారు ఈ మారు దక్షిణాదికి విజయం చేసినప్పుడు అరిగండపురం వేదనారాయణుని దర్శించి కైంకర్యం చేయాలి అని మనవి చేసుకుంటున్నాను" అన్నాడు.

కృష్ణదేవరాయలు కొంచెం ఆలోచనలో పడ్డట్టు ముఖకవళికవల్ల ద్యోతితమయింది. తొమ్మిది సంవత్సరాలక్రితం వేదనారాయిణస్వామి కైంకర్యానికి ఏదో గ్రామం నివేదించినట్లు, మరికొన్ని అధికారాలు స్థానికుల కిచ్చినట్లు రాయలవారికి జ్ఞాపకం వచ్చింది. ఈ సంగతిని వడమల్లైయణ్ణ గ్రహించాడు. ఇలా విన్నపం చేశాడు:—

దేవరవారు భావ సంవత్సరం కార్తీకమాసం ఉత్థానద్వాదశి పుణ్యతిధి నాడు అరిగండ పురనాధునికి దానమిచ్చిన గ్రామం సవ్యంగా వినియోగమవుతున్నది. దేవరాయకుప్పమ్ అనేగ్రామాన్ని *కృష్ణరాయపురమని నూతన నామకరణం చేసి దేవరవారు అనుగ్రహించారు. దీనికి తామ్రశాసనమూ

* చంద్రగిరి వుప పట్టణాలయిన కృష్ణరాయపురం (కృష్ణరాయపట్టణము) గాక, నాగలాపురసమీపమున మరొక కృష్ణరాయపురం (దేవరాయ కుప్పం) వున్నట్టు ఇందువల్ల రూఢి అవుతోంది.
— గోపీకృష్ణ.

చెక్కించారు. ఆ తామ్రశాసనాన్ని శాశ్వతంగా ఉండడానికి శ్రీ వేదవల్లీదేవి ఆలయ ఉత్తర పశ్చిమ దక్షిణ కుడ్యాల వెలుపలి భాగాలపై చెక్కించాము. ఆ గ్రామం ఆదాయంతో అరిగండ పురవాసి అయిన కరిమాణిక్య పెరుమాళుకు అంగరంగవైభోగాలు జరుగుతున్నాయి."

(శ్రీ వేదవల్లీదేవి ఆలయం ఉత్తర పశ్చిమ దక్షిణకుడ్య బహిః ప్రాంతాలపై చెక్కిన ఈ శాసనము శక సం॥ 1436, భావ సం॥ కార్తీక మాసం ఉత్థాన ద్వాదశి శుక్రవారం. దీనికి సరైనది క్రీస్తుశకం 1514 అక్టోబర్ 30వ తేది. ఈ శాసనభాగం ఇక్కడ ఇవ్వబడింది :-

శాలివాహన నిర్ణీతే శకాబ్దే సచతుశ్శతై:
షట్త్రింశతాన సంయుక్తైః సంఖ్యాతే దశభిశ్శతై:
భావసంవత్సరే మాసి కార్తికే భృగువాసరే
రేవత్యామపి పుణ్యాయా ముత్థానద్వాదశీ తిథౌ
తుంగభద్రాపగాతీరే విఠలేశ్వర సన్నిధౌ
ఖ్యాతస్య కరిమాణిక్య పెరుమాళితి భూతలే
అరిగండ పురస్థస్య సుదాహారస్య శార్ఙిణి:
తుండీర మండలే ఖ్యాతం చంద్రగిర్యఖ్యరాజ్యకం
కుండవర్ధన కోట్టార నిర్ణెయూర్గాడుకేస్థితం
నారాయణ పురప్పట్టి భూషణత్వముపాశ్రితం
ప్రాచీమాశాం తిరుక్కారి కర్రైగ్రామ సమాశ్రితం
వేదాద్రి కాననోద్దేశా ద్దక్షిణస్యాం దిశి స్థితం
అరిగండ పురాభిఖ్యాత్ గ్రామవరాచ్చ పశ్చిమం
ఆరణీ సరితశ్చాపి దిశమాశ్రిత యుత్తరాం
కృష్ణరాయపురం చేతి ప్రతినామసమాశ్రితం
సర్వసస్యాన్వితం దేవరాయకుప్పం మనోరమం
సర్వమాన్యం చతుస్సీమా సంయుతంచ సమంతత:
నిధినిక్షేపణ పాషాణ సిద్ధ సాధ్యజలాన్వితం

అరిగండ పురాధీశః తిరువేంకట నాయక:
యం ప్రసూయ వసతంతః సంజయత్యేన పుత్రిణం
సాహిత్యసార సాహిత్య భాజాభోజానుకారిణా
శ్రీ మద్వడమలణ్ణేన చోదితస్తేనధీమతా
కృష్ణదేవమహారాయో మాననీయో మనస్వినాం
సహిరణ్యపయోధారా పూర్వకం దత్తావాన్ ముదా
తదిద మననీవనీపక కవినుత సారస్య కృష్ణరాయస్య
శాసన మతిబలశాసన తరుకర దానస్య సామధానస్య
కృష్ణదేవ మహారాయ శాసనేన సభావతిః
అభాణీత్ ముద్రసందర్భం కధితం తామ్ర శాసనం
కృష్ణదేవ మహారాయ భూమిపాలస్య శాసనాత్
మల్లణాచారి వర్యేణ లిఖితం తామ్ర శాసనం )

కృష్ణరాయలు వడమల్లైయణ్ణ ఇంగితజ్ఞానానికి చాల సంతోషించారు. "నీలమాణిక్య దేవుడనే నామాంతరం గల వేదనారాయణుని మహిమలు నేను చాలవిన్నాను. మరి మీరు నిరంతరం నాతో ఉంటే, అక్కడ బాధ్యతతో దేవాలయ కైంకర్యం చేయించేవారు ఎవరు? అని ప్రశ్నించారు.

వడమల్లైయణ్ణ ప్రశ్రయంతో ఇలా మనవి చేశాడు:— "దేవరవారు చిత్తగించవలె. నా తమ్ముడు హరిదాసపెరుమాళ్ నాయకుడు దేవాలయాన్ని ఎంతో శ్రద్ధగా చూస్తూ సకలోత్సవాలూ జరిపిస్తున్నాడు. మా నాయనగారు * హరిదాస తిరువేంకటనాయకునికి వేదనారాయణస్వామి స్వప్నంలో సాక్షాత్కరించి కోవెలను విశాలంగా కట్టించ వలసిందని ఆదేశించారు. వేదనారాయణ స్వామి కోవెల మొదట్లో చిన్నది. మూలవిరాట్ వేంచేసిన గర్భాలయం మా తండ్రిగారు పునరుద్ధరించారు. దానిముందు అంతరాళ మండపం, ముఖ మండపం, మహామండపం కట్టించడానికి శాలివాహన శకవర్షంబులు 1442

---

* నాగలాపుర ఆలయ పునర్నిర్మాణం పని, రాయలువారు ఇతనికే అప్పగించారని నేను వ్రాశాను. (భావించాను.) — గోపీకృష్ణ.

విక్రమ సం. కన్యామాసం కార్తీక శుద్ధపంచమి ఆదివారంనాడు అరిగండపురం, తత్పరిసర గ్రామాల ప్రముఖులు, వర్తకులు, తదితరులు 1000 హొన్నులు (బంగారునాణేలు), వివిధ గ్రామాలలో పెక్కు భూములు నా తమ్మునికి సకలాధి కారాలతో ధారాదత్తం చేశారు. వారి సేవ, ఔదార్యం శాశ్వతంగా ప్రజలకు తెలియుడానికి ఆ మేరకు మండపం ఉత్తరకుడ్యం పైన తమిళ బాషలో శాసనం వేయించాము." (ఈ శాసనం శక సం. 1442 కన్యామాసం శుద్ధ పంచమికి సరైనది. క్రీస్తు శకం 1520 సెప్టెంబర్ 16 వ తేది,)

"అవును. మన ప్రజలు చాల ఆస్తికులు. దైవ కార్యానికి నడుం కట్టుకుని ముందుకు వస్తారు. మండపాలు పూర్తయ్యాయా?" అని ప్రశ్నించారు, రాయలవారు.

"తమ దివ్యచిత్తంవల్ల పూర్తయాయి. శిల్పాలు మలచడానికి మరికొన్ని కైంకర్యాలు స్థానికుడైన నా సోదరుడు హరిదాస పెరుమాళ్ నాయకుడు దేవర వారి రత్నసింహాసనం నుంచి వచ్చిన అధికారంతో ఈ మండపాలు పూర్తి చేయడానికి [1] పన్ను వసూలు చేశాడు. మొదటిరకం ఇండ్లకు ఇల్లు ఒకటింటికి ఒక పణం, రెండవరకం ఇల్లు ఒకటింటికి ముప్పావు పణం, మూడవరకం ఇల్లు ఒకటింటికి అర్ధపణం, నాల్గవ రకం యిల్లు ఒకటింటికి పావు పణం మేరకు ఇంటి పన్ను వసూలు చేయడానికి, ఈ మంటపాలలో ఉత్సవమూర్తి వేంచేసినప్పుడు ఆరగింపునకు, అనంతరాయన్ పట్టణం మొదలయిన ఆరణీనదీ తీరాలలో [2] పడవకేవు వసూలు చేయడానికి ప్రజలు, నా సోదరుడు హరిదాస్ పెరుమాళ్ నాయకునికి అధికారమిచ్చారు. ఈ మేరకు దేవాలయంలో ఒప్పందం చేసు కొన్నారు. [3] శోలమంగలం, [4] పాడైవీడు, చంద్రగిరి మొదలైన పట్టణాల ప్రజలకు ఉత్సవాలుచేసే అధికారం కూడా ఇవ్వబడింది. ఈ ఒప్పందాలన్నిటినీ

---

[1] పన్నులు వసూలు, గ్రామస్థుల తిరుగుబాటు, ఆలయ నిర్మాణం ఆగిపోవడం, మొదలగు నావిశ్వాసాలు నిజమేనని, ఇందువల్ల తేటవడుతోంది. — గోపీకృష్ణ.

[2] ఆ కాలంలో అరుణానది నిరంతరం ప్రవహించి నట్టుంది. పన్నులు వసూలు చేయ గలిగినన్ని పడవ ప్రయాణాలుండే వన్నమాట.

[3] శోలింగర్

[4] వడమాల పేట దగ్గరి పాదిరేడు ఒకప్పుడు పట్టణము కావచ్చు.

వేదవల్లీదేవి ఆలయ మండపం ఉత్తరకుడ్యంపై తమిళభాషలో చెక్కించాము. ఇది శక సం. 1442 విక్రమ సం. మకర మాసంలో చెక్కబడింది. (క్రీ. శ. 1521 జనవరి 1 వ తేది.) దీనిలో నగరవాసులు చేయగల వుత్సవాలు వివరించాము. తాము చిత్తగించాలి" అని వడమలణ్ణ నివేదించాడు.

రాయలవారు విష్ణుభక్తాగ్రేసరులు, అప్పుడు మహెూత్సాహంతో ఉన్నట్టి వారు గనుక వడమలణ్ణ మాటలు సావధానంగా విన్నారు. ఒక నిర్ణయానికి వచ్చారు. "మీరు, మీ సోదరులు దేవాలయ మండపాదికార్యం పూర్తి చేసినందుకు చాల ఆనందిస్తున్నాము. ఇక్కడి నుంచి రాజధాని విజయనగరం చేరిన పిదప దక్షిణంవైపు యాత్రలో అరిగండపురం వేదనారాయణస్వామిని తప్పక దర్శనం చేసుకుంటాము" అని అన్నారు.

వడమలణ్ణ సంతోషించి రాయలవారి వద్ద సెలవు తీసుకొని తన స్థానంలో వచ్చి కూర్చున్నారు.

రాయలవారు గజపతి విజయానంతరం విజయనగరానికి తిరిగి వచ్చారు. విజయనగరంలో కటక విజయ చిహ్నంగా ఉగ్రనరసింహుణ్ని స్థాపించడానికి ఉత్తరువు చేశారు. శిల్పులు ఉగ్రనరసింహ శిల్పాన్ని గండరించడంలో నిమగ్నులయ్యారు.

*ఇలవేల్పయిన వేంకటాచలపతిని ప్రతి పని ప్రారంభంలోను, సమాప్తి సాఫల్యాలలోను కొలవడం రాయలవారి అలవాటు. ఆ పద్ధతిని తిరుమలకు బయలుదేరి తిరువేంకటనాథుని సేవించారు. కుంభకోణంలో జరిగే మహామఖోత్సవంలో మహామఖ పుష్కరిణిలో స్నానం చేయడం విజయావభృథమని, అఘమర్షణమని పండితులు, పురోహితులు చెప్పారు. రాయలవారు తిరుమల నుంచి కుంభకోణానికి అరిగండపురం మీదుగా బయలుదేరారు. రాయలవారిని వడమలైయణ్ణ అనుగమించారు.

అరిగండపురం పొలిమేరలో వడమలైయణ్ణ సోదరుడు హరిదాస పెరుమాళ్ నాయకుడు రాయలవారికి సకల మర్యాదలతోను స్వాగతమిచ్చాడు.

---

* నా అభిప్రాయం కూడా ఇదే. వేరొకచోట వ్రాశాను.

రాయలవారిని వేదనారాయణస్వామి కోవెలకు పిలుచుకొనివెళ్లి తాము కట్టించిన గర్భాలయం, మహామండపం, ముఖమండపం మొదలయిన కైంకర్యం వివరించాడు.

''వేద తస్కరుడైన సోమకాసురుణ్ణి నారాయణుడు మత్స్యావతారుడై సంహరించి వేదాలు గ్రహించి బ్రహ్మకు ఇవ్వడానికి పశ్చిమాభిముఖంగా బయలు వెడలినాడు. ఆయనను ప్రళయకాలంలో పరమపదంలో కానక కరకంఠుడు, కమలాలయ వెదుక్కుంటూ బయలుదేరారు. వారికి నారాయణుడు సముద్రతీరంలో ఐదారామడల దూరాన కనిపించారు. నారాయణుడు పశ్చిమాభిముఖంగా వస్తున్నాడు. వారిద్దరూ పూర్వాభిముఖంగా వెళ్తున్నారు. ఆయనను చూడగానే వారిద్దరూ ఆగిపోయారు ఉన్నచోటుననే. అందువల్ల వేదనారాయణస్వామి పశ్చిమాభిముఖంగాను కరకంఠుడు, వేదవల్లి అనబడే లక్ష్మీదేవి పూర్వాభిముఖంగా వేంచేశారు. వేదనారాయణుడు నిలచిన స్థలం కావడంవల్ల ఈ ప్రాంతానికి వేదారణ్యమని, ఈ గ్రామానికి వేదపురి అని, వేదనారాయణస్వామి వేంచేసిన మిట్టకు వేదగిరి అని, ప్రక్కన ప్రవహించే అరుణానదికి వేదనది అని - పంచవేదాలు — పేర్లువచ్చాయి.'' అని స్థల పురాణాది విశేషాలు పెరుమాళ్ నాయకుడు విన్నవించాడు.

కరకంఠుడు హరిని చూచిన పురం కావడంవల్ల దీనికి పూర్వం నుంచి హరికండపురం అని పేరు వచ్చిందని, అదే ప్రజల వ్యవహారంలో అరిగండపురమని మారిందనీ వివరించాడు. ఆ అరిగండేశ్వరుని కోవెల వేదనారాయణుని గర్భాలయానికి కొంతదూరంలో వుందని విన్నవించాడు.

కృష్ణరాయలవారు హరిదాసు కైంకర్యానికి చాల మెచ్చుకున్నారు. వేదనారాయణునికి ప్రదక్షిణం చేయడానికి సపరివారంగా బయలుదేరారు. హరిదాస పెరుమాళ్ నాయకుడు సవినయంగా ముందు నడుస్తూ మహామండపం కుడ్యాల బహిః ప్రదేశంపై అడుగున శిల్పులు గండరించిన మత్స్యావతారగాథను [1]కృష్ణ లీలలను వివరిస్తూ రాయలవారిని ప్రదక్షిణం చేయించాడు. రాయలవారు శిల్పాల వరుసలను చూస్తూ, శిల్పుల పనితనాన్ని ప్రశంసిస్తూ ముందుకు వెళ్లారు.

మూడుమార్లు ప్రదక్షిణించి మహామండపంలో ప్రవేశించారు. ద్వార పాలకులుగా ఒకవైపు ఉత్థానగణపతి, రెండవవైపు విష్ణుదుర్గ దర్శన మిచ్చారు. రాయలవారు వారికి నమస్కరించి మహామండపంలో ప్రవేశించారు. మహా మండపం స్తంభాల శిల్పాలు, మండప మధ్యభాగం పైకప్పున రాసక్రీడల శిల్పం, మానవ మనస్తత్వం తెలిపే గొల్లవాని ప్రతిమను, ఉట్లను ఎలా కొడదామా అని పొంచివున్న స్తంభంమీది కృష్ణుని విగ్రహాన్ని చూచారు. ఆనందించారు. ముఖమండపంలో ప్రవేశించి జయవిజయుల అనుమతితో అంతరాళంలోకి వెళ్లారు. అక్కడ ఆళ్వారాచార్యులను సేవించి, ద్వారపాలకులయిన మణిక సంధ్యల అనుమతితో వేదనారాయణస్వామిని, భూనీళా సహితుని సేవించారు. ప్రధానభట్టాచార్యుడు కృష్ణరాయల ఆయురారోగ్యైశ్వర్యాలు కోరుతూ సహస్రనామాద్యర్చనలు, కర్పూర నీరాజనం సమర్పించి, వేదనారాయణుడు స్వయంభువు అని, నడుమునుంచి క్రింద మత్స్యమూర్తి అని, చతుర్భుజాలలో ఒకటి ప్రయోగచక్రయుతమూ, మరొకటి అభయ ముద్రాంచితమూనని, వామహస్తాలలో ఒకటి అనుగ్రహ హస్తమని, మరొకటి వేదయుతమని వివరించారు. తీర్థానంతరం రాయలవారికి దేవేరులకు పరిడై, పరివట్టం మొదలయిన దేవాలయ మర్యాదలుచేసి వేదనారాయణుని వక్షాన పట్టువస్త్రాలు అనుగ్రహించారు. దేవునికి రాయలవారు పెక్కు వజ్రాభరణాలు కానుకలు సమర్పించారు.

రాయలవారు స్వామి దర్శనానంతరం ముఖమండపంనుంచి గర్భాలయ ప్రదక్షిణానికి, బయలువెడలి, గర్భాలయకుడ్యాల మీది కృష్ణలీలలను, గూళ్ళలోఅమర్చిన మహిషాసురమర్దని, బ్రహ్మ, భూవరాహస్వామి, వీణాపాణీ దక్షిణామూర్తి, నాదబిందు విఘ్నేశ్వరుడు, మొదలయిన దిగ్దేవతల అపూర్వ శిల్పాలను గర్భాలయం చుట్టూ మలచిన [2]కృష్ణలీలలు, గజాశ్వపదాతి శిల్పాలు చూచి శిల్పుల విన్నాణం మెచ్చుకుంటూ వెలుపలికి వచ్చి వేదవల్లీదేవిని

1.2. కృష్ణలీలలు - ఆలయమంతా కృష్ణలీలలు - కథలు నా కథలను బలపరుస్తున్నాయి. ఇది శ్రీకృష్ణుని ఆలయమని ఇప్పుడు అందరికీ విశ్వాసం కలుగుతుందనుకుంటాను. — గోపీకృష్ణ,

దర్శించారు. ఆ దేవి సౌందర్యానికి, ఉత్సవమూర్తి చిద్విలాసానికి ఆశ్చర్య పడ్డారు. పెక్కు ఆభరణాలు, వస్త్రాలు సమర్పించారు.

చివరిసారిగా నమస్కరించి వెలుపలికివచ్చి ధ్వజస్తంభంవద్దకువచ్చి కొంచెంసేపు ఆగి మూలవిరాట్టు వేంచేసిన వైపు, వేదవల్లీదేవి వేంచేసినవైపు తిలకించారు. తల పంకించారు.

దేవాలయం నాలుగువైపుల ప్రాకార మహాద్వారాలులేక గోపురాలు లేక బోసిగా ఉన్నట్లు అనిపించింది. రెండుమూడు ప్రాకారాలుండాలి. నాలుగువైపులా ద్వారాలు, పెద్ద గోపురాలు ఉండాలి. విజయనగర విరూపాక్షస్వామి దేవాలయంతో పోటీపడేట్లుగా వుండాలి.

ఈ ఆలోచనలతో వడమలైయణ్ణను, అతని సోదరుడు హరిదాసు పెరుమాళ్ నాయకుని దగ్గరికి పిలిచారు. దేవాలయం సర్వాంగసుందరం, ప్రాకార గోపురయుతం కావడానికి రెండులక్షల హొన్నులు (బంగారునాణేలు) బహూకరించారు.

కొన్ని గ్రామాలు దానంచేస్తే, శిల్పులకు, కళాకారులకు వృత్తిఏర్పడి, దేవాలయం పూర్తికావడానికి అవకాశం వుంటుందని భావించారు. ఆనాడు కాకతాళీయంగా ఉత్థానద్వాదశి, శాలివాహన శకం 1445 కార్తీక శుద్ధ ద్వాదశి సోమవారం. (క్రీస్తుశకం 1523 నవంబరు 19 వ తేదీ) అనుకొని, గ్రామాలు దానం చేయాలని నిశ్చయించారు.

అరిగండపురం అనే పేరు గ్రామానికి బాగులేదని అనుకున్నారు. "మీరు ఉభయులూ మానుంచి భూములు, కానుకలుపొంది, దేవాలయం పనిని చక్కగా నిర్వహించారు. దీనికి ప్రాకార గోపురాలు నిర్మించాలి. దానికోసం ఈ అరిగండపురానికి మా తల్లిగారయిన నాగలాదేవిగారి పేర నాగలాపురమని నామకరణం చేసి మరికొన్ని గ్రామాలతో కలిపి దానం చేస్తున్నాము" అని సెలవిచ్చారు. వారు దివ్యచిత్తమన్నారు.

రాయల ఆదేశంపై తిరుమల నాయకుడు మొదలయిన వారు దేవాలయ నందనవనానికి, కైంకర్యానికి, పళ్ల తోటలకు, దేవాలయంలో పని చేసేవారికి, పుష్కరిణి త్రవ్వి నిర్వహించడానికి, పెక్కు గ్రామాలిచ్చారు. శ్రీ భండారం నుంచి లక్షల కొలది హొన్నులు ఇప్పించారు.

కృష్ణదేవరాయలవారు తమ మాతృదేవి పేర నాగలాపురం అనే పేరుతో దానం ఇచ్చిన శాసనం పాఠమిది:— శక 1445 స్వభాను కార్తీక శుద్ధ 12, క్రీ.శ. 1523 నవంబరు 19.

ఆ శాసనాన్ని హరిదాస పెరుమాళ్ నాయకుడు రెండవ గోపుర ద్వారం ఎడమవైపు చెక్కించారు.

గణాధిపతయే నమః నమస్తుంగ శిరశ్చుంబి
చంద్రచామర చారవే త్రైలోక్య నగరారంభ
మూలస్తంభాయ శంభవే. హరే ర్లీలా వరాహస్య
దంష్ట్రా దండస్స పాతటు వః హేమాద్రి కలశాయత్ర
ధాత్రీ ఛత్రశ్రియం దధౌ. కల్యాణాయాస్తు తద్ధామ
ప్రత్యూహ తిమిరాపహం యద్గజో వ్యగజోర్యూభ్తతం
హరిదాసిని పూజ్యతే అస్థి క్షీరమహా ద్ధ్వైః
మధ్యమానాన్మహాంబుధేః నవనీత మివో ద్భూత
మపనీత తమో మహః తస్యాసీ త్తవయః తపోభి రతులైః
అన్వర్థనామా బుధ; పుణ్యై రస్య పురూరవో భుజబలై
రాయుః ద్విషా న్నిఘ్నతః తప్యాయుః నహుషోస్య తస్య వరుషో
యుద్ధే యయాతః క్షితౌ ఖ్యాత స్తస్య చ తుర్వసుః వసునిభః
శ్రీ దేవయానీపతిః తదంగే దేవకీ జానిః
దిదీపె తిమ్మభూపతిః యశస్వీ తుళువేంద్రేశ
యదోః కృష్ణ ఇవాన్వయే. తతోభూ ద్బుక్కమాజానిః
ఈశ్వరక్షితిపాలకః అత్రాన సుగుణభ్రంశం
మౌళిరత్నం మహీభుజాం. సరసా దుదభూత్తస్మా

న్నరసావని పాలక: దేవకీనందనా త్కామో
దేవకీనందనాదిప. వివిధసుకృతోద్ధామే రామే
శ్వరప్రముఖే ముహు: ముదిత హృదయ: స్థానేస్థానే
వ్యధత్త యధానిధీ విబుధపరితో వానాదానాని యో
భువిషోడశ త్రిభువనజనోద్గీతం స్ఫీతం
యశ: పునరుక్తవాన్. కావేరీ మాశుబద్ధ్వా బహుళజలరయాం
తాం విలంఘ్యైవ శత్రుం జీవగ్రాహం గృహీత్వా సమితిభుజబలా
త్తం చ రాజ్యం తదీయం కృత్వాశ్రీరంగ పూర్వం తదపి నిజవశం
పట్టణం యో బభాసే కీర్తిస్తంభంనిఖాయ * భవన (*ఇక్కడ
కొంత అచ్చుపడలేదు. ఏముందో తెలియదు.)
స్తూయ మానా వదాన: చేరం చోళంచ పాండ్యం తమపిచ
మధురావల్లభం మానభూషం వీరోదగ్రం తురుష్కం గజపతి నృపతిం
చాపి జిత్వాతదన్యాన్ ఆగంగాతీరలంకా ప్రధమ చరమ భూ
భృత్తటాంత న్నితాంతం ఖ్యాత: క్షోణీపతీనాం స్రజమివ శిరసాం
శాసనం యో వ్యతానీత్. తిప్పాజీ నాగలాదేవ్యో:
కౌసల్యా శ్రీ సుమిత్రయో: దేవ్యోపి నరసింహేంద్రాత్
తస్మా త్పంక్తిరధా దివ. వీరౌ వినయినౌ రామ
లక్ష్మణావివ నందనౌ జాతౌ వీరనృసింహేంద్ర
కృష్ణరాయ మహీపతౌ. వీర: శ్రీ నారసింహస్స విజయనగరే
రత్నసింహాసనస్థ: కీర్త్యానీత్యా నిరస్యన్నృగ నళ నహుషా
నప్యవన్యా మధాచ్యాన్ ఆసేతో రానుమేరో రవధి నురనుత:
స్వైర మాచోళ పాండ్యా దాపాశ్చాత్యాచలాంతా దఖిలహృదయ
మాపర్జ్య రాజ్యం శసాస. నానాదానా న్యకార్షీత్కనక నదసియ:
శ్రీ విరూపాక్ష దేవ స్థానే శ్రీ కాళహస్తీ శితురపి నగరే
వేంకటాద్రౌచ కాంచ్యాం శ్రీశైలే శోణశైలే మహతి హరిహరే
హెూబిలే నంగిమేచ శ్రీరంగేకుంభ ఘోణే హతతమసి మహా
నందితీర్థౌ నివృత్తౌ. గోకర్ణే రామసేతౌ జగతి తదితరే

ష్వప్యనేకేషు పుణ్య స్థానే ష్వారబ్ధనానా బహుళ తరమహా
దానవారి ప్రవాహైః యసో దంచత్తురంగ ప్రకరఖుర
రజః పుంజ సంజాతమగ్న కామత్ పక్షచ్ఛిదోద్య త్కరకులిశ
దరోత్కంఠితా కుంఠితాభూత్ బ్రహ్మాండం విశ్వచక్రం ఘట
ముదితమహాభూతకం రత్నధేనుం సప్తాంభోధీంశ్చ కల్పక్షితిరుహలతికే
కాంచనీం కామధేనుం స్వర్ణక్ష్మాం యో హిరణ్యాశ్వరధ
మపితులా పూరుషం గోసహస్రం హేమాశ్వం హేమగర్భం కనకకరిరథం
పంచలాంగ ల్యతానీత్. ప్రాజ్యం ప్రశాసన్యనిర్విఘ్నం
రాజ్యం జ్యామివ శాసతి తస్మిన్ గుణేన విఖ్యాతే
క్షితే రింద్రే దిషంగతే తతోవ్యవార్య వీర్య శ్రీః
కృష్ణరాయ మహీపతిః బిభర్తి మణికేయూర
నిర్విశేషాం మహీమిమాం కీర్త్యాయస్య సమంతతః ప్రసృతయా
విశ్వం రుచైక్యం ప్రజేదిత్యాశంక్య పురాపురారి రభవత్
ఫాలేక్షణః ప్రాయశః పద్మాక్షోపి చతుర్భుజో జని చతు
ర్వక్త్రోభవత్ పద్మభూః కాళీ ఖడ్గ భయా ద్రమాచ కమలం
వీణాంచవాణీకరే. శత్రూణాం వాసమేతే దదత ఇతిరుషా
కిన్ను సప్తాంబురాశీన్ నానా సేనాతురంగ త్రుటితవసుమతీ
ధూళికా పాళికాభిః సంశోష్యస్వైర మేతత్ ప్రతినిధిజల
ధి శ్రేణికాం యోవిధత్తే బ్రహ్మాండం స్వర్ణమేరుప్రముఖ నిజ
మిహదా సతోయై రమేయైః.
మద్దత్తా మర్థి నార్థాః శ్రియమవ నుచిరం భుంజతా మిత్యవేత్య
ప్రాయః ప్రత్యూహ హేతోః తవసరథ గతే రాలయం దేవతానాం
తత్తద్దిక్ జైత్రవృత్త్యా పిచ బిరుద పదైః అంకితాన్తత్ర తత్ర
స్తంభాన్ జాత ప్రతిష్ఠాన్ వ్యతనుత భువి యో భూభృద గ్రంకషాగ్రాన్.
కాంచీశ్రీశైల శోణాచల కనక సభా వేంకటాద్రి ప్రముఖ్యే
ష్వావర్త్యావర్త్య సర్వే ష్వతనుత విధివత్ భూయసే శ్రేయ సేయః
దేవస్థానేషు తీర్థేష్వపి కనక తులా పూరుషాదీని నానా

దానాన్యేవోపదానై రపి సమ మఖిలై రాగమోక్తాని తాని.
రోషకృత ప్రతి పార్థివషండః శేషభుజక్షితి రక్షణ శౌండః
భాషెగె తప్పువరాయరగండః తోషకృదర్థిషు యో రణచండః.
రాజాధిరాజ ఇత్యుక్తో యోరాజ పరమేశ్వరః
హిందూరాయ సురత్రాణో దుష్ట శాత్రవ మర్దనః.
వీరప్రతాప ఇత్యాది బిరుదై రుచిదైర్యుతః
ఆలోకయ మహారాజ జయ జీవేతి వాదిభిః.
అంగ వంగ కళింగాద్యైః రాజభిస్సేవ్యతే చయః
స్తుత్యాదార్య స్సుధీభి స్స విజయ నగరే రత్న సింహాసనస్థః
క్ష్మారాలాన్ కృష్ణరాయ క్షితిపతి రధరీకృత్య నీత్యానృగాదీన్
ఆపూర్వాద్రే రథాస్త క్షితీధరకటకా దాచ హేమాచలాంతాత్
ఆసేతోర్ధసార్థ....భ్రిహుతీ కృత్య కీర్త్యా సమింధే.
శకాబ్దే గోరివాహ స్య సహస్రేణ చతుశ్శతైః
పంచాభ్యధికయా చత్వారింశతో గుణితే క్రమాత్.
సుభానువత్సరే మాసే కార్తికే సోమవాసరే
శుక్ల పక్షేచ పుణ్యాయా ముత్థాన ద్వాదశితిథౌ
తుంగభద్రాపగా తీరే హేమకూటోపశోభితే
విఠ్ఠలేశ విరూపాక్ష సన్నిధౌ ముక్తిదాయిని.
ఆశేషజగతాం సృష్టి స్థితి సంహార కారిణః
చిన్మయాంభోరుహోల్లాస ............
హరిదాస పురేశాయ వేదాచల విహారిణే
నానాసురాసురఖిలో రత్నశాయి వదశ్రియే.
నీలమాణిక్య దేవాయ భుక్తి ముక్తి ప్రదాయినే
చంద్రగిర్యా హ్వయేరాజ్య ప్రాజ్యే తోండీర మండలే.
ఖస్రన వర్ధన కోట్టీరే విఖ్యాతి మధికం శ్రితే
నారాయణ పురాభిఖ్య వర్తికే విహిత స్థితిం.

గ్రామా ద్రాజ విభాలాఖ్య వేట్టాయాః పూర్బ దిగ్బనం.
వెళ్లియూ రభిధా ద్గ్రామాత్ దక్షిణస్యాందిశి స్థితం
కృష్ణరాయ పురేణాపి వటకూప గతేనచ.
కొట్టైకా డభిధానేన గ్రామేణచ సమన్వితం
పట్టశ్రీ మధురాఖ్యేన గ్రామలేణ నమన్వితం.
ఇత్యాది గ్రానుకైశ్చాపి వేద శైలేన చాన్వితం
హరికంఠ పురాభిఖ్య సీమాంతర్గణితై స్సదా
శ్రీ సత్యవేడు.................... ...
గ్రామకైరపి కీళ్పాక్క గ్రామేణా పిచసంశ్రితం
నారాయణ పురాభిఖ్య పత్తికే విశ్రుతేపిచ
శ్రీ సింగపూన్మియూర్నామ గ్రామేణా పిచ యోజితం
నిర్ణయూరితి విఖ్యాత నాడుకే విశ్రుతేసిచ
వేట్టారై పట్టి నామ్నాచ గ్రామకేణాపి దాన్వితం
....................... ... ...........
తిరువేంకట ముడయాంభోధి పూర్ణ చంద్రేణ భూష్ణునా
గంగాజలాన్వవాయేన హరివానపురీ భువా
నారాయణ పదాంభోజ షట్పదీకృతచేతసా
నీలమాణిక్య దేవస్య కైంకర్త్యైకాయనేన చ
గోపురాణి విమానాని మండపావరణాని చ
రథాద్య శేష కైంకర్య కారిణా ధర్మశీలినా
శ్రీమద్వడమలణ్ణీన మంత్రి వర్యేణ దీమతా
తద్భ్రాత్రా ధర్మ శీలేన వినీతేన దయాళునా
హరిభక్తాగ్రగణ్యేన ఊరి దాసేన చార్థితః
సుధాహార రసాధిక్య నైవేద్యార్థం విశేషతః
నృత్తగీత మహావాద్య వైభవార్థంచ కల్పితం
హరిగండ పురాభిఖ్యం సర్వసస్య సమన్వితం

శ్రీ నాగలాపురమితి ప్రతినామ సమన్వితం
సర్వమాన్యం చతుస్సీమా సంయుతంచ సమంతతః
ఉడైత్తురా న్వితం సంక మార్గాయ మహితాన్వితం
తేనాముసైవ దేవేన భోగ్య మాచంద్రతారకం
దానస్య ధమనస్యాపి విక్రయస్యాపిచోచితం
పరీతం ప్రయతైః స్నిగ్ధ పురోహిత పురోధసైః
వివిధైః విబుధైః శ్రౌత పధికై రధి కైర్గిరా
కృష్ణదేవ మహారాయో మాననీయో మనస్వినాం
సహిరణ్య పయోధారా పూర్వకం దత్తవాన్ ముదా
ఆశేష జనతా సృష్టిస్థితి సంహారకారిణః
నీలమాణిక్య దేవస్య సన్నిధౌ ముక్తిదాయిని
వేద ద్రావిడ వేదాంత కీర్తనార్థం ప్రకల్పితం
నానా శాఖాభిధాగోత్ర సూత్రేభ్యః శాస్త్రవిత్తయా
విఖ్యాతేభ్యో ద్విజాతిభ్యః వేదవిద్భ్యో విశేషతః
విఖ్యాతం కచ్చియార్గామ్ని నాడుకేతి మనోహరే
ఇక్కట్టు కోట్టకే చాపి విఖ్యాతి మధికాం శ్రితం
పాత్తవాక్కమితి ఖ్యాత నామానం గ్రామ ముత్తమం
శ్రీ వేదగిరి నాధస్య పురాభాడవనామకం
దేవస్య సామగానార్థం సన్నిధా వస్య కల్పితం
పెరుంజే రీతి విఖ్యాత నామానం గ్రామ ముత్తమం
శ్రీ వేంకటపురం చేతి ప్రతినామ సమన్వితం
(అసమగ్రం)

ఇది రెండవ గోపుర ద్వారం ఎడమవైపు గ్రంథాక్షరాలతో చెక్కినది. 200 పంక్తులకు పైగా వుంది. కొరవ మరెక్కడో చెక్కినట్టు (ఇందుక్కిక్కిశై వృత్తియిలే అని శిల్పి తెలిపాడు ఎక్కడో, తెలియదు.)

కృష్ణరాయలవారు సపరివారంగా కుంభకోణానికి తరలి వెళ్లారు. మహామఘం పుష్కరిణిలో అఘమర్షణ స్నానం ఆచరించి, సారంగపాణిని కుందేశ్వరుణ్ని సేవించి నాగలాపురం మీదుగా విజయనగరానికి మరలారు.

నాగలాపురంలో అప్పటికే వేలాది శిల్పులు పని చేస్తున్నారు. ఆ శిల్పులకు జక్కణాచార్యుని వంశంవాడైన టేంకణాచార్యుడు ప్రధాన స్థపతి. నాలుగు ప్రాకార ద్వారాలు నిర్మితమయ్యాయి. మహాద్వారం — మొదటి పడి కావలిగోపురం మూడవ అంతస్థు నిర్మాణంలో వుంది. రెండవ పడికావలి గోపురం ఐదంతస్థులూ పూర్తయి గోపురం పూర్తయింది. మహా మండపం గోపురం మూడు అంతస్థులతో పూర్తయింది. ఉత్తర ద్వారగోపురం ఐదంతస్థులతో పూర్తయింది. దక్షిణ ద్వారగోపురం మూడవ అంతస్థు పూర్తయింది తూర్పు ద్వార గోపురం రెండవ అంతస్థు కడుతున్నారు. పుష్కరిణి పూర్తికావచ్చింది. నందనవనం మొగ్గతొడిగింది. పండ్ల తోట పూచింది.

ఎటుచూచినా శిల్పుల ఉలుల సవ్వడులు బరువురాళ్లు ఎత్తుతున్న కార్మికుల హైలెస్సా గీతాలాపాలు వినిపిస్తున్నాయి.

రాయలవారి రాకను ఎదురుచూస్తున్న వడమలైయణ్ణ, హరిదాసు ఎదురు వెళ్లి వారికి స్వాగతమిచ్చి వేదనారాయణస్వామి ఆలయానికి పిలుచుకొని వచ్చారు. మహానగరమే తయారయింది.

రాయలవారి కన్నులు ఆనందంతో చెమ్మగిల్లాయి. తిరుమలాంబగారి మాతృహృదయం ప్రేమభక్తులతో పొంగింది. వేదవల్లీ సమేతుడైన వేదనారాయణుని దర్శించి, దేవాలయంలోనే కొలువుదీర్చారు పురప్రముఖు లందరినీ రావించారు. దేవాలయ కార్యం ఇంత ఘనంగా సాగుతున్నందుకు పరమానందం వెలిబుచ్చి, హరిదాసపెరుమాళ్ నాయకునికి "కృష్ణరాయ హరిదాస నాయకుడు" అని బిరుదం ఇచ్చారు. నాగలాపురం మొదలైన గ్రామాలను దేవాలయ కైంకర్యం కోసం దానమిచ్చిన వాటిని ఆయా కైంకర్య దారులు నిర్వహించేట్టు చూచే సర్వాధికారాలు కృష్ణరాయ హరిదాసుకు దత్తం

చేశామని, పురవాసులందరు గౌరవించాలని ఆదేశించారు. దేవాలయంలో వేద పారాయణానికి, దివ్యప్రబంధ పారాయణానికి, నాట్యశిల్పాలకు కొన్ని గ్రామాలిచ్చారు: (ఈ ఆదేశాన్ని కృష్ణరాయహరిదాస బిరుదాంచితుడైన పెరుమాళ్ నాయకుడు తమిళభాషలో రెండవద్వారంపైన శకవరుషాలు 1445 స్వభాను మకరమాసం 17న. (క్రీ. శ. 1524 జనవరి 8వ తేదీన) చెక్కించాడు. దీనిలోని బిరుదభాగం ఇది:— "అరిగండపురమెన్ర పేరుమాగదెన్రు కృష్ణదేవమహారాయర్ తమ్ మాతావిన్ పేరాలే నాగలాదేవి యమ్మన్ పురమెన్రు కట్టలైయిట్టు తంగళుక్కు నాగలాదేవి యమ్మన్‌పురం స్థానమురలాన అనైత్తు కొత్తుక్కాణియం తంగళుక్కు కృష్ణదేవరాయ హరిదాస ముదలియారెన్ర దానపట్టిప్పేరుం పాలిత్తు ఇందమురైప్పడి క్కల్లాం శిలా శాసనం పణ్ణిన తిరువుళ్ళముం............

ఈ శాసనాన్ని హరిదాస నాయకుడు ఉత్తర గోపురద్వారంలోను, బహిఃప్రాకారం ఉత్తర కుడ్యంమీదను మరికొన్ని వివరాలతో ఆసంవత్సరమే చెక్కించారు.

తిరుమలదేవి ఆ పరిసరాలలోని కోటళత్తూరు, వేంగళత్తూరు అనే గ్రామాలను తిరుమలాదేవీపురం అనే నామకరణం చేసి వేదనారాయణస్వామి కైంకర్యం కోసం కృష్ణరాయ హరిదాసుకు దానమిచ్చారు.

ఈతిరుమలాదేవి శాసనం రెండవ గోపురద్వారంలో చెక్కబడింది. ఈ శాసనం మొదలు ఖిలమైనది. కడపటిభాగం మాత్రం ఉంది. హరిదాస పెరుమాళ్ నాయకునికి రాయలవారు 'కృష్ణరాయహరిదాస' బిరుదం ఇచ్చిన తర్వాతే ఈ దానం ఇవ్వబడినట్టు శాసనంవల్ల తెలుస్తున్నది. ఈ శాసనం భాగం ఇది:—

మొదలులేదు.

అమణ్మాక్కమితి ఖ్యాత నామానం గ్రామముత్తమం

.... .... .... .... .... రామానుజ కూటాయ

.... .... .... .... .... .... .... ....

.... .... శకృష్ణ రాయస్య ధర్మకామార్థ సిద్ధయే
.... .... .... ....   .... .... ....   ...
హరిదాసస్య స్థాన నిర్వహణ .... ....
కోట్టిళత్తూరితిఖ్యాతం గ్రామం .... ....
శ్రీమత్తిరుమలాదేవీ ....  ... నవనామ
వేంగళత్తూరి తిఖ్యాత నామానం గ్రామముత్తమం
శ్రీమత్తిరుమలాదేవీ పుర .... .... భవ్యనామకం
సర్వమాన్యం చతుస్సీమా సంయుతంచ సమంతతః
కృష్ణదేవమహారాయో మాననీయో మనస్వినాం
సహిరణ్య పయోధారా పూర్వకం దత్తావాన్ ముదా
పురతత్త్వ ప్రబోధా ....  .... .... ష్ణనే
శ్రీవైష్ణవపదస్థాయ విష్ణుకైంకర్యం శాలినే
కృష్ణరాయాభిధాసా లిహరిదాసాయ ధీమతే
కృష్ణమాణిక్య దేవస్య .... .... రసాప్తయే
స్థానాధిపత్య .... ....  ... .... ....  ..
దేవ్యాః తిరుమలాంబాయాః ధర్మాద్రామధ్యయం కృతం
సఏవ హరిదాసోయ మనుభూయా .... .... సర్వదా
ఆచంద్ర తారక మిదం సద్ధర్మం పరిపాలయేత్
నివేదితాన్నాహూవ .... .... స్థానమానంచ కల్పితం
పుత్రపౌత్రాధిభిః భోగ్యం స్థానస్వామ్యం సుశోభితం
.... .... .... .... కృష్ణదేవమహారాయ
శాసనేని సభాపతిః అభాణీన్మృదు సందర్భం
.... .... దిదం తామ్రశాసనం కృష్ణదేవమహారాయ
శాసనాన్మల్లుణాత్మజః త్వష్టా శ్రీవీరణాచార్యో
వ్యలిఖిత్తామ్రశాసనం శ్రీవిరూపాక్ష.

"శ్రీవిరూపాక్ష" తెలుగులో ఉంది.

ఈ ఏర్పాట్లు తర్వాత రాయలవారు సపరివారంగా విజయనగరానికి తరలి వెళ్ళారు.

ఐదేళ్ళు గడిచాయి. విజయనగర సామ్రాజ్యంలో కృష్ణరాయల తర్వాత ఎవ్వరనే ఆందోళన బయలుదేరింది. దానిప్రభావం పరిపాలన మీద పడి ఉంటుంది. పనులన్నీ సక్రమంగా నడిచే అవకాశం లేకపోయి వుంటుంది.

నాగలాపురంలోను వేదనారాయణస్వామి దేవాలయం నిర్వహణలో మార్పు వచ్చి వుంటుంది. కృష్ణరాయ హోరిదాసనాయకుడు, పడమటై యణ్ణ మరణించి వుంటారు. అందువల్ల దేవాలయ గోపురాల నిర్మాణం పూర్తి కాక పోయివుంటుంది. ఈ అవకాశాన్ని కొందరు దుండగులు దుర్వినియోగించు కొని, దేవాలయం పనులు కాకుండా చేయడానికి, దేవాలయం భూములు స్వాధీనం చేసుకొని అనుభవించడానికి ప్రయత్నించి వుంటారు. ఈ సంగతిని కొందరు రాయలవారికి ఫిర్యాదు చేసి వుంటారు.

ఈ పరిస్థితిలో దేవాలయ నిర్వాహకులు కట్టుదిట్టాలకోసం మరొక శాసనం రాయలవారి అంత్యదశలో వేయించారు. దీనిని బట్టి దేవాలయ దయనీయ స్థితి ఆరంభమైనదని వూహించవచ్చు.

ఈ శాసనం శక సంవత్సరాలు 1451 సర్వాధారి సంవత్సర మాఘశుద్ధ తృతీయనాడు వేయించింది. (క్రీ. శ. 1529 జనవరి 13) ఇది కన్నడభాషలో వేదనారాయణస్వామి గర్భాలయం దక్షిణ పూర్వ ఉత్తర కుడ్యాలమీద మధ్యన రెండు వరుసలలో చెక్కారు. దీనినే రెండవ గోపుర ద్వారం కుడిపక్కన మళ్ళీ చెక్కించారు. లేదా, మొదట గోపురద్వారం మీద 15 పంక్తులలో చెక్కించి తర్వాత గర్భాలయం మూడు గోడలమీద రెండు పంక్తులలో చెక్కించారేమో! ఈ శాసనంలోని వక్కాణమిది :—

శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర వీరప్రతాప శ్రీవీర కృష్ణ రాయలవారు నాగలాదేవి అంతఃపుర దేవాలయానికి, అష్టమాంశానికి రాయసం ప్రకారం వేయించిన శాసనంపల్ల కట్టు. ఈశాసనం రాళ్లను పీకివేసి దుర్జన

లను తగిన కట్టుబాటులోపెట్టి, వారినుంచి శిక్షగా వసూలుచేసే హొన్నులను దేవాలయానికి చేర్పించాలి. అష్టమాంశానికి మొదట వేరు పరచిన మాన్యాలు పోగా తక్కిన భూములను గుడిలో పనిచేసే వారి జీతానికి ప్రత్యేకించాలి. విఘ్నస్థానంలో దుర్జనులు చేసిన అకృత్యాలను సవరించి, సన్నిధిలోని వేదగిరి పెరుమాళ్లకు తిరునాళ్ళు సాగించి, పూజాదులు నిర్వహించాలి. గుడి ఉత్స వాల గ్రామాలకు, వైష్ణవులు, తదితరులకు ఏర్పాటయిన గ్రామాలు కృష్ణ రాయ హరిదాసనాయకుని కాలంలో నడిచిన గ్రామాలకు పూర్వం మేము వేయించిన తామ్రశాసనం ప్రకారం మర్యాదలు నడిపించాలి. ఉత్సవాదులకు ఎలాటి లోపమూలేకుండా నిర్వహించాలని చిత్తగిస్తున్నాము. శ్రీవిరూపాక్ష. (ఈశాసనం క్రీస్తుశకం — 1529 జనవరి 13 వ తేదీది.)

దీనివల్ల దేవాలయాన్ని మొదటినుంచీ ఉద్ధరించడానికి పూనుకున్న కృష్ణరాయ హరిదాసనాయకుడు ఇప్పుడులేడని, దానితో దుర్జనులు దేవా లయం ఆస్తిపాస్తులను, దేవాలయం రాళ్ళు ఇటుకలనుకూడ అపహరించడానికి ప్రయత్నించి వుంటారని, అందువల్లనే ఈ శాసనం ప్రత్యేకంగా వేయించి వుంటారని స్పష్టం. ఆ శాసన పాఠం కూడా ఇక్కడ పొందుపరచడం తప్పిదం కాదు:—

1. స్వస్తిశ్రీ సర్వధారి సంవత్సర మాఘశుద్ధ 3 లు శ్రీమన్మహారాజాధి రాజ రాజపరమేశ్వర వీరప్రతాప

2. శ్రీ వీరకృష్ణ రాయమహారాయరు విరుపయ్యణ....యప్ప నాగలా దేవియ ఆరమనె

3. యపుర దేవస్థానక్కె ఊ అష్టమాంకదనీరక్కె ఊ తమ్మరాయస ప్రకారదలె హాకిదశాసన యెల్లెకట్టు....ద కల్లు

4. గళన్ను కిత్తుహాకిద దుర్జనరు ఇబ్బరు మూపథిగె చక్కకట్టుపాటు మాడి అపరమేలణ రెక్కద హొన్నన్ను

5. తెగదు గుడిగె కొడిసిపుదు అష్టమాంశక్కె మొదలు వింగడిసి కొట్టుగద్దె మాన్య నెలను అల్లదెమిక్కం

6. ధానెలను గుడియ వినియోగదపరజీతక్కె వింగడిసోదు విష్ణు స్థానదల్లి దుర్జనరు మాడిద అకృత్యగళను, బిడి

7. సి సన్నిధి మేలణ వేదగిరి పెరుమాళిగె తిరుణాళను సాగిసి పూజయనుమాడిసోదు, గుడిదె ఉంటాద కట్ట

8. ళిగె ఈ తిరువళియాట గ్రామగళిగెయూ చాతిన చాతాదవైష్ణ పరిగెయూకృష్ణరాయ

9. మొదలి దినదల్లి అవరిగె నడెదస్థాన నిర్వాహ ఉభయ గ్రామ గళిగెయూ హిందక్కె నమ్మరాయన తామ్ర

10. శాననపాలిసివడెద మరియాదె ఈగలూ నడెవహాగె కట్టళిమాడి చిత్తయిస్సైపు ఆ మరియాదె

11. లి నడసిబహుదు ఆమరియాదలె ఎల్లవన్ను నడెసిణహాగెకట్టి శెయమాడువుదు. అష్టమాంశదవ

12. రిగె హిందక్కె వింగడిసి ఐటి స్థలదలె యిహాగె కట్టళెయ మాడూదు దేవరపూజా పురస్కారఅంగ

13. రంగవైభోగగళన్ను పొంగవాగినడసోదు నావు హిందక్కె దేవ స్థానక్కె ఉభయకట్టలెమొదలా

14. గి తిరువిళెయాటక్కం కట్టళెయ మాడి చిత్తయిన్త గ్రామగళు ఒందరల్లూ కడిమె యిల్లదహాగె నడసువుదు

15. ఆగి ఆ స్తితియన్ను నిరుపచిత్తయి సైపు శ్రీ విరుపాక్ష ”

1530 తర్వాత విజయనగర సామ్రాజ్యం విచ్ఛిన్నం కావడం ప్రారంభమయింది. తర్వాత ఎందరో రాజులు మారారు. రాజధాని పెను గొండకు తరలింది. నాగలాపురం దేవాలయ గోపురాలు పూర్తి అయినట్టు

లేదు. శ్రీ రంగరాయల కాలంలోను ఈ దేవాలయం పూర్తి అయినట్టు లేదు. కాని, ఉత్సవాదులు. నిత్యపూజలు లోపం లేక జరుగుతున్నట్టు పాంచాళం వారు—శిల్పులు—తమ పనిని మునుపటిలాగ కొనసాగిస్తూనే వున్నట్లు తెలుస్తుంధి. వారికిమర్యాదలూ యధావిధిగానే జరిగేవి. వారు ఈ శుష్కమైన మర్యాదలకన్నా దేవాలయం మాన్యాలు అనుభవిస్తూ దేవాలయ కైంకర్యం చేయడం మేలని దేవాలయం నిర్వాహకులతో చెప్పుకొని వుంటారు. అప్పుడు శ్రీ రంగదేవరాయల కార్యకర్త అయిన సెకటురెడ్డి కృష్ణమనాయకుడు అనేవారు, స్థానాధికారులు, వూరిలో వుండే పెద్ద మనుష్యులు సభకూడి, పాంచాళంవారు కోరినట్టు శాసనం వేయించారు. ఇది వేదవల్లీదేవి గర్భాలయము ఉత్తరువు గోడమీద చెక్కబడింది. ఇది సుమారు క్రీ. శ. 1579 నాటిది. శ్రీరంగ దేవరాయల కాలంది. అది తమిళ శాసనమైనా సులభంగా వుంది గనుక, కుతూహలం కలిగించేది గనుక చదవండి:—

1. ప్రమాది వరుషం చిత్తిరై
2. మాదం 1501 28 శ్రీ మన్మహా
3. మండలేశ్వర రాజాధి
4. రాజ రాజపరమేశ్వర శ్రీ వీరజగ
5. తావరాన శ్రీ రంగదేవమహా
6. రాయర్ కార్యత్తుక్కు కర్త
7. రాన సెకతురడ్డి కృష్ణ
8. మనాయుకరుం నాగలా
9. పురం స్థావత్తారుం ఊ
10. రావరుం నాగలాపురం
11. పంచాళత్తారుక్కు పాన
12. నంకుడుత్తార్పడి తంగళుక్కు
13. పరడై పరివట్టం వేండా

14. మెన్రుకట్టడై పణ్ణినోం
15. తాంగళ్ పూరిల్ంఉండా
16. సఉళవుతాళిలుం తిరు
17. క్కోయిల్ ఊళియముం
18. పణ్ణింకొండు ఇరుక్కక
19. డవరాహవుం తంగళుక్కుపూర్వ
20. మ్ ఉండాన మాన్నియం సు
21. దందిరంనడత్తివర కడవె
22. రమాగవుం ఇందపడిక్కు చం
23. దరాదిత్త పరైయుం నడక్కకడవో
24. మాగవుం ఇదక్కు యారొరువర్ అకుదం పణ్ణినాలుం
25. గంగైకరైయిలే కారాంపశువై
26. కొన్రదోషత్తిలే పొగక్కడవో
27. మాగవుం ఇందపడిక్కు స్థానకణక్కు వెంకప్పన్ ఎళుత్తుస్థానం శినివాసన్ ఎళుత్తు.

(ఈ శాసనాలన్నిటినీ 1904లోనే శ్రీ వి. రంగాచార్య అనేవారు మద్రాసు ప్రభుత్వం పక్షాన సేకరించి దిపోటోగ్రాఫికల్ లిస్ట్ ఆఫ్ ది ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్‌ది మద్రాస్ ప్రెసిడెన్సీ" అనే పుస్తకంలో ప్రచురించారు. దానిని తర్వాత మద్రాసు ప్రభుత్వంవారు "సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్‌షన్స్" అనే పేరుతో పెక్కునంపుటాలుగా ప్రకటించారు. వాటిలో 9, 13 సంపుటాలనుంచి ఈ శాసనాలు ఉదాహృతాలు.)

విజయనగర సామ్రాజ్య పతనం తర్వాత ఈ దేవాలయం పూర్తిగా ఉపేక్షితమయింది. దేవాలయ సేవకోసం పలువృత్తులువారికి ఇచ్చిన భూములు అన్యాక్రాంతాలో, విక్రీతాలో అయ్యాయి. అర్చకత్వం వారసత్వం గనుక, నిత్యపూజలు మాత్రం జరిగేవి. శ్రద్ధాసక్తులున్న పౌరులు ఉత్సవాలు

జరిపేవారు. కొంత కాలానికి వాహనాలు మొదలయినవి జీర్ణమయ్యాయి. రథం విరిగిపోయింది. రథచక్రాల ఇరుసులు మాత్రం మిగిలాయి.

ఈ ప్రాంతం కాలక్రమాన ఆర్కాటు నవాబు పాలన కిందకి వచ్చింది. దేవాలయం కైంకర్యం రాజోచితంగా జరిపించాలని పలువురు ఆచార్యులు, ప్రముఖులు పాటుపడ్డారు. వారిలో అగ్రగణ్యులు అప్పటి శ్రీ ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్యులవారు. వారు తమ శిష్యుడు నంబూరు కేశవా చార్యులను ఆర్కాటు నవాబు వద్దకు పంపారు. ఆయన జగన్నాధరావు అనే వారి ద్వారా నవాబు దర్శనం సంపాదించి, వేదనారాయణస్వామి దేవాలయ దుస్థితిని తెలిపి, రాజముద్రాముద్రితమైన ఆజ్ఞా పత్రం తెచ్చి గురువుకు అంద జేశాడట. అప్పటి నుంచి యధావిధిగా మళ్ళీ నిత్యోత్సవ విశేషోత్సవాలు జరుగడం మొదలయింది. ఈ విషయాన్ని నంబూరు కేశవాచార్యులు తాము రచించిన ''ఆచార్య సూక్తిముక్తావళి'' అనే ప్రబంధంలో చివర గ్రంథ కర్తృ వృత్తాంతము అనే ప్రకరణంలో తెలియజేశారు. దానిలోని ఇక ఘట్టాన్ని ఉదాహరిస్తూన్నాను :—

''నాగలాపురంబున స్వాభిమానాంతర్భూతుండగు వేదనారాయణ స్వామి కైంకర్యంబు జీర్ణంబైయున్నది. నీవు షడారణ్య పురాపర నామధేయం బైన యారుకాటికిం జని రాజద్వారంబు గాచి, యాకైంకర్యంబు నిర్వహింపుమని యాజ్ఞాపించిన మహాప్రసాదంబని యాచార్యునాజ్ఞ శిరసావహించి యాషడా రణ్య పురంబునకుం జని యందు కందాడ భావనాచార్య శ్రీపాద పద్మాశ్రితుం డగు జగన్నాధరాట్పండితుని మూలంబుగా నక్కైంకర్యంబు నద్దేశికేంద్రుని యనుగ్రహంబుచే నమకూర్చుకొని మగిడి యేతెంచి యాశ్రీపురియందు గోవింద రాజ మందిరంబున శ్రీమదార్ద్రా నక్షత్ర మహోత్సవంబునం దాస్థానమండపం బలంకరించి దివ్యసింహాసనాసీనులై విచ్చేసియున్న యెంబెరుమానార్ సన్నిధి శ్రీవైష్ణవ మధ్యంబున విచ్చేసియున్న మద్గురు శిఖామణిని జూచి సాష్టాంగ ప్రణామం బాచరించి యంజలించి యున్న నన్ను గటాక్షించి యద్దేశిక సార్వభౌముండు దేశాంతర గతుండగు పుత్రునింజూచి తండ్రి యెదుర్కొను

మాడ్రి నెదురేగుదెంచి శ్రీపాదపద్మ ప్రణతుండనగు నన్నుగ్రుచ్చి యెత్తి కౌగిటం జేర్చుకొని మత రతలగతంబగు రాజముద్రా ముద్రితంబైన పత్రంబు గైకొని వత్సా! నీవు మా కభిమతచ్ఛాత్రుండవు రెండవపుత్రుండవని మిగుల సంత సించుచు మహానుగ్రహం బ్రోవ.'' (ఆచార్యసూక్తి ముక్తావళి)

వంద సంవత్సరాల క్రితం ఈ దేవాలయం ఆర్కాటు నవాబులనుంచి బ్రిటీషు ప్రభుత్వానికి సంక్రమించింది. దేవాలయ పూజా కైంకర్యాల కోసం వారు మొదటి 300 రూపాయలను ఏటా ఇచ్చేట్టు ఒప్పందం చేసుకున్నారు. తర్వాత ఈ మొత్తాన్ని 500 కు పెంచారు. ఇటీవల కొన్ని సంవత్సరాల క్రితం ఇది అప్పటి లెక్కల ప్రకారం 811-25 రూపాయలకు పెరిగింది.

60 సంవత్సరాల క్రితం దేవాలయం భూములన్నీ రైత్వారీ చేయ బడ్డాయి.

నాగలాపురం సమీపంలో వున్న రజానగరం పోస్టుమాస్టరు శ్రీ ఉమ్మి నరసింహులు శ్రేష్ఠిగారు నాగలాపురం దేవాలయం గురించి కర్ణాకర్ణికగా వినవస్తున్న పెక్కు విషయాలు చెప్పారు. (వారు చిన్నయసూరి నీతి చంద్రిక శైలిలో నాగలాపురం చరిత్ర విరచిస్తున్నారు. దానిని వారు ప్రచు రిస్తే భాగవతులకు ఎంతో మేలు చేకూరుతుంది.) వారు చెప్పిన కథలలో కొన్నిటిని ఇక్కడ పొందుపరుస్తున్నాను:—

కృష్ణరాయ హరిదాసనాయకుడు వేదనారాయణస్వామి ఆలయాన్ని జీర్ణోద్ధరణ చేయించినవాడే కాక తమిళంలో గొప్పరచన కూడా చేసినవాడు. ఈయన హరిహర సారమ్యాన్ని తెలిపే ఒక గ్రంథాన్ని తమిళ భాషలో వ్రాశాడు. దీనికి ''ఇరుసమయ విళక్కం'' అని పేరు. అంటే సంప్రదాయద్వయ ప్రకాశిక అన్నమాట. దీనిలో 16 అధ్యాయా లున్నాయి. దీనిలో ఒక కథవుంది.

శ్రీ హరిదాస నాయకుడు శివ కేశవ పరమోత్కృష్టత్వాన్ని నిరూపించ డానికి వేదనారాయణస్వామి దేవాలయంలో ఒక సభ ఏర్పాటు చేశాడట. దానిలో ఎవరైనా శివ కేశవుల సారమ్యాన్ని గురించి ప్రసంగించవచ్చు.

ఒకరు మొదట ఒకరి గొప్పతనాన్ని నిరూపిస్తే, రెండవవారు దానిని సోపపత్తికంగా ఖండించి తన ఇష్ట దైవోత్తమత్వం నిరూపించాలి.

నాగలాపురంలో (అరిగండపురంలో) అప్పుడు ఆరణవల్లి, ఆగమవల్లి అనే అక్కచెల్లెళ్ళిద్దరు వుండేవారు. వారు చాల భక్తురాండ్రు. వారిలో ఒకరు హరిభక్తురాలు, మరొకరు హరభక్తురాలు. వారిద్దరూ ఈ వాదంలో పాల్గొనా లనుకున్నారు. హరిదాస నాయకుని కోరారు. అతడు అంగీకరించాడు.

ఊరిలోని సుందరీమణులు వాదిస్తున్నారంటే జనం సంగతి చెప్పాలా? మహామండపం, ధ్వజస్తంభ పరిసరాంగణం కిట కిట లాడి పోయాయి. ఆరణవల్లి, ఆగమవల్లి ఆరణీనదిలో స్నానంచేసి, తడిబట్టలతోనే దేవాలయంలో ప్రవేశించి, వేదనారాయణస్వామి ఎదుట, మహామండపంలో సమావేశమయిన పండిత పరిషత్తులో వాదం ప్రారంభించారు. ఆగమవల్లి శివసర్వోత్కృష్టత్వం గురించి ఉపన్యసించింది. ఆరణవల్లి హరి సర్వోత్తమత్త్వం గురించి ప్రసంగించింది. ఇద్దరూ సమానంగా తమ వాదాలు వివరించారు. పండితులు ఎవరి వాదం గొప్పదో నిర్ణయించ లేక పోయారు. కాని, ఆరణవల్లి విష్ణు సర్వోత్తమత్త్వం గురించి ఉపన్యసించేటప్పుడు, మహామండపంలోని స్తంభం నుంచి నృత్య గీతాలు వినబడ్డాయి. దానితో ఆరణవల్లే గెలిచిందని హరి భక్తులు భావించి సంతోషించారు. హరిదాసనాయకుడు ఎలాటి పక్షపాతమూ లేకుండా ఈ విషయాలు తన "ఇరుసమయ విళక్కం"లో చేర్చాడు.

అతడు హరిభక్తుడైనా, దేవాలయంలో శివకేశవ భేదభావం తొలగడానికే గణేశ దుర్గా దక్షిణా మూర్త్యాది విగ్రహాలు అక్కడక్కడ నెలకొల్పాడని పెద్దలు చెబుతారని, ఇది అపూర్వ సంప్రదాయమని కొన్ని సంవత్సరాల క్రితం ఈ దేవాలయాన్ని దర్శించిన శ్రీ జగద్గురు కంచికామకోటి పీఠాధిపతులు తెలియజేశారని వేద నారాయణస్వామి దేవాలయం అర్చకులు శ్రీ దామోదర భట్టాచార్యులవారు తెలిపారు.

శ్రీ ఉమ్మి నరసింహులు శ్రేష్ఠిగారు తెలిపిన మరొక కథ చాల ఆశ్చర్య కరమైంది:—

నాగలాపురం దేవాలయోద్ధరణ పుష్పగిరి దేవాలయోద్ధరణ ఒకే లగ్నంలో జక్కణాచార్యుని వంశస్థుడైన టేంకణాచార్యుడు ప్రారంభించాడట. ఈ సంగతి శిల్ప దర్శనం అనే గ్రంథంలో వుందట. ఈ మొదటి పడి కావలి గోపురం ఎక్కిచూస్తే కంచి ఏకామ్రేశ్వర దేవాలయ గోపురం కనిపించా లని టేంకణాదిత్యుని ఆశ. కాని అది అసమగ్రంగానే వుండి పోయింది. రెండు అంతస్థులే పూర్తయ్యాయి. హంపీ విరూపాక్షస్వామి మహాద్వార గోపురం 13 అంతస్థులు. అలాగే ఈ మొదటి మహాద్వార గోపురాన్ని 11, 13 అంతస్థుల యెత్తున కట్టాలని ఆయన ఆలోచనచేసి మూలబంధం వేశాడు మొదటి గోపురం క్రింది భాగం రాళ్లు గజం వెడల్పు, ఒకటిన్నర గజం ఘనం. ఇంత పెద్దరాళ్ళతో కట్టిన గోపురద్వారం మరెక్కడాలేదు.

ఆలయ నిర్మాణ సమయంలో కార్మికులు సమ్మె చేశారట. శిల్పా చార్యులకు జీతం ఎక్కువ, ఇనాములుకూడా. ఎందుకు ఇవంతా అని వారు హరిదాస నాయకునితో వాదించారట. హరిదాసుకు ఏమీ తోచలేదు. శిల్పా చార్యులతో సంప్రతించి ఒక సమావేశం ఏర్పాటు చేశారు. "నాకు అందరితో పాటే జీతం ఇవ్వండి. అందరితోపాటే పనిచేస్తాను" అని అన్నాడట శిల్పుల తరపున శ్రీ టేంకణాచార్యుడు. కార్మికులు ఒప్పుకున్నారు.

మహాద్వారం శిలలు పెద్ద పెద్దవి ద్వార బంధాల మీద ఎక్కించాలి. ఎందరు కార్మికులు ఎంత ప్రయత్నించినా అవి పైకి జరుగలేదు. సారువలు కట్టి పైకి తోశారు. అంగుళమైనా జరుగలేదు. హరిదాసనాయకునికి చాల బాధ కలిగింది. ఈ బాధలోనే నిద్రపట్టింది. నిద్రలో ఒక కల వచ్చింది — శిల్పాచార్యులతో సమాలోచించవలసిందని.

హరిదాస నాయకుడు లేచి, ఉదయం కాగానే టేంకణాచార్యుణ్ణి పిలి పించాడు. టేంకణాచార్యుడు కార్మికులు లోలోపల తమపై స్పర్థలతో

చేస్తున్న పనులు వివరించాడు. హరిదాసు అతని సమాశ్వాసపరచి, కార్మికుల ప్రసక్తి మాని, గోపురద్వార నిర్మాణం ఎలాగయినా పూర్తయ్యేట్లు చూడమన్నారు.

టేంకణాచార్యునికి శిలల నిద్రాకాలం తెలుసునట. ఆ కాలంలో అవి తేలికగా ఉంటాయట. అది గ్రహించి ఒళపుతో పనిచేస్తే, ఎంత పెద్ద గండ శిలలనైన ఎంత ఎత్తుకైనా ఎత్తవచ్చునట. ఈ సమయ సందర్భాలు తెలియక కార్మికులు బలవంతంగా రాళ్లు సారువలపై పైకితోయడం, అవి జారిపడడం, వాటివల్ల కార్మికులు దెబ్బతిని వికలాంగులు కావటం — ఈ ఉపద్రవాలు జరిగాయని ఆయన తెలిపాడట.

తర్వాత టేంకణాచార్యుడు ఒకరాత్రి అందరూ నిద్రపోతుండగా ఒక్కడే వెళ్లి ఆ గోపురం ద్వారం రాతి బండలను చేతితో తట్టి వాటి సంగతి తెలుసుకొని, నాజూకుగా, వాటిని ద్వారబంధం పైకి ఎక్కించి ఎప్పటిలాగా వచ్చి పడుకున్నాడట. తెల్లవారగానే గోపుర ద్వారం పూర్తియినట్లు అందరికీ కనిపించింది. సారువలమీది బండలు, క్రింద పడివున్న బండలు కనిపించ లేదు. ఊడ్చివేసినంత శుభ్రంగా వుంది. కార్మికులు ఆశ్చర్య పడ్డారు. నిజం తెలిసిన తర్వాత స్పర్థలు మానారు.

టేంకణాచార్యుని శిల్పవాస్తు చాతుర్యం గురించి మరికొన్ని గాథలూ వున్నాయి. తిరువాలంగాడు అనబడే షడారణ్యక్షేత్రం ప్రసిద్ధ శైవక్షేత్రాలలో ఒక్కటి. ఆరు సభాపతుల క్షేత్రాలలో తిరువాలంగాడు ఒకటి. తిరువాలంగాడు రత్నసభాపతి, చిదంబరం కనకసభాపతి, మధుర రజితసభాపతి. రామేశ్వరం తామ్రసభాపతి, కుర్తాళం చిత్రసభాపతి, ఆనంద తాండవ సభాపతి.

అలాటి తిరువాలంగాడు రత్నసభాపతి మందిర గోపురం ద్వారం మీద బండలు శిల్పి దృష్టే తగిలి పగిలి పోయాయట. గోపురం ఎప్పటికైనా కూలిపోతుందేమోనని భయం కలిగింది. అక్కడి శిల్పులు సలహాకోసం కంచికి బయలుదేరారట. అక్కడ వరదరాజస్వామి గోపురం ఉత్తరానికి ఒరిగింది. ఆ శిల్పి భయపడ్డాడు. ఆయన సలహా కోసం తిరువాలంగాడుకు

బయలుదేరాడు. ఇద్దరూ నాగలాపురంలో కలుసుకున్నారు. అక్కడ దేవా లయం ప్రాకార గోపురాదుల నిర్మాణం జోరుగా సాగుతున్నది. వారిద్దరూ ఒక మండపంలో పడుకున్నారు. అక్కడే టేంకణాత్యుడూ పడుకున్నాడు. వారిద్దరూ తమ తమ గోపురాల స్థితులు చెప్పుకుంటున్నారు. వరదరాజస్వామి దేవాలయ గోపుర శిల్పి మహాద్వార గోపురం ఉత్తరం వైపునకు ఒరిగిన సంగతి చెబుతున్నాడు. అది విని ముసుగుతన్ని పడుకున్న టేంకణాచార్యుడు "దక్షిణంవైపు పల్లంలేదా? అని ప్రశ్నించాడు. దానితో ఆ శిల్పికి, దక్షిణం వైపు పల్లం త్రవ్వి జాగ్రత్తగా ప్రవర్తిస్తే ఉత్తరం వైపు ఒరిగిన గోపురం సమ స్థితికి వస్తుందని గ్రహించాడు. తర్వాత తిరువాలంగాడు శిల్పి గోపురం బండలు పగలడం తెలిపాడు. అది విని, టేంకణాచార్యుడు "కందులు లేవా ?" అని ప్రశ్నించాడు. దానితో అతనికి కందుల బస్తాలు గోపుర ద్వారం అంతటా పేర్చి నీళ్లు చల్లితే కందులు రెండింతలు మూడింతలు ఊరి గోపు రాన్ని పైకి ఎత్తి పట్టుకుంటాయని, అప్పుడు పగిలిన బండలు తీసివేసి, మంచి బండలు అమర్చి గార పూయవచ్చునని స్ఫురించింది.

కృష్ణరాయలవారు ఈ పట్టణానికి నాగలాదేవి పురమని పేరు పెట్ట డానికి గల కారణాలను గురించి జనశ్రుతిని నాగలాపురం దేవాలయం మాజీ ధర్మకర్త శ్రీ ఏనుగు నారాయణస్వామినాయుడు తెలిపారు:—

కృష్ణరాయల తండ్రి తుళువ నరసరాజు దక్షిణ దిగ్విజయ యాత్ర నుంచి తిరిగి వస్తూ అరిగండపురం ప్రాంతంలో విడిశారట. అప్పుడు అరి గండంలో నాగమ్మ అనే సామాన్య వనిత వుండేది. ఆమె సుందరి, సుశీల. రాజుగారి రాణివాసానికి పరిచారికగా జనం కావలసి వచ్చారు. నాగమ్మ పరి చారికగా నరస భూపాలుని అంతఃపురంలో చేరింది. తర్వాత తన గుణ గణాలతో రాణిగారిని మెప్పించి ఆమెకు చెలికత్తె అయింది.

నరసరాజు విజయనగరానికి బయలుదేరినప్పుడు వారితోపాటు విజయ నగరానికి వెళ్లింది. అక్కడ ఆమె సౌందర్య సౌశీల్యాలకు నరసరాజు ముగ్ధుడై ఆమెను తన దేవిగా చేసుకొన్నాడు. నాగమ్మ స్వస్థలం నాగలాపురం కావడం

వల్లనే, కృష్ణరాయలు అరిగండపురానికి తన తల్లిపేరు పెట్టాడు. ఇది నేడు నాగలాపురంలో పెద్దలు చెబుతున్న సంగతి. దీనిలో నిజం వుండవచ్చు.

నాగలాపురం దేవాలయాన్ని దర్శించినప్పుడు విజయనగర సామ్రాజ్య వైభవం ఎవ్వరికైనా కనులగడుతుంది. విజయనగర వాస్తుశిల్పాల విశిష్టత సామ్రాజ్యవైభవ ప్రాభవాలకు అనుగుణంగా అంబరచుంబిత గోపురాలు, దిక్కులను అరికట్టాలని అనుకుంటున్నట్టున్న మహోన్నత ప్రాకారాలు, ఆకాశాన్నే ఎత్తి పట్టుకొనడానికి ఉద్దేశించాయా అన్నట్టున్న మహాకాయ సింహస్తంభాలు, కనుచూపుమేరకూ సాగిపోయే మండపాల బారులూ, ఉన్నత ప్రమాణంగల గోపుర ద్వారాలు మొదలయినవి. విజయనగర సార్వభౌములు తాము జయించిన ప్రాంతాలన్నిటా కనిపించిన దేవాలయాలన్నిటినీ అగడ్తలతో, ప్రాకార కుడ్యాలతో, మహాద్వార గోపురాలతో అలంకరించి వాటిని అంతఃపురాలుగాను, మహానగరాలుగాను తీర్చారు.

విజయనగర సార్వభౌముల సంకల్పానికి అనుగుణంగానే వారి శిల్పులు గూడ మహాప్రతిభా శాలులు. వారికైవాడానికీ కైవారంచేయని శిలలంటూలేవు. తమ శిల్పాలను గండరించడానికి మూలపదార్థాలకోసం వారు మారుమూల దేశాలకు వెళ్లలేదు. ద్వీపాంతరాలకు పయనం కట్టలేదు. చంద్రకాంత శిలలే కానక్కరలేదు. ప్రాచీన శిల్పాచార్యులు పురుషశిలగా నిర్వచించిన నల్లరాయి అవసరంలేదు. నలుగురూ నడిచితొక్కే నాపరాళ్లను గూడ వారు అపురూప శిల్పాలుగా చెక్కారు. ఉలి తగిలితేనే చెక్కులురేగి, నొక్కులుపోయి, లొత్తలుపడే అధ్వాన్నపు రాళ్లు వారి చేతులలో మైనపుముద్దలై చెప్పినట్టు విన్నాయనిపిస్తుంది.

విజయనగర సామ్రాజ్యంలో కొండలకు కొదువలేదు. తాటినిలువు స్తంభాలు, గజం వెడల్పు, గజన్నర ఘనం బండల వరుసలు, ఆరేడు నిలువుల ఎత్తు అతుకులు లేని ద్వారబంధాలు చూస్తుండగా, కొండలే కార్మికుల సమ్మెటపోట్లకు భయపడి, శిల్పాచార్యుల శిల్పపు మురుపులు సంత రించుకొందామని ఆశపడి, తమను నానా రూపాలలో అర్పించుకొన్నట్టు

తోస్తుంది. శిలారహస్యం తెలియకపోతే విజయనగర శిల్పులు తమ శిల్పవాస్తు సౌందర్య విలాసాలను విజయనగర సామ్రాజ్యమంతటా ఇంతగా విరజిమ్మడం సాధ్యమయ్యేదికాదేమో! విజయనగర శిల్పుల ఈ విజయపతాకాలలో ఒకటి నాగలాపురం దేవాలయమని చూపరులు ఎవ్వరైనా గ్రహించగలరు.

నాలుగువైపులా మహాద్వారాలతో ఉన్న నాగలాపురం వేదనారాయణ స్వామి దేవాలయం వోరుగల్లులోని శంభులింగేశ్వర దేవాలయాన్ని పోలి వుంటుంది. పాశ్చాత్య యాత్రికుడు ఫెర్గూనన్ వోరుగల్లు శంభులింగేశ్వరస్వామి దేవాలయాన్ని నాలుగువైపులా మహాద్వారాలున్న సాంచీస్తూపంతో పోల్చాడు. ఆయన నాగలాపురం దేవాలయం చూచివుంటే, దేనితో పోల్చేవాడో! సాంచీ స్తూపం చతురస్రాకారం. నాగలాపురదేవాలయం దీర్ఘచతురస్రాకారం.

ఈ దేవాలయం విస్తీర్ణం 12 ఎకరాలు. పూర్వం మరొక ప్రాకారం ఉండేదట. దాని మహాద్వారం చట్రం రాతిస్తంభాలు రెండు నేడు పోలీసు స్టేషన్ ప్రక్కన నిట్టనిలువున కనిపిస్తాయి. దేవాలయం పశ్చిమాభిముఖంగా వుంది. మహాద్వారం - పశ్చిమద్వారం - నుంచి పూర్వ ద్వారం వరకు నిడివి దాదాపు 630 అడుగులు. దేవాలయ వెడల్పు 280 అడుగులకు పైగా. నాలుగు మహాద్వారాల ఎత్తు దాదాపు 35 అడుగులు. మొదటి మహాద్వారగోపురం పాతు 61 అడుగులు. రెండవ మహాద్వారం గోపురం పాతు 32 అడుగులు.

దేవాలయం ఎత్తయిన వేదికపై కట్టబడింది. ఇది పూర్వం హొయిసళుల, కాకతీయుల సంప్రదాయం నుంచి వస్తున్నది. ఆలయాన్ని మూడు ప్రధాన విభాగాలుగా విభాగించి చెప్పవచ్చు. (1) గర్భాలయం, (2) దాని ముందు అంతరాళం, ముఖమండపం, ముఖమండపంలో గర్భాలయానికి ప్రదక్షిణమార్గం. ఈ అంతరాళాన్ని హొయసళులు శుకనాసం ఆలయం, (3) ముఖమండపం తర్వాత మహామండపం, దీనిని నవరంగమని కూడా అంటారు. దీనిలోనే ఉత్సవవిశేషాలలో ఉత్సవమూర్తులను వేంచేపుచేయిస్తారు. ఈ మహామండపం స్తంభాలు కళామయాలు. మహామండపం ఇవతలి ద్వారం నుంచి అవతలి ద్వారంవరకు ఐదువైపులా వరుసగా ఉన్న సింహస్తంభాలు,

వాటి ఆధారంగా ఉన్న నాసికా ప్రతిమలు (బ్రాకెట్ ఫిగర్స్) అత్యపూర్వ శిల్ప విలసితాలు.

రెండవ మహాద్వారంనుంచి మహామండపానికి ఉన్నమేర 100 అడుగులు మహామండపానికీ, వేదనారాయణ స్వామి పాదాల వరకు నిడివి 140 అడుగులు. రెండవ గోపురం వెలుపలి ద్వారం నుంచి మొదటి మహాద్వార గోపురం లోపలి ద్వారం వరకు నిడివి 126 అడుగులు. ఈ నిడివి వెడల్పులను ఇంతగా వివరించడానికి గల కారణాలను తర్వాత చెబుతాను.

వేదనారాయణస్వామి ఆలయం పశ్చిమాభిముఖం. వేదవల్లీ దేవి ఆలయం పూర్వాభిముఖం. మహాద్వారంనుండి వేదనారాయణస్వామి మూల విరాట్ విగ్రహం వరకు ఏడుద్వారాలున్నాయి. నాలుగు ద్వారగోపురాలు, మొదటి పడికావలి గోపురం, మహామండపం ద్వార గోపురం, రెండవ మహాద్వారగోపురం ఎడమప్రక్కన రామాలయగోపురం, వేదవల్లీదేవి ఆలయ విమానం—మొత్తం తొమ్మిది గోపురాలు.

మహామండపం ప్రాకారం వెలుపలివైపు శిల్పాలు ఎన్నదగినవి. మూలవిరాట్టు వేదోద్ధారకుడైన మత్స్యావతారమూర్తి గనుక, మత్స్యావతార గాథ మహామండపం కుడ్యం వెలుపలి భాగాన పాతుమీద, పైన వరుసగా చెక్కబడింది. మామూలు రాతిలో అంతటి సౌకుమార్యం తీసుకొని రావడం నాగలాపురం శిల్పికే చెల్లింది. కుడ్యం వెలుపల నాలుగు వైపులా ఇలాటి చిత్రాలున్నాయి. ఉత్తర కుడ్యం మీద మత్స్యావతార గాథ పూర్వకుడ్యం మీద విష్ణు దశావతారలీలలు, దక్షిణ కుడ్యంమీద కృష్ణలీలలు, పశ్చిమ కుడ్యం మీద సప్తతాళచ్ఛేదనంవంటి రామాయణ గాథలు చెక్కబడ్డాయి.

గర్భాలయ ప్రదక్షిణ మార్గంలోని శిల్పాలు మరీ హృదయ చోరకంగా వుంటున్నాయి. గోపికా వస్త్రాపహరణ గాథ ఎంతచిత్రంగా అడుగుమేర వరుసలలో నాపరాతిలో శిల్పి ఎలా చెక్కాడో ఆశ్చర్యమే. దానిలోను కృష్ణుని

చిలిపితనం, గోపికల నునుసిగ్గు దొంతరలు మొదలయిన సున్నితమైన భావాలు నాపరాయిలో రావడం ఎవరైనా ప్రశంసించవలసిందే.

గర్భాలయ ప్రదక్షిణ మార్గంలో గర్భాలయ కుడ్యాలలోని గూళ్లలోని శిల్పాలు విశేషంగా ప్రశంసార్హమైనవి. వీణా దక్షిణామూర్తి విగ్రహంలోని విన్నాణం మనలను ముగ్ధులను చేస్తుంది. ఈ విగ్రహాలు నాపరాతివి కావు. మరొక విధమైన ఇసుకరాయివని తోస్తుంది.

విష్ణ్వాలయంలో శైవ సంప్రదాయపు విగ్రహాలేమిటా? అని వైష్ణవులు విస్తుపోవచ్చు. మాదేవుడు గొప్పంటే మా దేవుడు గొప్పఅనే పెనుగులాట పూర్వంలేదు. విష్ణు సర్వోత్తమత్వం అంగీకరించేవారు గూడ శైవ దేవతలను విష్ణు అంగ దేవతలుగా పరిగణించి విష్ణ్వాలయాలలో నిలిపేవారు.

ముఖ్యంగా రాష్ట్రకూటులు ఈ అభేదాన్ని హెచ్చుగా పాటించారు. వారు శివ కేశవు లిద్దరికీ ఆలయాలు నిర్మించారు. కాకతీయులూ హొయ సళులు తాము అభిమానించిన దైవం ఏదైనా ఇతర దైవాలను వహించారు. విజయనగరరాజులూ అంతే.

రాష్ట్రకూటులు విష్ణు దేవాలయాలలోను దిగ్దేవతలుగా గర్భాలయ ప్రాకారకుడ్యాలు వెలుపల గూళ్లలో ఇతర దేవతామూర్తులను నిలిపేవారు. దక్షిణకుడ్యంలో గూళ్లలో జ్ఞాన దక్షిణామూర్తిని, నటనగణపతినో లేక నాగ బంధ గణపతిని, ఉత్తరకుడ్యం గూళ్లలో బ్రహ్మను, దుర్గను, పూర్వకుడ్యంపై విష్ణు అవతారాలలో ఏదో ఒక అవతారాన్ని నిలిపేవారు. ఇది కడలూరు సమీపంలోని బహూర్‌లోవున్న మూలనాథస్వామి ఆలయంలో కనిపిస్తుంది.

నాగలాపురం శిల్పాచార్యుడు ఈ సంప్రదాయాన్ని అనుసరించాడేమో నని అనిపిస్తుంది. సరిగా అక్కడిలాగే వేదనారాయణస్వామి గర్భాలయ కుడ్యాల గూళ్లలో ఈవిగ్రహాలు నిలిపాడు--తూర్పు కుడ్యం మీద భూవరాహ స్వామి, ఉత్తరకుడ్యంమీద వీణావాణి దక్షిణామూర్తి, నిలుచున్న గణపతి, ఉత్తరకుడ్యంమీద దుర్గ, బ్రహ్మలను.

విజయనగర దేవాలయాలంతటా ఈ పద్ధతి కనిపించదు. ఏవో చెదురుగావున్న విగ్రహాలను చెడిపోకుండా ఈ గుళ్లలో అమర్చారనడానికి వీలులేదు. వాటిని అమర్చిన మీదటే, ఒక పద్ధతిగా గోడ కట్టినట్లు కనిపిస్తుంది. దీనికి రాష్ట్ర కూటులనే సంప్రదాయం మనకు ఉండనే వుంది.

సుమారు 80 సంవత్సరాల క్రితం శ్రీ బాలిరెడ్డి అనేవారు ఈదేవాలయానికి ధర్మకర్తగ వుండేవారట. ముఖ మండపానికి ఇరువైపులా కర్రతో తాటించగా, లోపల బోలు ధ్వని వినిపించిందట. అతడు తవ్వించగా, చక్కని బిలాలు, వాటిలో ఆళ్వారాచార్యులు, ఆండాళ్, లక్ష్మీనారాయణులు మొదలైన విగ్రహాలు రాగివి దాదాపు 30, 40 దొరికాయట. వాటిని పుళికాపు చేయించి పెట్టించారు. వాటిలో ఆండాళ్ విగ్రహం అపూర్వమని, ఆండాళ్ జన్మక్షేత్రమయిన శ్రీవిల్లిపుత్తూరులో తప్ప మరెక్కడా ఇలాటిది లేదని దేవాలయ అర్చకులు శ్రీ దామోదర భట్టాచార్యులు, మాజీ ధర్మకర్త శ్రీ ఏనుగు నారాయణస్వామినాయుడు తెలిపారు.

తాండవకృష్ణుని బాల తొడుగును పోత పోసిన శిల్పికి ఎంతటి బహుమానమైనా ఇవ్వవచ్చు.

మహామండపంలోని స్తంభాల శిల్పాలు, ప్రవేశ మార్గం ఇరు వైపులామున్న స్తంభాల సింహ ప్రతిమలు, వాటిమీది నాసికా ప్రతిమలు గొప్పవని ఇదివరకే అన్నాను. నాసికా ప్రతిమలు కేవలం అలంకారప్రాయమైనవే. కాని స్తంభాగ్రాలపై ముంజూరులో వ్రేలాడుతున్నట్టివి. వీటిపైన కప్పు ఆధారపడదు. ప్రధాన స్తంభ భాగానికి అలంకారంగాను, చూపరులను ఆకర్షించేవిగాను వుంటాయి.

సింహాలను స్తంభాలకు చెక్కడం, స్తంభాన్నే పైకి ఎగిసే సింహాకృతిగానో, గజాధిష్ఠిత సింహాకృతినో, సింహాధిష్ఠిత గజాకృతులనో చెక్కడం మనదేశంలో, ముఖ్యంగా దక్షిణాపథంలో పల్లవుల కాలంనుంచి వుంది. పల్లవులు దీనిని బౌద్ధంనుంచి, అమరావతినుంచి ధర్మ చక్రాన్ని బౌదల

దాల్చిన సింహ శిల్పాల నుంచి గ్రహించారని అంటారు. కాని, సింహం రాజసానికి, పౌరుషానికి చిహ్నం గనుక, పల్లవులకు, తదనంతరం తక్కిన దక్షిణాపథరాజులకు ఉపాధేయమయి ఉంటుంది. పల్లవ శిల్పాల సింహాలకూ, విజయనగర సింహాలకూ భేదం వుంది. పల్లవ సింహాలు కూర్చున్నట్లు, తలపై నుంచి స్తంభాన్ని నిలువునా మోసుకొన్నట్లుంటాయి. విజయ నగర సింహాలు ప్రపంచాక్రమణకు వెలువడినట్టుగా ముందు కాళ్ళు పైకెత్తినట్టు వుంటాయి. పల్లవ సింహాలలో గాంభీర్యం కానవస్తే, విజయనగర సింహాలలో విజిగీష, వేగాతిశయం కానవస్తాయి.

మహామండపం కప్పు మధ్యన రాసలీలను అతి సహజంగా చెక్కాడు శిల్పి. ప్రతిమలు కడుంగడు చిన్నవి కావడంవల్లను, పైన సున్నం కొట్టడం వల్ల భావాభివ్యక్తి మరుగైపోయి, సహృదయుని మనస్సును చివుక్కుమనిపిస్తుంది.

నాగలాపురం శిల్పాచార్యుడు మానవ మనస్తత్వం చిత్రీకరించడంలో మొనగాడయినట్టే పశువులను చిత్రించడంలోను పటువు. ముఖమండపం లోపలి స్తంభాలమీద చెదరుగా వివిధ పశువుల శిల్పాలున్నాయి. ఒక గేదె వెనుక కాలిగిట్టను నాకుతున్నట్టు చెక్కిన శిల్పాన్ని గేదెలు, ఆవులు చూచినా, ఆశ్చర్యపడుతా యని నా నమ్మకం. సింహాల వివిధ భంగిమలు, గోపాలుని వేణునాదం విని మోరలెత్తి పరుగెత్తే ఆలమందల శిల్పాలు సహజంగా ఉన్నాయి.

చాపల్యానికి పేరుపడిన మర్కటం కళాకారులను మొదటినుంచే ఆకర్షించినట్టు కనిపిస్తుంది. ఒక్క లిప్తకాలమన్నా మిన్నకుండా ఉండలేని కోతి చేష్టితాలను గండరించడం తమ భావుకతకు, పనితనానికి పరీక్ష అని అనుకున్నారేమో ఆ శిల్పులు! పల్లవ శిల్పి మహాబలిపురంలో చెక్కిన మర్కట శిల్పం - తల్లికోతి తన పిల్లను ఒడిలో కూర్చోబెట్టుకుని పేలు చూస్తున్నట్టు చెక్కినది - సహృదయులకు ఎన్నటికీ మరుపురాదు. రాష్ట్రకూటశిల్పి దీనిని అనుకరించాడో, లేక స్వతహాగా వూహించాడో దక్షిణ పినాకినీ తీరంలో

కడలూరుకు ఉత్తరంగా ఏడు మైళ్లలోవున్న బహూర్‌లోని శ్రీ మూలనాథస్వామి ఆలయంలోను ఇలాటి మర్కటశిల్పమే ఉంది. కాని, రాష్ట్రకూటశిల్పి కొంత వన్నెచిన్నెలు తెచ్చారు.

విజయనగర శిల్పికి మర్కట లీలలు చిరపరిచితాలు. విజయనగర ప్రాంతం కిష్కింధాపట్టణమని పురాణ ప్రసిద్ధి పొందినట్టిది. కిష్కింధలో అలనాటి వాలీసుగ్రీవులను పోలిన మహాకాయ మర్కటాలు, కొండముచ్చులు, ఎలుగులు మందలు మందలు. అందువల్ల వాటి చేష్టలను అతడు బాగా ఆకళించు కొన్నాడనడం చర్వితచర్వణం.

నాగలాపురం దేవాలయం మహామండపం పురోభాగం మీది చూరు ఎడమకొనలో ఒక కోతిని చెక్కాడు, విజయనగరశిల్పి. ఎవరో తనను కవ్విస్తే కొరకొరలాడుతూ వానిపైన పడడానికి ఉంకిస్తున్నట్టు ఉన్నాడా వానరుడు. దూకనున్న భావాన్ని తెలుపడానికి మర్కటం పూర్వకాయం దీర్ఘీకృతమైంది. పశ్చార్థం వెనుక కాళ్లు బిగువ దన్నడంతో కుంచితమై కటిభాగం పైకిలేచింది. పట్టపగలు ఏమరుపాటున భక్తజనం దానిని చూస్తే నిజంగానే కోతి మీద పడడానికి వచ్చిందేమో ప్రసాదం కోసమని భ్రాంతిపడుతారు. ఈ మర్కటాన్ని చెక్కిన బోదెరాయి కూడా సామాన్యపు నాపరాయే కావడంవల్ల కోతి ఒంటి రంగు కూడా అనుషంగికంగా తెచ్చాడా శిల్పి అనేభావం కలుగుతుంది.

విజయనగర నర్తకీ శిల్పాలు అంతకు ముందున్న నర్తకీ విగ్రహాల సౌందర్య విలాస సర్వస్వాలని నేనంటాను. వాటిలో పల్లవపద్ధతి, రాష్ట్రకూటుల రాజసం, హొయసలుల నగిషి, కాకతీయుల ధీరోదారత మేళవించి పోయాయి. నాగలాపురం శిల్పాచార్యుడు నాలుగు దిక్కులవున్న గోపుర ద్వారబంధాలకు ఇరువైపులా, మొదటి పడి కావలి గోపుర ద్వారబంధాల మీద ఇరువైపులా చెక్కిన నర్తకి, విజయనగర శిల్పసంపదకే పరాకాష్ఠ. ఈమెను నాగిని అని కొందరన్నారు. నేను నాగనర్తకి అంటాను. ఈ నర్తకి నిలువెత్తున సాక్షాత్తూ మానవమూర్తిగానే మనకు దర్శనమిస్తుంది. అవయవాలు ఆదర్శ ప్రాయాలు. సన్నని నడుము, పెద్ద బిగువైన చనుకట్టు, విస్తృతమైన

నితంబం, అందంగా ఆకుంచితమైన పాదాలు, పాదాలమీద ఊరువులమీద చీరకట్టు మడతలు, ప్రక్కన వ్రేలాడే చీరకుచ్చెళ్లు, జఘనాలంకరణలు, మెడలోని బన్నసరాలు, చెవులకు పెద్ద తాటంకాలు, ఎత్తికట్టి రత్న హారాలతో బిగించిన సిగముడి, పిరుదుపై ఆనించిన చేతిహొయలు, కొద్దిగా విచ్చిన ఓష్ఠపుటం నుంచి కనిపించే మల్లెమొగ్గల పలువరస, మందహాసంతో ఉబ్బిన కపోలాలు, సంభ్రమాశ్చర్యాలు ప్రదర్శించే భ్రూలతానిక్షేప సుందరమైన చూపు ఓహ్!-బేలూరు నాట్య భారతిని ఈమె మించి పోలేదా? బేలూరులో హొయసలశిల్పి విష్ణువర్ధనుని దేవేరి శాతలాదేవిని తార్కాణగా శిల్పించాడని పెద్దలంటారు. నాగలాపురశిల్పి, సౌందర్య సౌశీల్యాలకు మూర్తిమత్త అయిన నాగలాదేవినే మనసులో పెట్టుకొని ఈ విగ్రహాలను గండరించాడా? ఏమో?

ఇక మహా మండపంలోని నర్తకీ శిల్పాలు గర్భాలయ ప్రాకార కుడ్యాల వరుసలోని నర్తకీమణులు, వివిధ భంగిమలలో వున్నారు. ఒక నర్తకి ఆలీఢ పాదంతో రౌద్రబీభత్సాలు ప్రదర్శిస్తున్నది. ఒకతె మృదంగ రవాను గుణంగా ఆడుతున్నది. మరి యిద్దరు ఒక నర్తకునికి ఇరు ప్రక్కల నిలబడి ఆడుతున్నారు. ముగ్గురికీ కలిపి నాలుగేకాళ్లు. మార్చి మార్చి అన్వయించుకుంటే శిల్పిచాతుర్యం తెలుస్తుంది.

గోపుర ద్వారాల ద్వారబంధాలమీద నాగ నర్తకీమణుల పైన లతా వలయాంతరాలలో దశావతారాలు, కృష్ణలీల, ఇతర దృశ్యాలు శిల్పి లోకవృత్త పరిశీలన పాండిత్యాన్ని చాటుతున్నాయి. కృష్ణుడు బకాసురుణ్ని నోరుచీల్చి ఎలా చంపుతున్నాడో ఒక్క అడుగులోపు వలయంలో మనం నేడు సినిమాలో చూచినట్టు చూడవచ్చు. అలాగే ఈ వలయ పంక్తిలోని బొమ్మలన్నీ త్రిడైమెన్షన్ చిత్రాల బొమ్మలాగా కనిపిస్తాయి.

నాగలాపురం శిల్పి దశావతార శిల్పాల పంక్తులను చాల చోట్ల రకరకాలుగా చెక్కాడు. దీనికి కారణం తన సమకాలంలోని రాయలు,

ఆయన ఆస్థానకవులు దశావతారాలను ఒకరు చెప్పినట్టు మరొకరు చెప్పకుండా వర్ణించిన తీరు తీయములే అయి వుంటుంది.

అన్ని దేవాలయాలలోలాగే నాగలాపురం దేవాలయంలోను అశ్లీల శిల్పాలూ ఒకటి రెండు ఉన్నాయి. నాకు తెలిసినంతవరకు, నేను గాలించి నంతవరకు చాల అశ్లీలమైంది స్త్రీది ఒక్కటి, సింహంది ఒక్కటి - మొత్తం రెండే కనిపించాయి.

నాగలాపుర దేవాలయం అంతరాళ ద్వారం వద్ద వున్న పాత దీప స్తంభం గురించి ప్రత్యేకంగా చెప్పాలి. ఇది ఐదారడుగల ఎత్తున్నది. సుమారు రెండు కిలోల నూనె సులభంగా పట్టగలదు. దీప శిల్పాలు మనకు వేనకువేలు. దీపస్తంభాలు, దీప వృక్షాలు, దీపలతులు, దీప నాగినులు, దీప సుందరులు, దీపసింహాలు — ఒక్కటేమిటి? ఇలాటివి ఎన్నో? ఈ దీప స్తంభంలో శిల్పవిశేష మేమీలేదు కాని, ఒక్క విశేషముంది. కింది కుదురు కంచు, నూనెపోసే భాగం కంచు, స్తంభంలో క్రింద, పైన కొంత కంచు. తక్కినది కర్ర. మరకంటే ఈ పద్ధతి సులభమని శిల్పి భావించి వుంటాడు.

ఈ దేవాలయంలోని అపూర్వ వాస్తుచాతుర్యం మరొకటుంది. అది ఒక నెలలో మూడు దినాలపాటు మహాద్వారంనుంచి ప్రవేశించిన ఎండ మూలవిరాట్టుపై ప్రసరించడం. వాస్తునిపుణుడు దీనిని గొప్పగాఊహించాడు. దేవాలయ గర్భగృహం ప్రాచీనమైంది. పశ్చిమాభిముఖంగా వుంది. దానికి వాస్తు శాస్త్రరీత్యా విశిష్టత చేకూర్చదలచాడు వాస్తు పండితుడు. మొదటి మహా ద్వారం నుంచి మూల విరాట్టున్న స్థలం వరకు ఏడు ద్వారాలు పెట్టాడు. ఇవి క్రమంగా మొదటి ద్వారంకన్నా రెండవది, రెండవదానికన్నా మూడవది అలా వరుసగా ఏడూ ఒకదానికన్నా మరొకటి చిన్నవిగాను, ఎత్తుననూ అమర్చాడు. సౌరమానం ప్రకారం మీనమాసం 12, 13, 14 తేదీలలో (చాంద్రమానం ఫాల్గుణాంతంలోనో, చైత్రమాసాదిలోనో) — మార్చి 26, 27, 28 తేదీలలో — సాయంకాలపు ఎండ మొదటి నాడు మూలవిరాట్టు పాద పద్మాలను, రెండవ నాడు మూలవిరాట్టు నాభీకమలాన్ని, మూడవ నాడు ముఖ

కమలాన్ని స్పృశిస్తాయి. ఈ ఎండ మొదటి మహాద్వార గోపురం నుంచి దాదాపు 600 అడుగుల పొడవున ఏలాటి ఆటంకమూ లేక మూలవిరాట్టు పాద, నాభి, ముఖ కమలాలను స్పృశించడమనేది గొప్ప ఇంజనీరింగు - వాస్తు శాస్త్ర - నైపుణ్యపు సాహస కృత్యం.

ముఖ్యమైన సంగతి మరచాను. మూలవిరాట్టు విగ్రహం శిలామయమో, జగన్నాధ క్షేత్రంలోలాగ దారుమయమో, తిరుపతి గోవిందరాజస్వామి విగ్రహంలాగా ఇష్టికామయమో కాదు. సుధామయమని పెద్దలు అంటారు. తిరువేంకటనాధుడు వారాని కొకమారు శుక్రవారం సుగంధి తీర్థంతో మజ్జనమాడుతాడు. కానీ, వేదనారాయణస్వామి నిరంతరం సముద్రనీరంలో వుండే మీనావతారుడైనా తిరుమంజనం చేయడు. ఎందుకంటే ఆయన సుధామూర్తి — సున్నపురాతి విగ్రహం. జలకమాడితే కరిగిపోతాడు. కనుక ఆయనకు తైలాభిషేకమేగాని, జలాభిషేకంలేదు.

ఇదంతా నాటి నాగలాపురం వైభవగాథ. ఇక ఇప్పటి విషాదగాథకు వద్దాము.

నాగలాపురం దేవాలయపు * నేటి విషాద పరిస్థితికి బీజాలు కృష్ణరాయల అవసాన దశలోనే పడ్డాయి. కృష్ణరాయల అవశాన స్థితికి ముందే ఈ దేవాలయాభివృద్ధికోసం రేయింబవళ్ళు శ్రమించిన కృష్ణరాయ హరిదాస నాయకుడు, అతని జ్యేష్ఠ సోదరుడు వడమల్లైయణ్ణ మరణించారని ఇదివరకే తెలుసుకున్నాము. కృష్ణరాయ నాయకుని కాలంలో వున్న దేవాలయ పూజా పురస్కారాలు, ఇతరులకు మర్యాదలు ఇప్పుడూ జరుగ వలసిందని రాయల వారి అంత్యదశలో దేవాలయం రెండవ గోపురద్వారం కుడిప్రక్కన, వేద నారాయణస్వామి గర్భాలయ కుడ్యానికి మూడువైపుల రెండు వరుసలలోను

---

* ఈ విషాదగాథ, నేడు వినోదగాథగా మారిపోయింది. తి. తి. దే. వారు యీ ఆలయాన్ని తీసుకొని 13 సంవత్సరాలయింది. గర్భాలయ గోపురపునర్నిర్మాణం, మండప నిర్మాణం నూతన ధ్వజస్తంభం, ఇలాంటి అభివృద్ధికర పనులెన్నో చేసినారు — ఇప్పుడూ చేస్తున్నారు. ఆ సంగతులన్నీ నే నిదివరకే వ్రాశాను. పాఠకులు గమనింప ప్రార్థన. ఇందు వర్ణితమైన దృశ్యాలు 13 సంవత్సరాల మునుపటివి. పాఠకులు గ్రహింపగలరు — గోపీకృష్ణ.

చెక్కిన కన్నడ శాసనంబట్టి వారిరువురూ మరణించివుంటారని, అందువల్లనే అలాటి శాసనం క్రీస్తుశకం 1529 జనవరి 13 వ తేదిన వేయించబడిందని తెలుస్తున్నది.

విజయనగర రాజ్యం కల్లోలంలో వుంది. నిరంతరం యుద్ధాలు, అంతర్యుద్ధాలు చెలరేగాయి. అళియ రామరాజుకు యుద్ధాలతో సరిపోయింది, గాని, దేవాలయాల పునరుద్ధరణ, దేవాలయ నిర్మాణాలను పూర్తి చేయడం ఎక్కడ? తర్వాత 50 సంవత్సరాలకు శ్రీరంగ దేవరాయల కాలానికి కూడా ఇది పూర్తి కాలేదు.

విజయనగర పరిపాలన తర్వాత ఇది ఉపేక్షితం కావడం, ఆర్కాటు నవాబుల కాలంలో శ్రీ నంబూరి కేశవాచార్యుల ద్వారా మరల పూజాదులు పొందడం. కుంఫిణీ కాలంలోను అటు తర్వాత, ఇప్పుడు ప్రభుత్వం నుంచి రూ 811–25 లు తస్దిక్ గ్రాంటులు పొందడం తెలుసుకున్నాము.

1967 కు పూర్వం దేవాలయ ధర్మకర్తగా వున్న శ్రీ ఏనుగు నారాయణస్వామి నాయుడు ఈ దేవాలయాన్ని పురజనుల సహాయంతో శుభ్రపరచారు. మొదటి మహాద్వార గోపురం మీద, తక్కిన గోపురాల మీద, దేవాలయంలో మండపాలలోను, పెరిగిన ముళ్లపొదలను తీయించివేసి, కూలిపోయిన మంటపాల రాళ్లను, పక్కకు నెట్టి నేల బాగు చేయించి ఒక రూపానికి తెచ్చారు.

ఈ దేవాలయాన్ని తిరుమల తిరుపతి దేవస్థానంలో చేర్చడం న్యాయంగా వుంటుందని ఆందోళన ప్రారంభించి 1966 లో ఆంధ్రప్రదేశ్ మంత్రులకు, ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపారు. ఆయన 1966 జనవరి 21 వ తేదిన అప్పటి ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయ సంస్థ సెలెక్ట్ కమిటీ సభ్యులు, మంత్రి అయిన శ్రీ పి. వి. నరసింహారావు గారికి అందజేసిన నివేదికలోని భాగాలను కొన్నిటిని ఉదాహరిస్తాము.

"ప్రస్తుతం ఈ దేవాలయానికి రూ 811–25 వార్షికమైన తస్దిక్ గ్రాంటు ఇస్తున్నారు ప్రభుత్వం వారు ఇది వారంరోజుల పూజపురస్కారాలకు, దేవాలయ నిర్వహణకైనా చాలదు. ప్రస్తుతం దేవాలయం పూజాధికాలు భక్తుల ఉభయాల మీద నడుపుతున్నాము. ఆంధ్రప్రదేశ్ దక్షిణ సరిహద్దులో ఇది గొప్ప వైష్ణవ దేవాలయం. చారిత్రకమైనది, వాస్తుశిల్పాల సంపద గలది. కాని పూర్తిగా ఉపేక్షితమైనది. కొన్ని శతాబ్దాలుగా గాలికి, ఎండకు నిలబడిన అసమగ్రమైన గోపురాలు గూడా నేడు బీటలువారుతున్నాయి.

"ఈ దేవాలయం వైఖానస సంప్రదాయ ప్రకారం పూజలు పొందుతున్నది గనుక, తిరుమల తిరుపతి దేవస్థానం వారు దీనిని స్వీకరించి పునరుద్ధరించవలసిందని కోరుతున్నాను. ఈ పునరుద్ధరణ గోపురాలు పూర్తిగా కూలిపోయేలోపుగానే జరగాలి. ప్రస్తుతం సెలెక్ట్ కమిటీ పరిశీలనలోవున్న బిల్లులోని దేవాలయాల జాబితాలో నాగలాపురం దేవాలయాన్ని గూడా చేర్చాలని కోరుతున్నాను.

"సెలెక్ట్ కమిటీ ఈ దేవాలయాన్ని తనిఖీచేసి జాబితాలో చేర్చడం సముచితం. ఈ విధంగా చేస్తే సెలెక్ట్ కమిటీ ఈ దేవాలయ పునరుద్ధరణకు ఎంతో సేవచేసినట్లవుతుంది."

ఈలాటి పెక్కు అభ్యర్థనలపై ఈ దేవాలయ నిర్వహణను తిరుమల తిరుపతి దేవాలయం వారు 1967 ఏప్రిల్ 29 తేదీన స్వీకరించారు. కాని ఇది తాత్కాలికమేనని, సంవత్సరం పరిశీలన తర్వాత శాశ్వతంగా నిర్వహించడం విషయమై ఆలోచిస్తానని దేవాలయధర్మకర్తృత్వ సంఘం అభిప్రాయపడింది.

సంవత్సరం రోజులూ ఉత్సవాలు సక్రమంగా సాగాయి. కాని ఎందుకో తిరుమల తిరుపతి దేవాలయంవారు దీని నిర్వహణ సాధ్యంకాదని సంవత్సరం తర్వాత నిర్ణయించారు. కాని, ఇప్పటి దేవాదాయధర్మాదాయ మంత్రి శ్రీ రుద్రరాజురామలింగరాజుగారు ఈ దేవాలయ పునరుద్ధరణకు ప్రజల

తోడ్పాటుతో కృషిచేయవలసిందిగా చిత్తూరుజిల్లా కలెక్టరుకు ఉత్తరువు చేశారు. తిరుమల తిరుపతి దేవాలయం నిర్వాహణలో వున్న దేవాలయాన్ని నిర్వాహణ నుంచి తీసివేయడం తగదని, నిర్వాహణ కొనసాగించడం మంచిదని తాము దేవస్థానం అధికారులకు సలహాయిచ్చామని మంత్రి శ్రీ రామలింగరాజుగారు ఒక సందర్భంలో తెలిపారు.

ఈ దేవాలయంలో ఉత్సవాలకు, నిత్యసేవలకు, వేద, దివ్యప్రబంధ పారాయణాలకు, నాట్య శిల్పాలకు, కృష్ణదేవరాయలు, ఆయన దేవేరి తిరుమలాంబ, తదితరులు వందలకొలది గ్రామాలిచ్చినా అవన్నీమాయమై పోయాయి. అర్చకత్వం, వాద్యగాళ్లు, మరికొందరు మాత్రం వారసత్వపు ఇనాము భూములు అనుభవిస్తున్న కృతజ్ఞతతో సేవ చేస్తున్నారు. పరిచార కునికి ఒక పడిబియ్యం, కొద్దిగా డబ్బు — ఇది జీతం. రెండుసార్లు దేవాల యంలో పడి ప్రసాదం నివేదన అవుతుంది. ఒక దాననంబి వున్నాడు.

తిరుమల తిరుపతి దేవాలయం నిర్వాహణస్వీకరించే వరకు సంవత్సర మంతా వుత్సవాలు భక్తుల ఉభయాలతో జరిగేవి. ఉత్సవాల వివరాలు ఇవి:—

సౌర సంవత్సరాది (చిత్తిరై), బ్రహ్మోత్సవం, కంచిగరుడసేవ ఆనివర ఆస్థానం, వరలక్ష్మీ వ్రతం, గోకులాష్టమి, వినాయక చతుర్థి, నవరాత్రి కొలువు, ఆరవరోజు - దుర్గాపూజ, మహాలయ అమావాస్య, దీపావళి కార్తీకదీపం, కార్తీకైకాదశి, ధనుర్మాసం, రథసప్తమి, తై శుక్రవారం, మాసిమఖం, సూర్యపూజ, పంగుని ఉత్తరం, చాంద్రమాన ఉగాది - మొత్తం 19 ఉత్సవాలు, వీటిలో ఈ దేవస్థానమే లాంఛనంగా జరిపేది.

ప్రస్తుతం దేవాలయం మునుపటి దీన పరిస్థితికే వచ్చింది. మొదటి మహాద్వారగోపురం అసమగ్రంగావున్న రెండంతస్థుల నుంచికూడా ఇటుకలు పడిపోతున్నాయి. వెనుక కల్యాణ మండపం పడిపోయే పరిస్థితిలో వుంది. మొదటి పాకశాల పడిపోయింది. పైకప్పు బండలు కదలించడానికి క్రేనులు రావలసిందేనేమో! దక్షిణంవైపువున్న మండపాల వరుస, పూర్వం వేద

పాఠశాలగాను, ప్రబంధ పాఠశాలగాను వినియోగపడేదట. ఇప్పుడిది కదిలి పోయింది. పైకప్పు బండలు చాలపడిపోయాయి. అందువల్ల ఈవరుసకొనలో పడిపోకుండావున్న ప్రాంతానికి అడ్డుగోడ కట్టి దానిని పాకశాలగా (తిరుమటప్పళ్లిగా) వినియోగిస్తున్నారు.

మొదటి ప్రాకారం లోపలి పుష్కరిణి పూడిపోయింది. దేవాలయం దక్షిణమహాద్వార గోపురం అసమగ్రం. దానిద్వారంలో అడ్డు గోడలకట్టి పశువులు కట్టివేశారు. మహాద్వారం పాతు సగంవరకు పూడిపోయింది. పూర్వద్వారం పరిస్థితి కూడ ఇలాగేవుంది. విరిగిపోయిన ద్వారపాలకుల విగ్రహాలు పెట్టారు. ద్వారం పశువులకొట్టంగా వాడుతున్నారు. అపూర్వ మైన నర్తకీ శిల్పాలు మొదలయినవన్నీ సుట్టికొట్టుకుని, పేడకలయంపివులుము కొనివున్నాయి. ద్వారబంధాలమీది శిల్పాలవరుసలలో కందిరీగలు గూళ్లుకట్టి వున్నాయి. శిల్పాలు ఈ విధంగా రక్షితమవుతున్నాయి.

దేవాలయంలోపల నాలుగుబేరాలు — (విగ్రహాలు) ఉన్నాయి: దేవా లయంలో తాయారు సన్నిధి, కోదండరామసన్నిధి, లక్ష్మీనారాయణ, ఆంజనేయ బేరాలున్నాయి. ఐదవబేరం-బలి బేరంలేదు. అమ్మవారు వేదవల్లీదేవి ఆలయం మండపం ఎడమమూలలో నిలుచున్న గరుత్మంతుని విగ్రహం పడి వుంది. మహామండపంలో ఒక ద్వారపాలకుడు తోడులేక నిలబడివున్నాడు. వేదవల్లీదేవి ఆలయమండపంలోని గరుడుడు, ఈ ద్వారపాలకుడు ఒక జట్టు అనుకుంటాను. ఈ రెండు విగ్రహాలను అంతరాళంవద్దగాని, మహామండప పశ్చాద్వారంలోగాని నిలవవచ్చు. పూర్వం బిలం వున్నదని చెప్పబడే ముఖ మండపం ముందుభాగంలో పడివున్న గరుత్మంతుని విగ్రహం ధ్వజస్తంభం వద్ద వుండవలసింది.

విమాన (గర్భాలయ) ప్రదక్షిణమార్గంలో కొన్ని అపూర్వ బేరాలు (విగ్రహాలు) పడివున్నాయి, త్రిమూర్తి, భూదేవి, మొదలయినవి. త్రిమూర్తి విగ్రహం అపూర్వ శిల్పం. దీనిని మీటితే సప్తస్వరాలు పలుకుతాయి. ఒక చోట దీనిని అనామత్తుగా నిలబెట్టారు. పడిపోతే చాల నష్టం కలుగుతుంది.

కనుక, దీనిని రక్షించడం అవసరం. అలాగే భూదేవి విగ్రహం కూడా ఉత్తరపుగోడకున్న గూళ్లలోని విగ్రహాలలో ఒక్కటి బ్రహ్మవిగ్రహం. ఇది రాష్ట్రకూట సంప్రదాయమని ఇదివరకే విన్నవించాను. ఇక్కడ దత్తాత్రేయులని వ్రాసివుంది. దానిని తుడిపించి బ్రహ్మ అని వ్రాయాలి.

అంతరాళంలో స్థలం చాలదు. దానిలో బిలాలలో దొరికిన ఆళ్వారాచార్యుల విగ్రహాలు, తక్కిన విగ్రహాలూ క్రిక్కిరిసి వుంచబడ్డాయి ఒక పక్కన, మరొకపక్కన మరికొన్ని విగ్రహాలు వుంచబడ్డాయి. ఆండాళ్, బాలకృష్ణుల విగ్రహాలను, లక్ష్మీనారాయణస్వామి విగ్రహాలనూ, విడిగా చిన్న మందిరాలలో స్థాపించడం అవసరమేమో!

పూర్వం రథోత్సవం మహావైభవంగా జరిగేదట. ఆ రథం విరిగిపోయింది. దానిని మరమ్మత్తు చేసేవారులేక, అది ముక్కలుముక్కలైపోయి ప్రస్తుతం దాని ఇరుసులుమాత్రం మిగిలాయి. వాటిని వేదవల్లీదేవి ఆలయ మండపంలో భద్రపరిచారు. ఉభయకర్తలు బ్రహ్మోత్సవంలో అంకురార్పణం, విష్వక్సేనోత్సవం, ధ్వజారోహణం, శేషవాహనం, సూర్యప్రభ, హంస వాహనం, ముత్యాలపందిరి, హనుమంత వాహనం, చిన్న శేషవాహనం, చంద్రప్రభ, మోహినీఅవతారం, గరుడసేవ, కల్పవృక్ష వాహనం, ఏనుగు వాహనం, సర్వభూపాల వాహనం, తోఁజ ఉత్సవం, తొట్టి తిరుమంజనం, గుర్రపు వాహనం, పల్లకితీర్థవారి, సింహవాహనం జరిపారు జరుపుతున్నారు. రథోత్సవం జరుపడంలేదు. అది చాల వ్యయసాధ్యం. "ఇరుసున గందెన బెట్టక పరమేశ్వరుబండియైన బారదు" అని సుమతి శతకకారుడు అన్నాడు. కాని, ఇక్కడ ఇరుసులున్నాయి. కందెనకు ప్రయత్నం చేయవచ్చు. కాని, బండిలేదు, చక్రమూలేదు.

దేవాలయంచుట్టూ నాలుగు మాడవీథులుండడం సర్వేసర్వత్రా ఆచారం. ఇక్కడ ఒక్క సన్నిధివీథి మాత్రమే కనిపిస్తుంది. తక్కిన వీథులన్నీ విచ్చలవిడిగా ఒక పద్ధతిలేక వున్నాయి. వాటిని ఒక పద్ధతిలో ఒక తీరులో పెడితే

దేవాలయానికి మరింత అందం ఏర్పడుతుంది. ఊరు మరింత సుందరం అవుతుంది.

సన్నిధివీథిలో పోలీసుస్టేషన్ ప్రక్కన పూర్వపు ప్రాకారద్వారపు స్తంభాలు రెండునిలిచి వున్నాయి. అవి భూమిలోపల చాలాదూరంవున్నా మనుష్యుల, పశువుల రాపిడికి పడిపోవచ్చు. వాటికి ముందూ వెనుకా ఒక ఇటుకవరుస గోడకడితే అవి భద్రంగా చరిత్ర చిహ్నాలుగా వుంటాయి. ఆ వీథికి ద్వారంగాను పనికివస్తుంది.

ఒక విషాదకర విషయం చెప్పడం మరచాను. గర్భాలయ ప్రదక్షిణ మార్గంలో దక్షిణ పార్శ్వంలో గోడలకు, పైకప్పున ప్రాచీన చిత్రాలు వుండే వట. దురదృష్టవశాత్తు నేడు వాటిపై సున్నం పూశారు. అంతటితో ఆ చిత్రసంపద నష్టమై పోయినట్టే. సున్నాన్ని కొద్ది కొద్దిగా తుడిచివేస్తే ఏమైనా ప్రయోజనం వుంటుందేమో.

ఇటీవలే మెదక్ సమీపంలోని అల్లాదుర్గ శిథిలాలలో కుడ్యచిత్రాలు దొరికినట్టు విని ఎంతో సంతోషించాము. మనకు ఉన్నవాటిని గూడ సున్నం పూయించుకున్నాము. ఇవి దొరికివుంటే లేపాక్షి అనంతరం ఆంధ్ర చిత్రకళా పరిణామాలు మనకు తెలిసేవి. వాటికోసం ఎలాగైన ప్రయత్నించాలి.

నాగలాపురం ప్రస్తుతం మేజర్ పంచాయతీ గ్రామం. ఊర్లో ఎలిమెంటరీ స్కూళ్లు, హైస్కూలు, బ్రాంచిలైబ్రరీ, పంచాయతీ ఆస్పత్రి, పశువులఆస్పత్రి వున్నాయి. ఒక ఎలిమెంటరీస్కూలు చాల సమర్థతతో ఇంప్రూమెంట్‌ట్రస్ట్ క్రింద నిర్వహించబడుచున్నది. ఈ పాఠశాలను మోడల్ పాఠశాలగా చేయ డానికి ప్రయత్నిస్తున్నామని, ఇటీవలే రెండునెలల క్రితం ఈ పాఠశాలలో గొప్ప విద్యావిషయక ప్రదర్శనం జరిగిందని, దానిలో జిల్లాలోని పాఠశాలలు 80కి పైగా పాల్గొన్నాయని ఈ పాఠశాల హెడ్‌మాస్టర్ శ్రీ శిరంబూరు మోహన్‌రెడ్డి గారు తెలిపారు.

దేవాలయానికి మరింత అందం ఏర్పడుతుంది. ఊరు మరింత సుందరం అవుతుంది.

సన్నిధివీథిలో పోలీసుస్టేషన్ ప్రక్కన పూర్వపు ప్రాకారద్వారపు స్తంభాలు రెండునిలిచి వున్నాయి. అవి భూమిలోపల చాలాదూరంవున్నా మనుష్యుల, పశువుల రాపిడికి పడిపోవచ్చు. వాటికి ముందూ వెనుకా ఒక ఇటుకవరుస గోడకడితే అవి భద్రంగా చరిత్ర చిహ్నాలుగా వుంటాయి. ఆ వీథికి ద్వారంగాను పనికివస్తుంది.

ఒక విషాదకర విషయం చెప్పడం మరచాను. గర్భాలయ ప్రదక్షిణ మార్గంలో దక్షిణ పార్శ్వంలో గోడలకు, పైకప్పున ప్రాచీన చిత్రాలు వుండే వట. దురదృష్టవశాత్తు నేడు వాటిపై సున్నం పూశారు. అంతటితో ఆ చిత్రసంపద నష్టమై పోయినట్టే. సున్నాన్ని కొద్ది కొద్దిగా తుడిచివేస్తే ఏమైనా ప్రయోజనం వుంటుందేమో.

ఇటీవలే మెదక్ సమీపంలోని అల్లాదుర్గ శిథిలాలలో కుడ్యచిత్రాలు దొరికినట్టు విని ఎంతో సంతోషించాము. మనకు ఉన్నవాటిని గూడ సున్నం పూయించుకున్నాము. ఇవి దొరికివుంటే లేపాక్షి అనంతరం ఆంధ్ర చిత్రకళా పరిణామాలు మనకు తెలిసేవి. వాటికోసం ఎలాగైన ప్రయత్నించాలి.

నాగలాపురం ప్రస్తుతం మేజర్ పంచాయతీగ్రామం. ఊర్లో ఎలిమెంటరీ స్కూళ్లు, హైస్కూలు, బ్రాంచిలైబ్రరీ, పంచాయతీ ఆస్పత్రి, పశువులఆస్పత్రి వున్నాయి. ఒక ఎలిమెంటరీస్కూలు చాల సమర్థతతో ఇంప్రూమెంట్‌ట్రస్ట్ క్రింద నిర్వహించబడుచున్నది. ఈ పాఠశాలను మోడల్ పాఠశాలగా చేయ డానికి ప్రయత్నిస్తున్నామని, ఇటీవలే రెండునెలల క్రితం ఈ పాఠశాలలో గొప్ప విద్యావిషయక ప్రదర్శనం జరిగిందని, దానిలో జిల్లాలోని పాఠశాలలు 80కి పైగా పాల్గొన్నాయని ఈ పాఠశాల హెడ్‌మాస్టర్ శ్రీ శిరంబూరు మోహన్‌రెడ్డి గారు తెలిపారు.

"పరగన్‌శిల్పి కుశాగ్ర బుద్ధియొ భవన్మాహాత్మ్యమో గాని మే
మరయంజాలక యున్నవారము గదా యాశ్చర్యమై వచ్చు న
త్వరభాస్కర సూర్యపూజ వరుసన్ బండ్రెండు బద్మాడు ను
స్థిరమొప్పన్ బదులాగ్గు తేదుల తుదిన్ శ్రీ వేదనారాయణా.

(శ్రీ వేదనారాయణస్వామి స్తోత్రరత్నావళి)

నాగలాపురం వేదనారాయణస్వామి దేవాలయంలో మహామండప స్తంభాలమీద, ప్రాకార ద్వార కుడ్యాలమీద, కుడ్యాలమీద విటంకాల లోను, గోపురద్వారం ద్వారబంధాలమీద ఇరువైపులా, గోపురాల వరుసల లోను వున్న విష్ణ్వవతారశిల్పాలు, ఒకదానితో మరొకటి పోలకుండా, ఒక దానితో మరొకటి పోటీపడుతున్నట్లు విరాజిల్లుతున్నాయి. ఇవి ఆనాటి శిల్పా చార్యుల కల్పనాశక్తికి మాత్రమేకాక, సమకాలిక కావ్య ప్రబంధాల వర్ణన రీతులకు కూడా తార్కాణాలుగా కనిపిస్తున్నాయి.

కృష్ణరాయల కాలపు ప్రబంధకవులు వర్ణనలలో ఒకరినిమించి మరొ కరు సాగిపోయారు. అహమహమికతో. అష్టాదశ వర్ణనలు కావ్యాలలో అత్యవసరమని లాక్షణికులు, అలంకారికులు ఏదో నియమంచెబితే, ఈ ప్రబంధకవులు దశావతారాలను సంబంధంవున్నా లేకపోయినా ఏదో ప్రసంగంలో ఇరికించడానికి చేసిన ప్రయత్నం చూస్తే, ఇదొక సంప్రదాయమయినట్టు, అనివార్యమయినట్టు, అది మినహాయిస్తే కావ్య ప్రబంధసౌందర్యం కొరవడు తుందని శంకించినట్టు తోస్తుంది. ఒకరినిమించి మరొకరు కల్పనలు నింప డానికి ప్రయాసపడినట్టు కన్పిస్తుంది.

ఇంతకూ అవతారగాథ జగత్పరిణామగాథ. విష్ణువు సర్వవ్యాప్తి. వ్యాపనశీలుడు, విష్ణువు అంటే చైతన్యం. ఈ చైతన్యం క్షణం వూరికే వుండదు. నిరంతరం వ్యాపిస్తూ, తనను తాను అనంతరూపాలుగా సృష్టించు కుంటూ, నానారూపాలు చెందుతూనే, తనే ప్రకృతీకూడా గనుక ప్రకృతిలోనూ నిరంతరం పరిణామాలు కల్పిస్తూ ఉంటుంది. ఆ పరిణామ విశేష ఘట్టాలే అవతారములు. ఈ అవతారాలు అసంఖ్యేయాలు.

ఈ అవతారకారుడైన విష్ణువు ఒక సరస్సువంటివాడు. అవతారాలన్నీ ఆసరస్సు నుండి బయలుదేరిన కాలువల వంటివి :—

"అవతార హ్యసంఖ్యేయాః హరేస్సర్వ నిధేః ద్విజాః,
యధా విదాసినః కుల్యాః సరసః స్యుః సహస్రశః"

అని బ్రహ్మ విష్ణువు అవతార విశేషాల రహస్యాలను తెలిపినట్టు వైష్ణవులు తెలుపగా, విష్ణువు ప్రకృతి అని, పరమేశ్వరుడు పురుషుడని, ప్రకృతిభేదంలో అవతారాలు ప్రధానంగా పది అని శైవాగమమైన "ముండమాల" చెబుతున్నది.

"ప్రకృతి ర్విష్ణు రూపాత్ర పురుషస్తు మహేశ్వరః
ఏవం ప్రకృతి భేదేన భేదస్తు ప్రకృతేర్దశ."

ఏమైనా అవతారులు జీవవికాశ పరిణామాన్ని తెలిపే వనడంలో సందేహం లేదు. దీనిని హెచ్. జి. వెల్స్‌వంటి సుప్రసిద్ధ చరిత్రకారుడు కూడా తన ప్రపంచ చరిత్రలో గుర్తించారు. జలమయమైన ప్రకృతినుంచి జలచరాలు తర్వాత జలచర, భూచర స్వభావంగల తాబేళ్ళవంటివి. పిదప ఉపోదక వర్తిప్రాణులు అయిన వరాహంవంటివి, అనంతరం సింహాలలాగ లోమమయ, అటవీ, చార, మాంసాలన మృగమానవజాతి, కొంచెం మనస్సు పొటమరించిన వామనులజాతి, అనాది పనిముట్లు పరశువువంటివివాడి, వేటాడి జీవించే మానవులు నాగరకత ప్రబలి నాగరీకమైన ఆయుధాలతో జీవించే మానవ జాతి వ్యవసాయపద్ధతులు తెలిసిన, చక్రం వాడుకతెలిసిన, నవనాగర కతకు మూలాధారమైనజాతి — ఇలాటి ప్రధానఘట్టాలను తమ ఇష్టదైవ మహాత్మ్యాలతో జోడించారు మనపూర్వులు. దశావతారాలుకాక, 22 అవతారాల సంప్రదాయానికి కూడా ఈ పరిణామం మరికొంత విస్తరించింది. ఏమైనా ఇది ప్రాచీనులమాటలను బట్టి కూడా ప్రకృతి పరిణామక్రమగాథ అనడం నిస్సంశయం.

కాని, క్రమంగా ఈ అవతార పరిణామరహస్యం మరుగైపోయింది. కేవలం పరమాత్మలీలలుగా వర్ణితమయింది. రాజు, లేక పోషకుడు ఎట్టి

దేవుని ఆరాధిస్తే తదాశ్రితకవి, ఆదేవుని ప్రశంసించడం ఆతని అవతారాలు విశేషాలు వర్ణించడం ఆచారమేకాక అలంకారిక సంప్రదాయమూ ఐపోయింది.

నాగలాపురం శిల్పికి ఈ ప్రబంధాలలోని దశావతార వర్ణన వైవిధ్యం స్ఫురించింది కాబోలు. ఒక్క వరాహమూర్తే రకరకాలుగా దర్శనమిస్తున్నాడు. ఈసందర్భంలో కృష్ణరాయల ఆముక్తమాల్యదలోని అవతారవర్ణనలను ఈశిల్పి చూచాడేమో! చూడకపోయినా, శిల్పశాస్త్ర, శిల్పాగమ గ్రంథాల నిర్వచనాలు ఉన్నాయి అతనికి ప్రమాణాలుగా అయినా కృష్ణరాయలతో సమకాలిక కవులు, తర్వాతి కవులు ఈ విషయంలో ఎలా పోటీలువడ్డారో చూడండి.

కృష్ణరాయలు వరాహమూర్తిని ఇలా వర్ణించారు.

ఒకమురి బుడ్డగింప విలయోదకముల్ పయికుబ్బిచివ్వ ప్ర
చ్చుకొని మహాభ్రవీధి జనసూకరత న్మెయివంచి వెండి క్రిం
దికి గయివ్రాలు తత్సలిల నిర్మలధార నధఃపరిస్సర
త్ప్రకృతికి నీ యజాండమును బంగరు ముంగరగా నొనర్పవే?

అని వరాహమూర్తి యెత్తినభూమి, అతనికి బంగారు ముంగరలాగ వుందని వర్ణిస్తే పెద్దన

ఉరుతర విగ్రహస్ఫురణ నుబ్బిన నీరు పరిచ్ఛదాముఖాం
తరమున దోరమై యెగయ ధార నజాండము గాజుకుప్పెతో
నరి యనగా దలాతల రసాతల సీమలు సించి దాత్రిను
ద్ధరణ మొనర్చినట్టి విను నాదివరాహము నాశ్రయించెదన్ 6—106

అని భూమిని గాజుకుప్పెగా వర్ణించారు. పారిజాతాపహరణ కర్త మరికొంత కల్పనసాగి,

"పెకలి యజాండకర్పరము బీటలు వారగమేను పెంచి యా
మకర నివేతనోదర నిమగ్న మహామహిళాలలామగే
తకముకుళాగ్ర సంగతమ ద్భ్రమరీ సమరీతి గాగ గొ
మ్ముకొన దగల్చి యెత్తగిటి మూర్తిని దాల్చితివా జనార్దనా? 3—31

అని ప్రశ్నించాడు. కోరలను మొగలి మొగ్గలాగ భూమి తుమ్మెదలాగ వుంద నడం ఎంతో అందంగాలేదూ? వీరందరితోను పోటీపడిన పాండురంగసుకవికి గేదంగి రేకుకొనమీది తుమ్మెదలాగ భూమివుందంటే, నచ్చలేదు. ఇలా అన్నాడు.

> "ఆ పెనుబెల్లి ద్రెళ్లు మకరాకర మేఖల నీవుదేర్చి య
> ష్టాపద టంకవిభ్రమ విడంబినియౌ నిజదంష్ట్ర గూర్చు
> తద్రూపము దీపితంబగు సరోరుహ లోచన సప్తజిహ్వా
> జిహ్వోపరిభాగ ధూమతల మోపమమై విలయోపలబ్ధులన్. 2—58

కృష్ణరాయలు క్షత్రియుడు. యుద్ధాలు చేసినవాడు, కళ్లారా అసృఙ్మాం సమజ్జాస్థి మేదస్సులను చూచినట్టివాడు. కనుక గజపతులను జయించిన మీదట విజయనగరంలోని ఏడునిలువలు ఎత్తు గుండును తొలిపించి ఉగ్ర నరసింహుని మలిపించినట్లే ఆముక్తమాల్యదలో నరసింహుని రణరంగాను భూతితో చిత్రించి మనను రణరంగ మధ్యంలో ఒకవీరుడు అరివీరుని పరి మార్చడం చూచేట్టు చేశారు.

> "అసురేంద్రా శయకుండి కాచ్చరుధిర వ్యాప్తస్వకచ్ఛాయ గాం
> చి సముద్యత్ప్రతిసింహ మత్సరమిళచ్ఛేష్టన్ తదుద్దామదీ
> ర్ఘ నటా ఘూటము బెల్లగించుగలి సంత్రశ్రేణి గిస్కన్ వెరం
> జు సితక్రూర భవన్న ఖావళులు ప్రోచు న్మర్త్యపంచాననా!" 4—22

రాయలు గనుక ఈ వర్ణన ఇంత కనులు గట్టేట్టుగా చేశాడా అని పిస్తుంది. గుండెలను ఇతర శరీరావయవ సన్నివేశాన్ని లోపల గూడ బాగా ఎరిగినవాడు కాబట్టి మరొక ఉత్ప్రేక్ష కూడా అతి సహజంగా చేశారు. గుండెలను కళ్లారా చూచినవాడుగాని ఇలా వర్ణించలేడు — మరొకరైతే వేదవాక్కులనే "పద్మకోశప్రతీకాశం" అని చిలకపలుకులలాగ చెప్పేవాడే. కృష్ణరాయలకు ఈ పద్మకోశోపమానం విష్ణుసూక్త గ్రథితం కాబట్టి తెలుసు. కాని, హిరణ్యకశిపు గుండెలలో త్రిమూర్తి తేజాన్ని చూచాడు స్వయంగా.

"మునుముందెల్పును దూర దూర మరి కెంపున్ వెండియుం దూర గం
దనిగాయంగల నల్పు దోప నఖకోణశ్రేణిచే విక్రమం
బునవాడు గ్రతగొన్న యట్టి పిలన న్మూర్తిత్రయీ తేజమున్
గొనులీలన్ విదళింపవే యసురవ క్షోభిత్తి మిథ్యాహరీ 4-23

నరసింహుడు తన గోళ్లను హిరణ్యకశిపుని దేహంలో గుచ్చేవేళకు మొదట తెలుపు, తర్వాత ఎరుపు తర్వాత ముదురు ఎరుపు వున్న గందుగాయక వరకు వెళ్లాయట.

త్రివిక్రమావతారాన్ని గాథాసప్తశతీకారుడు మహబాగా వర్ణించాడు:

అపహువ్వతం మహిమండలమ్మిణయ సంటియం చిరం హరిణో
తారాపుప్ఫపుయరం చిత్తం వ తఇ ఆం పయం ణమహ 5-11

(అప్రభవ న్మహి మండలే సభస్సంస్థితం చిరం హరేః
తారాపుష్ప ప్రకరాంచిత మివ తృతీయ పదం నమః)

త్రివిక్రముని మూడవకాలు ఆకాశానికి లేచింది. అక్కడి నక్షత్రాలు ఆ పాదం మీద పడ్డ పూవులులాగా కనిపించాయట. త్రివిక్రముడంటే, మూడు పూటలు తెలిపే సూర్యగతి వివరణమేనని, సూర్యుడే త్రివిక్రముడని వైదిక పండితులు చెబుతారు. ఏమైనా కృష్ణరాయలు హాలుని నభోమండలం దాటి శింటమార చక్రం గూడ అతిక్రమించిపోయారు.

బలిదైతేయ భయాంధకార భరిత బ్రహ్మాండగేహంబులో
పల బై మండెడి తత్ప్రతాపమయి దీపజ్వాల డింద స్గడుం
దలమై మింటికి గ్రక్కున న్నెగయు నుద్వృత్త న్మహోచ్చాయ నా
గల నీలాంగము శింశుమార మొరయంగా బెంచవే వామనా ?" 4-24

బలిదైతేయుని ప్రతాపదీపం ఆరిపోయేవేళకు త్రివిక్రముని పాదస్తంభం నీడలాగ కనిపించిందట శింశుమారచక్రం వరకు.

ముక్కుతిమ్మన నరసింహావతారానికి అనుగుణమైన ఆరభటీ వృత్తినే వాడాడు.

నటలిట మానురోరి హరి సర్వమ యుండటె యంచు బట్టితో
జిటచిటలుడి యిందు గన జేయుము నీవని దైత్యుడానినం
బటపట రాతి కంబ మిరు పాయలుగా నరసింహమూర్తి వై
కుటిల నఖాగ్రకుంచికల గ్రువ్వవె వాని యురఃకవాటమున్ 3-32

పాండురంగకవి హిరణ్యకశిపుని నెత్తురు నుంచి ఇంద్రరాజ్య రమ కోసం కీర్తి కలదులకురాలు పండించాడు.

"అలఘు జగద్విషద్విపఘ టాంకుశ శాత నఖాంకురాగ్రం
గలముల మున్ను నీ వసుర ఘస్మర వైరిభుజాంతరాళ జాం
గలమహి జాలువట్టి పలు గ్రమ్మెడు నెత్తురు నీరు పెట్టి
యం దలుకవె కీర్తి పూర్తికల మాంకుర మింద్రరమాఫలార్థివై 2-59

ఇవి ఏమి కల్పనలయినా, కృష్ణరాయల సహజరవుద్రరసాభివ్యక్తికి దగ్గరకైన రావని నా విశ్వాసం.

రాముని అవతారం గురించి కాకపోయినా లక్ష్మణుని గురించి గాథా సప్తశతిలో మంచిగాథ వుంది. మరదివెంటబడ్డాడు. ఏమి చెప్పినా వినడు. భర్తకు చెబితే, ఇల్లు రెండవుతుంది. తనకు ఏమి అవుతుందో! అందువల్ల ఇల్లాలు ఇంటి గోడలమీద వ్రాసిన, రాముని అనుసరించే లక్ష్మణుని చరిత్ర మరదికి దినమూ చూపేదట!

దిఅరన్న అనుద్ధమణన్స కులవహూణి అలకుడ్డి లిహి ఇం
ది అహం కహే ఆ రామాణులగ్గ సోమిత్తి చరిఆఇం. 1-35

మలినచిత్తుడైన మరిదికి నిల్లాలు చిన్న నవ్వుదోప చెప్పచుండు
రాము వెంట దిరుగు సౌమిత్రి చరితంబు గోడమీద వ్రాసికొన్నదాని.
(శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారిది)

పెద్దన రాముడు బాల్యంలో చేసిన సప్తసాలపరిచ్ఛేదాన్ని తర్వాత అతనిబాణం రావణుని శరీర సప్తధాతువులలో దూరడానికి వ్యాయమంగా ఉత్ప్రేక్షించాడు :—

"పవిధారా పతనంబు గైకొననియ ప్పౌలస్త్యు మైనప్తధా
తువులం దూరు పరిశ్రమంబునకు నుద్యోగించెనా నప్తసా
ల విభేదం బొనరించి నిల్వక సలీ లం జన్న యుష్మన్మరు
జ్జ నాస్త్రం బొనగున్‌సిరుల్ రఘుకుల స్వామీ రమావల్లభా!" 6-110

రాయలు ఈ పద్యాన్ని తన కావ్యంలో గ్రహించాడు. మరొక గొప్ప పద్యం చెప్పాడు. యుద్ధం చేసినవాడు, చేయడం చూచి మెచ్చిన వాడూ తప్ప మరొకడు ఇలాటి పద్యం చెప్పలేదు: —

స్యందనస్థ బిడౌజః క్షత్త్రుజాద్యకృ జ్ఘయీూ మరుద్గ రుజ్ఘాత్కృతములు
క్రవ్యాశిరాడ్గాత్ర కనదసృగ్గాహన స్ఫుటశల్య హవ్యభుగ్ ఛూత్కృత
ములు
యోధపర్మత హృత్స్ఫుటోత్కృంత నిజపాత సాలాశ్మకృతముహుష్ఠా
త్కృతములు
పతితోగ్రరక్షః కబంధ భారభృశార్తి భుగ్నభోగ ఫణీంద్రపూత్కృతములు
శ్రాంత రథ్యానిరంతర చ్ఛాయదములు దివ్యతావకకార్ముకోత్ప్రేరిత
ములు
కలుషములడంచు గాత లంకాపురాంగ ణాంబరచలత్కలంబ
కదంబకములు
4-27

కృష్ణుని బాల లీలలను గురించిన గాథలు గాథాసప్తశతిలో కొన్ని ఉన్నాయి. వాటిలో తల్లికి తన కుమారునిపై గల విశ్వాసాన్ని తెలిపే ఒక గాథ సహజసుందరం.

"అజ్జని బాలో దామోద రోత్తి ఇఅ జంపి ఏ యసో ఆఏ
కణ్ణముహ వేసి ఆచ్ఛం ణిఉదంహసి అంప అపహూహిం (2-12)
ఇకను చిన్నిబాలుడేగద మా కృష్ణు డని యశోద పల్కనతని మోము
కడకు జక్కగొల్ల పడుచులు వాల్చూపు సాగబలికి నగిరి సద్దు లేక.
(శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారిది)

తమ పిల్లల అల్లరిని తల్లులు గ్రహించలేరు. ఎవరన్నా ఫిర్యాదుచేస్తే మరీను. కృష్ణుడు పరాయివాళ్లు ఇళ్లల్లో అల్లరిచేసే నేటి పట్నవానపు కుర్రాడి వంటివాడు. ఆలాటివారి అల్లరిని ఎవరు చెప్పినా తల్లిదండ్రులు నమ్మరు. వెలుపల నానా హంగామా చేసి, ఇంట్లో మునంగులలాగ వుంటారు కృష్ణునివంటి వారు. కనుక గోపికలు అతనివైపుచూచి, లోలోపలే నవ్వుకున్నారట.

నాగలాపుర శిల్పి స్వామి గండరించిన అవతారమూర్తులను వర్ణిస్తూ పోతే ఒక గ్రంథమే అవుతుంది.

అంతరాళంలోని విష్ణుచిత్తుడు అచ్చం ఆముక్తమాల్యదలో వర్ణితుడైనట్టివాడే అతన్ని దర్శించగానే,

"ఆ నిష్ఠానిధిగేహసీమ నడు రే యాలి-చినన్ మ్రోయు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలున్ దివ్య ప్రజంఘాను సం
ధాన ధ్యానము నాస్తిశాక బహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పోనాస్త్యోదన సౌష్ఠవం చకృపయా భోక్తవ్య మన్మటలున్. (1-84)

నాకు వినబడ్డాయి.

ఇట్టి శిల్పవిధానాన్ని పునరుద్ధరించి రక్షించుకోడం తెలుగువారి విధి. నాగలాపురంలో యాత్రికులకు సౌకర్యాలు కలిగించడమూ మన విధి. నాగలాపురం దేవాలయం పరిసరాలలో బస్సుస్టాండుపక్కన చాలస్థలంవుంది. దానిలో సత్రాలు, కల్యాణమండపాలూ కట్టిస్తే యాత్రికులకు మహోపకారం అవుతుంది. పూర్వం ఎవరో ఏమోచేశాడని గాక, ఇప్పుడు మనం ఏమిచేయాలి, ఏమి చేద్దాము, ఏమి చేయగలము అనే దోరణిలో కృషిచేయాలి.

శ్రీ తీర్థం శ్రీధరమూర్తిగారు నాగలాపురం వేదనారాయణస్వామిపై చెప్పిన స్తుతిలోని ఒక పద్యాన్ని ఉదాహరిస్తున్నాను:

"తొలియుగమందు సోమకుడు దొంగిలె వేదములంచు వెంటనే
జలచరమూర్తివై యతని సంహరణం బొనరించితెచ్చి యు

నలువకు నిచ్చినాడవు మ నమ్మిన నేమి తలంచితో గదా
కలియుగవేళ వేదముల గాచుటయన్నది నీకు బట్టదో !''

ఇక్కడ వేదములు అంటే జ్ఞానం, సద్బుద్ధి, ఇంగితజ్ఞానం అనే అర్థంలో నేను గ్రహిస్తున్నాను. అలాటి పరిజ్ఞాన సముద్ధరణకు ఉపేక్షించ తగదని వేదనారాయణుని ప్రశ్నించినట్లే, మనం నాగలాపురం దేవాలయ సముద్ధరణలో ఉపేక్షించదగదని మననే హెచ్చరించుకుందాము.

నాగలాపురం - రామాలయంలో శ్రీ త్రివిక్రమమూర్తి



# సవాల్ - ఇ - జవాబ్

క్రీ. శ. 1801 లో మిస్టర్ స్ట్రాటన్ అనే ఆంగ్లేయుడు పశ్చిమపాళెము లకు కలెక్టరుగా వుండేవాడు (ఈ జిల్లాకు అతడు మొదటి కలెక్టరు- మన్రో తరువాత.) తిరుమల ఆలయ చరిత్రను, దానికి సంబంధించిన పురాణాలను, ప్రశస్తిని, ఐతిహ్యాలను, పరంపరాగతమైన సంప్రదాయాలను, స్థానికుల (శ్రీవారి ఆలయ నిర్వాహకుల) నుండి రాబట్టడానికై, ఆయన ఒక ప్రశ్నావళిని తయారు చేసినాడు. ఆ ప్రశ్నాపత్రంకు స్థానికులనుండి జవాబులు రాబట్టి, వాటిని ప్రచురించాడు. ఆ ప్రశ్న సమాధానముల పత్రమే సవాల్ - ఇ - జవాబ్ గా ప్రసిద్ధిగాంచినది. అవి మొత్తం నలభై ప్రశ్నలు - వాటి సమాధానాలు.

వీటినన్నిటిని ఇక్కడ ప్రచురించడం సాధ్యంకాదు. పైగా అందులో ఎక్కువ ప్రశ్నలకు సమాధానాలు - స్థానికులకు ఇదివరకే తెలుసు. అందువల్ల, అందులో ముఖ్యమైన, ఆసక్తి కరమయిన కొన్ని విషయాలను (సమాధానా లను) మాత్రం, ఇక్కడ పొందుపరచడం జరిగింది.

జవాబు 9. శ్రీవారి ఆలయంలో సంపంగి ప్రదక్షిణంలో నున్న విరజానది అని పిలువబడే బావికి తొట్టితీర్థమని పేరు. కటహ తీర్థమని కూడ దీనిని అంటారు. * తిరుమల కొండల్లో మొత్తం 365 తీర్థాలున్నాయని పురా ణాలలోవుంది. కానీ మనకు తెలిసినవి 25 మాత్రమే. మిగతా అన్నీ స్వామి పుష్కరిణిలో కలుస్తాయట. గోగర్భ తీర్థాన్ని పాండవ తీర్థమని కూడ అంటారు. తిరుమల లోని తి. తి. దే. ఉద్యోగుల నివాస గృహాలకు వెనుక వైపు యానాదుల గుడిసెలున్నాయి. అక్కడొక చిన్న ఊటబావి వుంది. దానికి అస్థి తీర్థమని పేరు.

కపిలతీర్థంలో కొండపేటి క్రింద నృసింహాలయముంది. ఆ ఆలయం లోపల ఒక సొరంగం వుంది. దాని వెంబడిపోతే తిరుమల ఆలయం చేర

---

* ఈ గుర్తుగలవి యీ రచయిత వ్యాఖ్యలుగానీ, సవాల్ - ఇ - జవాబ్‌కు చెందినవిగావు.

వచ్చునట. పురాణాలలోని తొండమాను చక్రవర్తి - ఆ దారిన బోయి తిరుమల శ్రీవారిని పూజించేవాడట.

* కపిలతీర్థంలోని నమ్మాళ్వారు గుడి గోడమీద ఒక తమిళ శాసన ముంది (తి. తి. దే. శాసనము నంబరు 58 సంపుటము 1). విషయం—"దివ్యజ్ఞానము బొందిన ఒక ముని ఇచ్చట నివశిస్తున్నాడు. దయాళువై యాతడు మనుష్యులకు బ్రహ్మ విద్యోపదేశము చేస్తున్నాడు." ఈ శాసనం ప్రాచీనమయినదే గానీ, తారీఖు తెలియదు. ఈ కాలంనాటికి జ్ఞానమార్గమైన 'బహ్మవిద్య' ఆచరణలో నున్నట్టున్నదిగానీ, అద్వైతం - విశిష్టాద్వైతం అమలులోకి రానట్టుంది.

* కపిలతీర్థం దారిలో, తి. తి. దే. ప్రస్తుత హుజూరు ఆఫీసు ప్రక్కన ఒక శిధిలాలయము వుంది. దానిని అందరూ జియ్యంగారు గుడి అంటారు. నిజానికది తిరుమంగై ఆళ్వారుగుడి. దానిని ఏ జియ్యంగారు కట్టించారో తెలియదుగానీ, క్రీ.శ. 1175 నాటికి ఎంబెరుమానార్ జీయరు దానికి మేనేజరు. అచ్చట అప్పుడప్పుడు గొప్పకాటాకుస్తీలు జరుగుతూంటాయి. ఒకప్పుడు తిరుపతిలో, కుస్తీ పోటీలన్నీ ఆ జియ్యంగారు గుడి అని పిలువబడే దానిలోనే జరిగేవి. తిరుపతిలోని గోడలమీద - "జియ్యంగారు గుడి వద్ద గొప్పకాటాకుస్తీ" అని వ్రాసి ప్రచారం చేసేవారు.

పన్నిద్దరు ఆళ్వారులలో నొకడైన తిరుమంగై ఆళ్వారు గొప్ప విష్ణు భక్తుడు. శ్రీ రంగంలోని రంగనాథాలయము బాగుచేయాలన్న సదుద్దేశ్యంతో డబ్బుకోసం రాజుల, ధనికుల నాశ్రయించినాడు - ఒక్కరూ సహాయం చేయలేదు. వెంటనే తన శిష్యుల నందరినీ దొంగతనానికి పురికొల్పి, తాను గజదొంగగా మారి పోయాడు. రాత్రులంతా కొల్లగొట్టి దొంగతనాలు చేయడం, పగలంతా రంగనాథాలయం నిర్మించడం, ఇదీ అతనిపని. ఆ మహానుభావుని ఆలయం క్రీ. శ. 18 వ శతాబ్దంలో హైదరాలీ మొదలగు తురుష్కుల దండయాత్రల వల్ల శిధిలమయింది. అయితే అయినదిగానీ ఆ విగ్రహాన్ని కూడ ఎవరో దొంగలించారు. దొంగయైన ఆ ఆళ్వారు విగ్రహం దొంగలించబడటం - పైగా

ఆ ప్రదేశంలో కాటాకుస్తీలు జరగడం ఇవన్నీ ఆయన చరిత్రకు తగ్గట్టు సంభవించడం – దైవలీలగదా! ఈ తిరుమంగై ఆళ్వారు ఆలయ అస్థిపాస్థులు పాపానాయుడుపేట సమీపంలో ఎలమండ్యం గ్రామంలోని తిరుమంగైయాళ్వారు పట్టెడ. ఆభూముల నిప్పుడు ఆళ్వారు పట్టెడ అని పిలుస్తారు.

10. స్వామిపుష్కరిణి గట్టుమీదనున్న గొప్ప అశ్వత్థ వృక్షము క్రింద దశరథ మహారాజు తపస్సు చేసినాడు. (ఇటీవల ఆ రాగి చెట్టు ఎండిపోయి పడిపోయింది.) కుమారధార తీర్థంలో కుమారస్వామి తపస్సు చేసిన చోటులో ఆయన ఆశ్రమంవుంది. అదే విధంగా చంద్రగిరి కొండల మీద శ్రీ అగస్త్యమహాముని తపస్సుచేసిన చోట ఆయన ఆశ్రమము, పాప వినాశం సమీపంలో సనక సనందనాదుల ఆశ్రమాలు, ఆలయానికి ఈశాన్య దిక్కున పదిమైళ్లదూరములో సప్తర్షుల ఆశ్రమాలు వగైరా తిరుమలమీద చెల్లా చెదరుగా వ్యాపించి వున్నాయి.

13. తిరుమల మీద మ్లేచ్ఛులు, చండాలురు ప్రవేశిస్తే, వారు దైవాగ్రహానికి గురయి, వారి కనేక ఇబ్బందులు కలుగుతాయట ఆకాలంలో. ఆళ్వారులు, రామానుజాచార్యులు మొదలగు మహాపురుషులు, ఆదిశేషుని పడగలైన ఆ కొండలమీద అడుగు బెట్టి అపవిత్రం చేయటం ఇష్టంలేక, దూరంనుంచే నమస్కరించేవారట. తప్పనిసరి అయితే తప్ప కొండ ఎక్కేవారు కారట.

*అందుకేనేమో? ఆకాలంలో హరిజనులు కొండఎక్కకుండా కపిల తీర్థం ప్రక్కనున్న మాలవాని గుండం, మాదిగవాని గుండములలో మునిగి, అలిపిరిలో నున్న పడాలమండపములో స్వామి పాదాలకు మ్రొక్కేవారు. తిరుపతికి కనిపించే ఎత్తయిన జలపాతం (పెద్దవంతెన ప్రక్కది) మాలవాని గుండం. క్రొత్తగా నిర్మించిన కనుమదారిలో శ్రీ విఘ్నేశ్వర స్వామి ఆలయమునకు ప్రక్కన వర్షాకాలములో ప్రవహించునది మాదిగవాని గుండం. ఈ రెండు తీర్థాలు వర్షంమీద ఆధారపడినవే.



తిరుపతి - జియ్యంగారి గుడి (తిరుమంగైయాళ్వారు గుడి)

14. మార్చి, ఏప్రెల్, మే, జూన్ (ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ) మాసాలలో ఆదిశేషుడు విషవాయువులు వదలుతాడు. అందువల్ల తిరుమలలో నున్నవారికి విషజ్వరాలు వస్తాయి. కొన్ని విషవృక్షాలు యీ కాలంలో పూలు పూయడంవల్ల జ్వరాలు వస్తాయని కొందరి అభిప్రాయం.

15. సువర్ణముఖినదీ తీరంలో తొండవాడవద్ద శ్రీ అగస్త్యేశ్వర ఆలయం వుంది. ఈ ఆలయానికి చెందిన నవస్తంభమంటప మొకటి, నదిలో వుంది. ఆ మంటపము అడుగున అగస్త్యపూజిత విష్ణుపాదం వుంది. గంగా నదీ తీరములో గయక్షేత్రంలోని విష్ణుపాదాలకు ఎంత పవిత్రత వుందో, యీ అగస్త్య పూజిత విష్ణుపాదానికి అంత పవిత్రత వుంది.

అదే నదీతీరంలో, యోగిమల్లవరంలో శ్రీపరాశర మహర్షి — శ్రీపరా శరేశ్వరుని ప్రతిష్ఠించి తపస్సు చేయడంతో, అక్కడ అనేకమంది యోగులు చేరి, ఆ వూరుయోగిమల్లవరం అయింది. అక్కడకు సమీపంలోనే శుక బ్రహ్మ, బలరామ కృష్ణులను ప్రతిష్ఠించి తపస్సు చేయడంతో - ఆవూరు ఆయన పేరు మీదుగా శుకపురము, తిరుచ్చోక్కినూరు (తిరుచానూరు) అయింది.

16. తిరుచానూరులో శ్రీ వేంకటేశ్వరస్వామి పద్మసరోవరమును నిర్మించి, లక్ష్మీదేవిని తపస్సుతో మెప్పించి - పద్మావతిగ ఆమెను పొంది నాడు. పద్మసరోవరములో పద్మములు వికసించడానికి గాను ఆయన తూర్పు గట్టున శ్రీసూర్యనారాయణమూర్తిని ప్రతిష్ఠించినాడు. పద్మావతిదేవి బలరామ కృష్ణుల ప్రక్కన ఆవాసమేర్పరచుకొన్నది.

21. 28వ మహాయుగములో, శ్రీ వేంకటేశ్వరస్వామి తిరుమలమీద స్వయంవ్యక్తమయినాడట.

22. దశరథమహారాజు, తిరుమలమీద 10వేల సంవత్సరాలు తపస్సుచేసి పుత్రసంతానం పొందగలిగాడట. తిరుమల శ్రీవారిని గూర్చి తపస్సుచేసి, అంజనాదేవి ఆంజనేయస్వామిని పుత్రుడుగా పొందగలిగినదట.

24. 28వ మహాయుగములో, కలియుగములో శంఖ మహారాజను వాడు శ్రీవారికి గర్భాలయము, గోపురమంటప ప్రాకారములు నిర్మించాడట.

26. కృతయుగములో శ్రీరామచంద్రుడు తిరుమలను వానరమూకతో దర్శించాడట. అప్పుడే వానరులు శ్రీవారి ఆనందనిలయ విమానము దేదీప్యమానముగా వెలుగొందడం చూసి, ఆసంగతి శ్రీరాముల వారికి తెలియ జేస్తే, అదంతా ఆకొండ ప్రభావ మన్నారట ఆయన. రావణ సంహారానంతరము అయోధ్య నగరానికి పోతూ తిరుపతిలో ఆయన ఒక రాత్రి గడిపారట. అతని రాకను పురస్కరించుకొనే, తిరుపతిలో శ్రీ కోదండరామాలయము వెలిసినదట.

28. తొండమాను చక్రవర్తికి యుద్ధంలో విజయం చేకూర్చడానికి తన శంఖు, సుదర్శన చక్రం దానం చేయటం వల్ల తిరుమల శ్రీవారికి ఆ రెండూ పోయి చేతులు ఖాళీ అయినందున తిరిగీ బంగారుతో అవి చేయించి పెట్ట వలసి వచ్చినదట. ఈ మహత్కార్యము చేసినవాడు శ్రీరామానుజాచార్యులు. బిల్వపత్రాల (మారేడు) పూజ, చేతులలో నాగాభరణములు, వైఖానసాగమ పూజ ఇవన్నీ, శ్రీ సుబ్రహ్మణ్యంస్వామిని గుర్తుకు తెస్తున్నాయి. శ్రీరామానుజాచార్యులు, ఆయనను వైష్ణవుడుగా మార్చేటంతవరకు, ఆయన కుమార స్వామిగానే పరిగణింప బడి ఆప్రకారం పూజింప బడుతూ వచ్చారు.

29. వరంగల్లు నేలిన కాకతి ప్రతాప రుద్ర గజపతి, తిరుమల శ్రీవారికి ఒక రత్నకవచాన్ని (18 లక్షల బంగారు మొహరుల విలువయిన దాన్ని) బహూకరించడమేగాక, అంతే మొత్తముతో శ్రీవారికి కనకాభిషేకము చేయించాడట. శాలివాహన శకము 1074 సం॥ నుండి అనగా ప్రజోత్పత్తి సంవత్సరము నుండి 58 సంవత్సరముల దీర్ఘ కాలం పరిపాలించిన వాడు ఆ ప్రతాపరుద్రుడు. ఆతడు గొప్ప రాజు. 9 లక్షల విలుకాండ్రు ఆయన అంతఃపురమునకు కావలికాచే వారట. నర్మదా నది నుండి కన్యాకుమారి వరకు ఆతని రాజ్యము విస్తరించి యుండెడిదట. ప్రతాపరుద్రుని దాన

శాసనము రెండవ ప్రాకారము గోడల మీదనున్నది. ఈ విధంగా అనేక మంది రాజులు చేతికి నరము లేని వారయి శ్రీ వేంకటేశ్వరునికి దానములు చేయటంతో - ఆయన 'కోటి ఆభరణముల కధిపతి' యని పేరు గాంచినాడు.

ఇంకో విశేషమేమంటే, కలికాలంలోని మనుష్యులు నమ్మదగని వారు గాబట్టి యీ ఆభరణాలన్నిటినీ ప్రదక్షిణ ప్రాకారంలో పూడ్చిపెట్టారట. ఈ ప్రదక్షిణ ప్రాకారం 300 గజముల పొడవు, 40 గజముల వెడల్పు కలిగివుంది. ఇంత విస్తీర్ణంలో - యీనగలు ఎక్కడ పూడ్చి పెట్టారో ఏమో? వీటిని కనిపెట్టాలని శ్రీనివాసాచార్యులనే తహసీలుదారు ప్రయత్నించి, తనకు తను నియమించిన పనివారికి వున్నట్టుండి జబ్బు రావడంతో అది దైవాప చారంగా భావించి, తన ప్రయత్నం విరమించు కున్నాడు. ఈ విధంగా అనేక మంది ప్రయత్నించి చివరకు విఫలులైనారని పెద్దలు చెబుతారు. ప్రస్తుతం యీ ప్రదక్షిణ ప్రాకారం మూసివేయబడివుంది. తలుపులు తాళాలు వేశారు. లోన బండరాళ్లు పఱచబడి వున్నాయి. దీనినే వైకుంఠవాకిలి అంటున్నారు.

* ఇదంతా నిజమా? అని. ప్రతాపరుద్ర గజపతి దానశాసనాలు తి.తి.దే. శాసన సంపుటాలలో నాకెక్కడా కనిపించలేదు. కాకతీయ రాజులు అసలు కొండకు వచ్చినట్టు దాఖలాలేదు. ఇక యీ కథ నిజమని నమ్మదామా?

30 తిరుమల శ్రీవారి పాద పీఠము ముందు, ఆది శంకరాచార్యులవారు, ఆకర్షణ యంత్రము నెలకొల్పాడట. అందువల్ల అంతమంది యాత్రీకులు - అంత డబ్బూ రావటం. ధనాకర్షణ అంటే అలావుంటుంది.

31. దాదాపు 800 సంవత్సరాల క్రితం, తిరుమలనంబి (రామానుజాచార్యుల మేనమామ) అనే వైష్ణవ భక్తుడు శ్రీవారి సేవ నిమిత్తము, పాపనాశన తీర్థంనుండి రోజూ కడివెడు నీరు తెచ్చేవాడు. ఆతనిని పరీక్షింప దలచి, శ్రీవారు ఆటవికుని రూపంలో, దాహం ఇవ్వమని తిరుమలనంబిని అడుగగా, ఆతడు నిరాకరిస్తాడు. భగవత్ చింతనతో తన్మయుడై నడుస్తున్న

తిరుమలనంబికి తెలియకుండా, కుండకు రంధ్రంచేసి ఆ నీరంతా త్రాగివేశారు స్వామి. తిరుమలచేరాక కుండలో నీరు లేకపోవడం చూచి జరిగిన విషయం తెలుసుకొని, తిరిగీ నీరు తేవడానికి బయలుదేరిన తిరుమలనంబి-వృద్ధాప్యంతో శక్తిహీనుడై మూర్ఛపోతాడు. అప్పుడు తిరుమల శ్రీవారు ప్రత్యక్షమయి, నంబిని సేదతీర్చి, నీటికి రోజూ పాపనాశనం పోనవసరము లేదని, సమీపం లోనే పవిత్రమైన జలం వున్నదని - ఆకాశగంగ తీర్థం చూపిస్తారు. ఆరోజుటి నుంచి శ్రీవారికి ఆకాశగంగ తీర్థం ఆదరణీయ మయినది. తిరుమలనంబికి స్వామి ప్రత్యక్షమైన ప్రదేశంలో స్వామి పాదాలు - ఒక మంటపము. మంటపము సమీపంలో - యీ జరిగిన కథను తెలియజేసే శిలాశాసన మున్నాయి. (పాపనాశనం సోపాన మార్గములో ) తిరుమలనంబి వంశీకులు, ఇప్పటికీ యీ సంప్రదాయాన్ని పాటిస్తూ, ఆకాశగంగ నుంచి పవిత్రోదకం తెస్తూనేవున్నారు. ఈ వంశంలో పేరు ప్రఖ్యాతులు గాంచినవాడు శ్రీ తిరుమల తాతాచార్యులు.

* తిరుమలలో శ్రీవారి ఆలయానికి దక్షిణంగా, ప్రస్తుతమున్న స్టేట్ బ్యాంకుకు తూర్పుగా అంటే దక్షిణమాడ వీధిలో తిరుమలనంబి గుడి వున్నది. ఈయన తిరుమల మొదటి పౌరుడు.

31. దాదాపు 800 సంవత్సరాల క్రితం, శ్రీ రామానుజాచార్యులు పంపగా వచ్చిన ఆనందాళ్వారు, తన పూలతోటకు మంచినీటి సరఫరాకు ఆళ్వారు చెఱువు త్రవ్వడం ప్రారంభించాడు. తన భార్య సహాయం తప్ప, ఎవరి సహాయమూ తీసుకోకుండా చెఱువు త్రవ్వాలని ఆతని ప్రతిజ్ఞ. గర్భవతి అయిన అనంతాచార్యుల భార్య చెఱువు త్రవ్వకంలో పడేపాట్లు చూడలేని తిరుమలస్వామి, బాలకుని రూపంతో వచ్చి, సహాయం చేస్తాడు. అది ఓర్వలేని అనంతాళ్వారు, ఆతనిని రాయితో గొట్టుతాడు. (కొందరు పారతో గొట్టాడని వ్రాశారు) గడ్డం పగిలింది. బాలకుడు అదృశ్యమయినాడు. తిరుమల ఆలయంలో శ్రీవారికి గడ్డం నుంచి రక్తం కారడం ప్రారంభమయి, అవతల జరిగిన దంతా అందరికీ తెలిసిపోతుంది. అనంతసూరి శ్రీవారి గడ్డానికి రస

కర్పూరం అంటించి రక్త స్రావాన్ని ఆపి, ఎంతో నొచ్చుకుంటాడు జరిగిన దానికి. ఆ రోజుటి నుంచి శ్రీవారి గడ్డానికి కర్పూర చుక్క పెట్టటం ఆచార మయింది.

* ప్రస్తుతం ఆళ్వారు చెఱువు అనునది శ్రీ ఆనందాళ్వారుచే త్రవ్వ బడినది. చెఱువు క్రింద తోటవున్నది. దానిని ఆళ్వారు తోట లేక పురుష వారి తోట అంటారు. ఇవన్నీ చంద్రగిరి సోపాన మార్గపు రస్తాలో వున్నాయి. ఈ ప్రాంతాన్ని గజేంద్రమోక్షం అని కూడ స్థానికులు పిలుస్తారు. ఈ ప్రాంతంలో మునుపు విష్ణువు గజేంద్రునికి సాయుజ్యమివ్వటం శిల్పాలలో బొమ్మలుండేవి. ఆ శిలాఫలక మిప్పుడు కానరాదు. తోటలో రామానుజ పుట్టేరి (అనంతాచార్యుల కుమారుని పేరు) అనబడే ఒక చిన్న కొలనుంది. కొలనుగట్టున మంటపముంది. ఆ మంటపంలో సంవత్సరానికి ఒక్కసారి శ్రీవారు కొలువు దీరుస్తారు. పశ్చిమ దక్షిణ మాడవీధులు కలిసే కూడలిలో మరొక పెద్ద మండపముంది. దాని నిప్పుడు నివాస గృహంగా మార్చి అనంత ఆళ్వారు వంశీకులు నివశిస్తున్నారు. ఈ ఇంటిముందు రస్తాకు ద్వారంవలె ఒక ఎత్తయిన శిలా ద్వారముంది. ఒకప్పుడు శ్రీవారు అక్కడ ఊంజలి సేవ చేయించు కొనేవారు.

ఇక్కడ తెలుసుకోదగిన గొప్ప విశేషముంది. నమ్మాళ్వారు క్రీ. శ. 7 - 9 శతాబ్దముల మధ్య జీవించిన వాడు. ఆయన తలమీద పెద్ద జుత్తుముడి వుంటుంది గాన, ఆయనను శఠగోపయతి అని కూడ పిలుస్తారు. ఆయన తిరువాయ్‌మోజి అనే ప్రబంధం వ్రాసి గానం చేసినాడు. ఆ ప్రబంధంలో మూడవ పట్టు అనే అధ్యాయంలో-తిరుమల క్షేత్ర దివ్యత్వాన్ని, తిరుమల దేవుని కృపారసాన్ని వర్ణించాడు. ఆ పదాలు చాల ఇంపుగా వుంటాయి. వాటి సారాంశం ఇలా వుంటుంది. "తుచ్ఛమానవుడా! ఈ జీవితాన్ని ఎందుకు వ్యర్థంచేసుకుంటావు? నీకు అవసాన కాలం సమీపించింది. వెంటనే తిరుమలకు పో! ఆ దేవదేవుని దర్శించు - సేవించు, ఆ భగవంతుని కైంక ర్యంతో నీ జీవితాన్ని ధన్యం చేసుకో!"

పై పాశురాలను పఠిస్తున్నాడు ఒకరోజు యమునాచార్యుడు. ఆయన మనుమడైన తిరుమలనంబి వాటిని శ్రద్ధగా విన్నాడు. అతని మనసు మారి పోయింది. వెంటనే తాతగారి అనుమతి తీసికొని, తిరుమలకు వచ్చాడు. అంతే ఆతని జీవితకాలమంతా శ్రీవారి సేవలోనే గడిపినాడు.

అవే పాశురాలను శ్రీ రామానుజాచార్యులు పఠిస్తుండగా, ఆయన శిష్యులలో నొకడైన అనంతాళ్వారు (ఆనందాళ్వారు - అనంతసూరి అని కూడ పేర్లు) విన్నాడు. ఆతని మనసు తిరుమల వైపు మళ్లింది. వెంటనే గురువు గారి అనుమతి కోరినాడు. ఆశ్చర్యం వేసింది రామానుజాచార్యులకు. క్రూర మృగాల కాలవాలమయి, విషజ్వరాలకు పెట్టిన పేరయి, అలరారే తిరుమల కొండలకు అనంతాళ్వారు బయలుదేరతాననగానే, 'నీవు మాములు మనిషివి గావు, మహాపురుషుడివేనని' కీర్తించారు రామానుజులు. అప్పటి నుంచి పురుషత్వం ప్రదర్శించిన అనంతాచార్యులకు పురుషవార్లు అని పేరు వచ్చింది. ఇందులో మొదటి పురుషవార్లు తిరుమలనంబి (వీరిని టి. కె. అంటారు తిరుమలకుమార) రెండవ పురుషవార్లు అనంతాచార్యులు (వీరిని టి. వి. పి. అంటారు - తిరుమల ఆనందాంపిళ్లై - పురీశ) ఇంకా ఇలాంటి పురుషవార్లు, కందాడై, ప్రతివాద భయంకర, వీరవల్లి, ధర్మపురి, పరవస్తువంశాలవారు. వీరు మొత్తం ఏడు వంశాల వారు. వీరిలో కందాడై, ధర్మపురి వారికి సంతానం లేక పోవడంతో, వారిలో ప్రస్తుతం - పురుషవార్లు లేనట్టుంది.

తిరుమల శ్రీవారికి, తిరుమలనంబి తోయకైంకర్యం చేస్తే, అనంతాచార్యుల వారు పుష్ప కైంకర్యం చేశారు. ఆనందాళ్వారు రాకతో తిరుమల నంబికి, తిరుమల మీద తోడు దొరికినట్టయింది.

ఇక సవాల్ - ఇ - జవాబ్ చూద్దాం.

31. దాదాపు 800 సంవత్సరాల క్రితం కురువనంబి అనే కుమ్మరి వుండేవాడు. అతనిని కురుకనంబి అని కూడ అంటారు. తన గుడిసెలో శ్రీ వేంకటేశ్వరుని మట్టిబొమ్మ పెట్టి, మట్టి పూలతో ఆయనను పూజించే వాడు.

ఆ మట్టిపూలు, తిరుమల శ్రీవారి ఆలయంలో ఆయన పాదపంకజములపై రోజూ కనబడేవి. దీనికి చింతించిన ఆలయ అర్చకులు అవతల అసలు విషయం గ్రహించి, కురువనంబి భక్తికి ఆశ్చర్యపోతారు. తిరుపతి సోపాన మార్గములో యీ నంబి ఒక గోపురం నిర్మించాడట. దాని మీద యీ కురువనంబి ఐతిహ్యం శాసనం చేయబడి వుందట. ఆయన సారెబొమ్మ కూడ అక్కడ వుందట.

* ఈ కురువనంబి కథను శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులగారు చక్కగా వర్ణించారు. సోపానమార్గములో కురువనంబి గోపురము ఏదో తెలియదుగానీ, కురువనంబి కుటుంబీకుల బొమ్మలు, అతని కుమ్మరి సారె వగైరా శిల్పించ బడిన శిలాఫలకాలు వున్నాయి. ఈ కురువనంబి భక్తికి మెచ్చిన, చంద్రగిరి రాజు వీరనరసింగదేవయాదవరాయలు, తిరుపతి సోపాన మార్గములో అతనిని కలుసుకొని అభినందించిన కథ ఒకటి ప్రచారంలోవుంది.

31. దాదాపు 500 సంవత్సరాల క్రితం, ఉత్తర దేశం నుంచి ఒక బైరాగి వచ్చాడు. 'తిరుమలదేవుని సాక్షాత్కారం పొందుతావుపో!' అని తన గురువుగారు ఆశీర్వదించడంతో, తిరుమలకు వచ్చిన ఆ బైరాగి పేరు హత్తీరాం బావాజీ.

పాపవినాశం సోపానమార్గములో ప్రస్తుత సమాధుల దగ్గర ధుని వేసికొని 12 సంవత్సరాల దీర్ఘ కాలం తపస్సు చేశాడు. సాక్షాత్కారం మాట అటుండనిచ్చి, శ్రీవారు యీ బైరాగితో ఆడుకొనేవారు. బోయగా. చెంచుగా, కిరాతకుడిగా, పులిగా, నక్కగా, కుక్కగా వేసాలువేసి యీ బైరాగిని తపస్సు చేసుకోనిచ్చే వాడుగాడు. కోపం వచ్చి హత్తీరాంజీ కొండ దిగిపోతూంటే బ్రాహ్మణుడి వేషంతో అతడిని అనుగమించి, కొండవదలి పోవలదని సలహా ఇస్తూ వెన్నంటి వస్తాడు. హత్తీరాంజీ అతని మాటలను లెక్కచేయడు. చివరకు విధిలేక, అవ్వాచారికోన వద్ద హత్తీరాంజీకి దర్శన మిచ్చి, చివరిదశలో తనలో ఐక్యం చేసుకుంటానని మాట కూడ ఇచ్చారు శ్రీవారు.

ఆ రోజుటి నుంచి, తిరుమల మీద భగవంతుడు - భక్తుడు దాయాలు ఆడుకొనేవారు. ఒకరి నొకరు విడిచిపెట్టకుండా స్నేహితులలాగా మెలగ సాగారు. శ్రీవారి ప్రోద్బలము వలననే హత్తీరాంజీ తిరుమల తిరుపతులలో మఠాలు స్థాపించి సాధువుల పోషిస్తూ - తన శిష్యపరంపరను నెలకొల్పుతాడు. ఆతని శిష్యుడే గిరిధరదాసు.

ఒకప్పుడు చంద్రగిరి దేవరాయల వంశ రాజొకడు - హత్తీరాం అంటే ఏనుగు గదా! నీ ఏనుగు బలం చూపమని హేళనచేస్తే - రాత్రికి రాత్రి బండ్ల కొలది చెఱుకులను తిని, తెల్లవారాక మామూలు మనిషిగా బయటకొచ్చి, తన గొప్పతనం ప్రదర్శించాడట హత్తీరాం చివరి దశలో శ్రీవారి ఆలయ ప్రదక్షిణచేస్తూ ఆయనలో ఐక్యమయిపోయాడు. ఆతని శరీరాన్ని వారి ఆచారం ప్రకారం ధునిలో వేసి భస్మంచేశాడట శిష్యుడు గిరిధరదాసు.

ప్రస్తుతం సమాధుల దగ్గర హత్తీరాంజీకి సమాధి కట్టబడివుంది. ఆయన శిష్యపరంపర వారి సమాధులన్నీ కూడ అక్కడే వున్నాయి. హత్తీరాంజీ తపస్సు చేసినచోట ఆయన ధుని (శ్రీవేణుగోపాలస్వామి ఆలయము) కూడ వుంది. అక్కడ నిత్యం పూజలు జరుగుతున్నాయి.

*హత్తీరాంజీ మహంతు శ్రీవారి ఆలయానికి కట్టెలు సరఫరాచేస్తూ — తనశరీర రక్షణకోసం కొద్దిపాటి ప్రసాదం తీసుకొనేవాడని అందువ్రాయబడి వుంది. కానీ నాకు తెలిసినంత వరకు ఆయన 12 సంవత్సరాలు సమాధులు స్థలము వదలి ఎక్కడికీ పోలేదు. ఆహారంగా ఆయన ఒక ఆకును తినేవారు, దానిని బద్దిఆకు అంటారేమో?. కానీ తిరుమల మీద దాని పేరు హత్తీరాంజీ ఆకు. తినడానికి రుచిగావుంటుంది. ఆకలి కూడ కలుగదు తిరుమలమీద ఆయాకు పుష్కలంగావుంది. తపస్సు చేసిన దీర్ఘకాలం ఆయన ఆ యాకునే తిన్నారట.

ఆయన శిష్యుడు గిరిధరదాస్. నిజానికతడు చంద్రగిరి యాదవ రాజ వంశీకుడయిన గిరిధర రాయలట. వైరాగ్యం కలుగగా, రాచపదవి,

రాజ్యం వదలి సన్యాసియై, హత్తీరాంజీకి శిష్యుడుగాచేరి పోయాడు. హత్తీ రాంజీ శ్రీవేంకటేశ్వరునితో దాయాలు ఆడుతూంటే, ప్రక్కనే నిలబడి నమస్కారం చేస్తూంటాడు యీ గిరిధర రాయలు — (అన్ని చిత్రపటాలలో.)

ఏనుగు కథలో — శ్రీవారు ఏనుగు రూపంలోవచ్చి తన భక్తుడి పరువు కాపాడినారు. గురుతుగా ఆయన అక్కడ పంచితము, లద్ది కూడ వదలినారట. ఎంతదయ!

32. తిరుమల శ్రీవారికి కర్పూర హారతి, అఖండ దీపారాధనలతో బాటు రోజుకు 60 సార్లు సంపూర్ణ నైవేద్యములు సమర్పిస్తారు. ఇందు నిమిత్తం - తిరుపతి ఇలాకాలో ఆయనకు 42 గ్రామాల ఆదాయం ప్రత్యేకించబడినది.

35. తిరుమల శ్రీవారికి కానుకలుగా సమర్పించబడిన వస్తువాహనాదుల విలువతో సమానమైన 'వర్తన' కూడ ధన రూపేణ సమర్పింపబడటం భగవంతుడే నిర్దేశించిన పద్ధతి. ఈ పద్ధతి ప్రకారమే, 18 లక్షల మొహరుల విలువయిన రత్నకవచాన్ని కానుకగా ఇచ్చిన కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి, అంతే మొత్తాన్ని ధన రూపంగా కూడ ఇచ్చాడు. ఈ వర్తన పద్ధతి ఆది నుంచీ వస్తున్న సంప్రదాయం.

37. చిత్రకూటము (చిదంబరము)లో రాజకీయ ఇబ్బందులవల్ల అచ్చట గోవిందరాజస్వామి విగ్రహాన్ని తిరుపతికి తీసుక వచ్చి అక్కడ ప్రతిష్ఠించినారు శ్రీరామానుజాచార్యులు. ఉత్సవ విగ్రహాలు కూడ ఏర్పాటుచేసి, వారికి నిత్య నైవేద్యాలు అమర్చారు. క్రీ. శ. 834 నుంచిపాలన కొచ్చిన యాదవరాజులు, ఆలయ, గోపుర, ప్రాకారాలు నిర్మించారు. దాదాపు 300 సంవత్సరాల క్రితము మట్ల కుమార అనంతరాజు రాజగోపురము నిర్మించడమే గాక ఆలయ ఆవరణలో రెండు బుగ్గబావులు నిర్మించాడు. ఆ వంశీకుడే అయిన మరొక ప్రభువు అప్పయరాజు ఆతని దివాను ముసలయ్యనాయుడు స్వామి

తేరును బాగుచేశారుగానీ, అదితిరిగీ పాడయింది. తూర్పు ఇండియా కంపెనీ వారు, యీమట్లు సంస్థానాన్ని కూడ తమపాలనలోకి లాక్కొన్నారు.

38. తిరుపతిలోని శ్రీ కోదండరామస్వామి దేవాలయాన్ని కలియుగం 64 సంవత్సరం జనమేజయుడను రాజు బాగుచేసినాడు. అతడు ఆలయం, గోపురమంటప ప్రాకారములు నిర్మించగా యాదవరాజులు వాటిని అభివృద్ధి చేసినారు.

**తిరుపతి - శ్రీ కోదండరామస్వామివారి ఆలయము**



# శ్రీ వేంకటాచల ఇతిహాసమాల

ఇది శ్రీ వేంకటాచలమునకు చెందిన చారిత్రక కథల మాల. ఈ చారిత్రక కథలు శ్రీరామానుజాచార్యులకు మునుపుగానీ, తరువాతగానీ లేవు. ఇవి కేవలము ఆయన కాలమునకు చెందినవి. కావున వీటి కాలమును సుమారు క్రీ. శ. 1050 నుంచి 1150 వరకు అని నిర్ణయింప వచ్చును. వీటినన్నిటిని క్రోడీకరించి వర్గీకరించినవాడు - దివాన్ బహదూర్ డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు. ఎం. ఎ., పి. హెచ్.డి. కావున ఆయన ఈ ఇతిహాసమాలకు ఎడిటరు. ఇందులో కొన్నిపురాణ కథలు కూడ వున్నాయి. ఈ మొత్తము ఇతిహాసమాలను ఏడుస్తబకములుగా ఏర్పరించిరి.

మొదట స్తబకములో వైకుంఠములోని శ్రీమహావిష్ణువు. కలియుగ వైకుంఠమగు శ్రీ వేంకటాచలమునకు వచ్చి, సంసారమాయాబద్ధులగు ప్రజల నుద్ధరించుటకు నిశ్చయించుకొనుట వర్ణింపబడినది.

ప్రస్తుత బ్రహ్మకల్పములోని రెండవభాగములో, ఏడవ మనువు పాలనా కాలములోని రెండవదశలో, 8వ మహాకలి ప్రారంభములో నైమిశారణ్యములో జరిగిన మహాయజ్ఞంలో అనేక మంది మునీశ్వరులు - ఋషీశ్వరులు సమావేశమయినారు. ఆ సమావేశములో సూతమహర్షి తిరుమల మీద జరుగబోవు కొన్ని విశేషాలను మహర్షులకు నివేదిస్తాడు.

విక్రమశకము తదనంతరము, శాలివాహన శకమునకు మునుపు పుట్టబోవు తొండమాను చక్రవర్తి కథ ఆతని విజయానికి శ్రీ వేంకటేశ్వరస్వామి తనశంఖు చక్రము దానం చేయడం మొదలగు విషయాలు కూడ సూతమహర్షి వారికి తెలియజేస్తాడు. ఆతడింకా ఈ క్రింది విషయాలు తెలియజేస్తాడు.

ప్రపంచములో ధర్మోద్ధరణకుగాను, తాను వవ్వళించే ఆదిశేషుని పుత్రుడు అనంతుడు లేక ఆనందుడను వానిని భూలోకములో జన్మించమని

ఆదేశిస్తారు మహావిష్ణువు. ఆ ఆనందుని అవతారమే శ్రీరామానుజాచార్యులు. తొండమండలములో మద్రాసు సమీపములోని భూతపురిలో (శ్రీ పెరుంబుదూరు) హరిత గోత్రీకుడయిన కేశవ సోమయాజికి, కలియుగము 4118 సం॥ శాలి వాహనశకము 938 పింగళినామ సంవత్సరము, చైత్రమాసములో ఆర్ద్ర నక్షత్రయుక్త లగ్నమున జన్మించినాడు. సకల శాస్త్రకోవిదుడై, సంస్కృత తమిళ భాషలందు నిష్ణాతుడై శ్రీరంగం పవిత్ర క్షేత్రంలో స్థిరపడివుండగా, తిరుమలలోని వైఖానసులు శ్రీవారి పూజాపునస్కారములు చేయుటలో విఫలు రయి, నారాయణవర యాదవరాజుచే శిక్షింపబడి, తిరుమల వదలిపెట్టి పారి పోయారు. వీరి నిష్క్రమణతో తిరుమలలో నున్న శైవులు కొందరు శ్రీవేంక టేశ్వరస్వామి శివస్వరూపుడన్న వాదనను లేవదీశారు.

శైవులు, తమవాదముతో యాదవరాజును వశపరచుకొను ప్రయత్న ములో నుండగా, యీ సంగతి తెలుసుకొన్న శ్రీరామానుజులు శ్రీరంగం నుంచి తిరుపతికివచ్చి తనవాదముతో శైవులనోడించి, తిరుమల శ్రీవారు సాక్షాత్తు శ్రీమహావిష్ణువని నిరూపిస్తాడు శ్రీరామానుజులు. బంగారుతో చేయించిన శంఖు చక్రములను శ్రీవారు రాత్రికి రాత్రే ధరించి వుదయానికల్లా విష్ణువయి పోవడంతో, శైవులంతా చల్లబడి పోయారట. యాదవరాజు మహా తృప్తిపడి పోయాడు. ఆ రోజుటినుంచి యాదవరాజు ముందు శ్రీ రామానుజులు ఆడినది ఆట పాడినది పాట.

శైవులు పాపం - శ్రీవారిని కుమారస్వామియని, స్వామి పుష్కరిణి, బిల్వపత్రపూజ, జటాఝూటాలు, స్వామివారి నాగాభరణాలు - ఇవన్నీ కుమార స్వామి సంప్రదాయాలు అని ఏవేవో చెప్పబోతారు. అయినా రాజుగారు కానీ, విశిష్టాద్వైత దురంధరుడైన శ్రీ రామానుజులుగానీ ఒప్పుకోరు.

రెండవ, మూడవ, నాలుగవ స్తబకములలో శ్రీవైష్ణవులు – శైవులు పనీపాటా లేకుండా వాదులాడుకోవటం - యాదవరాజు ఓపికగా ఇరువక్షాల వాదనలు వినడం, తిరుమల శ్రీవారు విష్ణుమూర్తియే యని స్థిరపడడం వర్ణింప

గుర్తుగా ఉత్సవము ఎనిమిదవరోజు, తేరునాడు, అనంతునికొక హారము సమర్పించాలని కట్టడిచేసినాడు రామానుజులు.

తిరుపతి సోపాన మార్గములో, ఒక చింతచెట్టుక్రింద తిరుమలనంబి రామానుజులకు శ్రీమత్ రామాయణాన్ని, ఒక సంవత్సరం పాటు, విశేషార్థాలతో బోధించినాడు. ఆ కాలంలో తిరుమలనంబికి శ్రీవారి మధ్యాహ్నపూజ తప్పిపోతోందన్న బాధ వుండేది. ఆబాధ కలుగకుండా శ్రీవారు అక్కడ తన పాదముద్రల అనుగ్రహించినారు. వాటిని పూజ చేసేవారు తిరుమల నంబి శ్రీ రామానుజులు. తదుపరి కొంతకాలానికి యీ స్వామి పాదాలను హరిజనుల పూజకొరకు ప్రత్యేకించడం జరిగింది.

ఒకరోజు తిరుమలనంబి శ్రీ రామానుజులకు విభీషణుని శరణాగతిని గురించి బోధిస్తున్నాడు. ఆశ్చర్యం! ఆ రోజు సీతారామ లక్ష్మణ విగ్రహాలు విభీషణునితోసహా శరణాగతి బొందినట్టుగా ఆ చింతచెట్టు క్రిందికొచ్చాయి. వాటిని శ్రీవారి ఆలయంలో భద్రపఱచినారు. పూజాదికములు ఏర్పాటు చేసినారు. అసలు ఏం జరిగినదంటే-మధుర సమీపంలో కృతమాల (వైగై) నదీతీరంలో విశ్వంభరుడనేఋషి కలవింగంలో నివశించేవాడు. విభీషణుని శరణాగతి గుర్తుంచుకొని, ఆ విగ్రహాలు తయారు చేయించి తాను రోజూ పూజించేవాడు. కొంతకాలం తరువాత అక్కడ రాజకీయ పరిస్థితులు విషమించాయి. ఆ ఋషి కలలో శ్రీ రామచంద్రుడు కనిపించి తనను తిరుమల చేర్చమని కోరడంతో ఆ విగ్రహాలు తిరుమల వచ్చాయి. విభీషణుని శరణాగతిని గురించి తిరుమలనంబి బోధిస్తున్నప్పుడే, ఆ విగ్రహాలు తిరుమల చేరడం దైవలీల గాక మరేమిటి? ఆ సంఘటనతో పొంగి పోయారు తిరుమల నంబి - రామానుజులవారు.

స్వామి పుష్కరిణి తీరంలోని శ్రీ వరాహస్వామికి మొదటి హారతి, గంట, నైవేద్యం జరగాలని కట్టడి చేసినాడు రామానుజాచార్యులవారు. దీనికి కారణం, శ్రీ వరాహస్వామి - తిరుమలలో మొట్టమొదటగా నివసించడం.

తిరుపతిలోని శ్రీ గోవిందరాజస్వామి ఆలయంలో పవళింపు సేవ తరువాత, శ్రీ విష్వక్సేనుని ఆలయంలోని ఒక హారం, సేవకు హాజరయ్యే వారికివ్వవలసినదిగా ఏర్పాటు చేశాడు రామానుజులు.

ఆరవ స్తబకములో - తిరుమలనంబి, అనందాళ్వారు శ్రీవారి సేవ నిమిత్తము ఏ విధంగా తిరుమల చేరినారో వివరింపబడివుంది. ఈ విషయం నేనిదివరకే సవాల్-ఇ-జవాబ్‌లో వివరించాను. ఇక క్రొత్త విషయం ఏమంటే- తిరుమలనంబి పాపనాశ సోపాన మార్గంలో మూర్ఛపోయినపుడు తిరుమల శ్రీవారు ఆయనను 'తాతా!' అని సంబోధించి నందువల్ల, తదుపరి కాలంలో ఆయన శ్రీశైలనాథ తాతాచార్యులు (శ్రీశైలపూర్ణుడని) అని పిలువబడినాడు. అరవంలో ఆయన పేరు తిరుమలై తాతాచార్యులు. తిరుమలనంబికి రామానుజ డనే కుమారుడుండేవాడు. అతడు చిన్నతనంలోనే మరణించినాడు. ఆతని మరణంతో తిరుమలనంబి - కుమార తిరుమలైనంబి అనేవానిని దత్తత స్వీక రించి, అతన్ని 'తాత' అని సంబోధించే వాడు. ఆతడే తదుపరి కాలంలో *తాతాచార్యుడని పిలువబడినాడు. ఆతడు అందరికీ స్నేహపాత్రుడు కావడంతో తాతార్యసఖ్యుడని, తొలప్పతాతాచార్యుడని ప్రసిద్ధి గాంచినాడు.

తిరుమలనంబి పరమపదించిన తరువాత, రామానుజాచార్యులు, ఆయన జ్ఞాపకార్థము అధ్యయనోత్సవాన్ని ప్రవేశ పెట్టినాడు, ఆ నాడు తిరుమంగై యాళ్వారు రచించిన ప్రబంధ పఠనం చేస్తూ శ్రీవైష్ణవులు ఆకాశగంగ జలాలతో నిండిన బిందెల నెత్తిమీద పెట్టుకొని, శ్రీవారి పాదుకలు శిరస్సున నిడుకొని తిరుమల నాలుగు మాడవీధుల ప్రదక్షిణం చేస్తారు. ఇది తిరుమల నంబి జ్ఞాపకార్థము రామానుజాచార్యులు చేసిన ఏర్పాటు.

ఇక చివరిది, ఏడవది అయిన స్తబకములో కొన్ని ఆంక్షలు-నియమాలు, మరికొన్ని చారిత్రక విషయాలు నిక్షిప్తమయి వున్నాయి. ఈ ఆంక్షలు-

---

* ఈ తాతాచార్యులను గురించి ఒక కథ. ఈతడు వీరవైష్ణవుడై తిరుమలకు వచ్చే యాత్రికులకంతా శంఖు, చక్రం ముద్రలు వేసి అందరినీ వైష్ణవులుగా మార్చేవాడట. అందుకని ఒక సామెత అమలులోకి వచ్చింది. తాతాచార్యుల ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు అని.

# తిరుపతి శ్రీవేంకటేశ్వర - బాలాజి

"తిరుపతి శ్రీవేంకటేశ్వర - బాలాజీ" అనుపేరుతో శ్రీ వి. యస్. శ్రీనివాసరావుగారు ఒకపుస్తకం వ్రాసి, 1949లో మద్రాసు ఉమాదేవన్ అండ్‌కో తరఫున ప్రచురించారు. శ్రీయుత శ్రీనివాసరావుగారు చిత్తూరు జిల్లాలో తహ సీలుదారుగా, దేవాదాయ ధర్మాదాయ శాఖలో అసిస్టెంట్ కమీషనరుగా పనిచేసి పదవీ విరమణ చేసినవారు.

తిరుపతి చరిత్ర క్రీ. శ. 1800 నుంచి ఆంగ్లేయుల రికార్డులలో పదిలపరచబడింది. అందువల్ల ఆలయంలో ఆ తరువాత కాలపు శాసనాలు కనిపించవు. లేదంటే ఒకే ఒక శాసనం శ్రీవారి ఆనందనిలయ విమానానికి బంగారు పూత పూయించడానికి సంబంధించినది మహంతుల కాలంనాటిది వుంది.

శ్రీనివాసరావుగారు ఆంగ్లేయుల కాలంలో అవిభక్త మద్రాసు రాష్ట్రంలో - ఈజిల్లాలో పనిచేయడం వల్ల - పైగా రెవిన్యూశాఖ - ఎండో మెంట్సు శాఖవాడయి నందువల్ల ఆంగ్లేయుల రికార్డులు చూసి అసలు విష యాలు గ్రహించే అదృష్టం తిరుమల శ్రీవారికి సంబంధించిన విషయాలు స్వయంగాచూసి, గ్రహించి, అసలు వ్యక్తులనుంచి రాబట్టగలిగే అధికారం ఆయనకు కలిగాయి. తన గ్రంథంలో ఆయన ఎన్నో క్రొత్తవిషయాలు వ్రాశారు. వాటిలో మనకు సంబంధించినవి - సరిక్రొత్తవి - ఆసక్తికర మయినవి ఏరి, వాటిలో కొన్నిటిని మాత్రం ఇచ్చట పొందుపరచడం జరిగింది.

1. తిరుమల శ్రీవారికి ఆపదమ్రొక్కులు మ్రొక్కుకొని, అవతల ఆవిష యం మరచిపోయిన వారిని "తిరుపతి దొంగలు" అంటారట. అట్టి వారిని శ్రీవారి ఆలయంలోనికి ఎప్పటికీ అడుగుబెట్టనీయకుండా నిషే ధించే వారట.

* మంచిదే! ఏకుటుంబమువారు మ్రొక్కుకుని, ఆపద గడచిన తర్వాత మరచి పోయారో - ఆసంగతి వీరికెలా తెలసేది? తెలిస్తేగదా! ఆలయంలోనికి రానీయకుండా చేయడానికి.

2. ఏడుకొండలను - వేంగడం అంటారు. అంటే శాశ్వత స్వర్గమట. తిరుమల అంటే శ్రీశైలం - శ్రీ - నివాసుడు గాబట్టి, ఆయన్మువల్ల శ్రీ పర్వతమైనదట. తిరుపతి అంటే వుపనిషత్తులలో చెప్పబడిన జీవన్ముక్తుని అవస్థ - త్రిపుటియట.

ఏడుసంఖ్య ఎంత ప్రాముఖ్య మయిందో? ఏడుకొండలు (ఏలుమలై అరవం) ఏడుకొండలవాడు, వారమునకు ఏడురోజులు, సప్తర్షులు, సప్తర్షి మండలము, సప్త తాళములు, సప్తసముద్రములు, సప్త సంతానములు ఇలాగ ఎన్నో? 48 దాకా వున్నాయి. వేంగడమంటే పాపదహనంఅని మరొకఅర్థం.

3. తోమాలసేవ జరుగునప్పుడు వెలిగించుదీపాలు - గద్వాల రాజాగారు బహుమతిగా ఇచ్చినవట. చామరాలు వీచు ఇద్దరిలో ఒకరు మైసూరు మహారాజాగారి మనిషట, రెండవవ్యక్తి శ్రీ హత్తీరాంజీ మఠానికి చెందినవారట.

4. కొలువు జరుగునప్పుడు పెట్టే బంగారు గొడుగు మైసూరు మహారాజా గారు బహుమతిగా ఇచ్చినదట. కొలువులో అర్చకులకు రెండు అణాలు, 16 శేర్ల బియ్యం దానంగా ఇచ్చేవారట. చిమ్మిలి భగవంతునికి నైవేద్యంగా పెట్టి అందరికీ ఫలహారంపెట్టేవారట. ఈసేవలో చామరాలు వీచువ్యక్తి హత్తీరాంజీ మఠానికి చెందిన సాధువట.

5. శ్రీవారి ఆలయ బంగారు వాకిలివద్ద ఒకేచోటనున్న రెండుపెద్ద గంటలు మునుపు ద్వారానికి అటువైపు ఒకటి, ఇటువైపు ఒకటి వుండేవట.

* ఈగుర్తుగలవి - యీ రచయిత వ్యాఖ్యలు అని గుర్తించ గలరు.

6. ఏకాంతసేవ జరుగునప్పుడు చిట్టచివర ఇచ్చు హారతి తరిగొండ వెంగమాంబగారి ముత్యాలహారతి. ఏకాంతసేవానంతరము బయటి కొచ్చేవారిని హర్కారా చెక్‌చేసి (వెదికి) పంపేవాడట.

7. శ్రీవారి పూలమాలలు కట్టే గదిని 'యమునోత్తర' అంటారట.

8. శుక్రవారం శ్రీవారి అభిషేకమప్పుడు చందనంతో ఆయన హస్త ముద్రలువేసి, యాత్రికులకు అమ్మేవారట. కుడిచేతిముద్రలను 'అభయహస్తం' అని, ఎడమచేతి ముద్రలను 'మాణిక్యం' అని పిలిచేవారట.

9. తిరుమల శ్రీవారి ఉత్సవాలు - ఏకాదశి, శ్రవణం, రోహిణీనక్ష త్రంలో కృష్ణునిఉత్సవం, ఆరుద్రనక్షత్రంలో భాష్యకారర్ (శ్రీరామా నుజులు) ఉత్సవం మొదలగునవి.

శ్రీరామజన్మ నక్షత్రం పునర్వసునాడు, సీతారామలక్ష్మణ ఆంజనేయు లతో చేయు ఉత్సవాన్ని అధికారి శ్రీరామలక్కన్‌దాసుగారు ప్రవేశపెట్టారు. అలాగే ఆయన చైత్రశుద్ధ ఏకాదశినుంచి పౌర్ణమి వరకు మూడురోజులు జరుగు వసంతోత్సవమును ప్రవేశపెట్టినారు

మైసూరు మహారాజుగారు చిత్తనక్షత్రంలో జన్మించారట. ఆరోజుటి ఉత్సవం ఆయన చేసిన కైంకర్యమట. గద్వాల రాజుగారు ద్వాదశి ఉత్స వాన్ని ప్రవేశపెట్టారట.

10. దక్షిణాయన పుణ్యకాలంలో ఆనిమాసం చివరలో, ఆడినెల మొదటి రోజు జరుగు ఉత్సవాన్ని ఆనివార ఆస్థానం అంటారు. నూతన సంవత్సరంనాడులాగ, విచారణకర్తగారికి జియ్యర్‌గారికి అర్చకులు సీళ్ళు, తాళాలు అప్పగించి, బహుమానం స్వీకరించిన తరువాత తిరిగి తీసికొని విధినిర్వహణకు హాజరయ్యేవారట.

11. తెప్పోత్సవమును మహంతు ప్రయాగదాసుగారు ప్రవేశపెట్టారట.

12. ధనుర్మాసంలో తోమాలసేవకు బిల్వపత్రాలు వుపయోగిస్తారు. ఈ మాసం రోజులు ఏకాంతసేవలో శ్రీవారికి బదులు శ్రీకృష్ణస్వామి పవళిస్తారట.

13. వైదికోత్సవములలో జరుగులోటుపాట్లు పరిహారార్థం చేయుపుత్సవాన్ని అధ్యయనోత్సవ మంటారట.

14. తిరుప్పావడ ఉత్సవంలోని కుంభం — పావడ, శక్తిపూజను గంగ జాతరను గుర్తుకు తెస్తాయట.

15. శ్రీవారి ఆలయంలోని నైవేద్యాలు-రెండురకాలు. చెరుపులు పల్లు-చెరుపు లంటే ఆహారం-పొంగలి-పాయసంలాంటివి. పల్లుఅంటే ఫలహారాలు జిలేబి, లడ్డు, వడ ఎగైరా.

16. "ఏ ఉత్సవానికయినా ఊర్లోవాళ్లు పైసా ఇవ్వకుండా హాజరవుతారు. పరసవాళ్ల దగ్గర డబ్బుగుంజుకుంటారు. బీదాబిక్కి అయితే వదలి వేస్తారు. షాహుకారులను వదలిపెట్టరు. కొండఎక్కి దిగిరావా లంటే డబ్బున్నవాళ్ళు 24 దుగ్గాండ్లు చెల్లించాలి. చెల్లించకపోతే రస్తాకావలికాచే సర్కారు జవానులు వారుచెల్లించనిదే దిగిరానీయరు. బ్రాహ్మణులు, జంగం, జోగి, బైరాగి, దాసరి మొదలగు బీదబిక్కి డబ్బుచెల్లించ నవసరంలేదు" అని క్రీ. శ. 1803లో నారాయణ రావు అనేవ్యక్తి మరాఠీలో వ్రాశారు. ఈయన కల్నల్ మెకంజీగారికి అసిస్టెంటు. క్రీ. శ. 1801లో కంపెనీ వారికి అధికారం వచ్చాక వారు యీపద్ధతి బాగులేదని నిర్దాక్షిణ్యంగా అందరి దగ్గరా 24 దుగ్గాడ్లు (12 అణాలు — ప్రస్తుతం 75 పైసలు) వసూలు చేశారు. అసలు క్రీ. శ. 1750 నుంచే తూర్పుఇండియా కంపెనీవారు ఆర్కాటు నవాబు దగ్గరనుంచి శ్రీవారి ఆలయఆదాయాన్ని గుత్తకు తీసికొన్నారు.

ఉత్తర ఆర్కాటుజిల్లా మాన్యుయల్ తయారుచేసినది ఎ. ఎఫ్. కాక్స్ గారను ఆంగ్లేయుడు. అప్పట్లో యీ ప్రాంతం పై జిల్లాలోని అంతర్భాగం.

కావున ఇచ్చటి స్థలపురాణాలు, ఐతిహ్యాలు, కథలు, చరిత్ర అంతా వ్రాశారా యన. అందులోని కొన్నివిశేషాలు తేదీలవారిగా చదువుకోవచ్చు.

17. క్రీ.శ. 1686 లో చివరి మొగలాయీ చక్రవర్తి అయిన ఔరంగజేబు దక్షిణాదిలోని మహమ్మదీయ రాజ్యాలను జయించాడు. ఆ శిధిలాల మీద స్థాపింపబడినవి హైదరాబాదు నిజాము రాజ్యము. కర్ణాటక నవాబు రాజ్యము. తిరుపతి ప్రాంతముకర్ణాటక నవాబు పరిధిలోకి వచ్చింది.

మరాఠుల దండయాత్రలు, వాటి వెనుక మొగలు దండయాత్రలు, వాటి తరువాత కఱవు కాటకాలు యీ ప్రాంత ప్రజల పరిస్థితులను దుర్భరం చేశాయి. ఔరంగజేబు తిరుపతి కొస్తాడన్న వార్తకూడ ప్రాకింది.

క్రీ. శ. 1750 లో తూర్పు ఇండియా కంపెనీవారు శ్రీవారి ఆలయ ఆదాయాన్ని కర్ణాటక నవాబు నుంచి గుత్తకు తీసుకొన్నారు. అందువల్ల ఆ ఆలయాన్ని - ఆదాయాన్ని పరిరక్షించుకోవటం వారి బాధ్యత అయింది. ఇలా వుండగా—

క్రీ. శ. 1753 తిరుపతిమీద మహమ్మదు కమాల్ దండయాత్ర జరిపాడు. ఆంగ్లేయులు ప్రతిఘటించారు. అందులో ఎంజైన్‌హూల్ట్ అనుఆంగ్లేయ అధికారి మరణించాడు. ఆ తర్వాత ఆగిల్వి అను అధికారి కమాల్ మీద విరుచుకపడడంతో కమాల్ ఏనుగు గాయపడి అతడు ఆంగ్లేయులకు పట్టుబడినాడు. అక్కడికక్కడే అతనికి మరణశిక్ష విధించబడింది.

క్రీ. శ. 1757 లో మహమ్మదాలీ సోదరుడు నజీబుల్లా అన్నమీద తిరుగబడి, పశ్చిమ పాళేగార్లయిన కాళహస్తి, కార్వేటినగరం వారి జమీందారీలను దోచుకోసాగాడు. పై సంవత్సరం ఆగస్టు మాసములో తిరుపతికి వచ్చి శ్రీవారి బ్రహ్మోత్సవ సమయములో ఆలయాన్ని దోచుకోవాలని నిర్ణయించుకున్నాడు. ఈ సంగతి పసిగట్టిన ఆంగ్లేయులు వాడి ఆటలు సాగనివ్వకుండా వాడిని సాగనంపినారు. వాడు వూరికి పోతూ పోతూ దారిలో కనిపించిన యాత్రీకుల ముడుపుల మూటలు గుంజుకొనిపోయి ఆ సంవత్సరం శ్రీవారి ఆలయ ఆదాయం తగ్గేలా చేశాడు.

క్రీ. శ. 1758 సెప్టంబరులో 'మెరచిన్' అనే ఫ్రెంచి అధికారి, శ్రీవారి బ్రహ్మోత్సవ సమయములో తిరుమలలో విడిదిచేసినాడు. బ్రహ్మోత్సవము చూడడానికికాదు - శ్రీవారి ఆలయం దోచుకోవడానికి వాడికి తోడుగా నెల్లూరు నజీబుల్లా, చంద్రగిరి అబ్దుల్ వహాబ్ తమ సేనలతో విచ్చేసినారు. అప్పట్లో శ్రీవారి బ్రహ్మోత్సవము 25 రోజులు జరిగేదట. 60,000 వగోడాల ఆదాయం (పౌండ్లు 24,000 స్టెర్లింగ్) శ్రీవారికి వచ్చేదట.

ఈ ఫ్రెంచి అధికారికి ఆలయం దోచుకోవలసిన అవసరం తప్పిపోయింది. ఎందుకంటే ఆలయ కంట్రాక్టరు ఇంగ్లీషువారి కివ్వవలసిన ముడుపు ఇతనికి చెల్లించి చేతులు కడుగుకున్నాడు. ఇతడు పోతూ పోతూ తన సేనల కొందరిని ఆలయానికి గావలిబెట్టి, నజీబుల్లా సేనలతో ఆర్కాటుకు 16 వ తారీఖున వెళ్లాడట. ఈ ఏర్పాటు చంద్రగిరి నవాబు అబ్దుల్ వహాబుకు నచ్చకుండా తన సేనలతో చంద్రగిరి చేరాడట - ఫ్రెంచివాడిని తిట్టుకుంటూ.

క్రీ. శ. 1759 మార్చిలో ఫ్రెంచివారు మద్రాసులోని ఆంగ్లేయుల స్థావరాన్ని ముట్టడించినారు. మహారాష్ట్రనుంచి గోపాలరావు దామలచెఱువు దగ్గరకు వచ్చి విడిదిచేసి, మొదట ఫ్రెంచివారికి, తదుపరి ఆంగ్లేయులకు సహాయం చేస్తానన్నాడు. వాడి సహాయాన్ని వారిద్దరూ వద్దన్నారు. ఆ కోపంతో వాడు కసిదీర్చుకోవడానికి, నష్టం పూడ్చు కోవడానికి అన్నట్టు శ్రీవారి ఆలయంమీద దండెత్తి ఆలయాన్ని ఆక్రమించుకొన్నాడు.

గోపాలరావుని పూనానుంచి వాడి అధికారి బాలాజీరావు పిలిపించాడు. వాడు పోతూ పోతూ అబ్దుల్ వహాబ్‌ను చంద్రగిరికి పొమ్మని, నారాయణ శాస్త్రి అనే అసిస్టెంట్‌ను సేనల చూచుకోమని చెప్పివెళ్లాడు. వాడు అటు పోతూనే అబ్దుల్ వహాబ్ మరాఠా సేనలను శ్రీవారి ఆలయంలో నుంచి తరిమివేసి, ఆలయం తనకు కౌలుకిమ్మని ఇంగ్లీషువారికి అర్జీపెట్టుకున్నాడు. మహమ్మదీయుడు హిందూ ఆలయం కౌలుకడగడం బాగలేదని ముందున్న కంట్రాక్టరునే స్థిరపరచినారు ప్రెసిడెన్సీవారు.

క్రిందికి తరుమబడిన నారాయణశాస్త్రి రేణిగుంట దగ్గరి కరకంబాడిలో చిన్నపాళేగారు నాశ్రయించి అక్కడ తన సేనలతో విడిదిచేసినాడు. కరకంబాడి పాళేగారు, మట్లవారి అధికారి. అందువల్ల నారాయణశాస్త్రికి మట్లవారు సైనిక సమీకరణకు తోడ్పడగా వాడు కరకంబాడి కొండల్లో రాత్రికి రాత్రి ప్రయాణంచేసి జూన్ 30 వ తారీఖు రాత్రి తిరుమల ఆలయాన్ని వశపరచుకొన్నాడు.

శ్రీవారి ఆలయ కౌలుదారులచే పోషింపబడుతున్న సైన్యాలు ఎంజైన్ విల్‌కాక్స్ నాయకత్వంలో తిరుపతిలో నున్నారు. కానీ నారాయణశాస్త్రిని తిరుమల ఆలయం నుంచి తరుమగొట్టడానికి వారు చాలరు. 8-7-1759 మద్రాసు నుంచి మేజర్ కలియడ్ నాయకత్వంలో 200 ఆంగ్లేయులు, 300 సిపాయిలు తిరుపతి కొచ్చారు. వారందరూ కొండ ఎక్కడానికి అర్హత కలవారు కారు. వారిలో 80 మందికి మాత్రము అర్హత కలదట. ఈలోగా నారాయణశాస్త్రికి మట్లవారి నుంచి అదనపు సైన్యాలు 9-7-1759 లో అడవుల గుండా కొందరు, మైదానాల మీద కొందరు వచ్చి తెల్లవారుఝామున 4 గంటలకు ముట్టడించారు. తిరుపతిలో నున్న ఆంగ్లేయ సైనికులు ఒక గంట యుద్ధంచేసి వారిని వచ్చిన దారిగుండా తిరిగి పోయేట్టు చేశారు. అయినా శ్రీవారి ఆలయమింకా నారాయణశాస్త్రి స్వాధీనంలో వుంది. మద్రాసు నుంచి వందలమంది సైనికులు వస్తున్నా తిరుమల మీదికి పోవడానికి ఎక్కువమంది నిషిద్ధులు.

మేజర్ కలియడ్ ఇక చేయునదిలేక తన సైన్యాలతో కరకంబాడి గ్రామాన్ని ముట్టడించి నారాయణశాస్త్రి విడుదులకు నిప్పు పెట్టినాడు. ఈ నిర్వహణలో కరకంబాడి పాళేగారు చనిపోయాడు. శ్రీవారి ఆలయ కౌలుదాయి అర్హత గల సైన్యాలతో నారాయణశాస్త్రిని తిరుమల ఆలయం నుంచి యీసారి తరమగలిగినాడు. దీనితో వాడిపీడ విరగడ అయింది.

క్రీ.శ. 1782 జనవరి మాసంలో చంద్రగిరి కోటను హైదరాలీ ముట్టడించినాడు. హైదరాబాదు నిజాము తొత్తు అయిన అబ్దుల్‌వహాబ్ యుద్ధం

చేయకుండానే హైదరాలీకి లొంగిపోయాడు. అయినా నమ్మక ద్రోహి అయిన ఇతని మీద హైదరాలీకి జాలి కలుగలేదు. సకుటుంబ సమేతముగా వాడిని బంధించి శ్రీరంగపట్నం పంపించాడు. అవతల వాడి అడ్రసు ఎవరికీ తెలియదు-(హైదరాలీ గానీ వాడి సైనికులు గానీ తిరుపతి పరిసరప్రాంతాల ఆలయాలను పోచుకున్నారు గానీ, ఎక్కువగా ఆదాయం వచ్చే శ్రీవారి ఆలయాన్ని, పద్మావతిఅమ్మ ఆలయాన్ని, శ్రీ గోవిందరాజస్వామి ఆలయాన్ని పవిత్రంగా చూశారు). హైదరాలీ తరపున శ్రీవారి ఆలయాన్ని ఆనిగాళ్ల నరసయ్య అనేవాడు క్రీ. శ. 1782-84 లో నిర్వహించినట్టు అముల్‌దారుల జాబితాలో వుంది:

* ఈ చరిత్ర అంతా చదివితే మనకు కొన్ని సందేహాలు కలుగుతాయి. ఇవి ఎవరికయినా కలుగుతాయి.

నారాయణశాస్త్రి చేతుల్లో కొన్ని ఏందలమంది సైనికులు తిరుమల మీద చనిపోయారు. వారి రక్తపాతంతో శ్రీవారి ఆలయం అపవిత్రం కాలేదు గానీ, ఆంగ్లేయులు మహమ్మదీయులు, హిందూవులలోని బలహీన వర్గాలు వీరు అడుగు బెట్టగానే మన శేషాచలం తన పవిత్రతను కోల్పోతుంది. ఇది ఆనాటి మన ఆచార్యపురుషల-జియ్యంగారుల ప్రతిభ అందామా? లేక అప్రతిభ అందామా?

తిరుమలకు, మనలను అడిగి వచ్చే ఆంగ్లేయులను పవిత్రత పేరుతో రానీయక పోతిమి. అడుగకనే వచ్చిన నజీబుల్లా అబ్దుల్‌వహాబ్ సోదరులు మహమ్మదీయులయినా వారినేమీ చేయలేక పోతిమి. ఇదీ మన పవిత్రత, వారి రాకతో మన ఆలయం అపవిత్రం కాలేదా?

హైదరాలీ శ్రీనివాసమంగాపురం, తొండవాడ తిమ్మప్ప ఆలయం, శ్రీ అగస్త్యేశ్వర ఆలయం, మట్ల గోపురం, చంద్రగిరి కోటలోని ఆలయాల సముదాయం కొత్తకోనేటి శివాలయం తిరుపతిలోని అచ్యుతరాయపురం (కొట్టూరు) జియ్యంగారి గుడి అని పిలువబడే తిరుమంగైయాళ్వారు గుడి, యోగి మల్లవరంలోని పరాశరేశ్వర ఆలయం వీటిని మాత్రం కొల్లగొట్టినాడు.

చేయకుండానే హైదరాలీకి లొంగిపోయాడు. అయినా నమ్మక ద్రోహి అయిన ఇతని మీద హైదరాలీకి జాలి కలుగలేదు. సకుటుంబ సమేతముగా వాడిని బంధించి శ్రీరంగపట్నం పంపించాడు. అవతల వాడి అడ్రసు ఎవరికీ తెలియదు-( హైదరాలీ గానీ వాడి సైనికులు గానీ తిరుపతి పరిసరప్రాంతాల ఆలయాలను దోచుకున్నారు గానీ, ఎక్కువగా ఆదాయం వచ్చే శ్రీవారి ఆలయాన్ని, పద్మావతిఅమ్మ ఆలయాన్ని, శ్రీ గోవిందరాజస్వామి ఆలయాన్ని పవిత్రంగా చూశారు ). హైదరాలీ తరపున శ్రీవారి ఆలయాన్ని ఆనిగాళ్ల నరసయ్య అనేవాడు క్రీ. శ. 1782-84 లో నిర్వహించినట్టు అముల్‌దారుల జాబితాలో వుంది:

* ఈ చరిత్ర అంతా చదివితే మనకు కొన్ని సందేహాలు కలుగుతాయి. ఇవి ఎవరికయినా కలుగుతాయి.

నారాయణశాస్త్రి చేతుల్లో కొన్ని ఏందలమంది సైనికులు తిరుమల మీద చనిపోయారు. వారి రక్తపాతంతో శ్రీవారి ఆలయం అపవిత్రం కాలేదు గానీ, ఆంగ్లేయులు మహమ్మదీయులు, హిందూవులలోని బలహీన వర్గాలు వీరు అడుగు బెట్టగానే మన శేషాచలం తన పవిత్రతను కోల్పోతుంది. ఇది ఆనాటి మన ఆచార్యపురుషుల-జియ్యంగారుల ప్రతిభ అందామా? లేక అప్రతిభ అందామా?

తిరుమలకు, మనలను అడిగి వచ్చే ఆంగ్లేయులను పవిత్రత పేరుతో రానీయక పోతిమి. అడుగకనే వచ్చిన నజీబుల్లా అబ్దుల్‌వహాబ్ సోదరులు మహమ్మదీయులయినా వారినేమీ చేయలేక పోతిమి. ఇదీ మన పవిత్రత, వారి రాకతో మన ఆలయం అపవిత్రం కాలేదా ?

హైదరాలీ శ్రీనివాసమంగాపురం, తొండవాడ తిమ్మప్ప ఆలయం, శ్రీ అగస్త్యేశ్వర ఆలయం, మట్ల గోపురం, చంద్రగిరి కోటలోని ఆలయాల సముదాయం కొత్తకోనేటి శివాలయం తిరుపతిలోని అచ్యుతరాయపురం (కొట్టూరు) జియ్యంగారి గుడి అని పిలువబడే తిరుమంగైయాళ్వారు గుడి, యోగి మల్లవరంలోని పరాశరేశ్వర ఆలయం వీటిని మాత్రం కొల్లగొట్టినాడు.

అధికార పెరిగిపోతూండడంతో, చంద్రగిరి నవాబు వాడితో బేటీ అయినాడేమో నని ఆంగ్లేయులకు సందేహం గలిగింది. అందువల్ల వారు ఒక అంగీ కారానికి వచ్చారు. ఆంగ్లేయ సేనలు చంద్రగిరిలో వుంటూ యీ ప్రాంతాన్ని కాపాడతాయి. వారి ఖర్చుల నిమిత్తం నవాబు ఏటా 9 లక్షలు చెల్లించాలి. ఈలోగా యుద్ధం వస్తే మొత్తం నవాబి ఆదాయం ఆంగ్లేయులు లాక్కొని నవాబు ఖర్చుల నిమిత్తం ఐదింట ఒక భాగం ఇస్తారు. ఇదీ అగ్రిమెంటు. దీనిలోని ఇంకో నిబంధన ఏమంటే, ముఖ్యమయిన పాళేగార్ల నుంచి పేష్కస్‌ను కంపెనీ వారే వసూలుచేసి నవాబు ఖాతాలో జమచేస్తారు. ఈ విధంగా కార్వేటి నగరం, కాళహస్తి, వెంకటగిరి జమీందారీలు ఆంగ్లేయుల పాలన క్రిందికి వచ్చాయి. చివరి రెండు మైసూరు యుద్ధాలవల్ల కంగుంది కుప్పం, పుంగనూరు పలమనేరు సమీపంలోని మొగిలి వెంకటగిరి జమీందారీలు కూడా యీ జిల్లాలో కలిశాయి.

క్రీ.శ. 1795 లో మహమ్మదాలీ మరణించినాడు. అతని కుమారుడు ఉమ్‌దుల్ ఉల్ ఉమ్రా నవాబయినాడు. కంపెనీ వారు అగ్రిమెంట్ మార్చా లన్నారు. కొత్త నవాబు ఒప్పుకోలేదు.

క్రీ. శ. 1799 లో నాలుగవ మైసూరు యుద్ధం జరిగింది. యుద్ధం వచ్చినా అగ్రిమెంట్ మార్చడానికి ఉమ్రా ఒప్పుకోలేదు. పైగా మైసూరు, చంద్రగిరి వారి మధ్య నడిచిన రహస్య లేఖలు బయటపడినాయి. ఆంగ్లేయులు దీనిలో తమ ఇదివరకటి అగ్రిమెంటును రద్దుచేసుకోవాలని నవాబు దగ్గర కెళ్లితే, వీరి కంటే ముందు యమధర్మరాజు గారు వెళ్లి వాడిని తీసుకపోయాడు. వాడి కొడుకు ఆలీహుస్సేన్ కూడ ఆంగ్లేయుల మాట విననంటే వినను అన్నాడు. దాంతో ఆంగ్లేయులకు కోపం వచ్చి చనిపోయిన నవాబు తమ్ముడు అజీమ్ ఉల్ ఉమ్రాను అందలం ఎక్కించారు.

31–7–1801 తారీఖున యీ క్రొత్త నవాబు, ఒక క్రొత్త అగ్రి మెంటు వ్రాసుకొంటూ నవాబి ఆదాయంలో ఐదింట ఒక భాగం తనకు, తన

కుటుంబానికిచ్చి, తక్కినది మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి పేనడగను అన్నాడు. దానితో యీ ప్రాంతం ఆంగ్లేయుల ప్రత్యక్ష పాలనలోకి వచ్చింది. అప్పటికి ఒక శతాబ్దం క్రిందట చంద్రగిరి రాజు దగ్గర మద్రాసులో దిగడానికి అనుమతి తీసుకొన్నారు. ఒక శతాబ్దం తరువాత తిరుమల శ్రీవారి హుండీ మీద అధికారం వారి హస్తగత మయింది.

క్రీ. శ. 1804 లో జిల్లా కలెక్టరు స్ట్రాటన్ పర్మనెంట్ సెటల్‌మెంటు పద్ధతి నచ్చని కొందరు పాళేగార్లు తిరుమలకు వచ్చే రహదారుల నన్నిటినీ కావలి కాచి యాత్రికులను దోచుకోసాగారు. ఆంగ్లేయులు రస్తాలపై సైనికుల బెట్టి కాపలా కాయగా వీరి ఆటకట్టింది. దీనితో శ్రీవారి ఆలయానికి శత్రువుల బాధ శాశ్వతంగా విరగడ అయింది.

క్రీ. శ. 1843 లో మహంతుల పాలన ఆరంభమయి క్రీ.శ. 1933 వరకు కొనసాగడం, అవతల కమిటీ వారి పాలన ప్రారంభమయి, ఇప్పటి వరకు కొనసాగుతూండడం అందరికి తెలిసిందే.

19. మెకంజీ కైఫీయతులలో తిరుపతి సరిహద్దులిలా పేర్కొన బడినాయి. పశ్చిమము - చంద్రగిరి తాలూకా, దక్షిణం - కార్వేటినగరం, నారాయణవరం వరకు, తూర్పు కాళహస్తి, ఉత్తర - వెంకటగిరి, నాగపట్ల, వాయల్పాడు తాలూకాలోని, దేవరకొండ, రాయచోటి తాలూకాలోని యర్ర గుంట కోట వరకు వ్యాపించి వుండెడిపట.

20. మరొక కైఫీయతులో యీ క్రింది విషయం వుంది. క్రీ. శ. 1787 లో చంద్రగిరి నవాబు మహమ్మదాలి, తన పాలనలోని గ్రామాలు కొన్ని అన్యాక్రాంతం కావడంతో ఆ సంగతి విచారించడానికి సయ్యద్ మహమ్మద్ ఖాన్ అను ముఖ్య అధికారిని, సర్‌బారీక్లోజ్ అను ఆంగ్లేయ అధికారిని పంపగా వారు ఒకటిన్నర సంవత్సరాలు కష్టపడి ఆ వివరాలు సేకరించారట నవాబు బలహీనుడు కావడం వల్ల ఆ గ్రామాలను పాళేగార్లు వదలలేదట.

21. క్రీ. శ. 1801 నాటికి (అనగా దుర్మఖనామ సంవత్సరం కంపెనీ సర్కారు ఫసలీ 1211.) తిరుపతి శ్రీవారి ఆలయానికి 187 గ్రామాలు వుండేవట.

22. శ్రీవారి ఆలయం తరపున కంపెనీ వారికి 18 గ్రామాలు వుండేవి. వాటిలో తిరుపతి తాలూకాలో 6 గ్రామాలు, చంద్రగిరి తాలూకాలో 5 గ్రామాలు, గాజులమెండ్యం తాలూకాలో 7 గ్రామాలు ఇక్కడ తొండవాడ పేరు క్రీ. శ. 1801 లో కనబడినది.

23. తిరుచానూరులోని పద్మసరోవరం చుట్టూ శ్రీనివాసాచారి అనే ఆయన భావసంవత్సరములో 26 వృత్తుల ఇండ్లుగట్టి బ్రాహ్మణులకు ధారాదత్తంచేశాడట. హేవళంబినామ సంవత్సరములో రాజా బీరబల్ రాయోజీ (మహమ్మదాలీ రెవిన్యూ మంత్రి - ఆర్కాటు సుబాకు బ్రాహ్మణ గవర్నరు) పైగ్రామాలలోని 'కావలి' సుంకాలలో 26 ఇండ్ల బ్రాహ్మణ అగ్రహారం పద్మసరోవరం చుట్టూ నిర్మించి బ్రాహ్మణులకు దారాదత్తం చేశాడట.

24. శ్రీవారి ఆలయ ఖర్చులు యాదవరాజుల కాలంలో నూరుశాతం వుండేవి. విజయనగర చక్రవర్తులు 75 శాతం చేశారు అందులో శ్రీరంగ రాయల కాలంలో ఆ ఖర్చు 50 శాతం అయింది. మహమ్మదీయుల పాలనలో ఆ ఖర్చు 6 లేక 7 శాతం వరకు దిగజారింది. క్రీ. శ. 1700 నుంచి 1800 వరకు శ్రీవారి ఆలయ అమలు దార్ల కాలంలో ఆ ఖర్చు ఇంకా తగ్గించబడి డబ్బంతా తమ స్వంత ఖర్చులకు మిగులబెట్టుకొనేవారు.

25. క్రీ. శ. 1800 నాటికి శ్రీవారి ఆలయనాలుగు మాడవీధులలో తప్ప ఇంకెక్కడా జనసంచారం వుండేదిగాదు. ఆ తిరువీధి వరున మండపాలలో కూడా అడవిపందులు, తేళ్లు, పాములు నిండివుండేవి. యానాది వారు మాత్రం ఇక్కడ నివాసముండేవారు. మెకంజీ కైఫీయతులలో లక్ష మంది యానాదివారు, తేనె, మైనం, ఎఱ్ఱచందనం, పండ్లు - కందమూలాలు సేకరిస్తూ జీవిస్తున్నారని, ముఖ్యంగా వారు వనమూలికల సేకరణతో జీవించే

వారని వ్రాయబడివుంది. ఇక్కడెన్నో గుహలున్నాయట. అందులో ఒక గుహమార్గం అహోబిలంవరకు పోతుందట. యాత్రికులు నాలుగువీధులు విడిచి దూరంగా పోవడం నిషిద్ధమట.

26. నాగపట్ల నాయకుడనువాడు తిరుమలలోని తీర్థాలన్నీచూసి రావడానికి బ్రాహ్మణులతో, సైనికులతో బయలుదేరి, దేవతల సైన్యం ఆ ప్రయత్నంనుంచి వారిని విరమింవజేయాలని తలపడి పోరగా అందరూ అక్కడే గతించారట. ఇంతవరకు తిరిగిరాలేదు. ఇక రాబోతారా?

27. తిరుమల నాలుగు మాడవీథులలో అడవి పందులు పడుకొని వుండేవట. అయినా అవి యాత్రీకులను ఏమీ అనవట. యాత్రీకులు వాటి జోలికి పోతేవూరుకోవట. చీల్చి చెండాడుతాయట. పుట్టలో వ్రేలుబెడితే చీమకుట్టకుండా వూరకుంటుందా?

28. ఆకాలంలో ఏవిషజంతువు కఱచినా, ఏ విషపురుగు కుట్టినా వున్న ఒకే ఒకమందు శ్రీవారితీర్థం, కఱచిన లేదా కుట్టినచోట కొద్దిగా రుద్దితే చాలు, ఠక్కున బాధమాయమయ్యేదట.

29. దత్తమండలాలకు మొదట ఐదుజిల్లాలకు కలిపి సర్‌థామస్ మన్రో కలెక్టరుగా వుండేవాడు. ఆయన తరువాత ఉత్తరార్కాటు జిల్లా (అప్పట్లో మన జిల్లా) మొదట కలెక్టరు మిస్టర్‌స్ట్రాటన్. ఆయన తరువాత కాక్‌బర్న్. ఆయన తరువాత వచ్చిన గ్రీమ్స్ గొప్పవాడు. ఆయన పేరుతో చిత్తూరులో వెలిసిన గ్రీమ్స్‌పేట, ఇంకా ఆపేరే కలిగివుంది.

30. క్రీ. శ. 1802లో అనగా 1212 ఫసలీకి, రాజురామ్‌జోసో అనువాడు శ్రీవారి ఆలయాన్ని సాలీనా 65,000 నక్షత్ర పగోడాలకు గుత్తకు తీసుకుంటానని టెండరువేశాడు. ఈ మొత్తంలో పగోడాచార్జీలు కలుపబడలేదట. కలిపితే ఇంకెంత మొత్తమవుందో తెలియదు. ఇందులో ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటంటే, కంపెనీవారి లెక్కల్లో అంతకుమునుపు అనగా గతించిన 5 సంవత్సరాల ఆదాయం మొత్తం కలిపితే 62,881 నక్షత్ర పగో

డాలట. మరి ఒక సంవత్సరానికి 65,000 నక్షత్ర పగోడాలు చెల్లిస్తా నన్నాడే దీనిభావమేమి తిరుమలేశ ?

బహుశా కంపెనీవారికి డబుల్ ఎంట్రీ త్రిబుల్ ఎంట్రీ పద్ధతి లెక్క లుండేవేమో ?

*ఇలా వ్రాస్తూపోతే. ఇదొక పెద్ద గ్రంథమయిపోతుంది. తిరుమల చరిత్రకు అంతుపొంతు లేదు.

తిరుమల చరిత్ర లేదా యీప్రాంతీయ చరిత్ర మొత్తం మహాసాగర మయితే అందులో నేను గ్రహించింది ఒక నీటిబొట్టు. పాఠకులయిన మీకు అందించినది కొన్నితుంపరలు మాత్రం.

లేదా యీ చరిత్రమొత్తం ఒక పంచదార రాశిఅయితే, నేను సేకరించ గలిగినది ఒక పిడికెడు. ఇకమీకు అందించినది కొన్ని కణికలు మాత్రం.



# తెలుసుకోదగిన కొన్ని విశేషాలు

సువర్ణముఖరీ నదీ తీరములో వెలిసిన ప్రాచీన ఆలయాలన్ని శివాలయములే!

1. ఆదినేపల్లి - అగస్త్యపర్వతము వద్ద వెలిసిన నవీన శివాలయము- సువర్ణముఖీనది జన్మస్థానము.

2. తొండవాడ - అగస్త్యేశ్వర ఆలయము ప్రాచీనమయినది. సువర్ణ ముఖి - భీమానది - కళ్యాణినదులతో కలిసి ఇచ్చట త్రివేణీ సంగమ మయింది. ఈ క్షేత్రకాలనిర్ణయము చేయ వీలుగాదు.

3. యోగిమల్లవరం (జోగులమల్లారం) తిరుచానూరు సమీపం— తిప్పలాధీశ్వరముడయ మహాదేవ అనిపేరు గలిగిన పరాశరేశ్వరస్వామి ఆల యం సుమారు క్రీ. శ. 800 ప్రాంతమున వెలిసినది.

4. ఇక్కడ తిరుపతి కపిలతీర్థంలోని శ్రీకపిలేశ్వరస్వామిని కూడ లెక్కించు కోవచ్చుకానీ, ఆ ఆలయానికి సువర్ణముఖి తీరం కనీనం మూడు మైళ్ళదూరంలోవుంది సుమారు క్రీ. శ. 1050 ప్రాంతమున వెలిసినది.

5. గుడిమల్లం - పాపానాయుడుపేట దగ్గర. పరుశురామేశ్వరస్వామి దేవాలయము. క్రీ. పూ. 1వ శతాబ్దమునాటిదని భావింపబడుచున్నది. ఇచ్చట బాణరాజుల శాసనములు అనేకమున్నవి. ఈ శివలింగము ఆకారము ప్రత్యేక మైనది పురుషాంగము మీద పరమశివుని ప్రతిమ చెక్కబడివున్నది. శ్రీవేంకటేశ్వరస్వామిలా యీ పరమశివుడు ప్రకాశంగా తళతళ మెరుస్తూ వుంటాడు.

6. తొండమనాడు - శ్రీకాళహస్తి సమీపం - శ్రీ ఆదిత్యేశ్వరాలయము. ఆలయము ముచ్చటగావుంది. దేవుడులేడు.

7, శ్రీకాళహస్తి - తిరుక్కాలత్తి దేవుడనబడు శ్రీకాళహస్తీశ్వరాలయ ములోని వాయులింగం. శ్రీ=సాలెపురుగు, కాళ=సర్పము, హస్తి=ఏనుగు.

ఈ ఆలయాలన్నీ ప్రాచీనములు. ఇందులో కొన్ని క్రీస్తు పూర్వం నాటివి. ఇటుకలు, సున్నం, కఱ్ఱలు - పూడగొట్టి - పల్లవులు - శిలలతో నిర్మాణం ప్రారంభం చేశారు. చోళులు - పాండ్యులు - బాణచక్రవర్తులు - విజయనగర చక్రవర్తులు వాటిని అభివృద్ధి పరచినారు.

శిలాతోరణాలు:— "1000 మిలియన్ల (నూరుకోట్ల) సంవత్సరాల క్రితం ఏర్పడిన శిలాతోరణాలు ప్రపంచములో ముచ్చటగా మూడువున్నాయి. తిరుమల చక్రతీర్థం సమీపాన ఒకటి. అమెరికా ఉతాలోని ఇంద్రధనస్సు వంతెన - రెండు, ఇంగ్లాండు డాల్ రెయిడన్ క్వార్ట్జైట్‌లోని హెడ్‌లాండు శిలాతోరణం మూడు - అంటే అమెరికా ఖండంలో ఒకటి, ఐరోపాఖండంలో - ఒకటి, - ఆసియాఖండంలో ఒకటివున్నాయి." (ది హిందూ -8-6-1979- యు. ఎన్. ఐ. విలేఖరి).

100 కోట్ల సంవత్సరాల నాటిదిగా భావింపబడుతున్న తిరుమల శిలాతోరణం.



ఈ ఆలయాలన్నీ ప్రాచీనములు. ఇందులో కొన్ని క్రీస్తు పూర్వం నాటివి. ఇటుకలు, సున్నం, కఱ్ఱలు - పూడగొట్టి - పల్లవులు - శిలలతో నిర్మాణం ప్రారంభం చేశారు. చోళులు - పాండ్యులు - బాణచక్రవర్తులు - విజయ నగర చక్రవర్తులు వాటిని అభివృద్ధి పరచినారు.

శిలాతోరణాలు :— "1000 మిలియన్ల (నూరుకోట్ల) సంవత్సరాల క్రితం ఏర్పడిన శిలాతోరణాలు ప్రపంచములో ముచ్చటగా మూడువున్నాయి. తిరుమల చక్రతీర్థం సమీపాన ఒకటి. అమెరికా ఉతాలోని ఇంద్రధనస్సు వంతెన - రెండు, ఇంగ్లాండు డాల్ రెయిడన్ క్వార్ట్జైట్‌లోని హెడ్‌లాండు శిలాతోరణం మూడు - అంటే అమెరికా ఖండంలో ఒకటి, ఐరోపాఖండంలో - ఒకటి, - ఆసియాఖండంలో ఒకటివున్నాయి." (ది హిందూ -8-6-1979- యు. ఎన్. ఐ. విలేఖరి).

100 కోట్ల సంవత్సరాల నాటిదిగా భావింపబడుతున్న తిరుమల శిలాతోరణం.



ఈ ఆలయాలన్నీ ప్రాచీనములు. ఇందులో కొన్ని క్రీస్తు పూర్వం నాటివి. ఇటుకలు, సున్నం, కఱ్ఱలు - పూడగొట్టి - పల్లవులు - శిలలతో నిర్మాణం ప్రారంభం చేశారు. చోళులు - పాండ్యులు - బాణచక్రవర్తులు - విజయ నగర చక్రవర్తులు వాటిని అభివృద్ధి పరచినారు.

శిలాతోరణాలు:— "1000 మిలియన్ల (నూరుకోట్ల) సంవత్సరాల క్రితం ఏర్పడిన శిలాతోరణాలు ప్రపంచములో ముచ్చటగా మూడువున్నాయి. తిరుమల చక్రతీర్థం సమీపాన ఒకటి. అమెరికా ఉతాలోని ఇంద్రధనస్సు వంతెన - రెండు, ఇంగ్లాండు డాల్ రెయిడన్ క్వ్యార్ట్జైట్‌లోని హెడ్‌లాండు శిలాతోరణం మూడు - అంటే అమెరికా ఖండంలో ఒకటి, ఐరోపాఖండంలో - ఒకటి, - ఆసియాఖండంలో ఒకటివున్నాయి." (ది హిందూ -8-6-1979- యు. ఎన్. ఐ. విలేఖరి).

100 కోట్ల సంవత్సరాల నాటిదిగా భావింపబడుతున్న తిరుమల శిలాతోరణం.



తిరుమల - తిరువేంగడం

తిరుపతి - తిరువేంకటాపురం

తిరుచానూరు - తిరుచ్చొకినూరు

తొండవాడ - తొండప్పాడి - తొండవ్వాడి - తొండవాడ

తుంగరామన్నపల్లి

తనపల్లి

తండ్లం

తిరుమండ్యం

తాతేకాల్వ

తూకివాకం

తొండమనాడు

తిమ్మినాయుడుపాళెం

ఇచ్చట వెలిసిన దైవములు

తిరువేంగడ ముడైయాన్ ⎫
తిరువేంగళనాథ ⎬ శ్రీ వేంకటేశ్వరస్వామి
తిరుపతి దేవర ⎭

తిమ్మప్ప (శ్రీవారికి పురందరదాను పెట్టినపేరు. ఈ పేరుతో తొండవాడలో వెలిసిన ఆలయము శిథిలమైయున్నది.)

తిప్పలాధీశ్వర ముడయ మహాదేవ (పరాశరేశ్వరస్వామి)

తిరుక్కాలత్తి వుడయార్ (శ్రీ కాళహస్తీశ్వరస్వామి)

తుంబురు తీర్థం - తిరుమలలోని ప్రసిద్ధ తీర్థరాజము ప్రకృతి రామణీయకత వర్ణనాతీతము (శ్రీ రంగనాథస్వామి విగ్రహాన్ని మొదట ఇక్కడే దాచి వుంచినారట)

## మంటపములు

తిరుమామణి మంటపము

తిరువిలం కోయిల్ (స్నపనమంటపము)

తిరుమలరాయ మంటపము.

## ఆళ్వారులు

తిరుమలిశై ఆళ్వారు
తొండరడిప్పొడి ఆళ్వారు
తిరుప్పానాళ్వారు
తిరుమంగై ఆళ్వారు.

## రాజవంశములు - చక్రవర్తులు

తొండమాను చక్రవర్తి
తుళువ - శ్రీకృష్ణదేవరాయలు - పెద్దభార్య - తిరుమలదేవి.
తుళువ అచ్యుతదేవరాయలు.
తిరుమలరాయలు.
తంజావూరు తొండమానురాజులు.

## మంత్రులు - దండనాధులు

( మహామంత్రి ) తిమ్మరుసు
తుళువనరసరాజు

కవులు - వాగ్గేయకారులు - భక్తులు - మతాధిపతులు వగైరా. తాళ్లపాక అన్నమాచార్య ఆయన సంతతిలోని తిరుమలాచార్య, తిరువేంగళనాథ, తిమ్మక్క మొదలగువారు.

త్యాగయ్య - త్యాగరాజు - కాకర్ల
తరిగొండ వెంకమాంబ
తెనాలిరామకృష్ణ
తిరుమల తాతాచార్య
తిమ్మన - నంది
తొలప్పఆచార్య
తిరువేంకట రామానుజజియ్యర్
తిరుమలనంబి

## సేవలు - ఉత్సవములు

తోమాలసేవ

తిరుక్కోడై తిరునాల్

తెప్పోత్సవము

తీర్థవారి

తిరుమంజనతీర్థం

తిరుప్పావడై

తిరుమంత్రం

తిరువీధి ఉత్సవం.

## దివ్యగ్రంథములు

తిరుప్పావై

తిరువెంబావై

తిరువాయ్ మొలి (మోజి?)

తమిళ ప్రబంధము



## సేవలు - ఉత్సవములు

తోమాల సేవ

తిరుక్కోడై తిరునాల్

తెప్పోత్సవము

తీర్థవారి

తిరుమంజనతీర్థం

తిరుప్పావడై

తిరుమంత్రం

తిరువీధి ఉత్సవం.

## దివ్యగ్రంథములు

తిరుప్పావై

తిరువెంబావై

తిరువాయ్ మొలి (మోజి ?)

తమిళ ప్రబంధము



1878 లో, మరికొన్ని మండపాలను, కపిలతీర్థం పుష్కరిణిని, క్రీ. శ. 1865 లో బాగుచేశాడు.

ఈయన తరువాత క్రీ. శ. 1880 లో మహంతు శ్రీ భగవాన్‌దాసు గారు విచారణకర్త అయినాడు. ఈయన 10 సంవత్సరాలకాలం అంటే 1890 వరకు మహంతుగావుండి 'ఆతనికంటె ఘనుడితండు' అని అనిపించు కున్నాడు. శ్రీవారి ఆలయంలో ధ్వజస్తంభ పునఃస్థాపన సాకుతో, దానిక్రింద పూర్వకాలపు రాజులుంచిన బంగారునాణెములు, విలువయిన వజ్ర వైడూర్యాలు దొంగిలించి నందుకుగాను కోర్టులో ప్రాసిక్యూట్ చేయబడినాడు. అంతేగాక శ్రీవారి డబ్బు 15 లక్షలు దుర్వినియోగం చేసినందుకుగాను, మూడుసంవత్స రాల కఠిన కారాగారశిక్ష విధింపబడినాడు. అపీలు చేయగా ఆశిక్ష 18 మాసాలకు తగ్గింది. ఇక్కడ గమనించదగిన విశేషం ఏమంటే కోర్టులకెక్కిన ఇరుపక్షాల ఖర్చులు శ్రీవారి ఆలయనిధులలో నుంచి భరించేవారు. ఈ పద్ధతి ప్రస్తుత ఉద్యోగస్తులకు అన్వయిస్తే బాగుంటుందిగదూ! ధర్మకర్తలమండలిని అడుగుదామా?

ఈయన తదనంతరం అనగా క్రీ. శ. 1890 నుంచి క్రీ.శ. 1894 వరకు శ్రీస్వామి మహావీర్‌దాసుజీ వారు విచారణ కర్తగా నున్నాడు.

క్రీ. శ. 1894 నుంచి 1900 వరకు విచారణకర్తగావున్న శ్రీస్వామి రామకిశోర్‌దాసుజీవారు శ్రీవారిడబ్బు 50 వేల రూపాయలు దుర్వినియోగం చేశాడన్న నేరారోపణ కోర్టులో వుండగానే హత్యగావింపబడినాడు. అయినా ఈ మహానుభావుడు కార్వేటినగరం, శ్రీకాళహస్తి జమీందారుల కిచ్చిన అడమానం మీది అప్పులు, అనతల వారి తాలూకాలు కొనడానికి పెట్టు బడిగా పనికివచ్చాయి.

క్రీ. శ. 1901 లో శ్రీమాన్ మహంతు ప్రయాగదాస్‌జీ వారు విచారణ కర్తగా వచ్చాడు. క్రీ. శ. 1933 లో పరిపాలన మద్రాను ప్రభుత్వము నియ మించిన కమిటీవారు హస్తగతం చేసుకొనేవరకు అనగా 33 సంవత్సరాల దీర్ఘ కాలం ఆయన విచారణకర్తగా వ్యవహరించాడు. చెప్పుకోదగిన చరిత్రకలవాడు.

ప్రయాగదాస్‌జీవారి కాలంలో గోపురాలు బాగుచేయబడినాయి. సోపాన మార్గాలు మరమ్మత్తు చేశారు. సత్రాలు నిర్మించారు. మంచినీటి సరఫరాకు చెరువులు త్రవ్వారు. మంచిరస్తాలు, దీపాలు ఏర్పాటుచేశారు. అన్నిటికీమించి శ్రీవారి ఆనందనిలయ విమానం ఆరవసారిగా క్రీ. శ. 1908 లో బంగారు మలామా చేయబడినది. ఈమేరకు శ్రీవారి ఆలయంలో శాసనం వేయించాడు- అధికారి రామలక్ష్మన్‌దాస్‌గారు.

వేలూరులోని ఉన్నతపాఠశాల, తిరుపతిలోని ఉన్నతపాఠశాల, మరియు ఓరియంటల్ కాలేజీ ఆయనకాలంలోనే బాగా అభివృద్ధిగాంచినాయి. అప్పుడు వాటిపేరు శ్రీమహంతు హిందూఉన్నత పాఠశాల - కళాశాల అని వుండి, తదుపరి దేవస్థానం హిందూ పాఠశాల - కళాశాలగా మారి ఇప్పుడు అన్నిటిపేరు ఎస్. వి. అనగా శ్రీవేంకటేశ్వర పేరుతో ప్రారంభమవుతున్నాయి. లేదంటే బాలికల విద్యాలయాలు శ్రీ పద్మావతిపేరుతో ప్రారంభం.

పాఠశాలలకు, హుజూర్‌ఆఫీసుకు క్రొత్త భవనాలు నిర్మించడంతో బాటు, ఇదివరకున్న వాటిని విస్తృతం చేసినారు - ప్రయాగదాస్‌జీవారు.

మద్రాసులో "తిరుపతి శ్రీమహంతు ప్రెస్" అనుపేరిట ముద్రణాలయము స్థాపించి అనేక మతగ్రంథాలు, తాళ్లపాక కవుల కృతులు, కావ్యాలు, ముద్రించినారు. తి. తి. దే. మాసపత్రిక నొక దానిని ప్రారంభించినారు. తదుపరి అవి తిరుపతికి తరలించబడినవి. ఆయన చేసిన మహత్తరకార్యం, తిరుమల - తిరుపతి - తిరుచానూరు ఆలయాలలోని శిలాశాసనాలు సేకరించి ముద్రించి వాటిని ఆంగ్లంలోనికి అనువదింపజేసి - 'ఎపిగ్రాఫికల్ రిపోర్టు' తయారు చేయించడం. ఈ మహోన్నత కార్యమును ఆయన ద్వారా నిర్వహించిన శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి గారి కృషి సఫలం - జీవితం ధన్యం.

శ్రీవారికి ఉన్నగ్రామాలు - భూములు చాలవన్నట్లు - ప్రయాగదాస్‌జీవారు ఇంకా రెండు తాలూకాలు కొన్నారు. కార్వేటినగరం జమీందారీలోని తిరుత్తణి, శ్రీకాళహస్తి జమీందారీలోని కచ్చినాడు తాలూకాలు అవి. ఇవిగాక కార్వేటినగరం జమీందారీలోని అత్తిమంజేరిపేట సంస్థానం సగభాగంకొన్నారు.

శ్రీవారి ఆలయాన్ని - యీతాలూకాలను ఆయన కేవలం ఇద్దరుముగ్గురు పేష్కార్లు ఒక దివాన్ పేష్కారుతోనే నిర్వహించేవారు. ఆయన పాలనా కాలం అనగా 33 సంవత్సరాలలో పేష్కార్లు మొత్తంకలిసి పదిమందికి పైగా పనిచేయలేదు. వారుకూడా రిటైరయిపోయిన ప్రభుత్వంవారి డిప్యూటీ కలెక్టరులు లేదా జీవితంలోంచే రిటైరు కాబోయే దేవస్థాన వుద్యోగులు.

అందరినీ విమర్శించే కట్టమంచి రామలింగారెడ్డి గారు యీ మహంతు గారిని పొగడటం విశేషం.

ఈయన తరువాత హత్తీరాంజీ మఠానికి మహంతులుగా వచ్చినవారు 'మ' కార విసర్జన చేయలేక ఎలక్షన్లలో నిలబడటం అవతల కూర్చోలేక పోవడం - సంసారాలు పెట్టడం - సాంసారికుల కన్నా నికృష్ట వేదనామయజీవితం గడపడంతో మఠానికి మంచిపేరు మాత్రం రాలేదు. దాని ఆస్థి ఇప్పటికీ ఆరు కోట్ల రూపాయల పైమాట.

ప్రయాగదాసుగారు 25-8-1883 శనివారం నాడు రాజపుటానా లోని పుష్కర్ సమీపాన 'గంగ్వా' అనే కుగ్రామములో జన్మించాడు. 1894 లో తండ్రిగారితో బాటు తిరుపతి యాత్రకు వచ్చాడు. అనారోగ్యంతో తండ్రి చనిపోగా మఠంలోనే సన్యాసుల సంరక్షణలో జీవించాడు. 1897లో మహంతుస్వామి రామకిశోర్‌దాస్‌గారికి శిష్యుడయ్యాడు. 1900 లో విచారణ కర్త అయి, 24-10-1925 లో రజితోత్సవము జరుపుకొన్నాడు. చిన్నతనంలో దేవస్థానం హైస్కూలులోనే కొద్దిగా ఆంగ్లం - తెలుగు - సంస్కృతం చదువుకొన్నాడు. 1921 లో విజయదశమినాడు నలుగురు శిష్యులకు దీక్షనిచ్చినాడు. 5-10-1947 ఆదివారంనాడు అనంతునిలో ఐక్యమయినాడు. ఆయన జీవనకాలం 64 సంవత్సరాలు ఒకమాసం పదిరోజులు.

హత్తీరాంజీ మఠశాఖలు బొంబాయి, నాసిక్, నూగూరు, తంజాపూరు, వేలూరు, ఆదోని మొదలగు ప్రదేశాలలో నున్నాయి.

ఆయన సమాధి ఆళ్వారు చెఱువుకు ఎగువన కొత్త చెఱువుకు దిగువన మఠం తోటలోవుంది. మఠం తోట కోర్టులోవుంది- (రాజకీయాల మూలంగా.)

# తిరుమల - తోటలమయం

తిరుమలలోని అన్ని ప్రాంతాలు తోటల పేరుతోనే పిలువబడటం విశేషం.

1. ఎతిరాజనందనోద్యానవనం (టి. బి. ఏరియా)
2. అనంత - లేక ఆనందాళ్వార్లతోట (పురిశవారి తోట)
3. చామకూరతోట (క్వ్యాకాంప్లెక్సు కట్టబోవు ప్రదేశము)
4. చంద్రబాబుతోట (కొత్తచెఱువు క్రింద)
5. మహంతుతోట (ఆళ్వారు చెఱువుకు ఎగువ)
6. సురపురంతోట (పాపవినాశనం - బస్సుదారిలో)
7. పెరిందేవితోట (పాపవినాశనం కాలిదారిలో)
8. తరిగొండ వెంగమాంబతోట (శ్రీవేంకటేశ్వర బి. నాగిరెడ్డి ఇంగ్లీషు మీడియం పాఠశాల)
9. తాళ్లపాకంవారి తోపు (గోగర్భం డాము కెగువన పారువేట మంటపం దగ్గరవుంది)
10. గద్వాలతోట
11. మైసూరు మహారాజాతోట
12. రామభక్షితోట (తి. తి. దే. సాగుక్రింద)
13. ఫారంతోట ( ,, ,, )
14. ఉత్తరాదివారితోట (ఉత్తరదేశ మఠాలవారిది)
15. పాత పుష్కరిణితోట (పి. పి. టి.)
16. జియ్యంగారితోట

ఇందులో సురపురం - గద్వాల అనుతోటలు - ఆ పేరుతోనే మహ



తిరుమల ఉద్యావవనాలు - చంద్రగిరిలోయదృశ్యం.

మైసూరు మహారాజా తోట ఆ పేరుతోనున్న ధర్మశాలకు ఆనుకొని వుంది. ఇది పడమటిమాడవీధిలో పిఠాపురం సత్రంకు ఆనుకొనివుంది. ఇప్పుడా సత్రం కొట్టివేయబడి నూతనభవనం వెలుస్తోంది.

వీటన్నిటికంటే ముఖ్యమయినది ఎతిరాజనందనోద్యానవనం - శ్రీరామానుజాచార్యుల నామంతోవుంది. అందులో ముఖ్యఅతిధి భవనంవుంది. తి. తి. దే. వారి నర్సరీతోటకూడ అందులోనేవుంది

దేవస్థానంవారి నర్సరీలో అనేక రకాల క్రోటనులు, కాక్టస్, క్రొత్త రకాల మందారాలు, ఆరువందల రకాలకుపైగా రోజాపుష్పాలు ఇంకా అనేక రకాల అవెన్యూ చెట్లు - వగైరాలు ఎన్నోవున్నాయి. ఎంతో శ్రమపడి వీటిని అనేక ప్రదేశాలనుంచి సేకరించారు. ముఖ్యంగా బెంగుళూరులోని లాల్‌బాగ్ నుంచి, ఇంకా ఇతర నర్సరీలనుంచి పూలచెట్లను సేకరించారు. అందుకే తోటలు, అనేక రకాల పుష్ప జాతులతో - కాగితపు పూలచెట్లతో - ఎగబ్రాకుచున్న తీగలతో కళకళలాడుతూ ఆనందంగా వున్నాయి. పచ్చిక పచ్చని తివాసీ వలె మెత్తగావుంది.

పరిశోధనా కార్యక్రమంగా ఇచ్చట క్రొత్త మొక్కలను, పుష్పజాతులను సృష్టించి వాటికి "ప్రెసిడెంట్ నీలం సంజీవరెడ్డి" "గవర్నరు శారదాముఖర్జీ" మొదలగు దేశనాయకులపేర్లు పెడుతున్నారు. ఇక దేవుని పేరుతోనున్న క్రొత్త మొక్కలు - పూలు అనేకం.

అలనాడు రామానుజాచార్యులు పంపగా వచ్చిన అనంతలేక ఆనంద ఆళ్వారు. ఆళ్వారు చెఱువును స్వయంగా త్రవ్వి, పూలు - తులసి పండించి శ్రీవారి కైంకర్యంచేసి, శ్రీవారికి ఎంతో సేవ చేసినారు. ప్రస్తుతము, తి. తి. దే. గార్డెను ఆఫీసరు శ్రీ తమ్మన్నగారి సేవకూడ అంతకు తక్కువయిందేమీకాదు. ఒకవైపు స్వామి వారికి పూలు - మరొకవైపు యాత్రికులకు ఆనందం కలిగిస్తున్నారు.

———

# శ్రీవారి రౌద్రం

ప్రతి గురువారము స్వామి వారికి వేటగౌను తొడిగి, పూలంగిసేవ పుష్పాలంకరణచేసి, కత్తి (వేట ఖడ్గము) ఆయన ముందుంచగానే, ఆయనకు నిజంగానే రౌద్రాకారం వచ్చేదట. ఇది 16వ శతాబ్దములో జరిగినదట. పాపం! ఆలయ అర్చకులు ఆయన రూపం చూసి జడుసుకొని గురువారం పూలంగిసేవ సమయంలో మాత్రం లోపలకు బలవంతంగా నెట్టినా పోయే వారు కారట. ఈ పరిస్థితి చూసి శ్రీ కృష్ణదేవరాయల రాజగురువు వ్యాస రాజ అనే వ్యాస తీర్థుల వారు ప్రతి గురువారం శ్రీవారికి పూలంగిసేవ పూజ చేయవలసి వచ్చింది. ఆ విధంగా ఆయన 12 సంవత్సరాలు చేస్తే తదనంతరము స్వామి వారు శాంతించి తన రౌద్రరూపం వుపసంహరించు కొని అవతల ప్రసన్న వదనులయినారట. ఆ తరువాత ఆలయ అర్చకులు గురువారం పూలంగి సేవకు హాజరయే వారు. వ్యాసతీర్థులు వారు విమాన వేంకటేశ్వరుల దర్శనంతోనే అవతల తృప్తిపడేవారు. ఇప్పటికీ మాధ్వులు విమానవేంకటేశ్వరుల సమక్షంలో పురాణ పఠనము, సత్సంగము చేస్తారు. శ్రీ కృష్ణదేవరాయల పాలనలో దుష్టగ్రహ కూటమినాడు, విజయనగర సింహా సనాన్ని ఒకరోజు అధిష్టించి పాలించిన మహానుభావుడు యీ వ్యాసరాజస్వామి.

ఇది తి. తి. దే. ఎపిగ్రాఫికల్ రిపోర్టు 210 పుటలో వుండే కథే అయినా, ఇది ఖచ్చితంగా జరిగే వుంటుందని నా విశ్వాసం. ఇప్పుడు కూడ గురు శుక్రవారాలు శ్రీవారికి రౌద్రం వస్తుంది. ఆయన కన్నులు తెరుస్తారు. ఆ చూపుతో కొందరికి వుద్యోగాలు పూడతాయి. కొందరికి తాత్కాలికంగా నిలుపుదల లభ్యమయితే, మరికొందరికి కోర్టుకు పోయే యోగం పడుతుంది. 90 శాతం ఇవన్నీ గురు శుక్రవారాలలో జరుగుతుంటాయి. దీనిని దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు గారు చదువకుందురు గాక! ఇది గుర్తుంచుకొని గురు శుక్రవారాలలో ఆయన రౌద్రం వహిస్తే పరిస్థితి మరీ క్లిష్టమవుతుంది.

శ్రీవారు వ్రేపల్లెకు చెందిన చిన్నికృష్ణుడు గదా! అందువల్ల ఇలాంటి పనులు అప్పుడప్పుడూ చేస్తుంటారు.

**క్షేత్రపాలకుడు:** మునుపు శ్రీవారి ఆలయంలో క్షేత్రపాలకగుండు, అను పేరుతో ఒక పెద్ద గుండ్రని రాయి వుండేది. రాత్రులందు, లోపలి ప్రాకారంలో తిరుగుతూ క్షేత్రపాలకుడు ఆలయానికి కావలికాసేవాడట. ఒక సారి ఒక చిన్న బాలకుడు గుడి మూసివేసే సమయానికి ఆలయం లోపలే వుండి పోయాడట. ఉదయం చూస్తే అబ్బాయి అస్తమించాడు. ఈ క్షేత్ర పాలక గుండువల్ల యీ ప్రమాదం జరిగి వుంటుందని భావించి, అవతల ఆ గుండును గోగర్భం తీర్థం వద్దకు తరలించారు. అంతటితో ఆ గుండు మాహాత్మ్యం అంతరించిందట. అది చాల పెద్దది. ఆ కాలంలో ఎలా తరలించారో మరి. తగాదాలు వచ్చినప్పుడు ఆ గుండు దగ్గర కర్పూరం వెలిగించి నిజం చెప్పించేవారట. ఇప్పటికీ వుంది గోగర్భంలో. కానీ మునుపటిలా ముడుపులు చెల్లించి, కర్పూరహారతులు ఇచ్చి సత్యం చేసేవారు కనబడరు.

ఇప్పుడీ ఆచారం చిత్తూరు దగ్గరి కాణిపాక సిద్ధివినాయక క్షేత్రంలో వుంది. అబద్ధాలు ఆడేవాడిని కాణిపాకపట్నం ఆహ్వానించవచ్చు.

వేంద్రగుంటకు ఒక మైలు దూరంలో పూతలపట్టు కొత్తకోటకు సమీపంలో - అనగా ఆదినేపల్లి దగ్గర స్వర్ణముఖినది జన్మస్థానానికివతల ఒక వీర ఆంజనేయస్వామి పెద్ద గుండు మీద శిల్పించబడి వున్నారు. ఆ గుండు చుట్టు ఆయనకు ఆలయం వెలిసింది. చిత్తూరుకు పోవువారు ఎడమవైపు చూస్తే ఆ ఆలయం కనిపిస్తుంది. ఆయన కూడ శ్రీ వేంకటేశ్వరస్వామికి - క్షేత్రపాలకుడని పిలువబడతారు. స్వర్ణముఖి పుట్టేచోట వున్నారు గాబట్టి ఆయనను మొత్తం స్వర్ణముఖిలోయకే క్షేత్రపాలకుడనవచ్చు. అక్కడ కూడ యీ సత్యం చేసేవారి తంతు వున్నదని వినికిడి. ఆ ప్రాంతాన్ని అనంత రాయనిబడ్డు అంటారు.

**పోలీసు స్టేషను :–** క్రీ. శ. 1872లో హత్యలు, ఖూనీలు ఎక్కువై తిరుమలలో మొట్టమొదట పోలీసుస్టేషను ఏర్పాటు చేశారు. తిరుమలకు ఆంగ్లేయుల రాక అప్పటి నుంచే ప్రారంభమయింది. అయినా వారిని ఆలయంలోనికి రానిచ్చేవారు కారు.

**కొలత సాధనాలు :–** అలనాటి ద్రవ్యమానం - రేఖైలు, పణాలు, పణ్‌లు, వరహాలు అస్తమించాయి గానీ, ధాన్యకొలతలు ఇంకా కొనసాగుతూనే వున్నాయి. ఇప్పటికీ యీ ప్రాంతపు పల్లెలలో మాణికలు, పడులు, కుంచాలు ధాన్యపు కొలత సాధనాలుగా వున్నాయి. ఇవి పల్లవుల కాలం నాటివి.

**ప్రాచీన మార్గాలు :–** తిరుమలకు పూర్వకాలంలో 4 మార్గాలుండేవి. తలకోన సిద్ధేశ్వరక్షేత్రం నుంచి అడవిలో తిరుమలకు దాదాపు 25 మైళ్ల మార్గం ఒకటి; కడప జిల్లా నుంచి వచ్చేవారికి బాలపల్లి మామండూరు నుంచి కనుమ మార్గం. ఈ సోపానమార్గం ఇంకా కొంతవరకు అలాగేవుంది. దారిలో ఒకటి రెండు మంటపాలు కూడా వున్నాయి. దానిలో ఈతకాయల మంటపం ఒకటి. గోగర్భం డాము ప్రక్కనున్న గుట్ట మీదవుంది. మూడవ దారి తిరుపతి నుంచి. నాలుగవ దారి చంద్రగిరి నుంచి. ఇది కూడ ప్రాచీన మయింది. ఆ కాలంలో కపిలతీర్థం - అక్కారాంపల్లి, మంగళం, చెన్నాయి గుంట, కరకంబేడు మీదుగా శ్రీకాళహస్తికి ఒక మార్గం వుండేది. శ్రీకాళహస్తి నుంచి తొండమనాడు, గుడిమల్లం, నీలిసానిపేట, గాజులమండ్యం, కల్లూరు, అత్తూరు, పుత్తూరుల మీదుగా నారాయణవరం, నాగలాపురం వరకు ఒకదారి వుండేది. రేణిగుంట చక్కెర కర్మాగారం దగ్గరి అత్తూరు ప్రస్తుతం చిన్నపల్లి అయినా, ఒకప్పుడది నాడు (తాలూకా) కేంద్రం.

ముమ్మడి చోళాపురమను నామాంతరము గల కాళహస్తి అత్తూరి నాటి లోనిదని శ్రీకాళహస్తిలోని కృష్ణరాయల శాసనములో నున్నది. అంటే అప్పుడు శ్రీకాళహస్తి కూడ యీ తాలూకాలోనిది.

"జయంగొండ చోళమండలద ఆతూరునాద
శ్రీకాళహస్తి యాద ముంమడి చోళపురద
నయినారు శ్రీకాళహస్తి నయినార దేవర." క్రీ. శ. 1516.

మరొకదారి తిరుపతి, తిరుచానూరు, అప్పలయ్యగుంట, తిరుమండ్యం, మీదుగా పుత్తూరుకు పోయేది. ఇవన్నీ దగ్గరి దారులు. ఈ దారి ఇంకా వాడుకలోవుంది. మెకంజీ కైఫీయతులలో తిరుమలకు ఇంకా అనేక దారులు చెప్పబడినాయి. ఈ కైఫీయతులను క్రీ. శ. 1804 లో, మిరాశీ నుంచి బాబూరావు అనే ఆయన అనువాదం చేసినాడు. ఆ దారులు ఉత్తర వైపు నుంచి - మామండూరు, శెట్టిగుంట మార్గాలు. దక్షిణంవైపు నుంచి తిరుపతి, కపిలతీర్థం, పేరూరు, శ్రీవారిమెట్టు మార్గాలు. తూర్పు నుంచి కరకంబాడి, కాళహస్తి మార్గాలు. పశ్చిమం నుంచి నాగపట్ల కనుమ మార్గం.

సర్వమాన్యాలు-కొలువుమాన్యాలు: తి. తి. దే వుద్యోగుల అడ్రసులన్నీ సంపాదిస్తే, వారిలో నూటికి 90 మంది సర్వమాన్య గ్రామాలవారు వుంటారు. అందుకు కారణం, తరతరాలుగ శ్రీవారు వారి సేవలు అంగీకరించడం. ఉద్యోగాలిచ్చే అధికారి బయటివాడయినా, శ్రీవారు ఆయనకు బుద్ధిపుట్టించి - మాన్యాల గ్రామాల వారికి వుద్యోగం వచ్చేలా చూస్తారు. ఎందుకంటే అది తరతరాలనాటి బంధం. వచ్చిన తరువాత వుద్యోగం పోగొట్టుకుంటే అది వాడి ప్రారబ్ధం. అందుకు శ్రీవారు సహాయపడరు.

తరిగొండ వెంగమాంబ కాలంనాటి తిరుమల: సుమారు క్రీ. శ. 1800.

సీ. ఘన గోపురములు ప్రాకార మంటపములు
తేరులు సత్పుణ్య తీర్థములును
కమలాప్త కిరణ సంకలితంబులై ప్రకా
శించు చుండెడు హేమ శిఖరములను
పావన పరివార దేవాలయంబులు
మహిమ నొప్పు విరక్తమఠ వరములు
రంగత్తురంగ మాతంగ తురంగము
ల్గోమరారు బహుసాధు గోగణములు

"జయంగొండ చోళమండలద ఆతూరునాద
శ్రీకాళహస్తి యాద ముంమడి చోళపురద
నయినారు శ్రీకాళహస్తి నయినార దేవర." క్రీ. శ. 1516.

మరొకదారి తిరుపతి, తిరుచానూరు, అప్పలయ్యగుంట, తిరుమండ్యం, మీదుగా పుత్తూరుకు పోయేది. ఇవన్నీ దగ్గరి దారులు. ఈ దారి ఇంకా వాడుకలోవుంది. మెకంజీ కైఫీయతులలో తిరుమలకు ఇంకా అనేక దారులు చెప్పబడినాయి. ఈ కైఫీయతులను క్రీ. శ. 1804 లో, మిరాశి నుంచి బాబూరావు అనే ఆయన అనువాదం చేసినాడు. ఆ దారులు ఉత్తర వైపు నుంచి - మామండూరు, శెట్టిగుంట మార్గాలు. దక్షిణంవైపు నుంచి తిరుపతి, కపిలతీర్థం, పేరూరు, శ్రీవారిమెట్టు మార్గాలు. తూర్పు నుంచి కరకంబాడి, కాళహస్తి మార్గాలు. పశ్చిమం నుంచి నాగపట్ల కనుమ మార్గం.

సర్వమాన్యాలు-కొలువుమాన్యాలు: తి. తి. దే వుద్యోగుల అడ్రసులన్నీ సంపాదిస్తే, వారిలో నూటికి 90 మంది సర్వమాన్య గ్రామాలవారు వుంటారు. అందుకు కారణం, తరతరాలుగ శ్రీవారు వారి సేవలు అంగీకరించడం. ఉద్యోగాలిచ్చే అధికారి బయటివాడయినా, శ్రీవారు ఆయనకు బుద్ధిపుట్టించి - మాన్యాల గ్రామాల వారికి వుద్యోగం వచ్చేలా చూస్తారు. ఎందుకంటే అది తరతరాలనాటి బంధం. వచ్చిన తరువాత వుద్యోగం పోగొట్టుకుంటే అది వాడి ప్రారబ్ధం. అందుకు శ్రీవారు సహాయపడరు.

తరిగొండ వెంగమాంబ కాలంనాటి తిరుమల: సుమారు క్రీ. శ. 1800.

సీ. ఘన గోపురములు ప్రాకార మంటపములు
తేరులు సత్పుణ్య తీర్థములును
కమలాప్త కిరణ సంకలితంబులై ప్రకా
శించు చుండెడు హేమ శిఖరములను
పావన పరివార దేవాలయంబులు
మహిమ నొప్పు విరక్తమఠ వరములు
రంగత్తురంగ మాతంగ తురంగము
ల్గోమరారు బహుసాధు గోగణములు

దేవాలయాలు విద్యాలయాలు: ఇప్పటిలా మునుపు విద్యాలయాలు - విశ్వవిద్యాలయాలు వుండేవికావు. బౌద్ధుల కాలంలో విశ్వవిద్యాలయాలు ఏర్పడినాయి. నలంద - తక్షశిల - నాగార్జున మొదలగునవి. దేవాలయాలలోని, మఠాధిపతులే విద్యాలయాలను నిర్వహించేవారు. అందుకే ప్రజలు దేవుని హుండీలో ధారాళంగా ధనం కుమ్మరించేవారు. విద్యా దానానికని! ఇలాంటి వేదపాఠశాలలు, సంస్కృత పాఠశాలలు - తిరుమలమీద, శ్రీనివాసమంగా పురంలో, నాగలాపురములలో నిర్వహింపబడినట్లు దాఖలాలున్నాయి. ఆంగ్లేయుల కాలంలో శ్రీ మహంతు ప్రయాగదాసుగారు కూడా తిరుపతిలో దేవ స్థానం హిందూ ఉన్నతపాఠశాల, ప్రాచ్యకళాశాల (సంస్కృత కళాశాల), శ్రీ వేంకటేశ్వర బాలమందిర్ (అనాథ శిశు సంరక్షక గృహము) మొదలగునవి స్థాపించి విద్యాదానం చేసినాడు. తమిళనాడులోని వేలూరులో కూడ ఒక దేవస్థానం హిందూ ఉన్నతపాఠశాల స్థాపించినాడు.

తిరుమలమీద మొట్టమొదటి ప్రాథమిక పాఠశాల స్థాపించిన ఘనత, తొండవాడ శ్రీ మొగిలి రామకృష్ణారెడ్డిగారికి దక్కినది. ఆయన ఆ కాలంలో మద్రాసు క్రైస్తవ కళాశాలలో బి. ఎ. చదువుకున్నాడు. ఆంగ్లేయుల నుండి రావుబహదూర్. రావుసాహేబ్, దివాన్‌బహదూర్ మొదలగు బిరుదులు పొంది, జస్టిస్‌పార్టీకి మంచి సేవచేసినాడు. 1912 లో చంద్రగిరి తాలూకా బోర్డు అధ్యక్షులుగా వుంటూ - ఆ హెూదాతోనే తిరుమలమీద మొట్టమొదటి ప్రాథమిక పాఠశాలను 1912 ఆగస్టులో స్థాపించాడు. అదే సమయంలో ఆయన వియ్యంకుడు తొండవాడ శ్రీ అవిలాల నారాయణరెడ్డిగారు చంద్రగిరి తాలూకా విద్యాధికారిగా వుంటూ ఆ పాఠశాలను అభివృద్ధి చేసినాడు. బాగుగా అభి వృద్ధి గాంచిన తరువాత, ఆ పాఠశాలను మహంతు శ్రీ ప్రయాగదాసుగారు తమ యాజమాన్యానికి తీసుకొన్నాడు. శ్రీ అవిలాల నారాయణరెడ్డిగారు రీజనల్ డిప్యూటీ డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ హెూదాతో పదవీ విరమణ చేసినాడు.

శ్రీ మొగిలి రామకృష్ణారెడ్డిగారికి నలుగురు కుమారులు. మొదటి కుమారుడు శ్రీ వెంకటరమణారెడ్డి ఐ.సి.యస్, డి.ఐ.జి. గా వుంటూ ఇటీవల

మరణించినాడు. రెండవ కుమారుడు శ్రీ చంద్రమౌళిరెడ్డి ఐ.ఏ.యస్. ప్రస
దేవాదాయధర్మాదాయశాఖ కమీషనర్. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని ప్రా
ఆలయాలన్నీ ఆయన పుణ్యమా అని బాగుపడుతున్నాయి. తి.తి.దే. కా
నిర్వహణాధికారిగా వుంటూ, తిరుమలలో ఒక ఉన్నత పాఠశాల (1972
వేదశాస్త్రాగమ విద్యాకేంద్రం, తిరుపతిలో శ్రీ గోవిందరాజస్వామి కళాశా
శ్రీ పద్మావతి బాలికల ఉన్నత పాఠశాల, శ్రీ వేంకటేశ్వర జూనియర్ కళా
మొదలగునవి స్థాపించడమేగాక, మొట్టమొదట హిందూధర్మప్రతిష్ఠానా
1969 లో ప్రారంభించినారు. మూడవ కుమారుడు శ్రీ సుందర రామరె
చంద్రగిరి - తొండవాడ ప్రాచీన ఆలయాలకు వంశపారంపర్య ధర్మక
నాలుగవ కుమారుడు శ్రీ విజయకుమార్‌రెడ్డి. ప్రింటింగ్ టెక్నాలజీ చది
తి.తి.దే. ముద్రణాలయానికి మేనేజరుగా వుంటూ మత ధార్మిక గ్రంథ
వేల సంఖ్యలో అచ్చువేస్తూ, అనేకమంది రచయితలను ప్రోత్సహిస్తున్నార

1936 లో చంద్రగిరి ఉన్నత పాఠశాల భవనాన్ని శ్రీ మొ
కేశవరెడ్డిగారు నిర్మించారు. ఆయనకు సంతానం లేకపోవడంతో శ్రీచం
మౌళిరెడ్డిగారిని దత్తుపుత్రుడిగా స్వీకరించినాడు.

ఈప్రాంతంలోని రాజుల తరువాత, (రాజ్యంలేకపోయినా) రాజ
జీవించినవాడు శ్రీమొగిలి రామకృష్ణారెడ్డి. ఆయనను చూస్తే ఆంగ్లేయు
భయం. ఆంగ్లేయుల కాలంలో ఆయన తి. తి. దే. బోర్డుమెంబరుగా దాద
11 సంవత్సరాలు వుండినాడు. ఆయన దైవదర్శనానికిపోతే, శ్రీ
ఆలయంలో దేవుడుతప్ప ఆయనకెదురుగా ఎవరూవుండటం సహించ
అర్చకుడుకూడా హారతిఇచ్చి, గోడచాటున దాక్కునేవాడు. ఒకరోజు మొ
వెంకటగిరి జమీందారు తనమామిడితోటలో కోడిపందాలు ఆడుతున్నాడ
తొండవాడ రామకృష్ణారెడ్డిగారు వస్తున్నాడని ఎవరో వార్తఅందించా
అంతే, కోళ్లు ఏమయ్యాయో? పందెం ఏమయిందో గానీ, ఆయన
వెంబడి పుట్లవెంబడి వరుగులెత్తి పంచె చింపుకొని ప్యాలస్ చేరినాడు. అ
భయం. ఇక కాళహస్తి రాజాగారు కార్వేటినగరం రాజాగారు ఆంగ్లేయ

మధ్యమునకు యీయన సిఫార్సు జాబులకోసం పడిగాపులు కాసేవారు. ఈయ నకు ఆంగ్లేయులతో ఎంత సన్నిహిత సంబంధం, సహవాసం వున్నా, మద్రాసు క్రైస్తవ కళాశాలలో చదువుకున్నా, జీవితాంతం తన పిలకజుట్టును గానీ, నుదుటి తిరునామంగానీ వదలినవాడు గాదు. అంతటి సంప్రదాయ బద్ధుడు. 1955 లో దేహం చాలిస్తూ - శ్రీవేంకటేశ్వర సుప్రభాత రికార్డులు వినిపించమని కోరి - వింటూ వింటూ అలాగే భగవంతునిలో ఐక్యమయినారు. ఆయన చేసుకున్న పుణ్యం అది.

ఈ మొగిలిరెడ్ల తరువాత, యీప్రాంత (ఈ జిల్లాకే అని చెప్పవచ్చు) విద్యాభివృద్ధికి కృషిచేసినవాడు నరసింగాపురం శ్రీ రెడ్డివారి నాధమునిరెడ్డి గారు. 20 సంవత్సరాలకు పైగా ఎం. ఎల్. ఎ. గా వుండినాడు. చిత్తూరు జిల్లాపరిషత్ అధ్యక్షులుగా, తి. తి. దే. బోర్డుమెంబరుగా, తదుపరి అధ్య క్షులుగా, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ సెనేట్, సిండికేటు మెంబరుగా ఎనలేని సేవచేసినాడు. జిల్లాలోని అనేక జూనియర్ కళాశాలలు, ఉన్నత పాఠశాలలటుండనిచ్చి, చంద్రగిరిలోని జూనియర్ కళాశాల, శ్రీ పద్మావతి బాలికల ఉన్నత పాఠశాల, శ్రీనివాస మంగాపురములోని ఉపాధ్యాయశిక్షణ కేంద్రం (ఇప్పుడు మూసివేయబడినది.) పుదిపట్ల - చెర్లోపల్లి ఉన్నత పాఠ శాల, తిరుచానూరులోని ఉన్నత పాఠశాల సొరకాయలపాళ్యం, కట్టక్రింద వెంకటాపురం, నడవలూరు పాఠశాలల స్థాపనకెంతో కృషిచేసినారు. ఇక ప్రాథమిక ప్రాథమికోన్నత పాఠశాలలు ఎన్నో లెక్కలేదు.

తి. తి. దే. తరఫున శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతిలో స్థాపింప బడడానికి (1954) లో శ్రీ వేంకటేశ్వర కళాశాల స్థాపనకు (1945లో) శ్రీపద్మావతి కళాశాల స్థాపనకు (1952 లో) పాలిటెక్నిక్, పశువైద్య కళాశాల, వ్యవసాయ కళాశాల, వైద్యకళాశాలలు తిరుపతిలో స్థాపించడానికెంతో కృషిచేసినారు.

తి. తి. దే. బోర్డులో ఆయన వున్నప్పుడే, న్యూఢిల్లీలోని శ్రీ వేంక

టేశ్వర కళాశాల, తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర నాగస్వర పాఠశాల, శ్రీవేంకటేశ్వర సంగీత నృత్య కళాశాల మొదలగునవి ప్రారంభించబడినవి.

ఈయన మొదటినుంచీ భారత జాతీయ కాంగ్రెసు సభ్యుడు. ఆంగ్లేయుల కాలంలో కారాగారవాసం అనుభవించినాడు. దేశస్వాతంత్ర్యానంతరం అనేక పదవులు అలంకరించినాడు. మితభాషి. సౌమ్యుడు. స్నేహాస్పదుడు. ఆయనను ఎవరయినా, ఎప్పుడయినా, ఎక్కడయినా కలుసుకోదగిన స్నేహశీలి. తిరుమల శ్రీవారి భక్తుడు. ఈయన కృషిలో, కొంతవరకు శ్రీ అనంతశయనం అయ్యంగార్ తోడ్పడినాడు. ఎందరో మహానుభావులు. వారికందరికీ వందనాలు.



తిరుపతి శ్రీ వేంకటేశ్వరకళాశాల.

# తి. తి. దేవస్థాన శాసనాలు

## శ్రీ సాధుసుబ్రహ్మణ్యశాస్త్రిగారు

మహంతు శ్రీ ప్రయాగదాసుగారు, తిరుమల శ్రీవారి ఆలయంలోపలి కెళ్ళినప్పుడల్లా - ఆగోడలమీద శిలాశాసనాలుచూచి, ఏమివ్రాశారో తెలుసుకొంటే బాగుండేదని అనుకొనేవాడు. ఆ అభిప్రాయం తనతోబాటు వున్న శ్రీసాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ముందు చాలసార్లు వెలిబుచ్చాడు. అప్పట్లో శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, మహంతుగారి గుమాస్తాయే అయినా, దాదాపు పర్సనల్ అసిస్టెంటుగా ఆయనకు పనులు అప్పగించబడేవి.

ఇలావుండగా, ప్రభుత్వ ఎపిగ్రాఫిస్ట్ రావుబహదూర్ కృష్ణశాస్త్రిగారు, ఇండియా ఆఫీసు లైబ్రరీకి చెందిన డాక్టరు ఎఫ్. డబ్ల్యు. థామస్‌గారితోబాటు ఒకసారి తిరుపతికి వచ్చాడు. మహంతుగారు ఆయనను సంప్రదించగా, ఆయన ప్రభుత్వానికి వ్రాయమని సలహా ఇచ్చినాడు. అలా వ్రాయగా 14-6-1921 లో ప్రభుత్వం సమ్మతించి ఒకరిని ఎపిగ్రాఫికల్ శిక్షణ కొరకు పంపమని ఆదేశించింది.

మొదటినుంచీ శాస్త్రిగారిని, యీ పనికి పురమాయించాలని మహంతుగారి కోరిక. కాని పి. ఎ. లాగున్న వారిని యీ పనికి పంపితే చేయివిరిగినట్టయి తన పనులు కావేమోనని భయం. ఇలాంటి సందిగ్ధ పరిస్థితిలో నుండగా దివాన్ పేష్కార్ శ్రీ దొరస్వామయ్యగారు కూడ శాస్త్రిగారిని పంపక తప్పదనడంతో గత్యంతరములేక ఒప్పుకొన్నాడు మహంతుగారు.

శాస్త్రిగారు మద్రాసులోని దక్షిణ భారతవిభాగ పురావస్తు పరిశోధన శాఖ కార్యాలయంలో ఏడుమాసముల శిక్షణ గడించి 1922 మార్చిమాసములో తిరిగి తిరుపతికివచ్చి, తి. తి. దే. ఆలయాలలోని శాసనాలు కాపీచేయడం ప్రారంభించినాడు. ఈ పని చేయడానికి 8 సంవత్సరాలు పట్టింది. 1150 పైగా శాసనాలు దొరికాయి.

| | | | | |
|---|---|---|---|---|
| ఇందులో పల్లవ, చోళ, పాండ్య, విజయనగర మొదటి రాజుల కాలపు శాసనాలు | | | — | 236 |
| సాలువ నరసింహరాయలు | ,, | ,, | — | 169 |
| శ్రీ కృష్ణదేవరాయల | ,, | ,, | — | 229 |
| అచ్యుతదేవరాయల | ,, | ,, | — | 251 |
| సదాశివరాయల | ,, | ,, | — | 147 |
| అరవీటి రాజుల | ,, | ,, | — | 135 |
| | | | | 1167 |

ఇందులో తిరుమల శ్రీవారి ఆలయపు శాసనాలు దాదాపు 800, తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి ఆలయపు శాసనాలు 300 పైగా, తక్కినవి నరినర ఆలయాల శాసనాలు. ఇవిగాక తాళ్లపాక కవుల కీర్తనలు కలిగిన 3000 రాగిరేకులు దొరికాయి.

ఇందులో మొట్ట మొదటి శాసనం క్రీ. శ. 830 నాటిది. చిట్టచివరి శాసనం క్రీ. శ. 1909 నాటిది. విజయనగర చక్రవర్తులు అందరి రాజుల కంటె ఎక్కువ శాసనాలు వేయించారు.

వీటన్నిటిని కాలం ప్రకారం వర్గీకరణచేసి, అవి ఏ భాషకు చెందిన వయినా వాటికి ఇంగ్లీషు అనువాదంచేసి, ఆరు భాగాలుగా అచ్చువేసి ప్రచురించడానికి దేవస్థానంవారికి 8 సంవత్సరాలు పట్టింది. శాస్త్రిగారు తాను సేకరించిన శాసనాల సారాంశం, చారిత్రక, భౌగోళిక, కావ్యకథనాల ఆధారంతో ఒక ఎపిగ్రాఫికల్ రిపోర్టు తయారుచేసి, 1930 లో తి. తి. దే. మహంతు శ్రీ ప్రయాగదాసువారి అనుమతితో ప్రచురించినాడు. 1938 లో ఎపిగ్రాఫికల్ గ్లాసరీ తయారయి ప్రచురింపబడింది.

శాసనాలు అరవం, కన్నడం, తెలుగు, సంస్కృత భాషలలోనున్నాయి. అవి ఏ భాషలోనున్నా, ఆంగ్లానువాదం వుంది గాబట్టి, ఆంగ్లం వచ్చిన వారంతా చదువుకోవచ్చు.

పాడయిపోయిన శాసనాలుపోగా, వున్న శాసనాలలో కొన్ని విజ్ఞానం
ంచేవి, కొన్ని కుతూహలం ఆశ్చర్యం కలిగించేవిగా వున్నాయి. పల్లవ
కడవన్ పెరుందేవి (శమావై), నరసింహదేవయాదవరాయలు, ఇంకా
వరు యాదవరాజుల శాసనాలు, కపిలతీర్థంలోని మునీశ్వరుని శాసనం పై
లకు చెందిన శాసనాలు. తి. తి. దే. నందవనాల చరిత్రను, నేను ఫ్లవర్
(పుష్పకిరీటం) అనుపేరిటతో ఆంగ్లంలో వ్రాశాను. ఆ పుస్తకం కూడ
తోబాటు విడిగా ఆంగ్లంలో ప్రచురింపబడుతోంది. అందులో ఆహ్లాదకర
కొన్ని యాదవరాజుల శాసనాలను వుదహరించాను. ఆ శాసనాలు వుష్ప
ం, పుష్పయాగం, పూలంగిసేవ, పూలమాలల ఆకృతి, పుష్పోద్యాన
లు, పల్లవోత్సవం మొదలగు పుష్ప ఇతి వృత్తాలకు చెందినవి.

ఇవిగాక, సాళువనరసింహదేవరాయల కాలంలో తి. తి. దే. శాసనాలు
వ సంపుటములోని 85 శాసనములో (సుమారు క్రీ. శ. 1485 లో)
టింద్రుడు కనిపిస్తారు. అంటే వీరు కొండకు ప్రస్తుతం మనం ఏనుగుల
అంటున్నదారి గుండా ఏనుగులు నడిపించేవారేమో? 95 శాసనములో
గా 27–6–1491 లో ఆకాశగంగ సోపానమార్గము మరమ్మత్తులు
స్తాయి. ఇక సోపానమార్గము ఎప్పుడు నిర్మింపబడినదో - అప్పటికే
ప కొచ్చినది. 133 శాసనములో అనగా 1–7–1495 లో తిరుమల
రి ఆలయంలో, తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి ఆలయంలో నగలు, బం
, వెండిపాత్రలు మరమ్మతులు చేయుటకు ఒకనికి అధికారం ఇవ్వబడింది.
శాసనములో అనగా 18–1–1464 లో పాపాలు కడిగి పరిశుభ్రం
- పవిత్రోత్సవం కనిపిస్తోంది. ఆ ఉత్సవం ఆ కాలంలోనే 5 రోజులు
హింపబడేదంటే ఆశ్చర్యం కలుగుతుంది.

ఈ సంపుటములోని శాసనాలలోనే, ఇడ్లీలు, దోసెలు, వడలు, సుగీ
, వడపప్పు, పానకం, చక్కెర కనిపిస్తాయి. ఇవి 15 శతాబ్దమునాటికే
అలవాటులో నున్నట్టుంది. పెండిలిబాణం (బాణసంచా) కనిపిస్తుంది.
మలు కనిపిస్తాయి. ఇక మిరియాలు, రసకర్పూరం, చందనం, ఆకులు,

వక్కలు, బెల్లం, పాలు, పెరుగు, నేయి వీటి సంగతి వ్రాయబనిలేదు. ఆల యోద్యోగులలో నట్టువరులను నాట్యాచార్యులు, పాడువారను పాటలుపాడు వారు, కూయవరులను కుమ్మరులు, శిప్పియరులను శిల్పులు, కైకోలర్ అను సేవకులు (ఇప్పటి కైకాల్ రెడ్డి) ఈ విధంగా లెక్కవేసుకొంటూ వస్తే, ఇప్పటికన్నా అప్పుడే డిపార్టుమెంటులు - ఎక్కువ అని తోస్తుంది. అయితే ఆఫీసరులు కానరారు.

ఈ శాసనాలన్నిటినీ ఎత్తివ్రాస్తూ-ఆంగ్లానువాదంచేస్తూ - అర్థం అయిన చోట ఎంత ఆనందం - కానిచోట ఎంతవిషాదం — దుఃఖం అను భవించారో శాస్త్రిగారు, అసంగతి నాకిప్పుడర్థమవుతోంది.

శాస్త్రిగారు 13–12–1889లో జన్మించాడు. బి. ఎ. చదువు కున్నాడు. ప్రస్తుతం మునిసిపాలిటీ మునుపు క్రైస్తవ మిషనరీ యాజమాన్యంలో నున్న ఉన్నతపాఠశాలలో కొంత కాలం ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. తదుపరి మహంతు శ్రీప్రయాగదాసుగారి ఎద్ద తి. తి. దే. సర్వీసులోచేరి, పదవీ విరమణ చేశాడు. పండితులు పండిపోయి తెల్లగా నున్నట్టే ఈయన జ్ఞానంలో, పాండిత్యంలో, వయసులో తెల్లగా పండినటువంటివాడు. నాలుగైదేళ్లు కష్టపడి, 90 ఏళ్ళ వయసులో తిరుమల శ్రీ వేంకటేశ్వర అను పేరుతో ఆంగ్లంలో ఒక గ్రంథం వ్రాశాడు. దానిని తి. తి. దే. వారు త్వరలోనే ప్రచురించబోతున్నారు. అప్పుడయినా ప్రపంచానికి ఆయన విలువ తెలుస్తుంది. మనకెన్నో క్రొత్త విషయాలు తెలుస్తాయి.

————

# దేవేంద్రుడు - యజ్ఞములు

మనం పురాణాలలో, ఇతిహాసాలలో చదువుకొన్నాము. దేవేంద్రుడు యజ్ఞాలను పాడుచేసి ఎవరినీ దేవేంద్ర పదవికి అర్హులు కాకుండాచేయడం. తిరుమల మీద సరిగా అలాంటిదే జరిగింది. శ్రీత్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి వారు 108 క్రతువులు నిర్విఘ్నంగా జరిపాడు. 107 స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞములు నిరాటంకంగా జరిపాడు. 20-2-1980 నుంచి 26-2-1980 వరకు 108 స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞము జరుపవలసి వుండినది. కానీ ఆయన 30-12-1979 తారీఖున, వైకుంఠ ఏకాదశి నాడంతా జీవంతోవుండి, ద్వాదశి ఘడియల్లో పరమపదమందినాడు. ఇది కూడా దేవేంద్రుని పనేనా అని నాసంశయం. ఆయన పోతే పోయాడు. ఆయన గురువుగారయిన శ్రీవానమామలై జీయరుస్వామి (తోతాద్రిమఠం - నంగునేరి) ద్వారా ఆయజ్ఞం జరుపుదామనుకున్నారు. కానీ ఆయనను కూడ వదలి పెట్ట లేదు దేవేంద్రుడు. అతనికిదేపని! శ్రీవానమామలై జీయరుస్వామి తన 95 ఏట 17-1-1980 తారీఖున ఉత్తరాయణ పుణ్యకాలంలో పరమపదించాడు. గురుపరంపరలో ఆయన 27 వ జీయరుగా తోతాద్రిమఠాన్ని నిర్వహించాడు.

గురుశిష్యులిద్దరూ మాట్లాడు కొన్నట్టు 18 రోజుల తేడాతో పరమపదించడం - అవతల ఆ యజ్ఞం తి. తి. దే. వారి అండదండలతో మిగిలినవారు నిర్వహింపబడవలసి రావడం - ఇదంతా ఆశ్చర్యం కదా మరి!

---

# శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం

10–11–1979 తారీఖు శనివారంనాడు ఆంధ్రప్రభ దినపత్రికలో 'శ్రీవేంకటేశ్వర మహాత్మ్యం' అను శీర్షికలో బాక్సు కట్టబడిన ఒకవార్త ప్రచురింప బడినది. పేరు శ్రీవేంకటేశ్వరమహాత్మ్యం — అందులో శనివారం ప్రచురణ అయిందంటే — అదిగొప్ప విశేషంగానే భావించి — ఎందుకయినా మంచిది, అని కత్తరించి భద్రపరచి వుంచినాను.

శ్రీవేంకటేశ్వర మహాత్మ్యం ఎలాగుంటుందంటే — ఉదాహరణకు చెబు తాను. ఈ కత్తరించి పెట్టిన వార్తను వ్రాస్తామని, తీసి ముందర పెట్టు కొన్నాను. వెంటనే కనబడకుండా అదృశ్యమయింది. "పోనీ! నీ లీలలు వ్రాద్దామను కొని తీస్తే కనబడకుండా చేస్తావా? చేసుకో! నాదేం పోయింది. నీసంగతి పదిమందికీ తెలియకుండా పోతుంది అంతేగదా! నష్టం నీకే!" అనేసి మానుకున్నాను. అలాగ అను కుంటూనే, వెంటనే ఆకాగితం కన బడింది. తీరా ప్రారంభం చేశాక, అది వ్రాయనీయకుండా కరెంటు పోయింది. పోనీలే! అని తిరిగీ మెదలకుండా కూర్చున్నాను. విద్యుత్తు తిరిగివచ్చింది. రోజూ ఆగిపోయే సమయానికి మించి వుండింది. వ్రాశాను. తీరా ముద్రించేటప్పుడు, ఏమవుతుందో తెలియదు? — ఇలాగ వుంటాయి శ్రీవేంకటేశ్వరస్వామి లీలలు. వీటికి అంతులేదు పొంతులేదు. అనంతమయి నవి. ఈ ఒక్కవుదాహరణ లేదా అనుభవం నా ఒక్కడిది. ఇలా కోటాను కోట్ల భక్తులకు ఎన్ని అనుభవాలో? ఎన్ని సంఘటనలో? అవన్నీ సేకరించే దెవరు? వ్రాసేదెవరు? ముద్రించేదెవరు? అవన్నీ అందరికీ చేరేదెలాగ?

పదునారువేల ఎనిమిది మంది గోపికలతో క్రీడించే యీ గోపబాలకుడు- నిత్యం మనతో క్రీడిస్తున్నాడు. అయితే గమనించినది - గ్రహించినదీ

* ఎందరు? అతని ఆనవాలు - అడ్రసు అందరికీ తెలియ జేస్తాడా? - తెలుసు కొన్నవారు ధన్యులు. వారు ఆయన కృపాపాత్రులు.

ఇక, యీ వార్తను చదవండి.

## శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం.

(ఆంధ్రప్రభ ప్రతినిధి)

తిరుపతి, నవంబర్ 9: సర్వజగద్రక్షకుడు పరమాత్మ. ఆయన లీలలు అనంతములు, అనూహ్యములు. నేడు అర్ధరాత్రి మీాదట 12-35 గంటలకు తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలోని గంటలలో ఒక గంట దానంతట అదే గణగణమని మ్రోగింది. ఈ శబ్దం విన్న చుట్టుప్రక్కల ప్రాంతాలలోని ప్రజలు ఆశ్చర్యపడ్డారు.

ఆలీలామానుష వేషధారి లీలలు మానవమాత్రులకు సులభంగా బోధ పడవు. ఇలా స్వామి తన మహాత్మ్యం చూపించడం ఇది క్రొత్తకాదు. 1977వ సంవత్సరం ఏప్రెల్ 12వ తేది తిరుమల దేవాలయంలో ఇలాంటి వింత సంఘటన జరిగింది. వేళకాని వేళలో అప్పుడు కూడా దేవాలయ గంటలు గణగణమని మ్రోగాయి. ఇప్పుడు కూడా అదే విధంగా జరిగింది. ఆ నాడు శ్రావణం శ్రీ వేంకటేశ్వరస్వామి జన్మనక్షత్రం.

నేడు పునర్వసు దినోత్సవం. శ్రీరామచంద్రుని జన్మనక్షత్రం. నేడు రమణకోటి ప్రతిష్ఠ దినం కూడా. రాత్రి వేళలలో దేవతలు విచ్చేసి శ్రీ వేంకటేశ్వరస్వామిని ఆరాధిస్తారన్న పురాణ కథలు ఈ సంఘటనతో నిజమని నిరూపింపబడ్డాయి.''

---

* ఆంగ్లంలో ఒక కథ ప్రచారంలో వుంది. భగవంతుడు మనల్ని చూడడానికి, మన ఇంటికి వస్తాడట అనేకసార్లు. అయితే ఆయన వచ్చిన ప్రతిసారీ, మన ఇల్లు తాళంవేసి వుంటుంది. లేదా మనం ఇంట్లో వుండము. అందువల్ల ఆయనను చూసే అవకాశం పోగొట్టు కుంటాము.

ఈ వార్తలో తెలుసుకోదగిన విశేషాలు కొన్ని వున్నాయి.

గుడిలో గంటలు మ్రోగిన దినం పునర్వసు నక్షత్రం. పైగా రమణ కోటి ప్రతిష్ఠ దినం కూడా. శ్రీ రమణ మహర్షివారి *ఇలవేలుపు-శ్రీ వేంకటేశ్వర స్వామి. పైగా శ్రీ రమణమహర్షి పూర్వనామం-వేంకటరామన్. ఆయన తల్లి తరచుగా శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించేది. ఇలవేలుపు నామంతో పిలువ బడిన శ్రీ వేంకటరామన్ (రమణ మహర్షి), మహర్షి అయిన తరువాత కూడా ఆమె తిరుమలకు తన రాకపోకలు మానలేదు. పైగా యీ గంట మ్రోగిన దినం ఆ మహర్షి శతజయంతి ఉత్సవాలు దేశమెల్లెడలా ముగియడంతో-దానికి సూచనగా గంట మ్రోగడమా? మహర్షి పుట్టి ఒక శతాబ్దము ముగిసిందనా?

ఏది ఏమయినా, యీ రచయిత వుద్దేశంలో - ఇంకా కొన్ని నిగూఢ విషయాలు ఇందులో గూఢమై వున్నాయి.

శ్రీ వేంకటేశ్వరస్వామి ఇదివరకు ఎప్పుడూ ఆలయం వదిలేవారుకారు. ఇప్పుడు ఆలయం వదలకుండా వుండరు. ఆయన వుండరు కానీ, ఆయన మూర్తి మాత్రం అక్కడ వుంటుంది. ఆయన సామాన్య, బాలకునివలె బయట తిరుగుతూ, ఎప్పుడో తన కిష్టమైనప్పుడు ఆలయంలో ప్రవేశిస్తారు. ఆయన ప్రవేశించినప్పుడు ఆ ఆలయ గంట - లేదా గంటలు తమంతటతామే మ్రోగు తాయి, ఆయన ప్రవేశించాడనడానికి సూచనగా. అయితే విచిత్రం ఏమంటే - ఆయన, తన ఇదివరకటి అవతారాలలోని జన్మనక్షత్రాల నాడే అర్ధరాత్రి - ఆలయ ప్రవేశం చేయడం.

ఆలయాన్ని ఆయన ఎందుకు వదలుతున్నారు? పూజాపునస్కారాలలో లోటులేదు. ప్రసాద - ఎగపడుల రుచిగానీ, దిట్టంగానీ తగ్గలేదు. అయితే ఎందుకు? ఆలయంలో మన ప్రవర్తన - లేదా మన పొగరు వగరు చూడలేకనే, ఆయన వదలి వెళ్లుతున్నాడనుకోవాలి. ఆయన ముందు మనం చేసే పను

---

* శ్రీ వేంకటేశ్వరస్వామి - కొందరు ప్రఖ్యాత పురుషులకు ఇలవేలుపు. ఉదాహరణకు విజయనగర సామ్రాట్ శ్రీ కృష్ణదేవరాయలకు, శ్రీ రాఘవేంద్రస్వామికి, శ్రీ పురందరదాసు వారికి ఇంకా ప్రస్తుతము భారత రాష్ట్రపతిగానున్న శ్రీ నీలంసంజీవరెడ్డి మొదలగు వారికి.

లేమిటి? యాత్రీకులను ఛో! ఛో! అంటాం. పోకపోతే మెడబట్టి గెంటుతాం. వాడు తిరుగబడి తిట్టితే, మనం కొడతాం. అంటే వాడి నోరు ఆడితే, మన చెయ్యి ఆడుతుంది. ఇంతలోనే మనకు కావలసినవారు వస్తే - రండి! రండి అని ఆహ్వానించడం, హారతులివ్వడం, ముక్కోణంలో నిలబెట్టడం. శ్రీపాద రేణు మహాప్రసాద పొట్లాలివ్వడం. ఇదీ మనపని. అదీ! ఆయన పని.

గుడివదిలేసి ఎక్కడుంటారు? ఏంచేస్తుంటారు. ఒక్కచోట వుండరు. బడిలో కాస్సేపు, క్యూలో కాస్సేపు, క్యూషెడ్లలో - బస్టాండులలో కొంతసేపు, బ్రేకులు పనిచేయకుండా లోయల్లోకి దూకే వాహనాలను బ్యాలన్సు మీద నిల బెట్టడం; సోపాన మార్గాలలో 'గోవిందా' అని ఆర్తనాదం చేసేవారిని ఆదు కోవడం; హరీ! అని ఆత్మహత్య చేసుకొనే వారికి తన మాట పోతుందేమోనని, సాయుజ్యం ఇవ్వడం; దొంగతనాలు, హత్యలు చేసిన వారిని వెదకి పట్టించి శిక్ష పడేలాగ చూడడం - తననే నమ్ముకొని, ఆకులలుములు మేసి, కొండల్లో లోయల్లో తపస్సు చేసుకొనే వారి మంచిచెడ్డలు చూడడం, పొగరెక్కిన వుద్యోగుల స్థానభ్రంశం చేయడం - ఎక్కని వుద్యోగులను ఉన్నత స్థానంలో బెట్టి వారికి పొగరెక్కేలాగ చూడటం. కైపు ఎక్కి అదుపాజ్ఞలు దప్పి - అంతూపొంతూ లేకుండా అవ్వాచారి కోనలోకి పోయిన వాహనాల అడ్రసు తెలియజేయడం - నాలాంటి వారిచే తన చరిత్రలు వ్రాయించుకోవడం - అవతల అవి అర్జంటుగా అచ్చుగాకుండా చేయడం, మద్యపానంతో - మతులు తప్పి నడిరోడ్డులలో పవ్వళించిన పుణ్యాత్ముల జోకొట్టడం; ఇలాంటివి - ఆయన చేసే పనులలో కొన్ని. పురుషుడు గదా! ఎప్పుడూ ప్రకృతితో క్రీడిస్తూవుంటారు. రైళ్లలో, బస్సులలో, విమానాలలో - కొండల్లో, లోయల్లో, గుళ్లలో, బళ్లలో ఎక్కడ చూసినా ఆయనే! ఆయన లేని చోటు గలదా? కాస్సేపు వుద్యాన వనాలలో; కాస్సేపు అడవుల్లో కాయగసురు, ఆకులు, పుల్లలు సేకరించే ముసలమ్మల దగ్గర, కాస్సేపు తిరుమల పుణ్యతీర్థాల జలాలలో గ్రుంకులిడుతూ - ఇలా ఎక్కడ బడితే అక్కడ - ఎప్పుడుబడితే అప్పుడు అదృశ్యమవుతూ - ప్రత్యక్షమయ్యే ఆ స్వామిని ఎలా వర్ణించడం?

తాళ్లపాక అన్నమాచార్యులు గారన్నట్టు "తక్కువ వాడు గాడితడు." గాలివానకు తట్టుకోలేక, గాలికి కొట్టుక పోయిన కౌపీనం దొరక్క, చలికి గడ గడ వణకుతూ, గుడిసెలో దూరి - కూర్చోను చోటు లేక నిలబడిన మొదటి ముగ్గు రాళ్వారులను, ఆ గుడిసె నుంచి - మనం యాత్రికులను నెట్టినట్టు - మెడబట్టి గెంటిన వాడితడు. తిరుమంగై ఆళ్వారు చేత దొంగతనాలు చేయించిన వాడితడు. తొండరడిప్పొడి ఆళ్వారు అను విప్రనారాయణుని చేత కామ క్రీడలననుభవింపజేసిన వాడితడు. పెరియాళ్వారు తయారు చేసిన తులసిమాలలు ధరించుతూ, కృతజ్ఞతయినా లేకుండా, అమాంతంగా ఆయన పెంపుడు కూతురునే ప్రేమించేసిన మహానుభావుడితడు. ఆపదలు కలిగించి తనకు మొక్కుకొనేలాగ చేయుదిట్ట ఇతడు. పాపాలు చేయించి, ప్రాయశ్చిత్తం చేసుకోమని దారి చూపే దాక్షిణ్యుడితడు. తనకు మొక్కుకుని తలనీలాలు పెంచిన వారు, కొండకు రాకపోయినా, జుట్టు పట్టుకొని లాక్కొని వచ్చే ఘనుడితడు. ముడుపులు గట్టి మరచిపోయిన వారి ముడుపులు - వడ్డీతో సహా వసూలుచేసే వడ్డికాసుల వాడితడు. హుండీనిండా కానుకలరాశులు పోయమని భక్తుల ప్రోత్సహించే ఘనుడితడు. కట్టుకున్న భార్యను పుట్టినింటికి తరిమి, పుట్టుగతులనుకోకుండా సన్యసించమని శ్రీ రామానుజాచార్యులను ప్రోత్సహించిన వాడు కూడా ఇతడే. అందుకే తక్కువ వాడు గాడితడు? ఇతనిని గురించి నేనేమని వ్రాయను? ఎంతని వ్రాయను? అసలు నేనందుకు సమర్థుడనా? అర్హుడనా? కాను. అయినా ఆయన లీలలన్నిటిని, బాలాజీ కథలుగా ప్రత్యేకంగా ఒక గ్రంథమే వ్రాద్దామని వుంది. అందుకే ఇంతటితో చాలిస్తున్నాను. ఆ మహానుభావుని దయవల్లనే, ఈ బండి ఇంతటిదాకా నడిచింది.

ఇక సెలవు!

జై శ్రీనివాస్



తిరుమల శ్రీవారి రథోత్సవము.

అనుబంధం-1

# అవి - ఇవి - అన్నీ

స్వర్ణముఖిలోయను, అరుణానదీలోయను, అంజేరమ్మ కనుమ వేరు చేస్తుంది. తిరుపతి నుంచి రేణిగుంట మీదుగా పుత్తూరుకు పోవు మార్గంలో, వడమాలపేట, తడుకు రైల్వేస్టేషన్ దాటుతూనే వచ్చే కనుమపేరు — అంజేరమ్మ కనుమ. అంజేరమ్మ పతివ్రతా శిరోమణి. భర్తురాలు. రోడ్డుకు పశ్చిమంగా వేపచెట్టుక్రింద ఇప్పటికీ ఆమెకు శుక్ర, ఆదివారాలలో స్థానికులు పూజలు సల్పుతూంటారు. ఆకనుమలో ఆమె సాయుజ్యం పొందినందువల్ల, ఆమొత్తం కనుమ ఆమె పేరుమీదుగా ప్రసిద్ధి పొందింది. ఆ కనుమలో ఒకప్పుడు ఒక బందిపోటు దొంగ వుండేవాడు. మనిషి బలిష్టంగా, భయంకరంగా వుండేవాడు. ఆదారిన వచ్చే తిరుపతి యాత్రీకులను, స్థానిక పాదచారులను, కూర్చొని వున్న చోటునుంచి కదలకుండానే దబాయించి పైకం నగలు గుంజు కొనేవాడు. పాపం యాత్రీకులు - పాదచారులు వాడికి భయపడి, వాడు పైకిలేస్తే చంపుతాడేమోనని, తమదగ్గరున్నదంతా ముడుపు గట్టి వాడికి చెల్లించేవారు. ఇలా వుండగా, ఒక గడుగ్గాయి ఆ దారమ్మట వెళ్ళాడు. వాడికి కనుమలోని దొంగసంగతి తెలియదు. దొంగ మామూలుగ ఆ గడుగ్గాయిని బెదిరించాడు. 'లేచివస్తే చంపుతా' నని హూంకరించాడు. గడుగ్గాయి తక్కువ తిన్నవాడా? అసలు సంగతి తెలియకుండా, అమాయకంగానే 'నీవు లేచిరా! చూద్దాం' అన్నాడు. దొంగ పైకి లేవలేదు. లేవడానికి వానికసలు కాళ్లులేవు. అప్పుడే ఆదారివెంబడి వస్తున్న ఇంకా కొందరు పాంథులు అసలు విషయం గ్రహించి, ఇన్నాళ్లూ ఆ కుంటిదొంగ తమను మోసగించి దోచుకున్నందుకు కసిగా వాడిని కొట్టి చంపారు. అప్పటినుంచి యీ ప్రాంతంలో - అనవసరంగా బెదిరించేవారికి వాడే వుపమానం - 'అంజేరమ్మ కనుమలో కుంటోడు' అని.

ఈ ప్రాంతంలో బహుళ ప్రచారంలోవున్న మరొకసామెత - 'ఏ యెలవ (సమయము) కాడ లేచినా చింతగుంట కాడ తెల్లారుతుంది, అనేది ఈచింతగుంట, ఏ చింతగుంటో తెలియదు గానీ తిరుపతి సమీపంలో మాత్రం చింతలచేను, కాయంపేటదగ్గర చింతకాలువ, నెరబైలుదగ్గర (తలకోన లేక సిద్ధేశ్వరతీర్థం) చింతగుంట వున్నాయి. బహుశా చింతకాలువే ఒకప్పుడు చింతగుంట అని వ్యవహరింస బడేదేమో? ఆకాలంలో యాత్రీకులు రాత్రులలో బయలుదేరి తెల్లవారేసరికి తిరుమల చేరాలనుకొనేవారు. పాపం! ఎంత త్వరగా లేచి వచ్చినా యీ చింతగుంట దగ్గరి కొచ్చేసరికి భళ్లున తెల్లవారేది. ఎంత త్వరపడి చేసినా ఫలితం మాత్రం ఒకటే ననడానికి నిరూపణగా యీసామెత ప్రబల ప్రచారంలోకి వచ్చింది. యోగి వేమన అడ్రసు చూడండి.

ఆ. ఊరు కొండవీటి। కునికి పశ్చిమ వీధి
మూగచింతపల్లె ' మొదటి యిల్లు
యెడ్డె రెడ్డి కులమ। దేమని తెల్పుదు
విశ్వదాభిరామ। వినుర వేమ.

మూగచింతపల్లి ఒంగోలు తాలూకాలో నున్నది. వేమన సమాధి అని భావింప బడుతున్న కట్టడము కదిరి సమీపంలోని కటారుపల్లెలో నున్నది. కానీ, ఇవి తప్పు అంటున్నారు ప్రస్తుత చరిత్రకారులు. 13-4-1980 ఆదివారం, రాత్రి 7-30 గంటలకు హైదరాబాదు కేంద్రం నుంచి ప్రసారమైన యువవాణి కార్యక్రమాలలో డాక్టరు గోపాల్‌గారి, వేమనమీద పరిశోధక వ్యాసమొకటి. ఆయన 'ఏమంటున్నారంటే, పరిశోధించి ఎన్నో క్రొత్తవిషయాలు తెలుసుకొంటున్నాము. రామదాసు గారిని తానీషా ఖైదుచేయలేదు. తెనాలిరామలింగడు లేదా రామకృష్ణుడు రాయలవారి కొలువులో (అష్టదిగ్గజాలలో) నొకడుకాడు. అలాగే కదిరి సమీపంలో నున్న కటారుపల్లి సమాధి వేమన సమాధియేగానీ, యోగి వేమనదిగాదు. ఆవేమన వేరు. మూగచింతపల్లి చితూరుజిలా చంద్రగిరి తాలూకాలో నున్నది. యోగివేమన క్రీ. శ. 1606 లో

జన్మించారు. నా యీ అభిప్రాయాలకు క్రీ. శ. 1829 లో సి. పి. బ్రౌన్‌గారు సేకరించిన వేమనపద్యములు ఆధారము.' అని ఇంకా కొన్ని విషయాలు చెప్పాడు.

మూగచింతనపల్లి చంద్రగిరి తాలూకా, పులిచెర్ల ఫిర్కా, కల్లూరు రామిరెడ్డిగారిపల్లి సమీపంలో వుండేది. అది బేచరాకుగ్రామం. అంటే మునుపువుండి, ఇప్పుడు అదృశ్యమయిన గ్రామం. ఈ సంగతి తెలియ జేసిన శ్రీ బంగోరె ( బండిగోపాలరెడ్డి గారికి ) కృతజ్ఞతలు. ఈయన ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి వేమన ప్రాజెక్టులో స్పెషల్ ఆఫీసరుగా పని చేస్తున్నారు. గమనించవలసిన విషయం. వాయల్పాడులోను, పూర్వపు పొదిలి డివిజన్‌లోను, కందుకూరులోను వున్న గ్రామాలు - మూగచింతల మాత్రమే. మూగచింతలపల్లి మాత్రం కాదు. కల్లూరురామిరెడ్డిపల్లి ప్రక్కన ప్రస్తుతమొక చింతలవారిపల్లి వుంది. అది ప్రాచీన మూగచింతనపల్లికి గురుతుగా నిలచిందేమో ? ఆ చుట్టు ప్రక్కల గుట్టల మీద రెండు మూడు శివాలయా లున్నాయి. పరిశోధిస్తే యోగివేమన విశేషాలు ఏవయినా లభ్యంకావచ్చు.

యోగివేమన నటుండనిచ్చి భక్తరామదాసును చూద్దాం.

" శ్రీమించిన నెలకొండపల్లెలో శిష్టజనములు పొగడగను ''

కామాంబ లింగన మంత్రులకు పుత్రుడై జనించిన గోపన్న తిరుపతి దేవుళ్ళ గురించిగానీ, తిరుమల శ్రీవారిని గురించి గానీ, తన రామదాసుకీర్తనలలో ఒక్కమాటకూడ చెప్పకపోవడం ఆశ్చర్యం కదా !

మూగచింతపల్లె నటుండ నిచ్చి మఠంపల్లి కొద్దాము. ఈ కుగ్రామము చంద్రగిరికి తూర్పున, తొండవాడకు దక్షిణంగా గంగుడుపల్లి కొండలక్రింద నున్నది. కొండక్రిందపల్లి అని కూడ అంటారు. ఈగ్రామం మొత్తం హాత్తీ రాంజీ మఠానిది. వారు రైతులకు దీనిని శాశ్వత కౌలు ప్రాతిపదికగా ఇచ్చినారు. రైతులు మహంతులమీది మమకారంతో ఈగ్రామములోని భూములన్నిటినీ శాశ్వతంగా అమ్ముకున్నారు. కౌలుకిచ్చిన మఠం భూములను

తోటలను, అమ్మేవారు - కొనేవారు వున్నారంటే, ఈకాలాన్ని ఏ మనాలి? ఒకమండపం వుండటంవల్ల ఆపేరుతో మండపం పల్లెగా పరిగణింపబడుతున్న గ్రామమొకటి తిరుపతి ఇలాకాలో వుంది. తి. తి. దే. రెండవ సత్రమునకు వెనుక, అనగా వుద్యోగుల క్వార్టర్సుకు సమీపంలో దానరిమఠం అను హరిజనవాడ వుంది. పేరునుబట్టే వీరు మాలదానరులు. ఆ కాలంలో తిరుమల శ్రీవారిని దర్శించలేని మాధవదాసు అను హరిజనుడు అలిపిరిలో శిలగా మారి పోయి, ఇంకా అలా బోర్లగాగే పడుకొని వున్నాడు. అతని ప్రక్కనే ఒక ఖడ్గంకూడ వుంది. అతడెప్పుడో పైకిలేస్తాడట. అతను లేచినప్పుడు తిరుమల శ్రీవారి ఆలయంలోంచి ఒక భయంకర రాక్షసుడుపుట్టి దేశంమీద పడతాడట అతడు లేచేదానికి నిదర్శనంగా విరిగిపోయిన మాధవదాసు నడుము ఇప్పుడు అతుక్కుపోయి వుంది. ఇది స్థానిక కథ. చచ్చిన వారికి ఘంటవాయిస్తూ, శంఖు వూదే దానరులు వేరే వున్నారు. తిరుపతిలో, చంద్రగిరి క్రొత్తపేటలో వీరిపేరుతో ఒక్కొక్కవీధి వుంది. చంద్రగిరి ఈ దానరివీధి కెగువన సువర్ణ ముఖరీతీరంలో బ్రాహ్మణవీధి వుంది; అక్కడే, ఒకప్పుడు వెలిసిన శివాలయపు పూజారులు వారు. ఆ ఆలయము ఇప్పుడు శిధిలమై పోయి వుంది. ప్రకృతి వైపరీత్యాలు, నవాబుల రాకతో ఆ ఆలయం అస్తమించింది. ఈ ప్రాంతంలో ఆలయాలు వెలిసిన ప్రతిచోట బ్రాహ్మణవీధులు గాని, అగ్రహారాలుగానీ వెలిసి యుండడం గమనించవచ్చు.

చంద్రగిరి సమీపంలోని రెడ్డివారిపల్లి గ్రామానికి చెందిన శిధిలాలయము నృసింహాలయము అని నేను వ్రాశాను. కానీ ఆ గ్రామవాసులను విచారిస్తే కొందరు రామాలయమని, మరి కొందరు అమ్మవారి ఆలయమని ఇలా ఎవరికి తోచిన పేరు వారు చెబుతున్నారు. ఇప్పుడది యాగశాల అంటున్నారు. ఆ పేరుకు తగ్గట్టుగానే అది ఎత్తయిన వేదికలాగా కనబడు తోంది. మరి గోపురం ఎందుకొచ్చిందో? మొత్తానికి విజయనగర చక్రవర్తులు దానిని ఎందుకుపయోగించిరో తెలియలేకున్నాము. వారిచే నిర్మింపబడిన మరొక శివాలయము (క్రొత్తశానంబట్ల అడవిలో, అనగా చంద్రగిరికి తూర్పు

దిశలో ) ఒక గుట్టమీద వున్నది. అడవిలో నున్నందున దాని ఉనికి గాని చరిత్రగానీ, ఎవరికీ తెలియదు. అక్కడెందుకా ఆలయాన్ని నిర్మించారో కూడ ఎఱుగము. ఇలాంటి విజయనగర చక్రవర్తుల ఆలయాలు అలిపిరిలో ఒకటి, కపిలతీర్థంలో ఒకటి వున్నాయి. అలిపిరిలోనిది శ్రీలక్ష్మీనృసింహాలయం శిల్పకళకు, చిత్రలేఖనానికి ప్రతీక. పైకప్పు వీడిపోవడంతో చిత్రలేఖనం అదృశ్యమవుతోంది. పై ఆలయంలోని విగ్రహాలు తురుష్కుల దండయాత్రకు బలియై, అవతల అదృశ్యమయ్యాయి. అలిపిరిలోనున్న విజయనగరరాజుల మొండిగోపురం (పిడుగుపడినది.) కూడ శిల్పకళలోనూ, వాస్తులోను ఉన్నతమయినది. దానినిప్పుడు పునర్నిర్మాణము చేస్తున్నారు. అలిపిరిలోనున్న వృత్తాకారపుబండ యాత్రికుల డైనింగుటేబిలులాగా వుపయోగపడేదట. శిధిలాలయంలోని మరొకబండ రాగులరాయివలె వుంది. ఆ ఆలయంలోని బొక్కసం చూడదగినది. కపిలతీర్థంలోని ఆలయం భాష్యకారుల గుడి. బాగుపడవలసి వుంది.

తిరుమల కొండ క్రింద, పెరుమాళ్లపల్లికి సమీపముననున్న కొప్పెర వాండ్లపల్లి - మునుపు కొప్పెరల ( శ్రీవారి హుండీ ) కంట్రాక్టరులు నివశించిన గ్రామంగా భావించవచ్చు. కొండ క్రింద నివసిస్తూ, అవసరమయినప్పుడు కొండమీదికి పోతూ ఆలయకొప్పెర నిర్వహణను చేబట్టడంతో వారికి కొప్పెర వాండ్లని పేరు వచ్చివుంటుంది.

శ్రీనివాసమంగాపురములోని శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి వారికి మకరతోరణం లేదు. మకరతోరణం లేకుండా ఏ వేంకటేశ్వరస్వామి చిత్రమయినా కనబడితే, ఆయన శ్రీనివాసమంగాపురం స్వామివారని తక్కున చెప్పవచ్చు.

తిరుపతి, శ్రీ పద్మావతి కళాశాల ఆవరణలో విగ్రహ ప్రతిష్ఠ జరగకుండా ఆగిపోయిన, ఆలయాల సమూహముంది. ఆ ఆలయాలను దశావతారాల గుడులు అంటారు. గుడులు అక్కడున్నాయి. దశావతారాల విగ్రహాలు

తిరుమల శ్రీ హత్తీరాంజీ మఠంలోని రాముడోలాలో వున్నాయి. శ్రీరామనవమి వుత్సవాల సమయంలో, వాటికి పూజ జరుగుతుంది. మహంతు శ్రీ ప్రయాగ దాసుగారి హయాములో దశావతారాల గుడుల నిర్మాణం జరిగినట్టు తోస్తుంది. మద్రాసు ప్రభుత్వంవారు శ్రీవారి ఆలయ నిర్వహణను కమిటీకి అప్పగించడంతో వ్యథజెందిన మహంతుగారు, విగ్రహ ప్రతిష్ఠను ఆ ఖర్చు భరించలేకనే ఆపి వేశారనుకుంటాను. లేదా అధికార బదిలీ అపశకునంగా భావించారేమో? ఒకప్పుడు ఆ ప్రాంతాన్ని రౌండురోడ్ అని పిలిచేవారు. రౌండు:ఠాణాయో లేక ఏనుగుల ఠాణాయో కానీ, ఆవరణ మాత్రం చాల విశాలమయింది.

తిరుపతి పళనిటాకీసు సమీపంలో బైరాగి పట్టెడ వుంది. దానికి కెగువన తిరుపతి చెఱువులో బండారి బగీచా అను పేరు గలిగిన మామిడితోట వుంది. ఆ రెండుచోట్లా *ఆంజనేయస్వామి వారి గుడులున్నాయి. అవి శ్రీహత్తీ రాంజీ మఠం వారి స్వాధీనంలో నున్నాయి. మనం సన్యాసిని విరాగి అంటే, 'వ' అక్షర ప్రాముఖ్యం లేని ఉత్తరదేశం వారు బైరాగి అంటారు. 'వ' కు బదులుగ 'బ' వాడటం వారి రివాజు వంగదేశము - బంగదేశమయింది. బౌద్ధ, జైన విహారాలు విశేషంగా కలిగి విహార్ అని పిలువబడిన చోటు ప్రస్తుత బీహారు అని పిలుబవడుతోంది. రౌండురోడ్‌లో, బండారిబగీచాలో, బైరాగిపట్టెడలోను ముందు కుస్తీలు పట్టడానికి పెద్దపెద్ద గోదాలు, కసరత్తు చేయడానికి పరికరాలు వుండేవి. వాటిని వుపయోగించి బైరాగులు తమ దేహదారుఢ్యం పెంపొందించుకొనేవారు.

తిరుపతి జ్యోతిటాకీసు ముందు చాకలివారు బట్టలుతుకుతున్న గుంట ఒకప్పుడు † బ్రహ్మగుండమను పేరు గలిగిన పుణ్యతీర్థం. దాని ప్రక్కనే మంచినీళ్లగుంట అని పిలువబడుతున్న కోనేరు - నరసింహతీర్థం. అక్కడ

---

* తిరుపతి, తిరుమలలోనూ, తీర్థాలలోనూ, సోపానమార్గాల కిరువైపులా వెలిసిన ఆంజనేయస్వాముల విగ్రహాలు అరవైకి పైబడివున్నాయి.

† భీమతీరమను పేరుతో క్రొత్త కనుమదారిలో విఘ్నేశ్వరఆలయం సమీపంలో వున్న తీర్థాన్ని మాదిగవావి గుండమని కూడా అంటారని ఇదివరకే వ్రాశాను. దీని ప్రక్కన, కాలిబాటకు ఆనుకొని గంటి తీర్థముంది.

నరసింహస్వామి వారి ఆలయముంది. గట్టుమీద భిన్నమయిన *శ్రీగోవింద రాజస్వామి విగ్రహం ప్రకృతి అందాలు అవలోకిస్తూ పడి ఉంది. ఈ తీర్థం అపవిత్రం గాకుండా గట్టి బందోబస్తు చేశారు. ఈ తీర్థాలకు తూర్పున, తారురోడ్డు కానుకొని మరొక చెఱువుంది. దాని పేరు రామచంద్రగుంట. దాని గట్టుమీద నున్న మండపములోనికి శ్రీగోవిందరాజస్వామి ప్రతి సంవత్సరం ధనుర్మాసములో విచ్చేసి ఒకపూట గడిపివెళతారు. మంచిదే గానీ, ఆ దుర్వాసన ఆయన ఎలా భరిస్తారోమరి?

తిరుపతి నుంచి రేణిగుంటకు పోవుదారిలో, తిరుపతి దాటుతూనే, రస్తాకు ప్రక్కన ఒక పెద్ద మండపముంది. దానిని దొంగల మండప మంటారు. నిజాని కది శ్రీ గోవిందరాజస్వామి పారువేట మండపము. నీటి సౌకర్యం కోసం దాని ప్రక్కన చిన్న గుంట త్రవ్వారు. దొంగల మండపమను పేరుతో తిరుచానూరుకు పోవుదారిలో కూడ మరొక మండపముంది. ఈ రెండు మండపాలలోను, తిరుపతి వ్యవసాయ కళాశాల ప్రక్కన వున్న లోతువంక లోను మునుపటి కాలంలో దొంగలు వేచి వుండి యాత్రికులను దోచుకొనేవారు.

తిరుచానూరుకు పశ్చిమంగా సువర్ణముఖి తీరంలో పొన్నకాలువ అని పేరుగలిగిన ఒక కాలువవుంది. ఆ కాలువ గట్టుమీద ఒక చిన్న మండపము వుంది. అక్కడ శ్రీగోవిందరాజస్వామికి పొన్నకాల్వ ఉత్సవం జరుగుతుంది, ఒకప్పుడక్కడ పొన్నచెట్లు విశేషంగా వుండేవేమో? అందువల్ల ఆకాలువకు ఆపేరు వచ్చివుంటుంది. తిరుచానూరు శ్రీ పద్మావతి అమ్మవారికి కూడ అక్కడ పొన్నకాల్వ ఉత్సవం జరుగుతుందట. తిరుమల శ్రీవారు

---

* ఈ గోవిందరాజస్వామి విగ్రహాన్ని, చిదంబరమునుంచి శ్రీ రామానుజాచార్యులవారు తురుష్కుల బారిపడనీయక తీసుకవచ్చారట. రవాణాలో ఈ విగ్రహం భిన్నమయింది. అందువల్ల దానినిక్కడనే వదలి, అప్పటికప్పుడే ఒక నవనీత విగ్రహం తయారుచేయించి శ్రీ గోవిందరాజాలయంలో ప్రతిష్ఠించారని ప్రతీతి.

* బీబీనాంచారమ్మను లేవదీసుకవచ్చాడట. పెళ్లయ్యాక, బీబీనాంచారమ్మ మా వాళ్లు (మాతురకవారు) కొండకురారేమని అడిగిందట. అందుకు శ్రీవారు వచ్చేటప్పుడు మావారు, పోయేటప్పుడు మీవారు అన్నారట. పోయేవారు గుండుచేయించుకొని పోతారు గదా. అందుకని తురకవారు.

తిరుపతి శ్రీ గోవిందరాజస్వామికి బుగ్గ ఉత్సవం కూడ జరుగుతుంది. ఆయనకు ఆలయంలోపల ఒకటి, వెలుపల ఒకటి, రెండు బుగ్గలు (ఫౌంటెన్) వున్నాయి. ఆ బుగ్గలకు నీరు తిరుపతి సమీపంలోని ముత్యాలరెడ్డిపల్లినుంచి సొరంగ మార్గం గొట్టాలగుండా వచ్చేది. ఇప్పుడా బావులు, సొరంగ మార్గాలు పూడిపోవడం వల్ల బుగ్గలు ఎండిపోయాయి. కానీ, బుగ్గోత్సవం మాత్రం జరుగుతుంది. పైపులద్వారా బుగ్గలకు అవసరమయిన నీరు ఇప్పుడు కూడ పెట్టుకోవచ్చు. ఆ ఏర్పాటువుంది. ఈ నీటిబుగ్గల పేరిట తిరుపతి ఆలయంలో ఒక బుగ్గమఠం వుంది. (ఇది, శ్రీహత్తీరాంజీ మఠంకాక, తిరుమల–తిరుపతులలో, పెద్దజియ్యంగారి మఠాలు, చిన్నజియ్యంగారి మఠాలు, ఉత్తరాదిమఠాలు, అహెూబిలమఠాలు, శ్రీరాఘవేంద్రస్వామిమఠాలు, మైసూరు ధర్మసత్రాలు, పూనాధర్మశాలలు, తిరుమలలో మూలమఠం, తిరుపతిలో గాలిగోపురమఠం ఇలాంటివెన్నో వున్నాయి.)

నీటి బుగ్గలు ఎండిపోయినట్టు తెలియగా, శ్రీ గోవిందరాజస్వామి బుగ్గలు అలసిపోయినట్టు కనిపిస్తాయి. అందుకు కారణం ఆయన నవనీత విగ్రహుడవటంకాదు—తిరుమల శ్రీవారికి అగ్రజుడవటం. తమ్ముడు తిరుమల శ్రీనివాసుడు రేయింబవళ్లనక, యాత్రికులకు దర్శనమిచ్చి, సంపాదించిన ధనమంతా అన్న గోవిందరాజు కుంచంతోకొలిచి, కొలిచి, అప్పటికీ పూర్తికాక,

---

* బీబీనాంచారమ్మ తురక స్త్రీ అని, తిరుమల శ్రీవారు ఆమెను లేవదీసుకవచ్చాడని అందువల్ల ఆయన తురకవారి అల్లుడని, అ స్వంతం వల్లనే మహమ్మదీయులు ఆయన గుడిలో తిష్టవేసేవారని, ప్రస్తుతం ఆలయంలో వున్న లాలాఖమరాం (తోడరుమల్లు) కుటుంబ విగ్రహాలు అలావచ్చాయని పరంపరాగతమయిన ఒక కథ ప్రచారంలో వుంది. ఈ కథలోని ఇబ్బందిని గమనించిన మన అర్చకులు ఆండాళమ్మ (గోదాదేవి)కు బీబీనాంచారమ్మ అని పేరు పెట్టేశారు. ఇబ్బంది తొలగిపోయింది.

అలిసిపోయి కుంచాన్ని తలగడగా పెట్టుకొని అలాగే నిద్రపోయారట. అందుకే పాపం ఆయన బుగ్గలు కందిపోయి, ముఖారవిందము స్వేదబిందువులతో నిండినట్టు కనిపిస్తుంది. అన్నను చూచి తమ్ముని చూడాలిగదా. అందుకని తిరుమల ఆలయంలో తిరుమామణి మండపం ముందుభాగంలో (అంటే గరుడాళ్వారుకు వెనకవైపు) అన్నగారి బొమ్మను బంగారుపూతతో డిజైను చేసిపెట్టారు. యాత్రికులకు తమ్మునికంటే మునుపు అన్నగారి దర్శనమవుతుంది. కానీ కొందరు ఈ స్వామిని రంగనాథస్వామి అని అంటారు.

తిరుమల శ్రీవారికి శ్రీవరాహస్వామి స్థలదానం చేశారు గాబట్టి, ఆయనకు ముందుహారతి, నైవేద్యం గాబట్టి, ముందు ఆయనను దర్శించి తరువాత తిరుమల శ్రీవారిని దర్శించాలనేది ప్రాచీన సంప్రదాయం. ఆయన దర్శనంకాక పోయినా విమాన ప్రదక్షిణంలో శ్రీవిమాన వేంకటేశ్వరులను దర్శించితే, అసలు స్వామిని దర్శించినంత ఫలమట. కోరికలు అసలు స్వామిని కోరకూడదట. శ్రీ విష్వక్సేనులవారిని కోరితే, ఆయన అంతరంగ సమావేశంలో కోరికలను స్వామివారికి నివేదిస్తారట. అందరూ ఎక్కడ కోరుకుంటారోనని, వాటిని తీర్చలేకపోతే శ్రీ వారిహుండీకి ముడుపులు వస్తాయో రావోయని, భయపడి విష్వక్సేనులవారు వైకుంఠవాకిలి ప్రక్కన, ఎయిర్ కండిషన్ మిషన్ చాటున నున్న చిన్న ఆలయంలో దాక్కొని వున్నాడు.

శ్రీవారి తల్లి వకుళాదేవి శ్రీవారి పోటులో (వంటఇంట్లో) మకాంబెట్టి వగపడుల-ప్రసాదాల, దిట్టం గానీ రుచిగానీ తగ్గకుండా వంట బ్రాహ్మణులకు కావలికాస్తోంది. అయినా మనవారు తక్కువ తిన్నవారా? ఆమునలమ్మను కూడ ఏమఱచాలని అప్పుడప్పుడూ ప్రయత్నంచేసి పట్టుబడుతూ వుంటారు.

శ్రీవారి ఆలయం ముందు మిక్కిలి ఎత్తయిన నాలుగుకాళ్ల మండపముంది. దానినిప్పుడు హెచ్. ఎం. టి. వారి గడియారంతో సింగారించారు. ఆమండపానికి గొల్లదాని మండపమనిపేరు. ఆయాదవ స్త్రీ తిరుమలమీద

ఉడుతాభక్తిగా అమండపాన్ని నిర్మింప జేసింది. ఆమె భక్తి ఎలాంటిదనగా, ఆ నాలుగు స్తంభాలు ఏ ఆధారం లేకుండానే, భూమిమీద నగ్నంగా అంత భారం మోస్తూ నిలబడివున్నాయి. లేదంటే ఇప్పుడు రోడ్డు కాంక్రీటు - లెవల్ కోసం కప్పబడినాయి. అలాంటి భక్తి అందరికీ కుదరదు. మరొక యాదవ స్త్రీ డబ్బు కూడబెట్టింది. చెఱువుకట్టమీద బెట్టి నీరు త్రాగుతుండగా, ఒక కోతి ఆ డబ్బుసంచిని ఎత్తుకొని ప్రక్కనున్న చెట్టుకొమ్మలోనికి బోయి విదిలించగా సగండబ్బు చెఱువులో, సగండబ్బు గటుమీద పడింది. ఆమెకు దక్కినది గట్టుమీద పడిన డబ్బుమాత్రమే. చెఱువులోపడినది చెఱువుపాలు. నీతి ఏమనగా - పాలలో నీరు కలుపగా వచ్చిన డబ్బు నీటిపాలయినది. చిక్కని పాల డబ్బుచేతికి చిక్కినది.

అలాంటి పని చేసిన కోతియే మన బేడి ఆంజనేయస్వామి. శ్రీ వారికి ఎదురుగా సన్నిధివీదిలో నిలబడివున్నాడు. శ్రీవారిని లెక్కచేయక, తోక ఆడిస్తూ నిర్లక్ష్యంతో పోతూవుంటే, ఆతని పొగరు అణచటానికి, శ్రీవారు బేడీలు తగిలించ మన్నారట. బేడీలు తగిలించు కొన్నాడు కాబట్టే ఆయనపేరు బేడి ఆంజనేయస్వామి, అయింది.

తిరుమల కొండను పూర్వీకులు తిరుమల శ్రీవారుగానే భావించేవారు. అందువల్లనే కొండ పాదాన్ని శ్రీవారి పాదంగా పిలిచేవారు. శ్రీవారి మెట్టు అనేపేరు అలానే ఆదినుంచీ, చంద్రగిరి కాలిబాట కొండ పాదానికి వుంది. స్వామిపాదాలకు చెప్పులుకుట్టి, కొండ పాదం దగ్గఱబెట్టి శ్రీవారిమెట్టు (పాదం) అని పిలిచేవారు. అలిపిరిలో ఈ సంప్రదాయం ఇప్పుడు కూడ వుంది. దీనికి యాదవులు మిరాశిదారులు. మొక్కుబడులవారు శ్రీవారికి అనేక రకాల పాదరక్షలు వివిధ సైజులలో ఇప్పుడు కూడ సమర్పిస్తున్నారు. సరిగా సంవత్సరానికి అవి అఱిగిపోతున్నాయి. స్వామి, అమ్మవారి దగ్గర నుంచి వచ్చి చెప్పులు అక్కడేవదలి, అవతల కొండ ఎక్కుతారు. శ్రీవారు చెప్పులతో కొండ ఎక్కరు గానీ, మనం ఎక్కుతున్నాం. శ్రీవారు సాక్షాత్తు భౌతికంగా వున్నారనడానికి చెప్పులు అఱిగిపోవటం నిదర్శనం.

తి. తి దే. శాసనాలలో తిరువేంకట ముడైయాన్, తిరువేంగళనాథ, తిరుమలయ్య మొదలగునవి మాత్రమే తిరుమల శ్రీవారికి చెందినపేర్లు. ప్రసన్న వేంకటేశ అనుపేరు అప్పలయ్యగుంటలోని శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామికి చెందినది. కళ్యాణ వేంకటేశపేరు, శ్రీనివాస మంగాపురంలోని శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామికి చెందినది. ఈసూక్ష్మం అర్థంగాక, శాసనాలకు అర్థాలు గజిబిజిగా తయారయి, ఒకదానితో నొకటి పొత్తుకుదరక చరిత్ర కుంటువడినది. ఈశాసనాలలో కనిపించే తంజై ప్రాంతము - తంజావూరు అని కొందరి అభిప్రాయము. శాసనాలలో కనిపించు మరొక చోటు పాలారుకు సమీపంలోని కళ్యాం. ఇది కాట్పాడికి సమీపములో తూర్పున అంటే కాట్పాడినుంచి బొమ్మసముద్రమునకు పోయే కచ్చారోడ్డు ప్రక్కన 'కన్నం' అని పిలువబడు కుగ్రామం. మునుపు వేలూరులోని పాలారునది మొదలుకొని స్వర్ణముఖినది వరకు ఉత్తర ఆర్కాటు మండలముగా పరిగణించేవారు. పాలారునది వేలూరు, కాంచీపురము, చెంగల్పట్టుల మీదుగా ప్రవహించి బంగాళాఖాతములో కలుస్తుంది.

తిరుపతి సోపాన మార్గములోమట్లవారి గాలిగోపురం వుంది. ఈపేరిట తిరుపతిలో, శ్రీ కోదండరామాలయ సమీపంలో గాలిగోపుర మఠం వుంది. గాలిగోపురంలోని దేవతామూర్తుల (శ్రీ కోదండరాముల) కైంకర్యాలకు వెలిసిన మఠమిది. మొదటి మట్లరాజులు భక్తిపరులై భారీ నిర్మాణాలు కావిస్తే, చివరివారు, శ్రీవారి ఆలయ దోపిడికి విచ్చేసిన మరాఠులకు సహాయం చేయటం, ఈచరిత్రలో చూస్తాం. రాయచోటి సమీపంలో ఎఱ్ఱగుంట్లకోట (చిట్వేలిలో) యీ మట్లరాజుల వూరు మట్లివుంది.

అలాగే, విజయనగర చక్రవర్తులలో చివరి వంశం అరవీడువంశం. ఈ అరవీటి చక్రవర్తుల స్వగ్రామం, రాయచోటి తాలూకాలోని గాలివీడుకు సమీపమునవున్న అరవీడు. కర్నూలు జిలాలో మరొక అరవీడు వున్నది.

అదివేరు. అరవీడు, మట్లి - ఇవి రాయచోటి సమీపమున *బాహుదానదీ తీరమున వున్న గ్రామాలు. రాయచోటికి మరొక పేరు రచ్చవీడు. అనగా ఒకప్పుడు యుద్ధము జరిగిన ప్రదేశం. చంద్రగిరిలాగే, రాయచోటి కూడ ఒకప్పుడు నవాబుల పాలనలో వుండేది. రాయచోటి నవాబులదగ్గర, మన జిల్లా మదనపల్లి తాలూకాలోని తంబళ్లపల్లి రెడ్లు ఒకప్పుడు దివానులుగా పని చేసేవారు. చివరకు నవాబు పకీరయినాడు. రెడ్లు నవాబులయినారు. తొలి విజయనగర చక్రవర్తుల కాలంలో తిరుమల శ్రీవారి దిట్టం 75 శాతం వుండేది. చివరివారయిన అరవీటి వంశరాజులు పాలన కొచ్చాక ఆదిట్టం 50 శాతమునకు తగ్గింది.

నారాయణవరం, కార్వేటినగరం రాజులు, పూర్వంనుంచీ వస్తున్న యాదవరాజులు. వీరు చివరకు క్షత్రియులైనట్లు కన్పిస్తోంది. ఈమార్పు ఎలాసంభవమయిందో తెలియదు. లేదా యాదవనామం బిరుదాంకితమేమో? అయినా, వీరిని గురించి ఇంకా కొన్ని విశేషాలు యీ గ్రంథంలోనే మరొక చోట చదువుకోవచ్చు.

కంచి కామకోటి పీఠాధిపతులు జూనియర్ స్వామి అనగా శ్రీ చంద్రశేఖర జయేంద్ర సరస్వతీ స్వామి వారు తిరుచానూరును 'తిరు-ఈశానూరు' అంటారు. అంటే ఆయన భావము అది శైవక్షేత్రమని. తిరుచానూరు సమీపంలోనున్న ప్రసిద్ధ ప్రాచీన శైవక్షేత్రం, తిప్పలాధీశ్వర ముడయ మహాదేవ (శ్రీ పరాశరేశ్వరస్వామి) యీ సందర్భంగా గుర్తుకు వస్తున్నారు. పరాశర మహర్షి ప్రతిష్ఠగా భావించ బడుతున్న యోగి మల్లవరంలోని యీ తిప్పలాధీశ్వరస్వామి తూర్పు ముఖంగా వున్నారు. ఆలయద్వారానికి ఎదురుగా అమ్మవారు సాక్షాత్కారమిస్తారు. ఆమె దక్షిణముఖంగా వుంది. ఇక్కడ ఆలయ

---

* శంఖుడు, లిఖితుడు అనువారు సోదరులు. ఋషిపుంగవులు. లిఖితుడు రాజుగారి తోటలో మామిడిపండు, అనుమతి లేకుండాతిని, స్వయంగా రాజుగారిచే శిక్షవేయించుకొని చేతులుపోగొట్టుకొని, చివరకు యీ నదిలోమునిగి చేతులు పొందినందువల్ల యీనది బాహుదా అయినది. బాహువులు అనగా చేతులు. ద అనగా ఇచ్చునది

గోడలమీదనే కాక, ఎక్కడ బడితే అక్కడ ప్రాచీన శిలాశాసనాలు చిందర వందరగా పడి వున్నాయి. స్వామివారి ఆలయం బాగుపడింది గానీ, కళ్యాణ మండపము మాత్రం కొంత కూలిపోయి, తక్కినది కూడ కూలి పోవడానికి సిద్ధంగా వుంది. ఇచ్చట శిల్పసంపద పరిరక్షించుకోదగినంత విశిష్టమయినది. కళ్యాణమండపములోని కుడ్యాల మీద, పార్వతీ పరమేశ్వరుల కళ్యాణం, భిక్షాటనామూర్తి, ఉపవిష్ట పార్వతీ పరమేశ్వరుల దృశ్యాలు అనన్యాదృశములు.

తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి పుష్ప కైంకర్యానికి పూదోటలన్నీ దక్షణంవైపు వుండేవి. తిరుపతికి దక్షిణంగా వున్న మఠం భూములన్నీ పూర్వపు పూదోటలు. ఆలయానికి దక్షిణంగా అంటే దక్షిణ మాడవీధిలో మఱ్ఱిమాను సందుకు తూర్పుగా నున్న తి.తి.దే. ఉద్యోగుల సంఘ కార్యాలయ ప్రాంగణం ఒకప్పుడు సెల్వరాయన్ పూదోటగా ప్రసిద్ధి గాంచినది. అక్కడున్న ప్రాచీన మండపములో శ్రీ లక్ష్మీనారాయణస్వామి వారి గుడి వుంది.

అలాగే, శ్రీ కోదండరామస్వామి వారికి ఆలయంచుట్టూ అనేక పూదోటలుండేవి. తిరుపతి బజారువీధిలో నున్న, తి.తి.దే. కాలేజీ విద్యార్థుల వసతి గృహానికి ఒకప్పటి పేరు పుష్పతోట. ప్రస్తుత ప్రాచ్యకళాశాల, సెంట్రల్ స్కూలు, శ్రీ వేంకటేశ్వర బాలమందిర ప్రాంగణాలు కూడ ఒకప్పటి పుష్పవనాలు. ప్రసూతి వైద్యశాలకు సమీపంలో నున్న కోమలమ్మసత్రం యాత్రీకులకు వసతి గృహంగాను, భగవంతునికి పూదోటగాను వుపయోగపడేది. ధార్మికురాలయిన ఆకోమలమ్మ వైశ్యస్త్రీ అనుకొంటాను. ఈమె దివాను బహదూరు శ్రీ పి. విజయరాఘవులశెట్టిగారి ధర్మపత్ని. వీరిది మద్రాసులోని చింతాద్రిపేట. బ్రహ్మోత్సవము ముగిసిన రెండవదినము తిరుమలనుంచి నడచివచ్చి, 14-10-1929 ఏకాదశినాడు, అడివారం అను విష్ణుపాదంలో (అలిపిరి పడాలమండపంలో) సాయుజ్యమొందినది. ఈమెకు అక్కడొక స్మృతిచిహ్నం నిర్మించారు. ఇప్పటికీ ఈ సాధ్వివిగ్రహం శ్రీవారికి అంజలి ఘటిస్తూ అక్కడే నిలబడివుంది. క్రొత్తవీధికి ఎదురుగా అంటే తూర్పున ఒక

పూదోట ఇంకా మనగుర్తుకు నిలబడే వుంది. ఆ తోటముందు ఉత్తరాభి ముఖుండైన శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామి ఒక చిన్నగదిలాంటి ఆలయంలో వున్నారు. క్రొత్తవీధిలోని మరొక ప్రసిద్ధ ఆలయము శ్రీ కన్యకాపరమేశ్వరి ఆలయము. అక్కడ నవగ్రహ గుడి కూడ వుంది. ఇక్కడికి సమీపంలోనే నాథమునివీధిలో శ్రీ నాథమునుల ఆలయముంది. ఈ ఆలయానికి చెందిన ఒకప్పటి పూదోటలో, "కెజెక్సు" అను ఆంగ్లపాఠశాల, ప్రస్తుతం నిర్వ హింపబడుతోంది.

గాలివీధి మొగదలనున్న శ్రీ కాళియమ్మగుడి, కోర్టుదగ్గరున్న వేషాలమ్మ, తిరుపతి తూర్పు-లెవల్ క్రాసింగు దగ్గర, తిరుపతి, రేణిగుంట, తిరుచానూరు రోడ్లకూడలిలో నున్న అంకాలమ్మగుడి (తిరుపతి గ్రామదేవత), ఆర్. టి. సి. బస్‌స్టేషన్ సమీపమునవున్న శ్రీ తాళ్ళపాక గంగమ్మ, తాతయ్యగుంట దగ్గర వెలసిన గంగమ్మ, అక్కడే వున్న శ్రీ నేరేళ్ళమ్మ, శ్రీ వినాయకస్వామి జ్యోతిటాకీసు దగ్గరనున్న శ్రీ కావమ్మ, మారయ్యలగుడి, వీరంతా తిరుపతిని అన్నివైపుల నుంచి కాపాడుతున్న దేవతలు. ఇంకా ఇలాంటిచిన్న ఆలయాలు తిరుపతిలో అనేకముండటం అందరెఱిగినదే. తిరుపతి గంగజాతర మండు వేసవిలో వస్తుంది. మునుపటిలాగ జంతుబలులు లేకపోయినా, తాగి తందనా లాడటానికి సప్పరాలు, వేషాలు-వికృతాలకు కొదువలేదు. అసలు గంగజాతర అంటేనే సహించలేనంత బూతు అని అర్థం. బేరివీధిలో, శ్రీ వరదరాజస్వామి ఆలయంలోనున్న తిరుక్కచ్చినంబి బేరివాళ్ళ గురువట. కోలావీధి మొగదల ఒక రచ్చబండ వుంది. దానికానుకొని వున్న శ్రీ ఆంజనేయస్వామి ఆలయంలో ఆయన నెత్తిమీద శ్రీ సీతారామ లక్ష్మణ స్వాములను ప్రతిష్ఠ చేశారు. చక్కగా కుదిరింది.

తిరుమల శ్రీ తరిగొండ వేంగమాంబతోటలో (శ్రీ వేంకటేశ్వర బి. నాగిరెడ్డి ఇంగ్లీషుమీడియం పాఠశాల ప్రాంగణంలో) శ్రీ తరిగొండ వేంగ మాంబ సమాధి మండపం దగ్గర బావిలాంటి ఒక గోతిని పెద్ద బండతో మూసి వేశారు. ఆ గోయి తుంబురుతీర్థానికి వెళ్ళే రహస్య సొరంగ మార్గమట.

పూర్వము తరిగొండ వేంగమాంబగారు దానిని వుపయోగించేవారట. ఆ రహస్య సొరంగ మార్గం తిరుమల ఆలయంలోకే వుందని, ఆమె ఎవ్వరి కంటాబడక శ్రీవారి సేవకు రాత్రులలో పోతూ, మహంతులకు పట్టువడినదని మరొక అభిప్రాయం. ఆ మండపము దగ్గఱ ఆమె స్వయంగా పూజ చేసిన చిన్న, ముచ్చటయిన ఆంజనేయస్వామి విగ్రహం ప్రతిష్ఠ చేయబడివుంది.

పుట్టపర్తి సాయిబాబాగారు, షిరిడీ సాయిబాబాగారి అవతారమని కొందరి విశ్వాసం. షిరిడీ సాయిబాబాగారు పూర్వజన్మలో భక్త కబీరు. షిరిడీ సాయిబాబాగారి గురువు - గోపాలరావు ఆయన తిరుమల శ్రీ వేంకటేశ వర ప్రసాద లబ్ధుడుగాన ఆయినను వేంకుశుడు అని కూడ అంటారు. ఆయన పూర్వజన్మలో కాశిలోని శ్రీ రమానందయోగి. అంటే మరు జన్మములలో రమానందయోగిగారు తిరుమల శ్రీవారి వరము వలన వేంకుశుడు (గోపాలరావు) గాను, కబీరుదాను షిరిడీ సాయిబాబాగను జన్మించారన్నమాట. ఈ విషయం "ఏమీ; నిన్నుపేక్షింతునా?" అన్న శీర్షిక గలిగిన శ్రీ సాయిబాబా చరిత్రము నందున్నది. దీని కర్త బావట్ల హనుమంతరావుగారు.

తిరుమల శ్రీ వరాహస్వామి క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రవేశించి, ప్రాముఖ్యత నొందినట్టే, తిరుపతి శ్రీ పార్థసారథిస్వామి ఆలయంలో శ్రీ గోవిందరాజస్వామి ప్రవేశించి, ఆయనకు ప్రాముఖ్యం లేకుండా చేసినారు. గోవిందరాజస్వామి వారికి చోటిచ్చిన ఫలితమా అన్నట్టు ఇటీవల వఱకు ఆయన పూజానైవేద్యాలు ఎఱుగడు. ఆలయం మూసివేయబడి వుండేది, ఆ పరిస్థితి ఇప్పుడు మారింది.

తొండవాడ గ్రామానికి ప్రాచీన చరిత్ర సమగ్రంగా లభ్యం కాలేదు. క్రీ. శ. 630 నాటి ఒక రాగిరేకు శాసనములో 'తాణ్డివాడ' లేక తాడివాడ అని వుంది. 'తాడి' ప్రాముఖ్యం గల ఆవూరు ఎక్కడిదో ఏ చరిత్రకారుడూ స్పష్టంగా వ్రాయలేదు. అంతా వూహాలమయం. క్రీ. శ. 925 - 50, నాటిదయిన జమ్మలమడుగు తాలూకా కొసినపల్లి సంపూర్ణ తెలుగు శాసనంలో

"తొణ్డరవట్ట - లో ........" అని వుంది. ఇది తొండమండల ప్రస్తావనయో లేక తొండవాడ ప్రస్తావనయో తెలియదు. క్రీ. శ. 1433 సంవత్సరమున తొండప్పాడి అను పేరుతో, ఆ తరువాత క్రీ. శ. 1801 లో తొండవాడ అను ప్రస్తుత నామంతో యీ గ్రామం వ్యవహరింప బడినది. అప్పటి నుంచీ ఆ పేరు యథాతథంగానే వుంది.

తొండవాడ, అగస్త్యేశ్వర క్షేత్రముగా ప్రసిద్ధి గాంచింది. అలాగే పుంగనూరు తాలూకా కొత్తకోట గ్రామ సమీపంలో అగస్త్యేశ్వర గిరి దుర్గం వుంది. ఇది నిజానికి నెక్కొండి గ్రామానికి చెందినది. దీనికి అగస్త్యేశ్వరుని కొండ, వరాలకొండ అని కూడ పేర్లు వున్నాయి. ఇక్కడి అగస్త్యేశ్వరాలయం, కాశీ విశ్వేశ్వరాలయం మంచి శిల్పసంపద కలిగి వున్నాయి. పుంగనూరు కోటలో అఘోర వీరభద్రస్వామి, సోమేశ్వరస్వామి, మాణిక్యవరదరాజస్వామి వారి ఆలయాలు కూడ వున్నాయి. చిత్తూరు పట్టణానికి పశ్చిమంగా నీవా నది గట్టున మరొక అగస్త్యేశ్వరాలయముంది. నారాయణవరంలోని అగస్త్యే శ్వరాలయానికి చెందిన అగస్త్యేశ్వర, పార్వతీ పరమేశ్వర పంచలోహ విగ్రహాలు ముందునుంచి చూస్తే ముసలి రూపముతోనూ, ప్రక్కనుంచి చూస్తే పడుచుదనంతోనూ కనిపిస్తాయని వాడుక.

నారాయణవరంకు ఈశాన్యంగా 6 మైళ్ల దూరంలో *సింగిరికోనవుంది. అక్కడొక నరసింహస్వామి ఆలయముంది. శ్రీసొరకాయస్వామి శిష్య, భక్తు రాలయిన మంగమ్మ అక్కడ అజ్ఞాతంగా ఆరు మాసాలు తపస్సు చేసింది. ఆ అడవిలో ఒక గొప్పవృక్షముండేది. అది ఎవరూ గమనించలేదు. నారాయణ వరం శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామివారి రథం చేయడానికి గొప్ప చెట్టు కావలసివచ్చి, వారు విస్తృలంగా వెదకుతూంటే, చివరకు శ్రీ సొరకాయ స్వామివారు దొరికే చోటు తెలియ జేసినారు. ఒక సారి తన భక్తులు బల

---

* సింగిరిగుంట అను పేరుతో, తిరుపతిలోని కోర్టుభవనాల వెనుక ఒక చెఱువు వుంది. సింగాలగుంట అను పేరుతో తి. తి. దే. ముద్రణాలయం వెనుకవైపు మరొక చెఱువుంది.

వంతం చేయగా సొరకాయస్వామివారు తిరుమల శ్రీవారి దర్శనానికి వచ్చినారు. వచ్చినవాడు వున్నట్టుండి అదృశ్యమై, తన భక్తులు వగచుచుండ, తిరిగీ ఆయన శ్రీ వేంకటేశ్వరస్వామి విగ్రహం నుంచి వెలువడి వచ్చినారు. ఈ దృశ్యం చూసిన ఆయన భక్తులు, కొయ్యబారి పోయారు. సిద్ధుడు గదా! అందువల్ల ఆయన కలాంటివి సాధ్యం.

సత్యవేడు దగ్గర నున్న సురుటుపల్లిలో శ్రీపల్లికొండేశ్వరస్వామి ఆలయమున్నది. అక్కడి విగ్రహం దేశంలో మరెక్కడా లేదని చెపుతారు. క్షీరసాగర మథనంలో వెలువడిన హాలాహలాన్ని దిగమ్రింగిన శివుడు ఆబాధకు తట్టుకోలేకుండా అమ్మవారి ఒడిలో పవళించడం - ఆ విగ్రహ రూపం. ఇంకొక విశేషం మాతృమూర్తి ఆలింగనం చేసుకొన్న దక్షిణామూర్తి విగ్రహం. గత సంవత్సరం యీ ఆలయానికి దేవదాయ ధర్మాదాయ శాఖవారి తరఫున శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు కుంభాభిషేకం జరిపించారు.

నాగలాపురం, శ్రీ వేదనారాయణస్వామివారి ఆలయంలోని కొన్ని సుందరశిల్పాలను తి. తి. దే. వారి తిరుపతి మ్యూజియంకు ఇటీవల తరలించారు. శ్రీ త్రిమూర్తిస్వామి, శ్రీ త్రివిక్రమస్వామి, శ్రీ వేణుగోపాలస్వామి, ఆలయంలోని దీపస్తంభం, వగైరాలు తరలింపబడిన వాటిలో ముఖ్యమయినవి. ఈ గ్రంథంలోని 291 పేజీలో ఒక చిత్రాన్ని చూస్తారు. చిత్రం తమాషా కొరకు అచ్చువేయబడినది. ఋషీశ్వరుల నుదుట నామాలు. చేతుల మీద త్రిపుండాలువున్నాయి. వీరు వైష్ణవులా? శైవులా? శ్రీ వేంకటేశ్వరస్వామి లాగ - ఇద్దరూనూ. మతభేదం లేనివారు.

నేను వ్రాసిన ఈ చరిత్రను, కూలంకషముగా చదివిన శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, నాకు కొన్నివిషయాలు తెలియజేసినాడు. తొండవాడ శ్రీ మొగిలి రామకృష్ణారెడ్డిగారు మద్రాసు క్రైస్తవ కళాశాలలో చదువలేదట. వారు చదివినది మదనపల్లి బిసెంట్ థియోసాఫికల్ కళాశాలలోనట.

కావచ్చునేమో? ఎప్పుడో నా చిన్నతనంలో, మాటల సందర్భములో స్వర్గీయ *శ్రీ రామకృష్ణారెడ్డిగారు మద్రాసు చదువును గురించి ఒకరితో చెపుతూండగా విన్నట్టుగుర్తు. బహుశా అది నా వినికిడిలోపం గావచ్చు. ఇక రెండవ విషయం - తి. తి. దే. శాసనాలలో మొట్టమొదటి శాసన కాలం క్రీ. శ. 830? మొదటి శాసన కాలం క్రీ. శ. 830 అనీ, ఆయన ఇదివరకు తన తి. తి. దే. ఎపిగ్రాఫికల్ రిపోర్టులో వ్రాసినా, ఇప్పుడా అభిప్రాయాన్ని మార్చుకొన్నట్టు తెలియజేసినాడు. ఇప్పుడాయన వుద్దేశ్యం ప్రకారం-పల్లవరాణి 'శమావై' భోగశ్రీనివాసమూర్తిని వెలయించిన సంవత్సరం క్రీ. శ. 614. అంటే తిరుమల ఆలయచరిత్ర, శాసనాల ప్రకారం. రెండు శతాబ్దాలమునుపు వెళ్ళుతుంది. మంచిదే. అప్పుడు ఈ శాసనాలు (తి. తి. దే. శాసనసంపుటి 1. శాసనాలు 8,9.) మొదటి మహేంద్రవర్మ (క్రీ. శ. 600–630)కాలమునకుచెంది, ఇవే తి. తి. దే. శాసనాలలో మొదటివవుతాయి. అలాంటప్పుడు మొదటి శాసనంగా ఇన్నాళ్ళు పరిగణింప బడిన దంతివర్మశాసనము (తి.తి.దే. శాసన సంపుటము 1. శాసనము 1. క్రీ. శ. 830 నాటికి చెందినది.) తరువాత స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఇదీ సంగతి. ఈ మార్పువల్ల, అదే సంపుటములోని మూడవ శాసనములో బాణరాజు కుమారుడైన విజయాదిత్యుని ఆవిర్భావం తప్పగాదని - శ్రీ టి. కె. టి. వీరరాఘవాచార్యుల అభిప్రాయము. కూడ అదేనని- ఆతడు నిర్ణయించిన విజయాదిత్యుని కాలంకూడ (క్రీ. శ 790) సరిగానే వుందని స్పష్టమవుతోంది.

శాస్త్రిగారు తెలియజేసిన మరొకవిషయం—తిరుచానూరు అమ్మవారి ఆలయంలోని 'తిరువిలం కోయిల్' ను గురించిన సందేహాలు. ఆవిషయంలో నేను శ్రీ టి. కె. టి. వీరరాఘవాచార్యుల, శ్రీ మారేమండ రామారావు గారల అభిప్రాయాలతో ఏకీభవించినట్టు, వారు అభిప్రాయపడినారు. కావచ్చు.

---

* ఈయనతోబాటు తి. తి. దే వారి మొదటి కమిటీలో (క్రీ. శ. 1933) మెంబరుగా పనిచేసిన శ్రీ చంద్రగిరి శ్రీనివాసులుశెట్టి ఇంకా జీవించి వుండటం ముదావహం. ఈయనకిప్పుడు 92 ఏళ్ల వయసు. ఈయన తామ్రపత్రగ్రహీత. తిరుపతి మునిసిపల్ కమిటీ అధ్యక్షుడుగా, చిత్తూరు జిల్లా బోర్డు మెంబరుగా, తిరుపతి టౌన్ బ్యాంకు స్థాపకులలో నొకడై యీ ప్రాంతానికెంతో సేవచేసినాడు. శ్రీ రామకృష్ణారెడ్డి గారి భార్య శ్రీమతి ధనలక్ష్మమ్మ పేరిట తొండవాడ శివాలయంలో 9–6–80 తారీఖున శ్రీ కోదండరాముల ఆలయం వెలిసింది.

తిరుచానూరు పద్మావతిదేవి ఆలయంగా ప్రస్తుతము చెలామణి అవుతున్న ఆలయం ఒకప్పుడు తిరుచానూరు సభైయ్యర్‌ల మ్యూజియం. అంతకు మునుపు ధాన్యాగారంగా, ధనాగారంగా వుండేది. ఆచుట్టుప్రక్కల పడిపోయిన ఆలయాల శిధిలాలతో కోటలాంటి ఆ మ్యూజియంను నిర్మించారు. తిరుచానూరు సన్నిధివీధికితూర్పున *శిధిలాలయంలో వుండిన వరదరాజస్వామి, ఇంకా బలరామకృష్ణులు అంతా మ్యూజియం చేరినారు. తిరుపతిగ్రామదేవత [ప్రస్తుతం అంకాలమ్మగుడి] ఆలయంలోని †తిరుపతమ్మ *పద్మావతిదేవియై తిరుచానూరు మ్యూజియం చేరింది. ఆమె తిరిగివచ్చి తమను పిలుచుకొని పోతుందేమోనని ఆమె ద్వారపాలికలు, అంకాలమ్మ గుడిముందు, ఎండలోకూర్చుని, శకటాల దుమ్ము లెక్కచేయకుండా ఇంకా నిరీక్షిస్తూనేవున్నారు. గర్భాలయంలోని తిరుపతమ్మ అదృశ్యంకాగా, ఆ స్థానాన్ని అంకాళమ్మ ఆక్రమించింది. తిరుచానూరు మ్యూజియంలో విరిగిపోయిన విగ్రహాలకు చోటులేదు. అలాంటి భిన్నవిగ్రహాల మ్యూజియం, తిరుచానూరు మొగదలలో [గేటువద్ద] పద్మసరోవరం ప్రక్కనే ఇప్పటికీ వుంది.

తిరుపతినుంచి తిరుపతమ్మను తొలిగించినపుడు, ప్రజలనుంచి, ప్రభుత్వంనుంచి తిరుచానూరు సభైయ్యర్‌లకు మంచిడోను లభించింది. తిరుపతి ప్రజలు తిరుచానూరు సభైయ్యర్‌ల కొంపలమీద దాడి జరిపి తమ అసమ్మతిని తెలియ జేసినారు. అవతల (అంకాళమ్మ) విగ్రహం ఒకటి తెచ్చి ఆస్థానాన్ని భర్తీ చేసినారు. కానీ అది చాలా చిన్న విగ్రహం. అంతటితో మ్యూజియం విస్తృత వ్యాపనము ఆగిపోయింది. తిరుపతమ్మను తెచ్చుకొన్నా, ద్వారపాలికలను తెచ్చుకొనే ధైర్యంలేకుండా సభైయ్యర్‌లు వారి నక్కడే వదలివేశారు.

---

*ఈ శిధిలాలయం వరదరాజస్వామి సన్నిధియని, ఇదే తిరువిలంకోయిల్‌గా వుండవచ్చునని శాస్త్రిగారి అభిప్రాయము. ఆయన అభిప్రాయంకూడ ఎన్నదగినది.

†తిరుపతి పేరు తిరుపతమ్మ అను గ్రామదేవత వల్లనే వచ్చిందని నావిశ్వాసం.

* అందుకే ఆమెకుగానీ, అర్చకులకుగానీ మడులులేవు. మాన్యాలులేవు. పరసవారిమీద ఆధారపడివున్నారు. అందువల్ల 1914 లోనే హారతి, అర్చన టిక్కెట్లు ఇక్కడ అమ్మకానికి పెట్టారు.

చంద్రగిరి నవాబుగారి విచారణలో, స్థానిక ఆలయాలలో పూజాపునస్కారాలు నైవేద్యాలు సరిగా జరుగనందువల్ల, వాటికన్నిటికి విడివిడిగా ఏర్పాట్లుచేయడం వీలుగానందువల్ల, పైగా ఆలయాలు కొన్ని భిన్నములేదా శిధిలమైనందువల్ల, తాము ఆ దేవ, దేవతలకు పూజాపునస్కారములు, నైవేద్యములుచేయు సత్సంకల్పముతో అలాచేశామని తిరుచానూరు సభైయ్యర్‌లు మొరబెట్టుకున్నారు. చంద్రగిరి నవాబుగారు వీరి తెలివికి సంతోషించి, ఆరోజుటి నుంచి మ్యూజియమును అలయంగా మార్చి నిత్యనైవేదికములు జరుపుమని ఆర్డరు వేశాడు. స్థానిక ప్రజలు సంతోషించారు. కాస్సేపు కళ్లు తేలవేసినా, చివరకు తప్పదుగాబట్టి, ఒప్పుకున్నారు సభైయ్యర్‌లు.

ఆ రాత్రంతా అందరూ కూర్చుని దివిటీలు బెట్టుకొని ఆలోచించారు. మ్యూజియం అయితే, టికెట్టు బెట్టి పణం సంపాదించవచ్చు. ఆలయం అయితే పణం ఖర్చుబెట్టి నిర్వహించాలి. పైకం రాబట్టాలంటే తిరుపతమ్మకు ఆకర్షణ బెట్టాలి. అందుకని, తిరుమల శ్రీవారి భార్య సాక్షాత్తు *అలమేలు మంగమ్మ, ఆ ఉదయం కరివేపాకు తెచ్చుకోవటానికి వచ్చి, భర్తమీద కోపంతో అక్కడే ఆగిపోయిందని ఆ దారిన వచ్చే యాత్రీకులకు చెప్పసాగారు. ఊర్లో వారికి చెబితే ఒప్పుకోరు, పైగా మరో దాడి జరుపడం ఖాయం. తిరుపతమ్మ చేతిలో ఇన్ని పాట్లు పడవలసి వచ్చింది - తిరుచానూరు సభైయ్యర్‌లు. ఎలాగయితేనేం? క్రమంగా యాత్రీకుల దగ్గర నుంచి పైసలు రాబట్టసాగారు. క్రమక్రమంగా పంచలోహ విగ్రహాలు తయారయ్యాయి. అష్టాదశ పురాణాలు అవసరమయిన మార్పులతో ప్రచారం కాసాగాయి. తిరుచానూరు ఆలయంలో కూడ అవసరమయిన మార్పులు జరిగాయి. ప్రాకారాలు పదిలంచేసి, మహాద్వార గోపురం కట్టారు. అవసరమయిన మంటపాలు, వంటశాలలు వెలిశాయి. శ్రీకృష్ణుడు ద్వారానికి నేరుగా రావడంతో - తిరువిలంకోయిల్ కథకు కూడ ఆధారం దొరికింది.

---

* అమ్మవారు తిరుమలనుంచి వస్తూండగా దారిలో వానవచ్చిందట. ఆమె అక్కడొక పేటిక్రింద నిలబడింది. ఆ పేటిని చారలపేటి (సార్లపెట్టి) అంటారు. ఈ పేటిమీద భక్తాంజనేయ శిల్పం వుంది. ఇక్కడే భాష్యకారుల గుడి. అంటే ఇది శ్రీ రామానుజులవారు రామాయణం చదివిన చోటు. మోకాలిమెట్టు పైభాగం. ఈ చోటు ఎంతో ప్రాముఖ్యమయినది.

తిరుమల శ్రీవారు సృష్ట్యాది దేవుడు. ఆయనే ప్రకృతి-పురుషుడూను. ప్రత్యేకంగా ఆయన ఒక మతానికి గానీ, సంప్రదాయానికి గానీ, లింగవిభేదానికి గానీ చెందినవారు గారు. కానీ అలా లీలగా ఆయన ఆడుకొంటారు. అయినా మనకవసరం గాబట్టి, అడుగకపోయినా ఆయనకు కూడ ఒకభార్యను సృష్టించాము. నారాయణవరంలో తిరగలిరాయితో పిండివిసిరి పిండి వంటకాలతో ఆయనకు పెళ్లిచేశాము. ఆ మహాతల్లి దగ్గర కరివేపాకు మోయించాము. ఆమెను భర్తదగ్గరకు పోనీయకుండా శ్రీనివాసమంగాపురంలోను, నారాయణవరంలోను, తిరుచానూరులోనూ ఆలయాల్లో బంధించాం. ప్రతి సంవత్సరము తిరుచానూరు పంచమికి, తిరుమలనుంచి పసుపు కుంకుమలు, పద్ధతి తప్పకుండా పంపుతున్నాము. మనచేతిలోబడి ఆ పరమసాధ్వి పడరాని పాట్లు పడింది కానీ, తిరుమలమాత్రం ఎక్కలేక పోయింది.

ఇన్నాళ్లు, అలమేలు మంగాపురంగా ప్రసిద్ధిగాంచిన శ్రీనివాసమంగాపురం, అలమేలమ్మ అదృశ్యం కావడంతో వట్టి మంగాపురంగా మారిపోయింది. అలమేలమ్మ ( తిరుపతమ్మ ) రావడంతో, ఇన్నాళ్లు తిరుచానూరుగ వున్న గ్రామం అలమేలుమంగాపురంగా మారిపోయి ప్రసిద్ధి కెక్కింది. ఇదీ కథ. *క్రీ.శ. 1750 ప్రాంతాన హైదరాలీ ఆంగ్లేయుల కుమ్మలాట కాలంలో ఇది జరిగింది. బలరామకృష్ణులు అంతకు క్రితమే ఆలయంలో చోటు చూసుకున్నారు.

---

* 1979 జూన్‌మాసం, ఆంగ్ల సప్తగిరి మాసపత్రికలో, 'తిరుచానూరు ఆలయాలు' అన్న శీర్షికలో శ్రీ టి. కృష్ణమూర్తిగారు వ్రాసిన దాని సారాంశం. తి. తి. దే. శాసనాలు వేయికి పైగా వున్నా వాటిలో అమ్మవారి ఆలయ ప్రస్తావనలేదు. ఆలమేలుమంగ నాచ్చియార్ సన్నిధి మొట్టమొదట క్రీ. శ. 1477లో కనిపిస్తుంది. అదివరకు ప్రస్తావించబడిన అలమేలు మంగ శ్రీవారి వక్షస్థలమందున్నది. తిరుచానూరు పద్మావతి అమ్మవారి ఆలయము క్రీ. శ. 1౫వ శతాబ్దము మొదటిభాగములో కట్టబడినది. క్రీ. శ. 1743 లో తురుష్కుల దండయాత్రవల్ల కూల్చబడినది. అప్పుడు దండెత్తిన నిజాము సైన్యాలు అమ్మవారిని విరగగొట్టారు. తిరుపతి నమ్మాళ్వారుగుడిలో ఉత్సవవిగ్రహం దాచిపెట్టారు. తిరిగీ ఆలయపునర్నిర్మాణం పాతిక సంవత్సరాలదాకా జరిగింది. స్థానికవైద్యుడు, ధార్మికుడు అయిన శ్రీ తిరుమలరావు, మద్రాసులోని దుబాషీ అయిన ఓచ్ఛ నారాయణపిళ్లై పునాదులువేసి ప్రాకారం నిర్మించాడు తదుపరి స్థానిక ధనికులందరు సహాయంచేసి ఆలయం పూర్తిచేసి అమ్మవారిని [illegible] (ఏ అమ్మవారిని?) ఈ విషయము తూర్పుఇండియా కంపెనీవారి సవాల్-ఇ[illegible] పట్టికలో వుంది. ఆలయానికిగాని, అమ్మవారికిగాని మాన్యాలు లేవు.

బలరామకృష్ణులు పద్మావతి అమ్మవారి ద్వారపాలికలు ఒకే రకమయిన శిలతో శిల్పించబడగా, అమ్మవారి విగ్రహం మాత్రం ప్రత్యేకమైన మరో రకం శిల. ఈమెకు అంకాలమ్మగుడి దగ్గరనున్న ద్వారపాలికలకు పోలికలున్నాయి. శిలలుకూడ ఒకే రకమయినవని, అమ్మవారు అభిషేక పదార్థాల వల్ల ఆ రంగు తిరిగారని నా నమ్మకం. * శ్రీ సుందరరాజస్వామి, శ్రీదేవి - భూదేవి ఇంకోరకమైన శిల. ఇలా శిలల మార్పువల్ల నేనీ కథను అల్లలేదు. క్రీ. శ. 17వ శతాబ్దము మధ్యవరకు, బలరామకృష్ణులు గానీ, పద్మావతి అమ్మవారు గానీ అక్కడున్నట్టు శాసనాధారం లేదు. తిరుచానూరులో శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ప్రతిమ పూజింపబడినదన్న శాసనాన్ని నిజమని నిరూపించడానికి, ఇటీవల అంటే దాదాపు 100 సంవత్సరాల క్రితం, ప్రయత్నం జరిగింది. ఆ ప్రయత్నఫలితమే ప్రస్తుతం తిరుచానూరు ఉన్నతపాఠశాల కెగువననున్న శ్రీ వేంకటేశ్వరాలయము. నావిశ్వాసం ప్రకారం అప్పలయ్యగుంటలోని ప్రసన్న వేంకటేశ్వరాలయమే తిరువిలంకోయిల్. నేను సర్వజ్ఞుడిని కాను గాబట్టి అది తప్పుకూడ కావచ్చు. బాధలేదు. సత్యాన్ని వధించడంకంటే, ధర్మాన్ని చెఱపట్టడంకంటే, ఇలా చెప్పడమే మంచిదని మీరూ అంగీకరిస్తారు.

1952 లో డాక్టరు వి. టి. జగన్నాథరావు గారు "ఎ సింపోషియం ఆన్ తిరుపతి వేంకటేశ్వర" అనే ఆంగ్ల గ్రంథాన్ని వ్రాసి ప్రచురించారు. అది 50 పుటలు కలిగిన చిన్న గ్రంథం. శ్రీ జగన్నాథరావుగారు, ప్రసిద్ధ ప్రాచ్యభాషాకోవిదుడైన వంగనామాల బాలకృష్ణమూర్తి గారికి అన్నగారు. అహోబిల మఠసంప్రదాయమునకు చెందిన వైష్ణవులు. అంటే వడగల సంప్ర

---

* శ్రీ మహంతు ప్రయాగదాస్‌గారి కాలంలో శ్రీసుందరరాజస్వామి దాదాపు 75 సంవత్సరాలక్రితం వెలిసినారు. (క్రీ. శ. 1905 జూన్ మాసం.) అంతకుముసుపు అక్కడ వరదరాజస్వామి విగ్రహముండేది. ఆవిగ్రహమిప్పుడు తిరుచానూరు పద్మసరోవరము గట్టున శ్రీ సూర్యనారాయణస్వామి సమీపమున నున్నది. తిరుచానూరు తూర్పున వెలసిన వరదరాజస్వామి ఆలయాన్ని పురస్కరించుకొనే, ఆగ్రామానికి వరదరాజపురమని పేరువచ్చింది.

దాయము-U నామము. (మరొక సంప్రదాయము తెంగాలై లేక తెంగల-Y నామము-అంటే శ్రీ వైష్ణవులు). జగన్నాథరావు గారు, తిరుపతి దొడ్డాపురము వీథిలో త్రిలింగ ముద్రణాలయము స్థాపించి, అనేక ధార్మిక గ్రంథాలు స్వయంగా వ్రాసి అచ్చువేశారు. ఇతరులు వ్రాసిన గ్రంథాలు కూడ కొన్ని ప్రచురించారు. తి. తి. దే. వారి అన్నమాచార్య సంకీర్తనల సంపుటాలు కొన్నిటికి సంపాదకుడుగా పనిచేశారు. ప్రస్తుతం, పైకికూడ లేవలేని ముసలితనం.

శ్రీ జగన్నాథరావుగారు వ్రాసిన ఆంగ్ల "సింపోషియం" డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు, కుంభకోణం శ్రీ కంచికామకోటి పీఠాధిపతి-జగద్గురు శ్రీ శంకరాచార్యస్వామి, మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఎ. ఎస్. పి. అయ్యరు మొదలగు వారి ప్రశంసకు పాత్రమయింది. దానిని అచ్చువేయడానికి, శ్రీ హత్తీరాంజీమఠము*మహంతు శ్రీ నారాయణదాసుగారు ఆర్థిక సహాయం చేశారు.

అందులోని కొన్ని విశేషాలు టూకీగా తెలుసుకొందాం.

తిరుపతి అనగా తీరూపత్తి — త్రిపతి - దీనికి ఆలంబనగా శ్రీవేంకటేశ్వర గాయత్రి వుంది. "వేంకటేశాయ విద్మహే, త్రిపతినాథాయ ధీమహి, తన్నో శ్రీనివాసా ప్రచోదయాత్" శ్రీవేంకటేశ్వర అష్టాక్షరి మంత్రం ఇందులో నుంచి వుద్భవించినదే (యః, నః, ధీయః (ధ్యాః) ప్రచోదయాత్. ఇది ఒక రూపం. ఓం నమోవేంకటేశాయ అనునది సామాన్యరూపం.)

---

* మహంతు ప్రయాగ దాసుగారి తదనంతరము ఆయన సోదర శిష్యుడు మహంతు నారాయణదాసు గారు, మఠానికి అధిపతి అయ్యారు. ఆయన తరువాత మహంతు చేతన్‌దాస్ గారు, ఆయనకు డ్రైవరుగా వుంటూ, తానే మహంతువని చాటుకొన్న రామదాసు గారు, ఆయనను న్యాయస్థానంలో ఓడించి వచ్చిన దేవేంద్రదాసుగారు తదుపరి మహంతులు. ఈయన తరువాత ప్రస్తుతము మహంతు సర్జుదాసుగారు పదవిలో వున్నారు.

తిరుచానూరు — శ్రీ శుకపురి - తిరుచుగన్ ఊరు - తిరుచానూరు, మునులపూడి - ముండ్లపూడి, యోగుల మల్లవరము - యోగిమల్లవరం, పశు సంపదగలిగినదిగాన పాడిపేట, ఇలాంటివన్నీ తెలుగుదనాన్ని సూచిస్తున్నాయి.

* తిరుచానూరులోని ఇలంకోయిల్ అంటే బాల - ఆలయం, వైష్ణవులు బాలకృష్ణుడిదంటే, శైవులు బాలసుబ్రహ్మణ్యం గుడి అన్నారు. వైష్ణవులు తమవాదాన్ని నెగ్గించుకోవడానికి గోపురాని కెదురుగా బాలకృష్ణాలయముగట్టి దానిని ఇలంకోయిల్ అన్నారు. అక్కడి పూజ పాంచరాత్రాగమమం ప్రకారం, తిరుమలలో వైఖానసాగమం ప్రకారం జరుగుతూండడం గమనించదగ్గది. అనేకమంది ఆళ్వారులు తిరుచానూరులోని శ్రీకృష్ణుని లేదా మానవాళ పెరుమాళ్‌ను గురించి తమ పాశురాలలో కీర్తించినారు. శాసనాలలో తిరుచానూరు దేవుళ్లను, తిరువిలంకోయిల్ పెరుమానాడిగల్, తిరుమంత్రశాలై పెరుమానాడిగల్, తిరువెంగటత్తు పెరుమానాడిగల్ అని లిఖించారు. ఇందులో చివరిదేవుడు ముఖ్యమయినవాడు. అందువల్ల, ఆపేరునుబట్టి చరిత్రకారులందరూ ఆయన తిరుమల శ్రీవారనుకుని పొరపాటు పడినారు. క్రీ. శ. 7వ శతాబ్దమువరకు తిరుచానూరులో శివాలయముండేదని తోస్తుంది. 8 వ శతాబ్దము ప్రారంభంలో వైష్ణవాలయము వెలిసినది. కొందరు ఆళ్వారులు తిరుమల దేవుని హరిహర రూపుడని కీర్తించిరి. ఆళ్వారులలో నమ్మాళ్వారు క్రీ. శ. 10 వ శతాబ్దములో తిరుమల సందర్శించి, ఆయనను శ్రీ మహావిష్ణువని కీర్తించినాడు.

తిరుపతికి గోవిందరాజ పట్టణమని కూడ పేరుండేది. నారాయణవరం, చంద్రగిరి కోటలలో జైనమందిరాలుకూడ వున్నాయి. తిరుమల క్షేత్రములోని అనేక ప్రాంతాలు చివర వాగు, వంక, కోన అను తెలుగుపదాలు కలిగివున్నాయి. కురువదోవ, బంగారువాకిలి, తొట్టితీర్థము, కొలువు, కానుకముడుపు, వర్తన, అద్దాలఅర, పానుపుసేవ, మంగలకట్ట, పూలబావి, తోమాల

---

* తిరుచానూరు ఇలాంటి కథలకేకాదు. ఎఱ్ఱ చందనపు బొమ్మల తయారీలో మనరాష్ట్రాని కంతా పేరుగాంచినది.

సేవ, అడ్డకొండ, *ముగ్గుబావి (తిరుపతి సోపాన మార్గంలో వుంది) గంగాళం, పూలంగిసేవ, నామాలగవి, జున్నుపాడి ఇలాంటివన్నీ తెలుగు పదాలు.

వేంగడమంటే, వేంగి + కడ వేంగడ మయింది. (వేంగిరాజ్యానికి చివరనున్నదని అర్థం) అంటే తెల్లకొండ. వేంకటేశ్వరుడనగా పాపదహనం చేసి పరబ్రహ్మంచూపేవాడు. తిరుమల ఆలయంలో తెలుగువారి సాంప్రదాయమైన చంద్రమాన పంచాంగం వాడబడుతోంది. తిరుమల శ్రీవారికి బుసనాగప్పడు అనిపేరు. అందుకు తగ్గట్టు ఆయన సహస్రనామంలో "వ్యాళరూప" అనికూడవుంది. శ్రీకృష్ణదేవరాయలు తిరుమల ఆలయం ఏడెనిమిది పర్యాయాలు దర్శించాడు గానీ, తిరుపతి గోవిందరాజ స్వామిని గానీ, తిరుచానూరు అలమేలు మంగమ్మనుగానీ దర్శించినట్టు దాఖలాలేదు. (అంటే అప్పటికి వారి ఆలయాలులేవా?) ఆదిమూలేశ్వర్ అనేది మొదటి జైన తీర్థంకరుని నామం. దానిని ఆదిమూర్తి అని వైఖానసులు పిలిస్తే, విష్ణుమూర్తి అని వైష్ణవులు పిలిచారు. జైన ఆలయాలలో అమ్మవారి ఆలయాలుండవు. తిరుమలలో అలాగేవుంది. శ్రీవారి కుడి వక్షస్థలములో

---

* ఈ ముగ్గుబావి ఒకప్పుడు బైరాగి సాధువుల తపోవనం, వారి కిక్కడ హత్తీరాంజీ మఠం మహంతులు, కొన్ని భవనాలు నిర్మించి, వాటిని ఆశ్రమ వాటికలుగా తీర్చిదిద్దారు. ముగ్గుబావి గట్టున శ్రీ భక్తాంజనేయస్వామి వారి గుడి ఇంకా వుందిగానీ, ఆశ్రమభవనాలన్నీ కూలిపోయి శిథిలమయ్యాయి. సాధువులు అదృశ్యమయ్యారు. ముగ్గుబావి నిండితే ఆ నీరు భీమ తీర్థంలో ధారగా దూకుతుంది. దూకిన నీరు అంతర్వాహినియై, జ్యోతి టాకీసు వద్ద నున్న బ్రహ్మగుండం, నరసింహతీర్థములలో జహిర్గతమవుతుంది. ఇది తెలియదు చాల మందికి. వర్షాకాలంలో భీమతీర్థ జలపాతం శబ్దం వినబడుతున్నా, నీరు కనబడవందున, క్రొత్త కనుమదారిలో వాహనాల మీద ప్రయాణం చేసేవారు. అక్కడికి వెళ్లి చూడరు. ముగ్గురాళ్లు ఎక్కువగా నున్నందున ఆ బావికి ముగ్గుబావి అని పేరు వచ్చింది. తిరుపతి సోపానమార్గంలోని యీ తెలుగు పేర్లు చూడండి. సార్లపెట్టు (చారలపేటి), దోప భాష్యకార్లు, అక్కగార్లు, మానువరసింహస్వామి (లక్ష్మీనరసింహస్వామి గుడి దగ్గర —మానుమీద చెక్కి మండపములో నున్న యోగనరసింహస్వామి) మాముదూరు మిట్ట, ఏడోమైలు, చిట్టెక్కుడు, రాజోళ్ల మండపం, ఎలకాక్కయల మండపం, డబ్బారేకుల మండపం, గాలిగోపురం, మొండిగోపురం, గజేంద్ర మోక్షము, అన్నదానం బావి (మొండిగోపురాని కెగువన, క్రొత్తగోపురానికి దిగువన, పడమటి వైపున్న బావి) తలయేరుగుండు, అలిపిరి వగైరా. అలిపిరి అంటే అల్పశరీరం గలవాడు అని అర్థం. శ్రీవారు ఇక్కడ సూక్ష్మరూపంలో వున్నారన్న మాట.

శ్రీవత్సం, ఆలయంమీది సింహనికేతం వుండడంవల్ల జైనులుకూడ శ్రీవారి ఆలయాన్ని తమది అనవచ్చు. తిరుమల శ్రీవారు శివుడనడానికి 26 కారణాలు - శ్రీ వేంకటేశ్వర పేరు, నాగాభరణములు, బిల్వపత్రపూజ, జడలు, గుండు చేయించుకొను యాత్రికులు, మూలమూర్తి వెనుక ఖాలీజాగా, తిరుమల చుట్టూ సమీపంలో వెలిసిన శివాలయాలూ, శివరాత్రినాడు క్షేత్రపాలకపూజ, వరలక్ష్మీవ్రతం, వినాయకపూజ ఆచరించడం, కుడుములుచేయటం, విమానం మీద మార్కండేయుడు శివలింగాలింగనం చేయటం, పంచాంగం చదివే శైవ బ్రాహ్మణుడు, స్వామిపుష్కరిణి, శ్రీవారు పాములాగ పుట్టలో నివశించటం, స్వామి పాదాలు భూమిలో వుండటం, అమ్మవారి లక్షణాలు కలిగి వుండటం, ఆలయంమీద సింహాలప్రతిమలు, నవరాత్రి బ్రహ్మోత్సవం, పసుపు వాడకం, వేపాకు కుంభం పావడలతో తిరుప్పావడ, పీతాంబరం కట్టటం, బాలాజీ అన్నపేరు, శ్రీచక్రస్థాపన, శ్రీశైలం అన్నపేరు, హరిహరుడని ప్రాచీనులు కీర్తించడం మొదలగునవి. ఇంకా చెప్పాలంటే, ఈయనశక్తిలాగ ఖడ్గము ధరిస్తాడు, చీరగట్టుతాడు, పునుగు కస్తూరి కర్పూరాలు వాడతాడు. చేతిలో ఇదివరకు గొడ్డలి, ఢమరుకము వుండేదని ప్రాచీనులు వర్ణించారు. ఈయనకు పురుషసూక్తము పాటించబడుతుంది. అందులో శైవుల 'రుద్రం' వుండనేవుంది. ఇక వైష్ణవ పరంగా (కుడివైపయినా) శ్రీవత్సం వుండనేవుంది. పాదాలచెంత విరజానది ప్రవహిస్తూవుంది. శివునిలాగ జడలు ధరించినా, విష్ణువులాగ దానిమీద కిరీటంవుంది. వడగల నామం [1] 'యు' లేకపోయినా, తెంగల్‌నామం [2] 'వై' లేకపోయినా యీ రెండిటినీ ఒకటిగా కలిపే ప్రత్యేక నామం వుండనేవుంది - ఇవి జగన్నాథరావుగారి అభిప్రాయాలు.

---

1 వడగల లేక వడగాలై సంప్రదాయానికి శ్రీ వేదాంత దేశికులవారు గురువు. ఆయన విగ్రహాలు తిరుమల తిరుపతులలోని శ్రీ పరకాల మఠములో పూజింపబడుతున్నాయి. శ్రీ మద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్య, శ్రీ రామానుజ సిద్ధాంత స్థాపనాచార్య, వేదాంతాచార్య కవితార్కిక కేసరి, శరణాగత వజ్రపంజర, అనునవి ఆయన బిరుదులలో కొన్ని.

2 తెంగల లేక తెంగాలై సంప్రదాయానికి శ్రీ మాణవాళ మహాముని గురువు. ఈయనకు తిరుపతి శ్రీ గోవిందరాజాలయములో ఒక గుడి వుంది.

మొత్తానికి తిరుమల శ్రీవారు త్రిపతి. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల సమగ్రరూపం. ఓంకారంలోని మూడు బీజాక్షరముల ముచ్చట స్వరూపం.

ఇక సప్తగిరుల చరిత్ర సప్తస్వరాల లాంటిది. రాగం, తానం, పల్లవి తెలిసినవారు ఎలాపాడితే అలాపాడుతుంది. ఎలావాయిస్తే అలావాగుతుంది. ఎలా ఆడిస్తే అలా ఆడుతుంది. ఎలాపలికిస్తే అలా పలుకుతుంది. తెలియ వలసినదల్లా నేర్పు లేదా టెక్నిక్.

: మంగళం భూయాత్ :

అనుబంధం — 2

# శ్రీ వేంకటేశ్వర సాహితీ సమారాధనము

తిరుమల శ్రీవారి మీద అనేక పురాణాలు, శతకాలు, కావ్యాలు, కథలు, కవితలు, కీర్తనలు వెలిసినాయి. పురాణాలలో అష్టాదశపురాణాలు, వాటి ఆధారంగా శ్రీవేంకటాచల మాహాత్మ్యం సంస్కృతములోను - తెలుగు లోనూ ప్రచురింపబడినాయి. క్రీ. శ, 1491 నాటి, తిరుమలలోని* ఒక శాసనంలో, మార్గళి మాసంలో ఒకరోజు, పసిండి వెంకటత్తురైవాన్‌జీయర్ 'తిరువేంకట మాహాత్మ్యం' శ్రీవారి ముందు పఠించుటకు, ఏర్పాటులను గురించిన వివరాలున్నాయి. శ్రీవేంకటాచల మాహాత్మ్యం గ్రంథాలను ఎందరో వ్రాసారు. ఎందరు వ్రాసినా అందరికీ ఆధారం అష్టాదశ పురాణాలే. శ్రీ తరిగొండ వేంకమాంబగారు వ్రాసిన శ్రీ వేంకటాచల మాహాత్మ్యం కూడ ప్రసిద్ధిగాంచినదే.

తాళ్ళపాక వంశ కవులు శ్రీవారి మీద ఎన్నో కీర్తనలు రచించారు. వాటిని రాగి రేకుల మీద లిఖింపించి, తిరుమల శ్రీవారి ఆలయంలోని 'తాళ్ల

---

*శ్రీవేంకటాచల మాహాత్మ్య పఠనము జరుగు మరియొక సమయము.

"...శకవర్షము 1413, విరోధికృత్సంవత్సర మిథునమాస బహుళ సప్తమి ఉత్తి రట్టాది (ఉత్తరాభాద్ర) నక్షత్రయుక్త సోమవారము (క్రీ. వె. 1491 జూన్ 27 వ తేది) న దేవాలయ స్థానికులు పసిండి వేఙ్కటత్తుఱైవారాన జీయర్ రామానుజయ్యపరముగా లిఖించిన శాసనములో మార్గళిమాసమున తిరువధ్యయనోత్సవములో తణ్ణీర్ అముదు (ఆకాశగంగనుండి తీర్థమును అభిషేకార్థముతెచ్చు) ఉత్సవము నాఁడు స్వామివారి యాస్థాన సమయమున వీరు తనయుభయముగా నేర్పాటు చేసిన తిరుప్పావడ నైవేద్యము నారగించుటకు ముందు వీరు విన్నవించిన తిరు వేఙ్కట మాహాత్మ్యము పఠించునట్లేర్పాటు చేయఁబడినది. అన్నమాచార్యులు దివ్యభాషలో కావించిన వేంకటాద్రి మాహాత్మ్యము ఇదియేనో లేక వేంకటత్తుఱై వారు వేరొకటి కావించిరో, ఇప్పుడు దేవస్థానము వారు ప్రచురించి యుండునది యీ రెంటిలో నేయొకటియో లేక యితరమో తెలియరాదు. అయినను అన్నమాచార్యుని కావ్యమే అప్పటినుండి పఠింపఁ బడుచుండిన దానిని దేవస్థానమువారు ప్రచురించియుండవచ్చును..."

— శ్రీ తాళ్లపాక అన్నమాచార్యోత్సవపత్రిక అనుబంధం 7, పుట 80. 1950)

పాక వారి సంకీర్తనల భండారము'లో భద్రపఱచినారు. 'అన్నమాచార్య చరిత్రము' అను గ్రంథాన్ని ఆయన మనుమడు చిన్నన్న అను చిన్న తిరు వేంగళనాథుడు రచించాడు. దాని ప్రకారం తాళ్లపాకవారి సంకీర్తనల మొత్తం 32 వేలు. శ్రీవారి ఆలయంలో దొరికిన రాగిరేకులు 3000. ఒక్కొక్క రేకుకు ఒకవైపు 3 కీర్తనల చొప్పున మొత్తం 18,000 కీర్తనలు. అందులో అన్నమాచార్యులవి సుమారు 11 వేలు, పెద తిరుమలాచార్యులవి సుమారు 5000, చిన తిరుమలాచార్యులవి సుమారు 2 వేలు అని లెక్కించినా, మనకు దొరకని సంకీర్తనలు 20 వేలు, అంటే దొరికిన వాటికంటే దొరకని వాటి సంఖ్య ఎక్కువన్నమాట. మరి ఇవి ఏమయినాయి? రాగిరేకుల కెక్కు భాగ్యం కలుగకనే, తాళపత్రాలలోనే శిధిలమై పోయాయా? ఏమో? 'కొన్ని వందల సంకీర్తనలు మాత్రం ఇప్పటికీ *అహోబిల నరసింహస్వామివారి యాలయమునను, శ్రీరంగమున రంగనాథస్వామివారి ఆలయమున నుండునట్లు తెలియుచున్నదని' శ్రీసాధు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తెలియజేసినారు. (ప్రథమ శ్రీ అన్నమాచార్యోత్సవ క్రమము అనుబంధం - 7 అను పుస్తకములో-)

ఆయన తెలియజేసిన ఇంకొక ఆసక్తికరమయిన విషయం, తి.తి.దే. ఎపిగ్రాఫికల్ రిపోర్టు 282 పుటలో నున్నది. అందులోని విషయం. శ్రీ వంగూరి సుబ్బారావుగారు తమ శతక కవుల చరిత్రములో, తాళ్లపాక అన్నమాచార్యులు గారు వ్రాసిన వేంకటేశ్వర శతకము పద్యములను జర్నల్ ఆఫ్ ది తెలుగు అకాడమీ (ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక) వారు రాగిరేకుల నుంచి ఎత్తివ్రాసిన పద్యముల నుండి గ్రహించినట్లు 137 పుటలో తెలియ జేసినారు. మరి ఆ రాగిరేకులు ఏమయినాయి? తెలుగు అకాడమీకి ఎవరి

---

*మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టు 1915, 96 పేజీ, 19 పేరాలో ఇలావుంది. 'తిరుమల ఆలయ, తాళ్లపాకం వారి కొట్టులో లభ్యమయిన పెద్ద రాగిరేకులు లాంటివి, ఎగువ అహోబిలంలోని శ్రీనరసింహస్వామి ఆలయ భూగృహంలో భద్రపరచబడి వున్నవి. అవి నిజమువకు తిరుమల ఆలయమువకు చెందినవి గానీ, అహోబిలమునవి గావు. ఎందుకనగా వాటి కర్తలయిన, తాళ్లపాక అన్నమాచార్య, ఆయన కుమారుడయిన తిరుమలాచార్య, ఆ కీర్తనలలో శ్రీ వేంకటేశుని సంబోధించియున్నారు.'

చ్చారు? ఏమయిందో ఏమో తెలియదుగానీ, ఆ రాగిరేకులు మాత్రం తి.తి.దే. వారి దగ్గరలేవు. బహుశా అకాడమీవారు తీసుకపోయి, తంత్రిలాంటి దేవుడు సొత్తేగదా అని తిరిగీ ఇవ్వకుండా తమ దగ్గరే అట్టిపెట్టుకొనిరేమో? కరిగించి పాత్రచేయకుండా, అలాగే అట్టిపెట్టుకొని వున్నా మనం సంతోషించ వలసినదే. మనకు దొరకని 20 వేల సంకీర్తనలకు గూడ ఈ గతి పట్టి వుండునా? ఏమో ఆ సంగతి, తనమీద అన్ని కీర్తనలు వ్రాయించుకొన్న ఆసామికి తెలియాలి. వేంకటేశ్వర శతకము అసలుపేరు 'శృంగార వృత్త పద్యాల శతకం'— శ్రీవారికి అన్నమయ్య అంకితమివ్వడం వల్ల వేంకటేశ్వర శతకమయింది. తాళ్లపాక వారు వ్రాసిన శృంగార, అధ్యాత్మ్య కీర్తనలు-శృంగా రమంజరి ప్రసిద్ధిగాంచినవి. ఈ కీర్తనలనన్నిటిని తి.తి.దే. వారు సంపుటములుగా ప్రచురించుచున్నారు. ఇప్పటికి దాదాపు 30 సంపుటములు వెలువడినవి. ఇంకను అనేకము వెలువడనున్నవి. ఈ కీర్తనలు వ్రాసి తాళ్లపాక వంశంవారు ప్రశస్తులైరి. వాటి ప్రచురణకు సంపాదకులుగా పనిచేసి, కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, పరవస్తు వేంకట రామానుజ స్వామిగారు, రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ గారలున్ను, శ్రీ పి. టి. జగన్నాథ రావు ప్రసిద్ధులైరి. శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ ప్రస్తుత సంపాదకుడు. అందరి కంటే ప్రఖ్యాతిగాంచినవారు — ఆ పెద్దనామాలయ్య. *సినిమాలు తీయించుకొని, నేపథ్యగాయకులచే తన పాటలు పాడించుకొని, ప్రసిద్ధ సంగీత కారులచే తన కీర్తిని పొగిడించుకొని చివరకు ఎల్. పి. రికార్డులు కూడ రిలీజు చేయించుకున్నారు.

ఇక కీర్తనల రాగం-తానం-పల్లవి, సాహిత్యం, భావం-ఇవన్నీ మధురాతి మధురం. దేశిపదములు, ముఖ్యముగా రాయలసీమ వ్యవహారిక పదజాలమున కివి ఆటపట్టు.

---

*తి. తి. దే. వారు "శ్రీ వేంకటేశ్వరవైభవం" అను పేరిట ఒకచలనచిత్రం నిర్మించారు. ఇదిగాక ఒకటి—రెండు డాక్యుమెంటరీలున్నాయి. శ్రీ వేంకటేశ్వర పంచరత్నమాల మొదలగు ఎల్. పి. రికార్డులు ఉన్నాయి. ఇక సినీనిర్మాతలు తీసిన చిత్రాలు, శ్రీవారిని గురించి పాడించిన పాటలు అందరూ ఎఱిగినవే. అన్నిటికిమించి, అన్నమయ్యపాటలు ఇటీవల బహుళప్రచారంలోకి వచ్చాయి.

ఈ గాన మాధుర్యాన్ని, స్వయంగా అన్నమాచార్యులందీయగా గ్రోలినవాడు విజయనగర చక్రవర్తి *వీరనరసింహ రాయలవారు. కొండ మీది అప్పుడు, తన ఆలు †అలమేలుమంగతో జరుపు శృంగార చేష్టలు విని, తను - తన భార్యపరముగా అలా శృంగార కీర్తనలు అల్లమని అడిగి, కాదనిపించుకొని, అన్నమయ్యను ఖైదు చేసినాడు. అన్నమయ్య అలనాటి పోతనవలె "హరి ముకుందుని గొనియాడు నాజిహ్వ నిను గొని యాడంగనేర" దని నేరుగా చెప్పడమే - ఆతడు చేసిన పాపం. పాపం, అన్నమయ్య భక్త రామదాసువలె, వేంకటాచలపతిని - తన పాద సంకెళ్లనుంచి - ఖైదునుంచి తప్పింపమని వేడినాడు. వేంకటవరదుడు బ్రోచినాడు సంకెళ్లు తెగి పోయినవి. ఆ సంగతి భటుడు చెప్పగా విన్న రాయలవారు, తిరిగీ తనముందు సంకెళ్లు వేయించగా, అన్నమయ్య 'శ్రీనివాసోరక్ష' అని ప్రార్థింపగనే, అల గజేంద్రుని బ్రోచిన 'బొల్లిగద్దనెక్కిన నల్లనయ్య' తిరిగీ అన్నమయ్యను బంధ విముక్తుని చేసినారు. రాయలవారికి జ్ఞానోదయమైంది. అన్నమయ్య పాదాల మీదబడి "అపరాధి నపరాధి నన్నమాచార్య కృపజూడు" అని ప్రార్థించి నాడు. ఇదీ కథ.

దశావతారాలు ఎత్తి జగతిని కాచినస్వామి, పురాణాలలోని శంఖుని, పురందరుని కొడుకు మాధవుని, **వైఖానసుని, కూర్మని, రంగదాసునిబ్రోచిన స్వామి, కాలితోతన్నిన భృగుమహర్షి పాదములొత్తిన వనమాలి, యశోదమ్మను

---

*సాళువనరసింహరాయలవారు అన్నమయ్యకు మిత్రులు. ఈయనపాలనకాలం 1487-90. అన్నమయ్యను హంపీ విజయనగరమునకాహ్వానించి, కీర్తనలను పాడించు కొని ఆనందించి. అవతల తనమీద వ్రాయమనడంతో స్నేహం బెడిసి కొట్టింది.

†అన్నమయ్య 'అలమేలుమంగ' అని అమ్మవారిని కీర్తించినా, అప్పటి అలమేలు మంగ, తిరుచానూరు శ్రీపద్మావతిదేవి వారుగాదు. అన్నమయ్య కాలమునాటి అలమేలు మంగాపురం — శ్రీనివాసమంగాపురమే. అక్కడ వెలిసిన అమ్మవారు—అలమేలుమంగ. అన్నమయ్య కీర్తించినది ఆయమ్మవారిని గావచ్చు, లేదా తిరుమల శ్రీవారి వక్షస్థలమందున్న అమ్మవారు కావచ్చు.

**ఈ వైఖానసుని పేరిటప్రస్తుత వైఖానస సంప్రదాయం వెలిసింది. ఈ సంప్రదాయం ప్రకారం శ్రీవారికి పూజ. తిరుమల పడమటి మాడవీధిలో వైఖానస ఆశ్రమముంది.

వకుళాదేవిగా కనికరించిన కరుణామూర్తి, వేదవతిని పద్మావతిగ పరిగ్రహించినవేల్పు, ఓడిపోయిన తొండమాను చక్రవర్తికి తనశంఖు చక్రాదులు దానము చేసి యుద్ధమునకు ప్రోత్సహించిన దయాళువు, హత్తీరాం బావాజీ, పనిలేక, పాచికలాడదాం రమ్మంటే, వెంటనేవచ్చి పాచికలాడిన పరమాత్మ, ఆనందాళ్వారుకు మట్టి, తిరుమలనంబికి నీళ్లుమోసిన మహానుభావుడు, త్యాగయ్య 'తెరతీయగరాదా' 'అని పాడుతూనే తెరతీసి దర్శనమిచ్చిన శ్రీహరి, 8-10-1908 తారీఖున కాకినాడ కోర్టులో, నల్లప్పశ్రేష్ఠి కనుకూలంగా సాక్ష్యమిచ్చిన దయామయుడు; యిక తాళ్లపాక అన్నమయ్య పాడితే పలకరా? లేచికూడ ఆడగలరు. అందుకు సందేహం వలదు. తాళ్లపాకం వారిమీద ఆయన కున్న ప్రేమ పక్షపాతంతో కూడుకున్నది. నా కందరూ సమానమని ఆయన భగవద్గీతలో చెప్పినా, మనము నమ్మబనిలేదు.

ఇక ప్రహ్లాద, నారద, ముచికుంద, అజామీళ, అంబరీష, ద్రౌపది, గజేంద్ర, సనకసనంద, ఉద్దాలక, కుబ్జ, అక్రూర మొదలగు వారికథలు విన్నాము. గానీ చూడలేదు. అందుకే ఆనాటి తాళ్లపాకంవారు తమ జీవితాలనే ఆయనకు అర్పించి, ఆయన సేవయే పరమావధిగా జీవించినారు. శరణాగతి విషయమున, ముందుగవీరిని తెలిపి, తక్కినవారిని తదుపరి చెప్పవలసియుండును అన్నమయ్య వేలకొలది కీర్తనలు, వేంకటాచలమాహాత్మ్యముగాక, 'సంకీర్తన లక్షణము' అను సంస్కృత లక్షణశాస్త్రమును కూడ వ్రాసినాడు. అతని పెద్దభార్య తాళ్లపాక తిమ్మాంబ లేక తిమ్మక్క "సుభద్రకళ్యాణము"ను వ్రాసినది. రెండవభార్య అక్కాంబ కుమారుడు పెద్ద తిరుమలాచార్యుడు శృంగారసంకీర్తనలు, వైరాగ్యవచనమాలికా గీతములు, శృంగార దండకము, చక్రవాళమంజరి, శృంగారవృత్త పద్యాలశతకము, ఉదాహరణము, నీతి సీసపద్యశతకము, సుదర్శన రగళ (డ?)రేఫాఱకారములు మొదలగునవి వ్రాసినాడు. ఈతని కుమారుడు చిన్నతిరుమలాచార్యుడు అధ్యాత్మ్య, శృంగారకీర్తనలు, అష్టభాషాదండకము, సంకీర్తన లక్షణము (తాతగారి పుస్తకానికి తెలుగు అనువాదము) మొదలగునవి వ్రాయగా, ఈ చిన్న

తిరుమలాచార్యుని మూడవ తమ్ముడు చిన్నన్న అనే చిన్న తిరువేంగళ నాథుడు - అన్నమాచార్య చరిత్రము, పరమయోగి విలాసము, అష్టమహిషీ కళ్యాణము, ఉషాపరిణయము మొదలగు కావ్యముల రచించెను. ఇతని కుమారుడు తిరువేంగళదీక్షిత - శృంగారామరు కావ్యము అను ఆంధ్ర అమరుక శతకమును రచించెను. ఇతని పెద్దతండ్రి చిన్న తిరుమలాచార్యుని కుమారుని పేరుకూడ ఇతనిపేరే. అతడు బాలప్రబోధిక లేక గురుబాల ప్రబోధిక, సుధానిధి అను గ్రంథములను రచించినాడు. అన్నమాచార్యుని మనుమడు (కుమార్తె తిరుమలాంబ కుమారుడు) రేవణూరి వేంకటార్యుడు శకుంతలాపరిణయము, శ్రీపాదరేణు మాహాత్మ్యము అను గ్రంథములను రచించినాడు.

తాళ్లపాక కవులు ఇంతటివారు గనుకనే తిరుమల శ్రీవారి నిత్యకళ్యాణమునకు కన్యాదాతలుగా వ్యవహరించుచున్నారు. ఇకవారు స్వామివారికి చేసిన దానములు, కైంకర్యములు, కొత్తగా ప్రవేశపెట్టిన ఉత్సవములు అనేకములు.

భిన్నరీతులు గల దేశికవితలు, ద్విపదలు, శతకములు తాళ్లపాకం వారితోనే ప్రారంభమయినాయి. అసలు తెలుగులోని కవితలు శాఖోపశాఖలై విస్తరించడం వీరితోనే మొదలయింది. అన్ని తాలూకాలలో (ముఖ్యముగా వాయల్పాడు, పుంగనూరు, మదనపల్లి తాలూకాలలో) 6, 7 శతాబ్దినాటి తెలుగు శాసనములుండగా, మన చంద్రగిరి తాలూకాలోని మొదటి తెలుగు శాసనము క్రీ. శ. 14వ శతాబ్దమునాటిది. తిరుమల శ్రీవారి ఆలయంలో రెండవ ప్రాకార గోపురమునకు ఉత్తరవైపున్న యీ తెలుగు శాసనము సాలువ మంగిదేవ మహారాజు, శ్రీవారి ఆలయమునకు సువర్ణశిఖరము నెత్తించుటను గురించి వున్నది. కాలము సుమారు క్రీ. శ. 1361. ముచ్చటయిన యీ శాసనం చూడండి.

23 మం. చ.

1. స్వస్తిశ్రీ జయాభ్యుదయ శక (వ)
2. ఋషంబులు ౧౪౮౧ (అగునేంటి) వికా
3. రి సంవచర ఆషాడ శుద్ధ దశమి మ (౦)
4. దవారాన స్వస్తిశ్రీ (మ) న్మహామండ (లే)
5. శ్వర మీసరగండ మంగిదేవ మహా
6. రాజులు తిరుమల దేవరకు వ
7. (టా) ది నగగు సువణాఽదిసిఖ
8. రమును ఎతించెను - మంగళ
9. మహా శ్రీశ్రీశ్రీ

— తి.తి.దే. శాసన సంపుటి1, శాసనం 179.

కృష్ణదేవరాయలకు మునుపు వేయబడిన శాసనములలో పైన పేర్కొన్న తెలుగు శాసనముకాక మరిరెండు కన్నడశాసనము లున్నవి. తక్కినవన్నియు తమిళశాసనములని నేను వేరుగా చెప్పబనిలేదు. కృష్ణరాయలకు తెలుగన్న ఎంత అభిమానమో అందరెఱిగినదే. ఆయన తాను తెలుగులో వ్రాసిన ప్రౌఢ కావ్యము లేదా ప్రబంధమయిన ఆముక్త మాల్యదను తిరుమల శ్రీవారికే అంకితమిచ్చినాడు.

తాళ్లపాకం వారి ఇంటి పొరుగున తరిగొండ వేంకమాంబగారి నివాసం. అంటే తాళ్లపాకలో — తరిగొండలోకాదు. తిరుమల ఉత్తరమాడ వీధిలో. ఇరుగు పొరుగు కొందరు పరస్పరాభిమానములు కలిగి వుంటారు. కొందరు వుండరు. తాళ్లపాక అన్నమాచార్యుల మనుమలు, మునిమనవళ్లకు, 19 వ శతాబ్దిలో జీవించిన తరిగొండ వేంకమాంబకు పరస్పర వైమనస్యాలు వున్నట్టు తోస్తుంది. అందుకు సంబంధించిన కథలలో పుల్లాకుల కథ ఒకటి. తాళ్లపాకంవారు భోజనం చేసిన విస్తరాకులు, యీ ముసలమ్మ పెర టిలో పారవేసేవారట. ఆమె శుభ్రం చేయలేక బాధపడేదట. అన్నీ ఇలాంటి పుక్కిటి పురాణాలు.

తరిగొండ వేంకమాంబగారు, కొన్నాళ్లు గోగర్భం, పాండవ తీర్థా లలో తపస్సుచేసి, అక్కడ ఆమెదర్శనార్థం వచ్చేజనులు ఎక్కువకాగా, చివరకు దుర్గమము, నిర్జనము అయిన తుంబురుతీర్థ కీకారణ్య ప్రాంతమునకువెళ్లి అక్కడ తపస్సు కొనసాగించింది. ఈయమ్మగారు చేసే వంటలంటే తిరుమల శ్రీవారికి ఎంతో ఇష్టమట. అందువల్ల ఈమె వంటచేసుకొని, పూజాద్రవ్యాలు తీసికొని, ఎవ్వరూ చూడకుండా, అర్ధరాత్రివేళ ఆలయ ప్రవేశంచేసి, పూజా పునస్కారాలుచేసి, నైవేద్యాలు సమర్పించి తిరిగి వచ్చేదట. ఆలయం మూసి వేశాక అర్ధరాత్రి జరుగు పూజా పునస్కారాల అంతుతెలియక, అందుకని కాచుకొనివుండి, అర్ధరాత్రిలో అమ్మవారిని చూచి ఆశ్చర్యపోతాడు అప్పటి మహంతు - శ్రీ సేవాదాస్‌జీవారు అవతల భగవదాదేశంతో వేంకమాంబకు స్వామి పవళింపు సేవను అప్పగించారు.

ఈ పానుపు సేవ లేదా ఏకాంతసేవ అప్పటినుంచీ ఇప్పటివరకు ఆమె వంశీకుల మిరాశి అయింది. అసలు పద్ధతి ఏమంటే, హత్తీరాంజీ మఠం నుంచి వచ్చే పాలు పెరుగులతో మొదట వరాహస్వామి వారికి అభిషేకం జరగాలి. అవతల తిరుమల శ్రీవారు సుప్రభాత కీర్తనంతో మేలుకొని, ముఖ ప్రక్షాళనం గావించుకొని హత్తీరాంజీ మఠం నుంచి వచ్చిన నవనీతం చక్కె రలను సేవించి – తాను గోపాలకృష్ణుడు కాబట్టే నిద్రలేస్తూనే వెన్నతింటున్నా నని నిరూపిస్తాడు. రాత్రి పవళింపు సేవా సమయంలో తాళ్లపాకం వారి తంబుర పాట వినని దే, తరిగొండ వేంకమాంబ గారి ముత్యాలహారతి స్వీక రించనిదే శ్రీవారికి నిద్రరాదు. తరతరాలుగ అలా అలవాటయిపోయింది ఆయనకు.

వేంకమాంబగారు చేసుకున్న పుణ్యం ఇంతేకాదు. తిరుమల శ్రీవారి మీద ఎన్నో గ్రంథాలు వ్రాసింది. ఇవి తి. తి. దే. వారికి దొరకలేదుగానీ, దొరికిన వారంతా వాటిని ప్రచురించారు. శ్రీవేంకటాచల మాహాత్మ్యము, రాజయోగ సారము, విష్ణుపారిజాతము, నృసింహ యక్ష గానము, ద్విపద రామాయణం, భారతం, భాగవతం, శతకాలు, మేలుకొలుపులు ఇలాంటి

వెన్నో ఆమె రచించినా, అందులో ఎక్కువ గ్రంథాలు లభ్యంకాలేదు. ఆమె ఇంటిలో లభ్యమయిన తాళపత్రాలలో - సాహితీపరమైనవి, దానపత్రాలకంటే తక్కువగా వున్నాయి. ఉన్నవి పూర్తిగాలేవు. అసమగ్రములు.

తరిగొండ నృసింహస్వామిని, తిరుమల శ్రీ వేంకటేశుని పరముగా — (సామ్యముతో) ఆమె కీర్తించినది. పరమ భక్తురాలు. పావనచరిత. ఆమె జీవితం కూడ, అన్నమయ్యవంశీకుల వలెనే - ఆ తిరుమలేశుని సేవకు అంకితమైనది. తరిగొండగ్రామము చిత్తూరుజిల్లా, *వాయల్పాడుకు 4 మైళ్లలోవుంది. అక్కడ శ్రీ లక్ష్మీనరసింహస్వామి ఆలయముంది. ఆయన పెరుగుకుండలో పుట్టాడట. అందువల్ల తఱికుండ అని పేరు వచ్చింది. వేంకమాంబ తండ్రి కానాలి కృష్ణయ్య. తల్లి మంగమ్మ. భర్త ఇంజేటి వేంకటాచలప్ప. ఈమె బాలవితంతువు. అందువల్లే భక్తురాలయి తిరుమల చేరింది.

ఇలా, శ్రీ వేంకటేశ్వరుని గురించి ఎన్నో పురాణాలు, ఇతిహాసాలు, చరిత్రలు, జానపద సాహిత్యం, దేశికవిత ఇలాంటివెన్నో వెలిసినాయి. వీధి భాగవతాలకు, యక్షగానాలకు, నాటకాలకు, పల్లెపదాలకు, హరికథలకు బుఱ్ఱకథలకు లెక్కలేదు. అవన్నీ సేకరిస్తే సంవత్సరాలకొలది సంపుటాలు అచ్చువేసుకొంటూ పోవచ్చు. తిరుమల శ్రీవారి మీద వెలిసిన, శతకములు, శతమునకు మించినవి. ఇక ఆయనకు అంకితమివ్వబడిన గ్రంథములకు లెక్కలేదు. వాటినన్నిటినీ వ్రాయటం, సమీక్షించటం. ఇక్కడ వీలుగాని పని. అందుకని ఒకే ఒక శతకమును సమీక్షించి చూద్దాం.

---

* వాయల్పాడు తాలూకా కోన - చెర్లోపల్లి సమీపంలో రెడ్డెమ్మకొండ వుంది. రెడ్డెమ్మ కాపుకన్య. గుఱ్ఱంకొండ నవాబు సైనికులు ఆమె సౌందర్యానికి ముగ్ధులై చెఱచబోగా రెడ్డెమ్మ కొండ ఎక్కి, ప్రార్థించగా, ఆ కొండ రెండుగా చీలి రెడ్డెమ్మను తనలో ఇముడ్చుకొంది. ఆనాటి నుంచీ ఆ కొండకు రెడ్డెమ్మకొండ అని పేరు. రెడ్డెమ్మ అడిగిన వారికి ఒక కాలంలో నగలు కూడా ఇచ్చేదట. బదులు తీసుకున్న వారు తిరిగీ ఇవ్వకపోవడంతో నగలు అరువివ్వడం మానుకుంది. కానీ అడిగిన వారికి లేదనకుండా సంతానం కలిగిస్తోంది. అందుకే చిత్తూరు జిల్లాలో రెడ్డెప్పలు, రెడ్డెమ్మలు ఆమె ఇచ్చిన వరం గురుతుగా, విశేషంగా వున్నారు.

తి. తి. దే. వారిచే లఘుకృతులలో ప్రచురింపబడిన వేంకటాచల విహారశతకము. ఈ శతకములోని పద్యములు మొత్తం 98. చివరి రెండు పద్యములు దొరకనందున కవి నామము గానీ, చరిత్ర గానీ తెలియలేదు. ఇవన్నీ సీస పద్యములు.

కవి తనను గురించి 'నమఁబోటి బావఁడైనను' అన్నాడు కాబట్టి ఇతడు తప్పకుండా బ్రాహ్మణుడై వుంటాడు. పైగా 'దేవ నీసొమ్ము గట్టిగాఁదిన్న కవిని గాన' అన్నాడు కాబట్టి ఇతడు ఆలయోద్యోగియో లేకఅర్చకుడో అయివుండాలి. 'యకట లలాట శూన్యము పాపమెట్లు మానగనేర్తు నుదుటను నామమిడక' అన్నాడు గాన, ఆతడు వైష్ణవుడని చెప్పవచ్చు. ఈశతకములోని మూడు సీస పద్యములు ఇదివరకే, యీ గ్రంథములోని వేరొకచోట వుదహరించబడినవి.

విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మగారు తన శతక వాఙ్మయ సర్వస్వము, ప్రథమ సంపుటము, 124 పుటలో "తాళ్లపాక చిన్నన్న దండెమీటులు గావు గోమాంస భుగ్ధనుర్గుణరవములు — అని 18 వ శతాబ్దంలో జీవించి — యుండి 'శత్రు సంహారశతకము' రచియించిన గోగులపాటి కూర్మనాథ కవి ...." అని అన్నారు గాబట్టి ఈ వేంకటాచల విహారశతకము — లేదా శత్రుసంహార శతకము కర్త గోగులపాటి కూర్మనాథ కవి అని, ఇతడు 18 వ శతాబ్దమునకు చెందిన వాడని తెలుస్తోంది.

"శత్రు సంహార, వేంకటాచల విహార" అనునది మకుటముగాన యీ శతకము పై రెండు పేర్లతోనూ పిలువబడు చున్నది.

కవి తన శతకములో [1] 'మోకాళ్ళ ముణుపు' 'బకాళ బాతు' (శ్రీ వారి ఆలయంలోని తీపి వంటకము పేరు) 'అవ్వఘరి' (అవ్వాచారికోన)

1. తిరుపతి సోపానమార్గములో మోకాళ్ళముణుపు వుంది. ఇచ్చట మెట్లు నిటారుగా వుంటాయి కాబట్టి, కొండ ఎక్కువారు మోకాళ్ళు బట్టుకొని ఎక్కుతారు కాబట్టి, దీనిని మోకాలి నెట్టు (మెట్టు) అంటారు. తిరుమలమీద పాదముమోప నిచ్చగించని ఒకఆళ్వారు (నమ్మాళ్వారు కావచ్చు) మోకాళ్ళమీద నడచి రావటంతో దీనికి మోకాలి నెట్టని పేరు వచ్చిందని ఒక కథ. అయితే అలా నడిచివచ్చిన వారెవరు? రామానుజాచార్యులని కొందరు, హత్తీరాం బావాజీ అని మరి కొందరంటారు. ఇవి పుక్కిటిపురాణాలు. వీటికి చారిత్రకాధారం లేదు. ఇక్కడికి సమీపంలోని అక్కగార్లపేటిమీద తిరగలి బండమీద ఒకమురళి వుండేడి. అది స్వామివారి పిల్లనగ్రోవియని చెప్పేవారు. అదిప్పుడు కానరావటం లేదు.

‘ తలనీలములు ’ ‘ తిర్మలకొండ ’ ‘ పేరూరిచెఱువు ’, ‘ గోచికాఁడు ’, ‘ముని-కోల ’, ‘ పలుపు ’, ‘ మోఁకు ’ ‘ పగ్గంబు ’, ‘ కాడి ’, ‘ మేడి ’, ‘ కఱ్ఱు ’, ‘ భాష్యకారులు ’, [2] ఱాళ్ళకాలువ [3] ‘ మామిడూరు ’ [4] ‘ సంజీవరాయరు ’ ‘ వెయిగాళ్ళ మంటపివీధి ’ మొదలగు ప్రాంతీయ నామములు ధారాళముగ వుపయోగించినందువల్ల, అతడీప్రాంతమువాడో లేక ఇక్కడ స్థిరపడిన వాడు గనో భావించవచ్చు.

కన్నడ వారి ముద్దులాడి, నంబిమిటారి, కోమటివారిచెలత, ద్రావిడ భామ, చక్కని కర్ణాట చంద్రవదన, రాచిల్కపల్కుల రాజకన్య, గబ్బికోమటి గబ్బి గుబ్బలాడి, బంగరువంటి బలిజెకులజ, అని తిరుమల మీద నివశించు వివిధ వర్ణాల సుందరాంగులను వర్ణించాడు. 18వ శతాబ్దము ఉత్తరార్థంలో తిరుమల తిరుపతుల మీద దండెత్తిన మహమ్మదీయుల చీల్చి చెండాడక, తిరుమల శ్రీవారు, పై సుందరాంగుల చూచి తత్తరపాటు నొందుచున్నారట.

ప్రాణంబు గలిగెనేని బలుసుటాకేటి తినవచ్చు (బ్రతికుంటే బలసా-కయినా తినవచ్చు), బైసిమాలిన మాఱు బానలినికి, నీ యఱవ చెవుల బూడ్చ రాదని, తాళ్ళపాక చినన్న దండెమీటులుగావు, దహ తహ చెందు సాతాని వాడు, మామిడి క్రింది సోమరిపోతు శ్రీ భాష్యకారులకేల, సొలవక వడ్డి కాసుల దండుకొను, తెరిమాకి చోదంచు .. ఇలాంటి ఈ ప్రాంతములోని సామెతలు, జాతీయాలు, నుడికారాలు, వ్యవహారికాలు ప్రయోగించినాడు కవి.

2 కొండల్లోని అవ్వాచారి కోన, మైదానం చేరేసరికి ఱాళ్ల కాలువగా మారుతుంది. ఈ కాలువ నిండా రాళ్లు. వాటిని చూస్తూనే అది రాళ్ల కాలువగా నిర్ణయించవచ్చు. రేణిగుంట కాళహస్తి మార్గంలో, రేణిగుంట సమీపంలోనే వుంది యీ కాలువ. ఇది స్వర్ణముఖినదిలో కలుస్తుంది.

3 మామండూరు కూడ రేణిగుంట సమీపం - బొంబాయి మార్గంలో రేణిగుంట దాటుతూనే వచ్చు స్టేషను. తిరుమల కొండలకు తూర్పున అడవికి ఆనుకొని వున్న గ్రామం. ప్రఖ్యాత వేటగాళ్లయిన జిమ్‌కార్బెట్, కెన్నెత్ అండర్సన్ ఈ మామండూరు అడవులలోని, నరభక్షకులయిన పెద్ద పులులను సంహరించిన కథలున్నాయి.

4 సంజీవరాయరు. సంజీవ పర్వతమును తెచ్చి ఆంజనేయస్వామి సంజీవరాయడయినారు. తిరుపతి గోవిందరాజస్వామి ఆలయమునకు ఎదురుగా, తేరు వీధిలో నున్న స్వామి ఆ పేరుతో పిలువబడుతున్నారు. ఆయనను నేరుగా చూడకూడదట.

ఇదే శతకంలోని యీ క్రింది సీసపద్యంవల్ల తిరుపతి గోవిందరాజ స్వామి ఆలయంలో మనం పాటించవలసిన నియమాలు తెలుస్తున్నాయి.

సీ. సంజీవరాయని సరిగఁ జూడఁగరాదు
ఉదరి సన్నిధి వీధి నుమియరాదు
తరిమల్లె వారి గోపురము దాఁటఁగరాదు
బుగ్గలోపలఁ గాళ్లు పులుమరాదు
నెటి జియ్యరు మఠాలు నిక్కిచూడఁగరాదు
కలియుగ లక్ష్మిని గలయరాదు
కానుక రొక్కంబు గణుతిక పోరాదు
సాలవాకిటరంతు సలుపరాదు

తే. ఇప్పుడిటువంటి మర్యాదలెల్లఁ దప్పె
గండు మీఱియుఁ దురకలు గట్టుచుట్టు
కొనిరి గదవయ్య తిరుపతి కొల్లగొనుచు
శత్రు సంహార వేంకటాచల విహార ॥

తిరుపతిలో, కపిలతీర్థంలో - కపిలతీర్థం రస్తాలో, శ్రీ కోదండ రామాలయంముందు, గోవిందరాజ ఉత్తరమాడవీధిలో, గాంధీరోడ్డు బేరివీధికూడలిలో, మఠం ముందు రెండు, నాలుగకాళ్ల మండపంవద్ద, మంగలివాళ్ల భజన మందిరం ముందు, ఆంజనేయ (సంజీవరాయ) ఆలయాలున్నాయి.

ఈ శతకము మొత్తము, దక్షిణ దేశమున తురుష్కుల దండయాత్రకు సంబంధించిన విషయములతో నిండియున్నది. అందు ముఖ్యముగా తిరుమల - తిరుపతులు ప్రస్తావించబడినవి.

తురుష్కులు దేవాలయాలలో ప్రవేశించి దేవుళ్లను బ్రద్దలు చేసినారు. జిగురుపాలకని రావిమ్రాకులు నజ్జునజ్జుగా కొట్టినారు. *వైష్ణవుల పట్టి

* ఈ సందర్భములోనే తాతాచార్యులకు పీరుల పండుగకు సంబంధమేమిటనే సామెత విరోధభావంతో యీ ప్రాంతంలో వాడుకలోనికి వచ్చింది.

నామములు నాకినారు. బ్రాహ్మణుల పిల్ల జుట్లు వూడబెరికినారు. తిరుమలయ్యా! నీవిదంతా చూస్తూవున్నావు గదయ్యా. అని నొచ్చుకుంటాడు కవి.

తోమని పళ్లెములు తునియగొట్టి, తిరుకాపులన్నియు విఱిచి, డబ్బు దెమ్మని నంబుల గొట్టి, వాహనములు పాఱవైచి, గరుడ గంబము బంగారు రేకు వూడబెఱికి, గోపురములు కుప్పగూల్చి, పణ్యారములు పీక్కొని, జీయ్యం గార్ల బాధించి, తీరా నీ వొంటి మీద సొమ్ములు దోచుకొనే దాక మొలలో బాకు జెక్కుకొని, తురకల పొడుతునని బొంకులు పలుకుతూ వుండు. అంటాడు కవి. నీ చేతిలోని చక్రం ఇచ్చావా, నేను బాపడైనను సరే, తురకలను చిల్లు పొల్లుగ ఖండించి, చించి, యుఱికి నఱికి డాకలుగోసి బెట్టుటిమి, తఱిమికొట్టి గోరింపనే గోలకొండ దాఁక అని తన ప్రతాపాన్ని శ్రీ వారికి తెలియజేస్తాడు.

నీవి అఱవ చెవులు. అంటే పెద్ద రంధ్రములు గలవి. వాటిని పూడ్చడం ఎవడబ్బ తరము. నీ బ్రహ్మోత్సవము, వసంతోత్సవము, సమర భూపాల వాహనము, ఏమవుతాయో మరి? * పాశ్చాత్యభటుల తుపాకి గుండ్లు - చల్లని పన్నీటి చల్లులాటలు గావు.

నీ ప్రసాదాలు తలచుకొంటూనే, మాకు నోరూరుతుంది. మేము గ్రుక్కిళ్లు మ్రింగుతూండగానే నీవు వాటిని ఆరగిస్తావు గానీ మాసంగతి అనుకోవు.

రుక్మిణి మూడు రోజులకు ముందే తన పెద్దనరాన్ని పెట్టెలో దాచుకుంది. సత్యభామ తన తండ్రి ఇచ్చినవని పచ్చల కడియాలు బరిణెలో పెట్టుకుంది.

---

* క్రీ.శ. 1758 లో చంద్రగిరి అబ్దుల్ వహాబ్, నెల్లూరు నజీముల్లా, ఫ్రెంచివారి సాయంతో తిరుమల ఆలయంలో తిష్టవేసిన బ్రహ్మోత్సవ సమయ సంఘటన ఇది. హైదరాలీ చంద్రగిరిని ముట్టడించి నపుడు, తిరుమలకు వస్తాడని, ఆలయం మూసివేసి, ఆరు మాసాల నైవేద్యం స్వామిముందు వుంచి, సోపాన మార్గములు అడవి కంపతో కప్పివేసి, మలయప్ప స్వామిని కొండ గుహలో దాచి. ఇన్ని ఏర్పాట్లు చేశాక హైదరాలీ దండెత్తలేదు. శ్రీవారు మాత్రం తాంబూలంతో సహా నైవేద్యం స్వాహాచేశారట. మలయప్ప కొండ లోయలో దాచిన వుత్సవ విగ్రహం ఆ పేరుతోనే పిలువబడుతోంది. ఇది బహుళ ప్రచారంగల కథ.

జాంబవతి ముత్యపు ముక్కుపోగు కూడ దాచుకుంది. మిత్రవిందాదేవి మెడలో దారంతప్ప నగలేవీ ధరించడం లేదు. ఇన్ని దాచుకున్నా ఇవన్నీ తురక వారి పాలేగదా! కాబట్టి కనుమ దాటించు. నీ పగ్గెలటు గట్టిపెట్టు. నీవు పూర్వ అవతారాలలో సీతను పోగొట్టుకున్నప్పుడు, జరాసంధునితో యుద్ధము వచ్చినప్పుడు ఏమేంపాట్లు పడినావో అవన్నీ మాకు తెలియవనుకున్నావా? శాహుసేన్, బాహుసేన్, అరేఅల్లా, నమాజు, హరాంకోర్, యరే ధగిడీ, యరే భేటీచోదా, గజాగాండూ, తెరిమాకి చోద్–ఇలాంటి పరభాషా పదాల మీద, పాశ్చాత్య తిట్లుమీద నీకు మోజున్నదా ఏమి? అసలు నీవు కూడ తురకవైయ్యావాఏమి? ఏదీ నీ చెవులు చూపించు తెలుసుకొంటాను.

ముసలివాడు, పురాణ పురుషుడు, చేతులలో సత్తువలేదు. శార్ఙ్గమును కుదువ బెట్టినాడు. కత్తికి తుప్పు పట్టినదని,కౌమోదకి పాంచజన్యము గుల్ల పడియెనని, జీతమియ్యని కొల్వు మాకేటి కంచును భటులిచ్చానువర్తులై రిల్ల కోపుదప్పి యున్నట్టి వేళ—అలాంటి భటులు ఇక యుద్ధం చేయబోతారా?

ఒక్కపోటుతో జియ్యంగారు కూతబెట్టినాడు. దూరడంతో తలుపు వీడి రాగా అలాగే పరుగెత్తినాడు ఆళ్వారు తాను దాక్కొన్న గొందిలో తేలుకుట్టినా నరే కిమ్మనకుండా ఒదిగినాడు నంబి. నారీకవచాద్రుల నడుమ లంజలబారులో గుడి పారుపత్యదారు అణగినాడు.

కవి చమత్కారమునకు ఈక్రింది పద్యము తార్కాణము.

సీ॥ మలలపై పెద్దహెూబలము సింగారెడ్డి
మంగళగిరికోట మలయరెడ్డి
పొలుపొందు మారకాపురము చెన్నారెడ్డి
రంజిల్లు నుదయాద్రి రామిరెడ్డి
వెలయు తిర్వాళూరు వీరరాఘవరెడ్డి
పన్నెవానుల కంచి వరదరెడ్డి
నీటు కెక్కిన గండికోట మాధవరెడ్డి
తగు తాడిపర్తి చింతాలరెడ్డి

తే॥ సేయు కాఁపుదనంబు చూచినను నీకుఁ
గోర్కిపుట్టెనె దిరుమల కొండరెడ్డి
మగతనము మాని కాఁపైన నగవుగాదె
శత్రుసంహార వెంకటాచల విహార ॥

ఇలా వ్రాస్తూపోతే, ఎన్నిపేజీలయినా వ్రాయవచ్చు. విషయం అంత ఎక్కువగా వుంది. ఇందు గమనించదగ్గ కొన్ని పదములున్నాయి. 'మఱచి నాఁడనే నీతొంటి మర్మమెల్ల, నేకి కాకుల కిచ్చెదఁ గాక యేల, మోవనిత్తును తురకల మొత్తకున్న' అని కవి కొన్నిరహస్యాలు బైటపెట్టాడు. తిరుమల శ్రీవారు లోభియట. అందుకనే, ఆయన పాత్రలు అరిగిపోతాయేమోనని తోమరు. 'వడ్డికాసొక్కటి వదలకుండా .... .... లోభివై కూర్చుకొన్నట్టి రొక్కమెల్ల' అని ఎందుకన్నాడంటే ఎంతవున్నా, పెళ్లికి కుబేరునిదగ్గర చేసిన అప్పు ఇంతవరకు తీర్చలేదు. పైగా ప్రతి ఆనివార ఆస్థానానికి పద్ధతి తప్పకుండా బేడీలు వేయించుకుంటూనే వున్నారు. సంకెళ్లయినా వేయించు కొంటాడు గానీ, అప్పు మాత్రం తీర్చనివాడు లోభికాక మరేమౌతాడు ?

తిరుమల దక్షిణమాడవీధిలో తిరుమలనంబి గృహానికి ఆనుకొనివున్న ఇల్లు (ప్రస్తుత స్టేట్‌బ్యాంకు) గుగ్గిళ్లమునలామెదట. మనం చిన్నతనంలో చేసినట్టే శ్రీవారు కూడాగుగ్గిళ్లఅవ్వదగ్గర అప్పుచేసి గుగ్గిళ్లు తిన్నారు. ఆపైసలు కూడ ఇంతవరకు ఇవ్వలేదు. ఇవ్వకపోగా, ఆ దారిన మెరవణి వెళ్ళేటప్పుడు గుగ్గిళ్లఅవ్వ వచ్చి అప్పు అడుగుతుందేమోనన్న భయంతో నిశ్శబ్దంగా వెళ్లుతారు. ఆ ఇల్లు దాటేవరకు మేళతాళాదులన్నీ ఆపివేసి, దొంగకు తేలుకుట్టినట్టు చడీచప్పుడు లేకుండా పోవడంచూస్తే, తిరుమల శ్రీవారికి ఏమిగతి పట్టిందా? అనిపిస్తుంది. ఇక ఆ అప్పుమాత్రం ఆయన ఇవ్వబోతారా? ఇవ్వాలనుకున్నా మన ఆడిటర్లు చెక్కుస్లిప్ వెయ్యకుండా ఆ బిల్లు పాసుచేయబోతారా? ఇవి రెండూ సాధ్యంకావు గనుక తిరుమల శ్రీవారు గుగ్గిళ్లమునలామె ఇంటిముందు దొంగ బోయినట్టు పోవలసినదే. తప్పదు.

శతకకారుడు, 'కోవెల బాబయ్య గోరిచేసి, గర్భగృహంబుల గలయంపి గాఁజేసి' అన్నాడు కావున ఆయనదృష్టి 'రామార్‌మేడై'మీద పడిందను కుంటాను. ఈ రామార్‌మేడై తిరుమల ఆలయంలో శయనమండపానికి, స్నపనమండపానికి మధ్యనున్న గొందె. దీనిక్రింద భూగృహముందంటారు. దీనికిరువైపులా రెండు అరుగులున్నాయి. ఉత్తరపు అరుగుమీద విష్వక్సేనుల వారు, గరుడాళ్వారు, ఆదిశేషులు ఆసీనులయివుండగా దక్షిణపు అరుగుమీద హనుమంతుడు, సుగ్రీవుడు, అంగదుడు భిన్నరూపాలలో కనిపిస్తారు. శ్రీవారి దర్శనమునకు వెళ్లినపుడు ప్రతిఒక్కరూ వీరిని చూసివుంటారు. వీరు ఆసీను లయివున్న అరుగులే గోరీలు అని కొందరి అభిప్రాయం. దానిని మనం విశ్వ సింప బనిలేదు.

పడమటి మాడవీధిలోని శృంగేరి శంకరమఠానికి చెందిన శివలింగ స్థాపనకూడ ఇలాంటికథే. దానిని సాక్షాత్ శంకరాచార్యులవారు స్థాపించారట. శివలింగం ప్రక్కనే శారదాదేవి, శ్రీ ఆదిశంకరాచార్యులవారి విగ్రహాలున్నాయి. కానీ విశ్వసించదగిన ఆధారాలు మాత్రం లేవు.

"యవన జీమూత దుర్దినంబైన దిగువ, తిరుపతిని జూడమిటు వంటి తటిని నిదుఁ, పోవుచున్నాఁడు మీయన్న లేవలేక." అని కవి, గోవిందరాజ స్వామివారిని దూటినాడు. శ్రీ వేంకటేశ్వర లఘుకృతులలో యీ వేంకటాచల విహారశతకముగాక వేంకటేశ్వర మకుటము గలిగిన పది ఇతర శతకము లు, తారావళి, స్తవము, మంజరి, పంచచామరములు, రెండు దండకములు, రెండు కళ్యాణములున్నవి. ఈ గ్రంథ సంపాదకుడు కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.

శతక వాఙ్మయ సర్వస్వములో మరికొన్ని విశేషాలు కనిపించాయి.

"అల తాళపాక చిన్నన్న రోమములైన తంబుర దండెకుఁ దంత్రుతానె."

—- పోలిపెద్ది వేంకటరాయకవి చిన్నన్నను గూర్చి చేసిన ప్రశంస - ఈయన కార్వేటి నగర వేణుగోపాలుని మీద ఒక శతకము వ్రాసినాడు.

“అన్నాతిఁగూడ హరుఁడగు, నన్నాతిని గూడకున్న నసురగురుండౌ,
నన్నా! తిరుమలరాయఁడు కన్నొక్కటి లేదుకాని కంతుఁడుగాడే”

తళ్లికోట యుద్ధములో, తిరుమలరాయలకు ఒక కన్ను పోయినదట. దానిని గురించి ఎవరో ఒక కవి చెప్పిన చాటువు అది.

ఆంధ్రదేశములో తురుష్కుల దండయాత్రలు పురస్కరించుకొని పుట్టిన శతకములు - సింహాద్రి నారసింహ శతకము, శత్రుసంహార శతకము, రంగధామ శతకము, కస్తూరిరంగ శతకము, (కిరిగిరి) బాలసుబ్రహ్మణ్య శతకము.

శ్రీమత్తిరుమల, నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార శ్రీనివాస వేంకటాచార్య కవి “తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా” అను మకుటముతో ఒక శతకము వ్రాసినాడు. ఇతని కాలము క్రీ.శ. 1790 - 1840. అదేకాలమున భుజమెళ్ల భగవచ్ఛాస్త్రి “తిరుమల శ్రీ వేంకటేశ త్రిదశాధీశా” అను మకుటముతో మరియొక శతకము వ్రాసినాడు.

305 పుటలో “ముడుంబై వేంకటకృష్ణమాచార్యుఁడు” అన్న శీర్షిక క్రింద యీ చారిత్రకాంశములున్నవి.

“....మూడవది తొండమండల రాజ్యము. ఇది ఘటికాచలమనఁబడు చోళలింగ పురము నుండి శ్రీకాళహస్తి వఱకు వ్యాపించి యుండునది. ఇప్పటికిని కాళహస్తికి నాలుగు మైళ్లదూరమునఁ దొండమనాడను గ్రామమున్నది. దాని నానుకొనినట్లుగా ‘బొక్కిసంపాళెమ’ నుగ్రామము కలదు. ఆ కాలమునఁ జంద్రగిరి దుర్గాధీశలకు లోఁబడి కాళహస్తి నేలుచుండిన దామెర్ల వారి ఖజానాలు వగైరా లీ బొక్కిసంపాళెములో నుండునవియఁట.

“తొండమండలములోని (కార్వేటినగర) నారాయణవన ప్రాంతమును సాళ్వరెడ్లు పరిపాలించుచుండఁగా వారియొద్ద దండనాథులుగా నుండిన క్షత్రియ ప్రభువులు వారిపైఁ దిరుగఁబడి, యోడించి యా ప్రాంతమును

స్వాధీనము చేసికొనిరి. దానితోనది క్షత్రియ రాజ్యమైనది. వీరు కూడ నొకప్పుడు చంద్రగిరి రాయలకుఁ గప్పము కట్టుచు వచ్చిన సామంత రాజులే! ..."

ఈ సాలువ రెడ్లు విజయనగరము నేలిన సాలువ వంశీయుల మూల పురుషులా?

క్రీ. శ. 1840 ప్రాంతములో మంచెళ్ల కృష్ణ కవి "వేంకటనగాధిప శతకము" వ్రాసినాడు. తిరుమల శ్రీవారి మీద ఇలాంటి శతకాలెన్నో.

అనేక శతకాలు వ్రాయబడిన తాళపత్రముల గ్రంథ మొకటి నాదగ్గర చాలకాలము నుంచి పడివున్నది. దానిని గాలించగా, తిరుమల శ్రీవారి మీద వ్రాయబడిన రెండు పద్యములు దొరికినవి. ప్రాచీన లిపిని మాత్రము పరిహరించి, మిగతా యథాప్రకారము వ్రాసినాను. ఆ పద్యములు ఎవరు వ్రాసిరో వివరాలు లేవు. గ్రంథము మీద మాత్రము "చదలువాడ వరదయ్య తన స్వంతానకు వ్రాసుకొన్న పుస్తక"మని వ్రాసివుంది.

* శృంగార రాయుని చెలువు మీరిన కొండ
ఫణిరాజు పేరిట పశిడి కొండ
పుష్ప జాజుల విష్ణు పూజింపగల కొండ
కల్పవృక్షములెల్ల గలుగుకొండ
చిలుకలు కోవెలును చేరి యాడెడు కొండ
మృగ జాతి కంట్లను మెలగుకొండ
ఘోరదురితము లణచుకోనేర్లుగల కొండ
ఘనమైన మోక్షంబు గలుగుకొండ
అమర వరులకు నాధారమైన కొండ
ఆళ్వారులకు ప్రత్యక్షమైన కొండ
అలరుజూచిన బ్రహ్మాండమైన కొండ
యేను పొడగంటి శ్రీవేంకటేశ కొండ॥

---

* ఇవి ఏ పద్యములో మూలమునందు వ్రాయబడలేదు.

తన పురాకృతముచేత గలక పోరాదు
　　బ్రహ్మవ్రాతకు మారుబలుకరాదు
పంచాస్త్రశస్త్రముల్ ( ? ) పట్టి చూడగ రాదు
　　ప్రకృతి స్వభావంబు మాన్పంగరాదు
దైవకృతంబెల్ల తప్పింపగారాదు
　　కాలమెవ్వరికైన గడపరాదు
పోయిన ప్రాణంబు పొదపెట్టితే రాదు
　　గత జలంబులు నడ్డ గడ్డరాదు
యేమి శాయంగ వొచ్చు సర్వేశ్వరాజ్ఞ
వరుస నెంతటివారికి వగువ వలదు
కలిత లక్ష్మీశ సర్వ జగన్నివేశ
విమల రవికోటి సంకాశ శ్రీ వేంకటేశ ।

* * *

పాహిమాం, పాహిమాం! రక్షమాం, రక్షమాం!!

# ఉదంతం

## ఈ రచయితను గూర్చి ఒక చరిత్రకారుడిలా వ్రాశాడు:

ంజీవి గోపీకృష్ణ. జననం: 8–6–1938.

పై కలం పేరుతో రచనలు చేస్తూన్న చిరంజీవి సొరకాయల కృష్ణా ి, చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా, తొండవాడ కాపురస్థులు. ఈయన A., B. Ed., చిత్తూరు జిల్లాపరిషత్ హైస్కూళ్ళలో వ్యాయామోపాధ్యా ుడుగా, సీనియరు తెలుగు పండితుడుగా పనిచేసి, ప్రస్తుతం తిరుమల తిరుపతి స్థానం వారి తిరుమల ప్రాచ్య ఉన్నతపాఠశాలలో ఎల్. టి. అసిస్టెంట్‌గా ) చేస్తున్నాడు. కొందరు మిత్రులు కలసి. ఈయనను 'గోపీకృష్ణ' అనే ంపేరు పెట్టారు.

ఈయన మొదటి కథ 'జీవితవ్యధ' కె సభాగారి 'దేవదత్తం' స పత్రికలో వెలువడింది.

'బ్రహ్మచారి' అనే నాటకాన్ని, 'వాడినపూలు' అనే నవలను హితీ సదనం తిరుపతి వారు అచ్చు వేయించారు. 'రాధా మాధవం' అనే ల 'ప్రజావాహిని' వార పత్రికలో సీరియల్‌గా వెలువడింది

ఆంధ్ర ప్రభ దినపత్రికలో అప్పుడప్పుడు వ్యాసాలు ఈయన వ్రాస్తూ ంటాడు. 'సప్తగిరి' అనే తి. తి. దేవస్థానం వారి మాస పత్రికలో కూడ యన రచనలు వెలువడుతూ వుంటాయి. ఈయన రచనలలో యింకా కొన్ని తర పత్రికలలో కూడా వెలువడ్డాయి.

ఈయన స్వగ్రామం తొండవాడ. సువర్ణముఖీతీరంలో తిరుపతికి5మైళ్ళ రంలో వున్నది. అక్కడ వెలిసిన శ్రీ అగస్త్యేశ్వరస్వామిని, మంగాపురం ని శ్రీ కళ్యాణ వెంకటేశ్వరస్వామిని, యింకా చంద్రగిరి ప్రాచీన చరిత్రను సో వకరకంగా తన రచనలలో కొనితేవటానికి ప్రయత్నిస్తూ వుంటాడు...."

— శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారి 'మిత్రులూ - నేనూ' అనే రెండవ భాగం - పుస్తకం నుండి - పుటలు - 341 - 2.

ఈ రచయిత వ్రాసిన

"చరిత్రకారుని చరిత్ర"

అనే గ్రంథానికి పీఠిక వ్రాస్తూ —

ఆంధ్రప్రదేశ్ విధానమండలి మాజీ అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఇలా వ్రాశారు:

"........యాభై ఆరు సంవత్సరాల డైరీలు, ఉత్తర ప్రత్యుత్తరాలు, ఇతర వాఙ్మయము చదివి, అహర్నిశలు శ్రమ చేసే 'చరిత్రకారుని చరిత్ర' అత్యుత్తమంగా వ్రాసినందులకు సోదరుని శిష్యుడు ఆ గోపీకృష్ణ గారిని అభినందిస్తూ గురువును మించిన శిష్యునిగా ప్రతిష్ఠ నార్జించుకొనవలసినదిగా ఆశీర్వదిస్తున్నాను.

ఓం తత్ సత్

17—9—70 గొ॥ బ్రహ్మయ్య."

---

## సహాయక గ్రంథాలు

ఈ గ్రంథ రచనకు దాదాపు వందగ్రంథాలు సహాయపడినాయి. వాటి నన్నిటినీ పేర్కొనటం సాధ్యం కాదు. అందులో ముఖ్యమయినవి తి.తి.దే. వారి శాసన సంపుటాలు, ఎపిగ్రాఫికల్ రిపోర్టు, తాళ్లపాకంవారి కృతులు, లఘుకృతులు, బులెటిన్లు, జర్నల్స్ మరియు సప్తగిరి సంచికలు, ఇంకా టి.కె.టి. వారి తిరుపతి చరిత్ర, మారేమండ రామారావుగారి తిరుమల, తిరుపతి, తిరుచానూరు వగైరా, తెలుగు విజ్ఞాన సర్వస్వ సంపుటాలు, నండూరి రామ కృష్ణమాచార్యగారి ప్రాచీన దక్షిణ భారత చరిత్ర, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం- (కుందూరి ఈశ్వరదత్తు గారిది) విజయనగర సామ్రాజ్యము - చక్రవర్తుల మీద ఇప్పటి వరకు వెలువడిన అనేక చరిత్రలు, ఆంగ్ల, ఆంధ్ర దినపత్రికలలో అప్పుడప్పుడు వెలువడిన అనేక వ్యాసాలు మొదలగునవి. మరికొన్ని గ్రంథాలను-యీ పుస్తకంలోనే అవసరమయిన చోట్ల వుదహరించటం జరిగింది. గమనించ గలరు.

T. T. D. Religious Publications Series No. 75

Subsidised Price : Rs. 7-00




తిరుమల తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారి

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ.ఎ.ఎస్., గారిచే

ప్రకటింపబడినది.

---

తి. తి. దేవస్థానముల ముద్రణాలయము, తిరుపతి ప్ర. 5,00